**Published by**

**Sri Praneeti Publications**
3-6-494/101, St.No.7, Himayathnagar,
Hyderabad-500 029.

| | | |
|---|---|---|
| First Edition | : | 2013 |
| Copies | : | 1000 |
| Author | : | Ms Prasanna Kumari |
| Price | : | Rs.120 |

**For Copies please contact:**

Cell: 9010039671 / 9010089641
or
mail to : sripada@mail.com



శ్రీపాద శ్రీవల్లభ త్వం సదైవ ।
శ్రీదత్తా అస్మాన్ పాహి దేవాధిదేవ ।
భావగ్రాహ్య క్లేశహారిన్ సుకీర్తే ।
ఘోరాత్ కష్టాత్ ఉద్ధర అస్మాన్ నమోస్తుతే ॥
త్వం నో మాతా త్వం పితాచాధివస్త్వం ।
త్రాతా యోగక్షేమకృత్ సద్గురుః త్వం ।
త్వం సర్వస్వం నః ప్రభోః విశ్వమూర్తే । ఘోరాత్..॥
పాపం తాపం వ్యాధిం ఆధించ దైన్యం ।
భీతిం క్లేశం త్వం హరాశుత్వదన్యం ।
త్రాతారం నో వీక్ష్య ఈశాస్తజూర్తే । ఘోరాత్..॥
నాన్యః త్రాతా నాపి దాతా న భర్తా ।
త్వత్తో దేవ త్వం శరణ్యో హర్తా ।
కుర్యాత్రేయానుగ్రహం పూర్ణరీతే । ఘోరాత్..॥
ధర్మప్రీతిం సన్మతిం దేవ భక్తిం।
సత్సంగాప్తిం దేహి భుక్తిం చ ముక్తిం।
భావాసక్తిం చ అఖిలానందమూర్తే।ఘోరాత్...॥
శ్లోక పంచకం ఏతత్ యః లోక మంగళ వర్ధనం।
ప్రపఠేత్ నియతో భక్త్యా సః దత్త ప్రియో భవేత్॥

**శ్రీపాద శ్రీవల్లభ సంక్షిప్త చరితామృతం**

## విషయాను క్రమణిక


| అధ్యాయాలు | ఫలశ్రుతి | పేజి నెం. |
| --- | --- | --- |
| 1. శ్రీశంకరభట్టుల పరిచయ వాక్యాలు | ఇంట్లో ప్రశాంత వాతావరణం | 1 |
| 2. మదురా (మదురై) నగర వృత్తాంతం | మనోవ్యధ దూరం అవుతుంది | 6 |
| 3. శ్రీపాదుల లీలావైభవం-పళనిస్వామి | నాగదోషనివారణ-సంతానప్రాప్తి | 15 |
| 4. శ్రీపాద-వాసవాంబికల సోదర సోదరీ బంధం | కన్యలకు యోగ్యవరునితో వివాహం, గురునిందా పాపవిముక్తి | 22 |
| 5. తిరుపతిలో శంకరభట్టు అనుభవాలు | మొక్కుబడులు చెల్లింపక పోవటం వలన కలిగే దోషాలు, విఘ్నాల నివారణ | 34 |
| 6. శ్రీపాదుల దివ్య అవతరణ | పితృదేవతల శాపాల నుండి నివృత్తి | 41 |
| 7. ఏడాది శిశువు లీలలు | విద్యాప్రాప్తి | 52 |
| 8. తిరుమలదాసు-అద్భుత అనుభవాలు | సంతానప్రాప్తి, లక్ష్మీ కటాక్షం | 58 |
| 9. కర్మఫలాలు-నివారణోపాయాలు | ప్రారబ్ధకర్మ నివారణ | 68 |
| 10. సుబ్బయ్యశ్రేష్ఠి వృత్తాంతం | దురదృష్ట నివారణ | 78 |
| 11. శ్రీపాదప్రభువుల తత్త్వం | దురలవాట్ల నుండి విముక్తి | 84 |
| 12. వర్మకళ-మర్మకళ | చక్కటి ఆరోగ్యం | 89 |
| 13. ఆనందశర్మయే వెంకయ్య అవధూత | గోసంపద, ఫలసాయం | 92 |
| 14. దత్తులు గౌడకులస్థునిలా శంకరభట్టుని కలుసుకోవడం | కష్టాలు తొలగి మనోధైర్యం పెరుగుతుంది | 97 |
| 15. వినూత్న యోగ ప్రక్రియ | అకారణ కలహాల నుండి, పూర్వజన్మ సంచిత పాపాల నుండి విముక్తి | 102 |
| 16. శిష్ట రక్షణ-దుష్టశిక్షణ | ధనాకర్షణ | 110 |
| 17. అయోగ్యులపై కూడా అనుగ్రహం | ప్రభువులసిద్ధపురుషుల ఆశీర్వాదం | 117 |
| 18. పండిత-పామరుల గాథ | పాపకర్మ విధ్వంసన, అదృష్టయోగం | 125 |

| | | |
|---|---|---|
| 19. లింగణ్ణ-గణపతి శాస్త్రుల వృత్తాంతం | మానసిక కల్లోలాన్ని, వ్యధను దూరం చేయడానికి | 131 |
| 20. గురుచరణుల గురుభక్తి | ఘోర కష్టనష్టాల నివారణ | 137 |
| 21. దండిస్వాముల వృత్తాంతం | ఆధ్యాత్మిక ఔన్నత్యం. పుణ్య సముపార్జన | 143 |
| 22. అహంకారమే అజ్ఞానం | కర్మ దోషాల, విఘ్నాల నుండి విముక్తి | 147 |
| 23. శివపూజా మహిమ | ఐశ్వర్య ప్రాప్తి | 152 |
| 24. శివుని ఆయుధాల విశిష్టత | దంపతుల మధ్య అనుకూలత | 156 |
| 25. సత్సంగత్వే నిస్సంగత్వం | సాంసారిక బాధల నివారణ. సుఖ ప్రాప్తి | 160 |
| 26. కాలపురుషుని వివరణ | దౌర్భాగ్యం నుండి విముక్తి. సంతాన ప్రాప్తి | 164 |
| 27. పంచదేవ్‌పహాడ్‌లో మా అనుభవాలు | విషమ పరిస్థితులలో దైవసహాయం | 167 |
| 28. వైశాఖ శుద్ధ దశమి, శుక్రవారం, వాసవిమాత జన్మదినం | అనుకూల వధూ-వరుల ప్రాప్తి | 169 |
| 29. వాసవీమాతకు ఆర్యవైశ్యులతో అనుబంధం | పితృదేవతల ఆశీర్వాద ప్రాప్తి | 174 |
| 30. సంశయాత్మా వినశ్యతి | ఉజ్జ్వల భవిష్యత్తు | 176 |
| 31. దశమహా విద్యల వర్ణనం | విద్యా, ఐశ్వర్య, అధికార ప్రాప్తి | 178 |
| 32. నవనారాయణులే నవనాథులు | సద్గురు కటాక్ష ప్రాప్తి | 181 |
| 33. నరసింహరాయల ఆతిథ్యం | వివాహానికి అనుకూల సంబంధ ప్రాప్తి | 185 |
| 34. మానవత్వమే అసలైన దైవత్వం | ఋణ విముక్తి. సుఖ శాంతి | 188 |
| 35. దుష్ట శిక్షణ-శిష్ట రక్షణ | వాక్‌శుద్ధి | 192 |
| 36. విచిత్ర దాంపత్యం | అనుకూల దాంపత్య ప్రాప్తి | 195 |
| 37. స్త్రీ పురుష తత్త్వాల శుద్ధి | లక్ష్య ప్రాప్తి | 201 |
| 38. బైరాగి కథనం | ఆత్మవిశ్వాసం, ధైర్య ప్రాప్తి | 204 |
| 39. నాగమణి మహత్యం | నాగదోష నివారణ | 208 |

| | | |
|---|---|---|
| 40. భాస్కరశాస్త్రితో బహుముఖగోష్ఠి | అసాధ్యాన్ని సాధ్యం చేయించగలిగే శక్తి | 211 |
| 41. దత్తదీక్షా ప్రహసనం | కుట్రలు, కుతంత్రాల నుండి రక్షణ | 213 |
| 42. దిగంబరా!దిగంబరా! శ్రీపాదవల్లభ దిగంబరా! | తప్పిపోయిన పిల్లలు దొరకటం | 218 |
| 43. జగన్మాత వివిధ రూపాలు | అష్టవిధ ఐశ్వర్య ప్రాప్తి | 222 |
| 44. పృథ్వీ జల యజ్ఞాల వివరణ | ఉజ్జ్వల భవిష్యత్తు | 226 |
| 45. శ్రీసాయి అవతరణ | సర్వతోముఖాభివృద్ధి | 230 |
| 46. అశ్వాల వ్యోమయానం | తొందరగా యోగ్య వివాహం | 232 |
| 47. శ్రీపాదుల మాతృభక్తి | ఎన్నో రకాల శుభ ప్రాప్తి | 235 |
| 48. శ్రీపాదుల ధర్మబోధలు | ముముక్షువులు-సాధకులకు చతుర్విధ పురుషార్థ ప్రాప్తి | 237 |
| 49. అగ్ని ఉపాసనయే అగ్ని యజ్ఞం | అన్ని రకాల దోష నివారణ | 240 |
| 50. ప్రభునామస్మరణం- భవభయహరణం | గురునిందా ప్రాప్తి వల్ల కలిగే దోష నివారణ | 243 |
| 51. శ్రీపాదులు అంతర్హితులగుట | మారక యోగాల నుండి రక్షణ | 246 |
| 52. శంకరభట్టు యోగానుభవం | సమస్యాపరిష్కారాలకు | 247 |
| 53. బాపనార్యుల 33వతరం- చరితామృత గ్రంథం | ఘోరపాపాల విముక్తి. అదృష్టాన్ని తిరిగి చేజిక్కించుకోవడం | 248 |

# సమీక్ష

త్రిమూర్త్యాత్మకుడు, త్రైలోక్యపూజ్యుడు అత్యంతమహిమోపేతుడు, ఆదిగురువైన శ్రీదత్తప్రభువు మానవాళికి తత్త్వజ్ఞానం కలిగించుటకు, వారిని అజ్ఞానమునుండి రక్షించుటకు జగద్గురువుగా అవతరించి సృష్టి, స్థితి, లయలకు కారణమైన త్రిమూర్తుల స్వరూపమయినారు.

భక్తరక్షణకై శ్రీదత్తప్రభువు శ్రీపాద శ్రీవల్లభునిగా పిఠాపురములోను, నరసింహసరస్వతిగా కరంజా గ్రామంలోను, మాణిక్యప్రభువుగా లాద్వంతిగ్రామంలోను, స్వామిసమర్థగా అక్కల్‌కోటలోను, శ్రీసాయిబాబాగా షిరిడీలోనూ అవతరించారు. వీరిని దత్త పంచకమని పేర్కొంటారు.

గురుచరిత్రలో శ్రీదత్తుని మొదటి అవతారమైన శ్రీపాదుని చరిత్రను ఐదు అధ్యాయాలలో తెలపడం జరిగింది. శ్రీపాదులు ఉద్భవించినది మొదలు వారి అవతార సమాప్తి వరకు కురువపురంలో జరిగిన వారి జీవిత చరిత్రను, లీలలను వర్ణిస్తూ, ఇటీవల "శ్రీపాదశ్రీవల్లభ సంపూర్ణ చరితామృతము" అనే గ్రంథము వెలుగులోనికి వచ్చినది. శ్రీపాదుని సమకాలికులైన శ్రీమాన్ శంకరభట్టు ఈ గ్రంథాన్ని సంస్కృతంలో రచించారు. 14వ శతాబ్దంలో జరిగిన విశేషములు ఇవి. తరువాత 2001 సంవత్సరములో దాని తెలుగు ప్రతిని శ్రీమాన్ మల్లాది గోవిందదీక్షితులు శ్రీపాదుని జన్మస్థలమైన పిఠాపురంలో పిఠాపుర సంస్థానానికి అందజేసారు. ఈ ఉద్గ్రంథంలో శ్రీపాదుని అద్భుత విశేషాలు, బాల్యదశలోని వారి లీలలు, ముక్తిని ప్రసాదించే పరమార్థ సాధనలు నిబిడీకృతమై ఉన్నాయి. ఈ పుణ్యగ్రంథము భక్తుల హృదయాలను ఆకర్షించే పవిత్ర గ్రంథమనడంలో అతిశయోక్తి లేదు. ఈ గ్రంథాన్ని నేను పది పదిహేను పర్యాయాలు పారాయణ గావించి పునీతనయ్యాను. ఈ పవిత్ర గ్రంథాన్ని శ్రీమతి ప్రసన్నకుమారి శ్రీపాద దత్తుని ప్రేరణతో కరుణానుగ్రహాలతో భక్తి భావోద్రేక పూరితయై సంక్షిప్తంగా సులభ శైలిలో సంకలనం చేసి భక్తులకు అందిస్తున్నది. ఈ సంక్షిప్త గ్రంథము సర్వాంగ సుందరంగా భావయుక్తంగా చక్కటి శైలితో

భాషాపరిజ్ఞానముతో కూడిన వాడుక భాషలో చదువుటకు తేలికగా ఉండి, చదవగానే సులభంగా అర్థమయ్యేటట్లు ఉంది. ఈ పవిత్ర సంక్షిప్త శ్రీపాదుని చరిత్రను ప్రతీ భక్తుడు చదివి, ధన్యులు అవగలరని విశ్వసిస్తున్నాను. ఈ గ్రంథమును అందించిన ప్రసన్నకుమారికి ఇది ముక్తిప్రదమని భావిస్తున్నాను. తమ కరుణా కటాక్షములతో శ్రీపాదులు సదా ఈమెను కాపాడుగాక! అని మనస్ఫూర్తిగా ప్రసన్నకుమారిని ఆశీర్వదిస్తున్నాను.

భక్తులు ఈ గ్రంథాన్ని చదివి పునీతులు అగుదురుగాక! నాలుగు పురుషార్థ ఫలములను పొంది ధన్యులు అగుదురు గాక!

శ్రీసాయి అనుగ్రహ రచయిత్రి
**శ్రీమతి. ఎమ్.కె.దుర్గాంబ,**
**సికింద్రాబాద్**



# ముందుమాట




"పలికెడిది భాగవతమట పలికించెడి వాడు రామభద్రుండట" అని మహాభక్తులు కవీశ్వరులు అయిన పోతనగారు చెప్పినట్లే శ్రీపాద శ్రీవల్లభ చరితామృత గ్రంథకర్త శ్రీ శంకరభట్టుగారు కూడా ఆ గ్రంథ ప్రారంభంలోనే 'శ్రీచరణుల దివ్య చరిత్రను, దివ్య లీలావైభవమును వర్ణించుటకు మహా మహా పండిత వరేణ్యులకే అసాధ్యమైన పరిస్థితులలో ఎంతమాత్రము విద్యా గంధము లేని అల్పజ్ఞుడైన నేను వారి చరిత్రను వర్ణించుటకు పూనుకొనుట కేవలము వారి దివ్యాజ్ఞ ప్రకారమని దివ్యాశీస్సుల వలన అని వినయపూర్వకంగా తెలియ జేసుకుంటున్నాను,' అని వ్రాసారు.

**"ఈ మహా పవిత్ర గ్రంథాన్ని ఏ భాషలో పారాయణం చేసినా విశేషఫలం లభిస్తుంది. తమ చరితామృతమును అనువదించుటకు యోగ్యత కలవారిని తామే ఎన్నుకుంటామని, ఈ గ్రంథాన్ని అనువదించే సమయాలలో అనువాదకునిపై తమ విశేష కృపాదృష్టి ఉంటుందని ఆ మహాప్రభువులే శెలవిచ్చారు,"** అని భాస్కరపండితులు (44వ అధ్యాయం) చెప్పారు.

ఇది వాస్తవికంగా జరిగిన అద్భుతమైన చరిత్ర, దత్తుని లీలామృతం. దానిని అందరికి అర్థమయ్యేలా నా శైలిలో వ్రాయడానికి చేసిన ప్రయత్నం మాత్రమే నాది. స్ఫూర్తి, ప్రేరణ, అనుగ్రహం ఆ అంతర్యామిది.

ఈ అపూర్వ అలభ్య యోగాన్ని స్మర్తృగామి దత్త ప్రభువులు ఎంతో కరుణతో నాకు రెండుమార్లు ప్రసాదించారు. మొదటగా నేనెవరో కూడా తెలియకపోయినా శ్రీ మల్లాది గోవింద దీక్షితులు మామయ్యగారు (పెద్ద చిన్నా అనే వయోభేదం లేకుండా అందరూ వారిని మామయ్యగారు అని, మామాజీ అని పిలిచే వారు) నాకు ఫోన్ చేసి ఈ దివ్యగ్రంథాన్ని హిందీలోకి

అనువదించమని చెప్పినపుడు నాకు ఆశ్చర్యానందాలు కలిగాయి. కాని ఆ పరతత్త్వ లీలా వైభవాన్ని వర్ణించే విజ్ఞత, అర్హత నాకు లేవేమో అన్న సందేహంతో పిఠాపురంలో వారిని కలుసుకోవడానికి వెళ్ళినప్పుడు "నిన్ను శ్రీపాదులే ఎన్నుకున్నా" రంటూ వారు నా వెన్ను తట్టి నన్ను అనువాదానికి ప్రోత్సహించారు. అడుగుడుగునా నాకెంతో చేయూతని, సూచనల ను ఇచ్చారు. ఆరోగ్యం బాగుండక హాస్పిటల్‌లో ఉన్నప్పుడు కూడా నా సందేహాలకు జవాబులను ఇస్తుండేవారు. హిందీ ప్రచురణ జరిగిన తర్వాత ఇంగ్లీషు భాషలోనికి కూడా అనువదించమని వారు నన్ను అడిగారు. అడగకుండానే నాకు ఇటువంటి వరం ప్రసాదించి నాతో శ్రీకారం చుట్టించిన దీక్షితులు మామయ్యగారికి నా కృతజ్ఞతలను ఎలా చెప్పినా, ఎంత చెప్పినా తక్కువే అవుతుంది.

అటు తరువాత అనుకోకుండా నన్ను కలిసిన చాలామంది తెలుగువారు, "ఈ గ్రంథాన్ని చదవాలని, పారాయణం చేయాలని ఎంతగానో ఉన్నా సమయాభావం, పనుల ఒత్తిడి వల్ల చదవలేక పోతున్నామని సాయిబాబా పారాయణ గ్రంథంలా దీన్ని కూడా సంక్షిప్తంగా వ్రాస్తే మాలాంటి ఉద్యోగస్తులకి వీలుగా ఉంటుంది. మీరలా ఎందుకు వ్రాయకూడదు?" అని నన్ను అడగటం జరిగింది. ఇది అక్షర సత్య గ్రంథమని ఇందులోని ఒక్కొక్క అక్షరము వేదమంత్రమంత పవిత్రము, మహిమాన్వితము అయినదని గ్రంథంలోనే చాలాసార్లు చెప్పబడినది. అటువంటప్పుడు దీని సంక్షిప్తీకరణ ఎంతవరకు భావ్యం అనే మీమాంసలో స్వామివారిని శంకరభట్టు అడిగి నట్లే నేను శ్రీచరణులను అడిగాను. ఒకటి రెండు నిదర్శనాలతో తృప్తిపడక నా భ్రమ ఏమో అని కూడా భావించడం జరిగింది. రెండు అధ్యాయాలు వ్రాసాక కూడా నాలో మథన అలాగే ఉండి అస్త్రసన్యాసం చేసాను. ఒకరోజు రాత్రి, "అక్షరసత్య గ్రంథమంటే ప్రతి అక్షరము సత్యమైనది, పవిత్రమైనది అని వాచ్యార్థం అయితే, అక్షరము – అంటే నాశనములేని, నాశనముకాని ఆ పరబ్రహ్మ యథార్థ తత్త్వాన్ని వర్ణించే పవిత్ర గ్రంథమని

గౌణార్థం కాదా!", అంటూ దివ్యవాణి వినిపించింది. భయమో సంతోషమో తెలియని అయోమయస్థితిలో లేచి కూర్చుని కన్నీరు కార్చాను. అదంతా నా భ్రాంతి ఏమో అని కూడా అనిపించింది. కాని వరుసగా రెండు మూడు రోజులు ఈ వాణి నన్ను వెంటాడుతూనే ఉంది, అంతే, భగవంతునిపై భారం వేసి నా పనిని కొనసాగించాను. ఈ పవిత్ర గ్రంథాన్ని రెండు మార్లు నా చేతిలో పెట్టి **నిషిద్ధ పదార్థములచే రోగములు కుదుర్చుట** అనే విషయంలో నాకున్న సందేహాన్ని స్వామివారు దూరం చేసారు.

ఈ జన్మని ఇచ్చిన నా తల్లిదండ్రులకు, ఈ పనిలో పరోక్షంగాను, ప్రత్యక్షంగాను నాకు సహకరించిన నా వారందరికి నమఃపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ పవిత్ర గ్రంథ సంక్షిప్తీకరణలో నావల్ల ఎక్కడయినా, ఏవైనా పొరపాట్లు జరిగి ఉంటే నా తప్పులను పెద్ద మనసుతో మన్నించమని దత్త భక్తులకు, సహృదయులైన పాఠకులకు సవినయంగా మనవిచేస్తూ , ఆ పరమాత్ముని అపార అనుగ్రహానికి శతకోటి నమస్సుమాంజలులు అర్పిస్తూ

**శ్రీమతి ప్రసన్న కుమారి**

# కృతజ్ఞతలు

రెండవ ప్రచురణను ప్రోత్సహించి చేయూతనిచ్చిన శ్రీమతి అనితా మణ్ణం గారికి, వారి సోదరి శ్రీమతి కళ్యాణగారికి, డా॥ అనిల్ ప్రశాంత్ గారికి, శ్రీప్రేమచంద్రరావుగారికి, శ్రీపాత్రోగారికి, శ్రీకె.యస్. రావుగారికి, శ్రీకె.శ్రీరాంశర్మగారికి, ఎంతో ఓపకతో డిజైన్ చేసిన యస్.యన్. యల్. ఎంటర్ ప్రైజస్ శ్రీనాగేందర్ గారికి మరియు గూగుల్ సర్చ్ఇంజన్‌కి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

# మల్లాది గోవింద దీక్షితులుగారితో నా అనుభవాలు



2000 సం.లో మా అన్న గారైన డాక్టర్. శివప్రశాంత్ గారితో కలిసి అనుకోకుండా కురువపురం వెళ్ళడం, అక్కడ గురుచరిత్ర పారాయణం చేయడం, ఆ రాత్రి భగవత్‌సాన్నిధ్యంలో గడపటం జరిగింది. ఇప్పుడు శ్రీపాదుల లీలలు సంపూర్ణంగా చదివి తెలుసుకున్నాక, వెనక్కి తిరిగి ఆలోచిస్తే నా పారాయణ, అంతర్మథనలకు శ్రీచరణులు నాకు ఇచ్చిన వరమే నా కురువపురయాత్ర, శ్రీవారి దర్శనం కాబోలు అని అనిపిస్తుంది. 2007లో గాయత్రిహోమంలో పాల్గొనడానికి విశాఖపట్టణం వెళ్ళాను. అక్కడ మా మిత్రుని ఇంట్లో మొదటిసారిగా "శ్రీపాద శ్రీవల్లభ చరితామృతం" గ్రంథాన్ని చూసాను. మొదటి అధ్యాయం చదివిన వెంటనే పిఠాపురం వెళ్ళి అక్కడ ఆ పుస్తకం కొనుక్కొని అక్కడే ఉండి మూడు రోజుల్లో పారాయణం పూర్తి చేసుకొని వచ్చాను. ఇందులో చర్చించని విషయం అంటూ ఏదీ లేదు, కాణాద కణ సిద్ధాంతం నుండి ప్రారంభిస్తే రసాయనిక, వృక్ష శాస్త్రాలు, ఖగోళం, జన్యుశాస్త్రం, ఇప్పుడు కొత్తగా ఊపునందుకుంటున్న సకారాత్మక, నకారాత్మక స్పందనలు మొదలైన ఎన్నో విషయాలు ఇందులో చర్చింపబడ్డాయి.

2008లో నేను మా అన్నగారు కలిసి సప్తాహ పారాయణకు పిఠాపురం వెళ్ళాము. మా రాకని మామయ్యగారికి (అలా పిలిచేంత చనువు వారు మాకు కలిగించడం మా అదృష్టం)ముందుగానే తెలియజేసాము. ఆ వారం రోజులు జీవితంలో మరువలేనివిగా మిగిలి పోయాయి. సాయంత్రాలు కుక్కుటేశ్వరఆలయంలో కూర్చొని ఎన్నో వేదాంత విషయాలను తెలుసుకునే వాళ్ళం. అప్పుడే దీక్షితులుగారు ప్రసన్నకుమారిని ఆ గ్రంథాన్ని హిందీలోకి,

తర్వాత ఇంగ్లీష్‌లోకి అనువదించమని నిర్దేశించడం జరిగింది.

ఈ పుస్తకంతో సంబంధించిన ఒక్క విషయం భక్తులకు చెప్పదల్చుకున్నాను. మల్లాది సూర్యనారాయణగారు, మామయ్యగారి తండ్రి తమకు అవసాన దశ దగ్గర పడిందని గ్రహించి పుత్రుణ్ణి పిలిచి, “సిద్ధంగా ఉన్నావా?” (శ్రీపాదులకు సంబంధించిన అన్ని విషయాలు తెలుసుకోవడానికి అని భావం) అని అడిగారట. మామయ్యగారు ఏ మాత్రం తటపటాయించకుండా సరే అని చెప్పారట. పాలేరుని పిలిచి అటకపై ఉన్న గ్రంథాన్ని తెమ్మని చెప్పారట. నిచ్చెన వేసుకొని అటకపై తొంగి చూసిన పాలేరుకి గ్రంథాన్ని చుట్టుకొని సర్పరాజం కనిపించిదట. అతడు భయపడి అదే విషయం చెప్తే మొదటగా ఆ పాముకి దండంపెట్టి నా మాటగా చెప్పమని చెప్పారట. అతడు వెళ్ళి నమస్కరించి ఈ పుస్తకం తెమ్మని అయ్యగారి ఉత్తరువు అని చెప్పగానే ఆ పాము అదృశ్యమయిందట. తరువాత ఆ పవిత్ర గ్రంథాన్ని పుత్రుని చేతిలో ఉంచి, వారి తలపై చేతినిఉంచి శక్తిపాతం చేసారట. వీరికి వెంటనే ఎన్నో యోగరహస్యాలు, సంధ్యాభాష, సాంద్రసింధువేదం మొదలైనవి తెలిసాయట.

శంకరభట్టుగారిచే సంస్కృతంలో రచింపబడి తరువాతి తరాలలో తెలుగులో అనువదింపబడిన ఈ గ్రంధము 33 తరాల వరకూ అంటే మల్లాది గోవిందదీక్షితులగారి హయాం వరకు, సర్వదా సర్పరాజంతో రక్షింపబడుతుండేదట. మావూళ్ళమ్మ గుడి దగ్గర నుండి వారికి సంకేతం రావటం భక్తులకు తెలిసిన విషయమే. అయితే పురాతన ప్రతి ఎంత శిథిలావస్థలో ఉన్నది అంటే ముట్టుకుంటే చినిగేలా ఉన్నదట. దాన్ని సంస్కరించి కాపీ చేయడానికి మూడు సంవత్సరాలకు పైగా పట్టిందని చెప్పారు.

చాలామంది ఈ పుస్తకంలోని భాష మాకు అర్థం కావడం లేదనో, చాలా పెద్దదనో, చదవడానికి సమయంలేదనో మాతో చెప్పడం

జరిగింది. మరికొంతమంది ఇది మాకు అర్థమయ్యే సరళభాషలో సంక్షిప్తంగా రాస్తే చదవగలుగుతాము. చదవాలని అభిలాష ఉన్నా చదవలేక పోతున్నాము అంటూ ఆవేదన వ్యక్తపరిచారు. ప్రసన్నకుమారి ఈగ్రంథాన్ని సంక్షిప్తీకరించడంతో దత్తభక్తులకు సరళభాషలో ఈపుస్తకం పారాయణం చేయడానికి వీలుగా ఉంది.

ఈగ్రంథాన్ని చిన్నా పెద్దా అందరు చదివి అర్థం చేసుకొని సాధ్యమైనంత వరకు ఆచరణలో పెడుతూ అన్ని రకాలుగా పుణ్యము, సఫలత, ఆయురారోగ్య ఐశ్వర్యాలు పొందాలని ఆశిస్తూ...

**శ్రీసాయిరాం**

సికింద్రాబాదు

## శ్రీ శంకరభట్టు సామీప్యముక్తి

రెండు మూడు గంటలు క్యూలో కాళ్ళు పీక్కుపోయేలా నిల్చొని, సెక్యూరిటీ వాళ్ళ బెదిరింపులు, పూజార్ల హెచ్చరికలు, తోటిభక్తుల తోపులు గట్రా లేకుండా రెండు నిమిషాలు విగ్రహం ముందు నిల్చొని నిశ్చలంగా దండం పెట్టుకోగలిగితే, గుడి నుండి బయటకు రాగానే "అబ్బా! ఎంత అదృష్టమో!" అని సంబరపడిపోతాం మనం. మనవంతు రాగానే మనవైపు కన్నెత్తి కూడా చూడకుండా చేతిలోంచి పూలు గట్రా లాక్కునంత పని చేసిన పూజారితో బిక్కమొహం వేసుకొని దీనంగా "దేవుడి కాళ్ళ దగ్గర నుండి రెండు పూలు ఇవ్వండి. స్వామి, అంటూ వేడుకుంటాము. ఆయనగారు మన మాట విన్నారో లేదో? అని ఆదుర్దా... ఆయన కొద్దిగా వంగి పూల దగ్గర చేయి పెట్టగానే దేవుడు వెనక్కు వెళ్ళి పోయి "ఇంతింతై వటుడింతితై" అన్నట్లు పూజారి విశ్వరూపం ధరించి మన కంటికి కన్పిస్తారు. గుప్పిటి నిండా పూలు తీసిన ఆయన ముఖంలో మనకు అందరు దేవుళ్ళు ప్రత్యక్షం అవుతారు. ఒక్క పూవు అడిగితే తండ్రీ! ఇన్ని ఇస్తున్నావా? అంటూ భావుకులం అయిపోతాము. ఆత్రంగా భక్తితో దోసిలి చాపుతాం. ఇంతలో ఆ పక్కన పూజారి వీరితో ఏదో మాట్లాడటం మొదలు పెడ్తారు. ఈయన ముఖం అటు, చేతులు ఇటు పెట్టి ఆ పూలేవో మన వెనకాలనో, పక్కనో ఉన్న వాళ్ళ చేతిలో పెడ్తారు. అయ్యో! అనుకుంటూనో "తానొకటి తలచిన దైవ మొకటి తలచును అనుకుంటూనో బాధపడుతూనే మనసు సరి పెట్టుకుంటాం. ఒకవేళ మన చేతికి ఆ పూలు వస్తే మన ఆనందానికి హద్దులు ఉండవు. మన కష్టాలన్ని తీరిపోతున్నాయని భగవంతుడు మనకి సంకేతం ఇచ్చారని ఉబ్బి తబ్బిబ్బు అవుతాం. అలాంటప్పుడు సాక్షాత్తు దత్తావతారమైన శ్రీవల్లభుల అనుగ్రహానికి పాత్రులై, వారికి సమకాలికునిగా జన్మించడమే కాక, నిరాకారుడు, నిర్గుణుడైన భగవంతుని సాకారంలో చూస్తూ, వారి వద్దనే ఉంటూ, వారికి సేవలు చేస్తూ, వారి లీలలను కళ్ళారా

చూస్తూ వారి ఆజ్ఞ మేరకు వారి చరిత్రను వ్రాసిన శంకరభట్టు ఎంత అదృష్టవంతులై ఉండాలి!

నాలుగు మంచి మాటలు వినడానికి, మంచి సాంగత్యానికి, పుణ్యతీర్థాలు చూడటానికి పెట్టి పుట్టాలి అంటారు. అలాంటప్పుడు సృష్టి, స్థితి, లయకారుడు, ఆద్యంత రహితుడు, నిర్గుణుడు అయిన భగవంతుని, భగవంతుడని గుర్తించడానికి కావలసిన మంచి గుణాలన్నీ కలిగి, నేను, నాది అనే అహంకారం నశించి, మనలో ఉన్న భగవంతుని గుర్తించగలిగి నపుడు భగవత్ సాక్షాత్కారం అయినట్లే అంటారు. అటువంటి నిరహంకార, నిరామయ స్థితిలో ఉండి, అడుగడుగునా వారి సూచనలు అందుకొని, రక్షింపబడిన పుణ్యమూర్తి శంకరభట్టుగారితో కలిసి వారి అనుభవాల ను ఎన్నిసార్లు విన్నా, చదివినా, ఎంత మందితో పంచుకున్నా కొత్తగానే ఉంటుంది. ఇది ఒకసారి చదివి పక్కన ఉంచే పుస్తకం కాదు. చిలికితే వెన్న వచ్చినట్లు చదవగా చదవగా మనకే ఇందులోని కొత్త కొత్త విషయాలు తెలియజెప్పే పవిత్ర గ్రంథం. పదండి, మనం కూడా శంకరభట్టుగారితో కలిసి, వారి కష్టసుఖాలను సమంగా అనుభవిస్తూ, ఆధ్యాత్మిక విషయాల ను తెలుసుకుంటూ, అన్ని యాత్రలు కాలి నడకన చేస్తూ శ్రీపాదుల దర్శన, స్పర్శన, చర్చలతో తరించడానికి కర్ణాటక నుండి కురువపుర యాత్ర ప్రారంభిద్దాం.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

## మొదటి అధ్యాయం

## శ్రీ శంకరభట్టుల పరిచయ వాక్యాలు



శ్రీమహాగణనాయకునికి, చదువుల వేల్పు సరస్వతీమాతకు, జ్ఞానజ్యోతిని వెలిగింపజేసే మా గురుపరంపరకు, శ్రీకృష్ణభగవానునికి నమస్కరించి నేను శ్రీపాద శ్రీవల్లభుల వైభవాన్ని వర్ణింపబోతున్నాను. గొప్ప పండితుడను కాకపోగా అంతగా వేదవేదాంగాలు, శాస్త్రాలు చదువని నాతో ఇటువంటి గొప్ప గ్రంథాన్ని వ్రాయించటం కేవలం వారు నాపై కురిపించిన అనుగ్రహ అమృత వర్షమే అని మనవి చేసుకుంటున్నాను.

నాపేరు శంకరభట్టు. నేను భారద్వాజ గోత్రంలో పుట్టిన కర్ణాటక బ్రాహ్మణుడను. శైవ, వైష్ణవ భేదం పాటించని స్మార్తుడనే అయినా నాకు శివునిపై భక్తి కొంచెం ఎక్కువే.

ఉడిపిలో ఉన్న శ్రీకృష్ణ విగ్రహాన్ని సాధారణ శిల్పులు తయారు చేయలేదని, మయసభ నిర్మాత, దేవశిల్పి అయిన విశ్వకర్మ ఆ విగ్రహాన్ని శ్రీకృష్ణుని ఆజ్ఞపై తయారు చేసి ప్రతిష్ఠించారని విన్నప్పటినుండి అక్కడకు వెళ్ళాలన్న కోరిక ఇనుమడించి, ఉడిపి వెళ్ళాను. ఆపాదమస్తకం ధగ ధగా మెరుస్తున్న ఆభరణాలతో, విలక్షణంగా ఒక చేతిలో కవ్వం, మరొక చేతిలో కవ్వపుతాడు, తలపై నెమలి పింఛంతో ముగ్ధ మనోహరంగా ఉన్న కృష్ణుని చూసి మైమరిచాను. స్వామిని తనివితీరా చూసుకొని అచటి నుండి కన్యాకుమారి వెళ్ళి దేవీ దర్శనం చేయమన్న కృష్ణ భగవానుడి ఆజ్ఞ ప్రకారం కన్యాకుమారి వెళ్ళాను. ఆ జగన్మాత చిరునవ్వులు చిందిస్తూ

ఆశీర్వదించినట్లు తోచింది. మండప ప్రాంగణంలో ధ్యానంలో కూర్చొని ఉండగా ఆ మాత మనోనేత్రం ముందు సాక్షాత్కరించి, “నా సోదరులు శ్రీపాద శ్రీవల్లభులు కురువపురంలో ఉన్నారు. వారిని దర్శించి నీ జన్మ సార్థకం చేసుకో,” అని, వారి దర్శనంవల్ల మనస్సు, ఆత్మ, ఇంద్రియాలకు మాటల్లో చెప్పలేనంత ఆనందం కలుగుతుందని ఆదేశించడంతో నా కురువపుర యాత్ర మొదలైంది.

**మరుత్వమలై హనుమంతులవారి కొండ**

దారిలో, మరుత్వమలై దగ్గర మజిలీ చేసాను. పూర్వం హనుమంతుల వారు సంజీవనీ పర్వతాన్ని తీసుకొని వెళ్ళుతుండగా దాని నుండి చిన్న ముక్క విరిగి పడిందని, అందువల్ల దానికి ఆ పేరు వచ్చిందని విన్నాను. మరుత్వమలై అంటే హనుమంతులవారి కొండ అని అర్థం. అక్కడి గుహల్లో సిద్ధపురుషులు ఉంటారని విని, చూడాలన్న కోరికతో వెళ్ళాను. కాని ఒక గుహ దగ్గర పులిని చూసి భయంతో “శ్రీపాద శ్రీవల్లభా” అంటూ బిగ్గరగా అరిచాను. శ్రీపాదా అంటూనే నన్ను చూసి భయపడుతున్నావా? అంటున్నట్లు పులి మాత్రం నిబ్బరంగా నిల్చొని, శ్రీపాదుల తారకమంత్రం ఇదే సుమా అని చెప్పుతున్నట్లుగా గంభీరంగా “శ్రీపాదరాజం శరణం ప్రపద్యే” అంటూ మానవ భాషలో గర్జించింది.

**సిద్ధపురుషుల కథనం**

ఇంతలో గుహనుండి ఒక సిద్ధ పురుషులు బయటికి వచ్చి “శంకరా, లోపలికి రా!” అంటూ గుహలోనికి తీసుకొని వెళ్ళారు. అచట వారు అగ్ని మొదలైన యజ్ఞ ద్రవ్యాలను అన్నింటిని సృష్టించి యజ్ఞం చేసారు. కలియుగంలో ప్రజలు యజ్ఞాలను మరచిపోతున్నారని, వాటిని చేయడంవల్ల ప్రకృతి శక్తులు శాంతించి మానవులకు అనుకూలమైన పరిణామాలు ఇస్తాయని, తాను ప్రపంచశాంతి కోసమే యజ్ఞం చేసి ఆ ఫలితాన్ని విశ్వానికి

ధార పోస్తున్నానని ఆ సిద్ధపురుషులు చెప్పారు. నేను ఆ పులిని గురించి, శ్రీపాదులవారి గురించి తెలుసుకోవాలన్న నా ఉత్సాహాన్ని వ్యక్తం చేసాను. వారిలా చెప్పడం మొదలుపెట్టారు:

**వ్యాఘ్రేశ్వరుని జననం-బాల్యం**

"గోదావరి మండలంలోని, ఆత్రేయపురంలో, కాశ్యప గోత్రీకులైన శ్రోత్రీయ బ్రాహ్మణ కుటుంబంలో ఒక శిశువు జన్మించాడు. అతనికి వ్యాఘ్రేశ్వరశర్మ అని పేరు పెట్టారు. తండ్రి మహాపండితుడైనా, బాలుడికి ఒక్క అక్షరం ముక్క ఒంట పట్టలేదు. 'పండితపుత్రః పరమశుంఠః' అనే సామెత వీరితోనే మొదలయిందా? అని అనిపించేంత విధంగా తండ్రి మహా మేధావి, పుత్రుడు పూర్తిగా వ్యతిరేకం. వయసు వచ్చినా, సంధ్యావందనం కూడా చేయలేకపోవడంవల్ల, అందరితోబాటు తల్లితండ్రులు కూడా అతన్ని చిన్నచూపు చూడటం మొదలు పెట్టారు.

**వ్యాఘ్రేశ్వరశర్మ బదరికారణ్య ప్రయాణం**

ఒకనాడు రాత్రి, కలలో, శ్రీపాదులు కనిపించి నేనున్నాను అంటూ అభయం ఇచ్చి బదరికారణ్యం వెళ్ళమని చెప్పారు. అందరి సూటిపోటి మాటలవల్ల మనసు చిన్నబుచ్చుకున్న శర్మ, వెంటనే బదరి కారణ్యానికి బయలుదేరాడు. బదరికారణ్యంలోని ఊర్వశీకుండంలో పుణ్యస్నానం చేస్తుండగా అక్కడికి ఒక మహాత్ములు తన శిష్యులతోసహా స్నానం చేయడానికి వచ్చారు. పుణ్యమూర్తులైన వారిని చూస్తూనే వారి కి సాష్టాంగపడి తనని శిష్యునిగా స్వీకరించమని శర్మ ప్రార్థించాడు. ఆయన సరే అని, "శర్మా! నీవు ఈ పుణ్య తపోభూమికి రావడం శ్రీపాదుల అనుగ్రహమే," అని చెప్పారు. వ్యాఘ్రేశ్వరుడు శ్రీపాదులు ఎవరని అడిగి నపుడు 'శ్రీపాదులు సాక్షాత్తు దత్త ప్రభువులే అని, త్రేతాయుగంలో భారద్వాజ మహర్షి పీఠికాపురంలో సావిత్రికాఠక చయనం చేసినపుడు దత్తుడు

వారికి కలియుగాంతంలో భరద్వాజ గోత్రంలో అవతరిస్తానని వాగ్దానం చేసినందువల్ల పీఠికాపురంలో శ్రీపాదునిగా అవతరించారని' చెప్పారు. తాను తమ గురువైన మహావతార బాబాజీ దర్శనానికి వెళ్తున్నామని, ఒక సంవత్సరం తర్వాత తిరిగి వస్తామని, అంతవరకు తాము నేర్పిన క్రియాయోగం అభ్యసించమని శిష్యులకు చెప్పి ద్రోణగిరికి వెళ్ళారు.

**నామ రూపాలలోనూ వ్యాఘ్రేశ్వరశర్మయే**

వ్యాఘ్రేశ్వరశర్మకి గురువుగారు చెప్పిన క్రియాయోగం, ఆ పద్ధతులు ఏమి అర్థం కాకపోవడంతో, గురువుగారి బోధనలో తనకు అర్థమైన ఆత్మపై మనసు కేంద్రీకరించాలన్న ఉపదేశం మాత్రం తీసుకొని, తన పేరు వ్యాఘ్రేశ్వరశర్మ కాబట్టి తన ఆత్మ పులి అని, పులి చర్మమే యోగులకు, సిద్ధులకు పవిత్రమైన ఆసనంగాను,



శివునికి అంబరంగాను ఉపయోగపడుతుంటే ఇక పులి ఎంత గొప్పదై ఉండి ఉండాలి అని ఆలోచించి పులిమీదే మనసు లగ్నంచేసి ధ్యానం ప్రారంభించాడు.

ఒక సంవత్సరం గడిచిన తరువాత తిరిగి వచ్చిన గురువుగారు ఒక్కొక్క శిష్యుడి అభివృద్ధి పరిశీలిస్తూ వ్యాఘ్రేశ్వరశర్మ గుహ దగ్గరకు వచ్చి అందులో పులి ఉండటం చూసి, యోగదృష్టితో నిజం తెలుసుకొని, అతని అమాయకత్వానికి అబ్బురపడి, ఓంకార నాదాన్ని, శ్రీపాదరాజం శరణం ప్రపద్యే అనే మంత్రాన్ని నేర్పించారు.

**వ్యాఘ్రేశ్వరశర్మపై శ్రీపాదుల కారుణ్య వృష్టి**

వ్యాఘ్రేశ్వరశర్మ ఆ పులి రూపంతోనే శ్రీపాదుల దర్శనం

కోసం కురువపురం చేరుకున్నాడు. కురువపురం చేరాలంటే మధ్యలో కృష్ణానదీపాయను దాటి వెళ్ళవలసి ఉంటుంది. అవతలి తీరాన ఉన్న శ్రీపాదులు, 'నా భక్తుడు నన్ను పిలుస్తున్నాడు,' అంటూ చకచకా కృష్ణ మీదుగా నడుచుకుంటూ వెళ్ళారు. అడుగు పెట్టిన ప్రతి చోటనుండి చక్కటి పద్మం బయటకు వచ్చింది. ఆయన ఆ పద్మం మీద కాలు పెట్టుకుంటూ వెళ్తూ ఉంటే ఆ పద్మం ఎలా నిల్చి ఉంది? ఆయన అలా నీటిపై తేలి ఎలా నడిచి వెళ్ళారు? ఇవి సాధారణ మనుష్యుల ఊహకు అందని విషయాలు. ఆయన పులి రూపంలో ఉన్న వ్యాఘ్రేశ్వరునిపై కూర్చుండి తిరిగి ఇవతలి ఒడ్డుకు చేరగానే పులి మరణించింది. ఆ పులిలో నుండి ఒక పుణ్యపురుషుడు బయటకు వచ్చి శ్రీపాదులకు నమస్కరించి ఆ పులి చర్మాన్ని ఆసనంగా చేసుకోమని ప్రార్థించారు. శ్రీపాదులు అంగీకరించి, వ్యాఘ్రేశ్వరశర్మకి అతని పూర్వజన్మ వృత్తాంతం ఇలా చెప్పారు: పూర్వజన్మలో అతను పులుల్ని బంధించి, హింసించి, ఆడించినందువల్ల ఇలాంటి సంఘటనలు అతని జీవితంలో జరిగాయని, ఇంకా ఎన్నో జన్మలు ఎత్తి అనుభవించవలసిన అతని కర్మని తాను దయతో తప్పించి ఈ ఒక్క జన్మలోనే సరిచేసానని తెలిపి, చాలాకాలం పులిగా ఉన్నందువల్ల ఎప్పుడు తలచుకుంటే అప్పుడు పులి రూపం రాగలదని ఆశీర్వదించి, హిమాలయాలకు వెళ్ళమని ఆజ్ఞాపించారు. నువ్వు చూసింది ఆ పులినే," అంటూ ఆ సిద్ధ పురుషులు పులి రూపంలోని మహాత్ముడికి సంబంధించిన వివరాలన్ని చెప్పారు.

హిమాలయాలలో ఉండే యోగులు, సిద్ధపురుషులు వారి వారి గుహలలో కూర్చొని కేవలం భావప్రసారాల ద్వారా ఒకరితో ఒకరు మాట్లాడుకోవచ్చు. ఒకరి విషయాలు మరొకరు తెలుసుకోవచ్చు. అయినా వాళ్ళు సరదాగా వ్యాఘ్రేశ్వరుని ద్వారా ఒకరికొకరు వర్తమానాలు పంపించుకుంటూ ఉంటారు. ఇది శ్రీపాదుల వినోద లీల.

**శ్రీపాదరాజంశరణం ప్రపద్యే**

## 2వ అధ్యాయం

## మధురా (మదురై) నగర వృత్తాంతము



మరుత్వమలై నుండి నేను మరల నా ప్రయాణం కొన సాగించాను. అడగనిదే అమ్మ అయినా అన్నం పెట్టదు అని అంటారు. కాని దీన్ని అబద్ధం చేస్తూ దారిలో నేను నోరు తెరచి అడగకుండానే ఎందరో తల్లులు నాకు భోజనం పెట్టారు. నాకు ఇది ఒక కొత్త అనుభవం. ఇది శ్రీపాదుల వారి దయే అని గ్రహించాను. పాండ్యదేశంలో కదంబవనం చేరేసరికి నా శరీరం దూదికన్నా తేలిగ్గా ఉండి గాలిలో తేలిపోతున్నట్లు ఒక వింత అనుభూతి కలిగింది. అక్కడ శివలింగం దర్శించి నమస్కరించి, కొద్ది ఘడియల తరువాత బయలుదేరేసరికి, మళ్ళీ నా శరీరం మామూలు స్థితికి వచ్చింది. దగ్గరలో ఏదో ఆశ్రమం కనిపిస్తే అక్కడకు వెళ్ళాను. అందులో ఉన్న సిద్ధయోగులు నన్ను సాదరంగా లోపలికి ఆహ్వానించి, నా అనుభవం విన్న తరువాత, ఆ శివలింగ మహిమను ఈ విధంగా చెప్పారు:

### మీనాక్షీ-సుందరేశ్వరుల ఆలయ వృత్తాంతం

"ఒకసారి దేవదానవ యుద్ధంలో ఇంద్రుని చేతిలో అందరు రాక్షసులు మరణించగా, ఒక్క రాక్షసుడు మాత్రం తప్పించుకొని పారిపోయి, తపస్సు చేసుకుంటుండగా, ఇంద్రుడు అతడిని చంపారు. తపస్సమాధిలో ఉన్న వాడిని చంపడం పాపకార్యం కాబట్టి, ఇంద్రునికి మహాపాతకం చుట్టుకొని, అతని తేజస్సు తగ్గిపోయింది. దానితో అతడు అన్ని పుణ్యక్షేత్రాలు తిరుగుతూ, ఈ స్థలానికి వచ్చేసరికి పాపభారం తగ్గి, తిరిగి తేజోవంతుడు అయ్యారు. ఇంద్రుడు శివలింగంపు మహిమను తెలుసుకొని దానికి ఒక

ఆలయం నిర్మించారు. నీవు ఆ ఆలయాన్ని, ఆ లింగాన్నే చూసావు. ఇది సాధారణ విషయం కాదు. **దత్త భక్తులకు, పుణ్యక్షేత్ర దర్శనం, పుణ్య పురుషులను కలుసుకోవడం మొదలైనవి అడగకుండానే దొరుకుతాయి** అని చెప్పి, మరోసారి శివదర్శనం చేసి రమ్మని నన్ను పంపారు.

ఈసారి ఆ ప్రదేశమంతా జన సందోహంతో నిండి ఉండడమే కాకుండా, ఇంతకు ముందు సాధారణ ఆలయం ఉన్న చోట ఇపుడు పెద్ద గుడి ఉండడం చూసి ఆశ్చర్యంతో బాటసారులను అడిగాను. అది మీనాక్షి సుందరేశ్వరుల ఆలయమని తెలిసింది. శివదర్శనం చేసుకొని మళ్ళీ వచ్చి చూడగా పూర్తి జన సందోహంతో గ్రామం కాస్త నగరంలా మారి సిద్ధయోగుల ఆశ్రమం ఎక్కడో తెలియలేదు. నాకు తోచిన దిక్కులో వెళ్తుండగా సూర్యాస్తమయమై చీకటి పడింది. కాని నా వెనుక కాంతి ప్రసారం ఉండటం గమనించి వెనక్కి తిరిగి చూడగా మూడు తలలమీద మూడు మణులతో ఒక పెద్ద పాము నా వెంట వస్తూ ఉండటం కనిపించింది. భయంతో కంపించిపోయి అప్రయత్నంగా శ్రీపాదుల నామం జపిస్తూ నలుదిక్కులా వెదుకుతూ చివరకు ఎలాగో సిద్ధయోగుల ఆశ్రమం చేరాను. వెంటనే ఆ సర్పం, ఆ కాంతి మాయం అయ్యాయి.

**ఆలయ మహిమ-మధురానగర పవిత్రత**

ఎంతో ఆదరంతో సిద్ధయోగీంద్రులు ప్రసాదంగా ఇచ్చిన వేయించిన వేడి వేడి శనగలు కడుపునిండా తిన్నాను. తర్వాత వారు ఈ విధంగా వివరించారు, “శంకరభట్టూ! నీవు మొట్ట మొదట దర్శించిన శివలింగం, తర్వాత దర్శించిన శివలింగం రెండూ ఒకటే, వేరు వేరు కావు. దత్తుల ఆజ్ఞ ప్రకారం నీకోసం కాలాన్ని వెనక్కి తిప్పి, ఆయా కాలాలలో ఉన్న శివలింగాన్ని, అప్పటి పరిస్థితులను, వాతావరణాన్ని కల్పించి నీకు చూపించడం జరిగింది. **శ్రీదత్త ప్రభువుల సంకల్పం వల్ల భవిష్యత్తు వర్తమానంగా, వర్తమానం**

**భూతకాలంగా, భూతకాలం వర్తమానంగా మారవచ్చు. ఒక విషయం జరగాలన్నా, జరగకుండా ఉండాలన్నా, ఇంకో కొత్త పద్ధతిలో జరగాలన్నా శ్రీదత్తప్రభువుల సంకల్పమే కారణం. ఏ మహాసంకల్పంవల్ల సృష్టి, స్థితి, లయలు జరుగుతున్నాయో ఆ మహాసంకల్ప స్వరూపమే శ్రీదత్తాత్రేయులు;** వారే ప్రస్తుతం శ్రీపాద శ్రీవల్లభునిగా పీఠికాపురంలో అవతరించారు. వారి అనుగ్రహం పొందాలంటే మనలోని అహంకారం, గర్వం పూర్తిగా నశించాలి," అని చెప్పి ఆ ఆలయ వృత్తాంతం ఇలా తెలియజేసారు:

దేవేంద్రుడు నిర్మించిన ఆలయ విషయాన్ని ధనంజయుడనే వ్యాపారి కులశేఖర పాండ్య మహారాజునకు చెప్పగా, ఆ రాజు ఆలయాన్ని అభివృద్ధి చేసి అక్కడ ఒక నగరాన్ని నిర్మించి "మధురానగరం" అని పేరు పెట్టారు. (ప్రస్తుతం తమిళనాడులోని మదురై పట్టణం) వారి కుమారుడు మల యధ్వజుడు పుత్రకామేష్టి యాగం చేయగా యజ్ఞకుండం నుంచి మూడేళ్ళ బాలిక అయోనిజగా పుట్టింది. ఆమెకు మీనాక్షి అని పేరు పెట్టి యుక్త వయసు రాగానే సాక్షాత్ విష్ణువు కన్యాదాతగా సుందరేశ్వరునికి ఇచ్చి వివాహం జరిపించారు. ఇంతేకాక శివుని జటాజూటం నుండి ప్రవహిస్తున్న వేగవతీ నది ఈ ప్రాంతమంతటిని మరింత పవిత్రం చేస్తున్నది."

### శంకరభట్టుకు కాకులు-పాముల బెడద

అలిసి ఉండటంతో కళ్ళు మూయగానే ఒళ్ళు తెలియని గాఢనిద్రలోకి జారాను. తెల్లవారు ఝామున లేచి చూడగా ఆశ్రమం కాని, యోగీంద్రులు కాని లేరు. నేను చూసింది కలా? నిజమా? నాకు అర్థం కాలేదు. తిరిగి నా ప్రయాణం సాగిస్తూ మధ్యాహ్నం ఒక గ్రామం చేరుకున్నాను. అక్కడ బ్రాహ్మణులు ఎవరు లేరని, కేవలం కొండజాతి వాళ్ళు మాత్రమే నివసిస్తున్నారు అని తెలిసి "మార్గమధ్యే శూద్రవత్ ఆచరేత్"[1] అనుకొని

1. మార్గ మధ్యంలో శూద్రునిలా వ్యవహరించవచ్చు.

తినడానికి వాళ్ళు ఇస్తున్న పుట్ట తేనె, పళ్ళు చేయి చాచి అందుకుంటూ ఉండగా ఎక్కడి నుండో కాకులు వచ్చి పొడవడం మొదలుపెట్టాయి. భయంతో పారిపోయే నన్ను వెంట తరిమి వేధించసాగాయి. నేనేదో దైవదూషణ చేసి ఉంటానని, అందుకే భగవంతుడు నాకు ఇలాంటి శిక్ష విధించి ఉంటాడని నాలాంటి  నాస్తికుని రక్షించినట్లయితే ఆ దేవుడికే కోపం వస్తుందేమో అని భావించి ఒక్కరు కూడా నన్ను కాపాడడానికి ముందుకు రాలేదు.

పూర్తిగా అలసిపోయి, రక్తం కారుతున్న శరీరంతో నేను ఒక మేడిచెట్టు కింద చతికిలబడుతూ ఈ చెట్టు దత్తప్రభుని నివాసం కదా, నన్ను రక్షిస్తుందని ఆశ పడ్డాను. కాకుల బెడద తప్పిందని ఆనందించే లోపల శూన్యంనుంచి పుట్టుకొచ్చినట్లు ఎక్కడి నుండో పాములు వరుసగా వచ్చి కాటు వేసి పోసాగాయి. శరీరం అంతా విషం నిండి కొన ఊపిరితో ఉన్న నన్ను కొంతమంది చాకలివాళ్ళు గాడిదపై పడుకోబెట్టి ఒక చర్మకార వైద్యుని యింటికి తీసుకొని వెళ్ళారు. లేత, రావి, ఆకులతో నాకు అతడు వైద్యం చేసాడు. రకరకాల కషాయాలు మింగించాడు. విషం విరుగుతున్నప్పుడు నరక యాతన అనుభవించాను. ఆ రాత్రికి నన్ను అక్కడే ఉంచారు. నాకు రాత్రంతా వల్లభదాసనే ఆ వైద్యుడు చేసిన "శ్రీపాద శ్రీవల్లభ" నామ సంకీర్తన ఒకవైపు ఎంతోహాయి కలిగించినా, మరొకవైపు బ్రాహ్మణ కులంలో పుట్టి ఒక అంటరాని వాని ఇంట్లో పడిఉండాల్సి వచ్చిందే అన్న బాధ వేధించ సాగింది. ఇంతలో అతను నా దగ్గరికి వచ్చి ఎంతో దయతో, ప్రేమతో, "నాయనా! శంకరభట్టూ! నీవు శ్రీపాదుల దర్శనానికి వెళ్తున్నావని నాకు తెలుసు. ఆ కాకులు, పాములు నిన్నెందుకు బాధించాయో కూడా నాకు తెలుసు," అని ఇలా చెప్పసాగారు:

**కాకులు-పాముల పూర్వ గాథ**

"గత జన్మలో ఆ కాకులు పీఠికాపురవాసులు. వేద నిష్ణాతులు.

తాము పండితులమనే అహంకారంతో బతికారే కాని వాళ్ళు ఒక్కరోజు కూడా నలుగురికి సాయపడే ఒక్క పని చేయలేదు. వాళ్ళు చనిపోయి స్వర్గాన్ని చేరినపుడు దేవేంద్రుడు మొదలైన దేవతలు వాళ్ళ తెలివితేటల్ని, పాండిత్యాన్ని ఎంతగానో మెచ్చుకున్నారు. కాని వారికి తినడానికి ఏమీ ఇవ్వలేదు. వీళ్ళు అమృతం తాగాలనే తమ కోరికను వెల్లడించగానే ఇంద్రుడు, "వేదవేదాంగాలు చదవడంవల్ల మీకు తెలియకుండానే మీరు ప్రభుస్తుతి చేసినట్లు అయ్యింది. ఆ పుణ్యంతోనే స్వర్గానికి రాగలిగారు. అంతేకాకుండా ప్రభుస్తుతికి ప్రతిఫలంగా దేవతలమైన మేము మిమ్మల్ని పొగిడాము. ఇది సామాన్యమైన విషయం కాదు. ఒక్క గింజ మీరు దానం చేసి ఉంటే దేవతలమైన మేము దానిని వేయి రెట్లు చేసి ప్రతిఫలం అందించి ఉండేవాళ్ళం. పాదగయ వంటి పుణ్య క్షేత్రంలో ఉండి కూడా తల్లితండ్రుల శ్రాద్ధకర్మలు ఏమాత్రం శ్రద్ధ లేకుండా, వృధా ఖర్చు అనే కలుషితమైన భావంతో చేసారు. వృద్ధులైన తల్లితండ్రుల్ని పోషించడం ఒక బెడదగా అనుకున్నారు, విసుక్కున్నారు. అలాంటి మీకు అమృతం దొరుకుతుందని ఎలా ఊహించారు? పుణ్యకార్యం ఒక్కటి కూడా చేయకుండా ఫలితాలని ఆశించడం ఎంత అవివేకం? స్వర్గంలో ఉన్నంత వరకు మీరు స్వేచ్ఛగా తిరగండి. తర్వాత మీరు కాకులు అవుతారు. కాలాంతరంలో మీ వంశంలో పుట్టిన దత్తభక్తుడూ శ్రీపాద శ్రీవల్లభ కీర్తనతో పవిత్రుడు అయిన వ్యక్తి రక్తం తాగిన తర్వాత మీకు ఉత్తమ గతులు ప్రాప్తిస్తాయి. అంతవరకు కాకి రూపాలలోనే ఉంటారు," అని దేవేంద్రుడు వాళ్ళకి వివరించారని వల్లభదాసు నాతో ఆ కాకుల గురించి చెప్పి ఆ పాముల విషయం కూడా ఈ విధంగా వివరించారు:

"నాయనా! ఆ పాములు కూడా నీ పూర్వీకులే. నీ పితృ దేవతలు కొందరు స్మశాన కాళి ఉపాసన చేసి కొందరి అకాల

మృతికి కారణం అయి పాపాన్ని మూట కట్టుకోవడం వల్ల పాములై జన్మించి, నీ రక్తం తగిలిన తర్వాత ఉత్తమ గతిని పొందారు. ఇది చిన్న ధర్మ సూక్ష్మం. ఏ కులంలో జన్మిస్తే ఆ కులపు ధర్మాన్ని తప్పకుండా ఆచరించాలి. శత్రువులను సంహరించడం క్షాత్ర ధర్మం, బ్రాహ్మణుడికి అహింస పరమ ధర్మం. కసాయివాడికి కాదు కదా! కర్మల ఫలం సక్రమంగా ఉండాలంటే ఎవరి ధర్మాన్ని వాళ్ళు చక్కగా ఆచరించాలి.

చిన్నప్పుడు "శుక్లాంబరధరం" అనే శ్లోకాన్ని తమాషాకోసం తప్పుగా వ్యాఖ్యానం చేసేవాడివి, శుక్లాంబరధరం అంటే తెల్ల బట్టలను ధరించినదని, శశివర్ణం అంటే బూడిదరంగు కలిగినదని, చతుర్భుజం అంటే నాల్గుకాళ్ళు కలదని, ప్రసన్న వదనం ధ్యాయేత్ అంటే ఓండ్ర పెట్టినపుడు ప్రసన్నమైన ముఖము కలిగినదని అటువంటి గాడిదను నేను ప్రార్థిస్తున్నానని నీ స్నేహితులతో చెప్పేవాడివి. శ్రీపాదులు తమ మాయతో నిన్ను ఆ పరిస్థితులలోనే విచిత్రంగా ఇరికించారు. చాకలివాళ్ళు నిన్ను తెచ్చినపుడు పూర్తిగా దుమ్ము నిండిన శరీరంతో బూడిద రంగుతోనూ, నడువలేక రెండు చేతులూ భూమిపై ఆనించి వచ్చినపుడు నీవు నాలుగు కాళ్ళ జంతువులాగానూ ఉన్నావు. బాధతో విలవిలలాడక పోయినట్లయితే నీవు ప్రసన్న వదనుడివే. శ్రీపాదులు ఈ విధంగా నీకు గుణపాఠాన్ని, నీ వాళ్ళకు ఉత్తమ గతిని ప్రసాదించారు," అని చెప్పి "నాయనా! మనల్ని, మనం చేసే పనులని వారు ప్రతిక్షణం గమనిస్తూనే ఉంటారని తెలుసుకో," అంటూ హెచ్చరించారు. ఈ ఉపదేశంతో నాలోని బ్రాహ్మణ అహంకారం చాలావరకు తగ్గింది. రెండు మూడు రోజులు అక్కడే ఉండి వారి దగ్గర సెలవు తీసుకొని బయలుదేరాను.

**విచిత్రపురపు విచిత్రరాజు**

కాలినడకన పోతూ ఉంటే రాజభటులు నా దగ్గరకి వచ్చి నా

గురించిన వివరాలు అడిగారు. నేను శివ కేశవులకు బేధం పాటించని బ్రాహ్మణుడినని, శృంగేరి పీఠాధిపతి శంకరాచార్యులు మా గురువని చెప్పాను.వారు నన్ను తమ రాజు దగ్గరకు తీసుకొని వెళ్ళారు. దారిలో మాటల సందర్భంలో తమ రాజు సంతానం కొరకు యజ్ఞం చేసి పుత్రుణ్ణి పొందారని, కాని దురదృష్టవశాత్తు యువరాజు మూగవారు కావడంతో బ్రాహ్మణులు యజ్ఞం సరిగా చేయించలేదని భావించి బ్రాహ్మణులపై కోపం వహించి ఉన్నారని, ఆ కోపంతోనే ఏ బ్రాహ్మణుడైనా ఆ ఊరి నుండి వెళ్తుంటే వారిని పిలిపించి 'అంతకు ఇంతయితే ఇంతకు ఎంత?' అని అడుగుతున్నారని ఎవరు సరియైన జవాబు చెప్పలేకపోతారో వారి గుండు గొరిగించి శైవ బ్రాహ్మణులయితే వైష్ణవ నామం, వైష్ణవులయితే విభూతి రేఖలు పెట్టి వారిని గాడిదపై ఊరేగిస్తారని చెప్పారు. పులి మీద పుట్రలా రాజు అకస్మాత్తుగా బ్రాహ్మణులకు బళ్ళ కొద్ది తోటకూర దానం చేస్తున్నారని వారికి మిగిలిన ఆహార పదార్థాలు తినడం నిషిద్ధం చేసారని, పచ్చిదో వండినదో తోటకూరనే వాళ్ళు ఆహారంగాను, అల్పాహారంగాను సేవించాలని చెప్పారు. ఇంతేగాక యువరాజు మూగవారు కావడం వల్ల రాజగురువుకు మూగభాషపై పరిశోధన చేసి విస్తృత గ్రంథం వ్రాయమని ఆదేశించారని తెలియజేసారు.

**తోటకూర రహస్యం**

నన్ను రాజు ముందు నిలబెట్టారు. మనసులో నేను శ్రీపాదుల వారిని స్మరించుకుంటూనే ఉన్నాను. అందరిని అడిగినట్లే రాజు నన్ను కూడా, 'అంతకు ఇంతయితే ఇంతకు ఎంత?' అని ప్రశ్నించారు. నేను చాలా నిబ్బరంగా "ఇంతకు ఇంతే" అంటూ తేల్చి చెప్పాను. ఆహా! నా అదృష్టం! నా సమాధానానికి వారెంతో సంతోషించి దానిని సమర్థిస్తూ తనకు వచ్చిన కల గురించి ఈ విధంగా చెప్పారు, "నేను పూర్వజన్మలో చాలా బీద బ్రాహ్మణుణ్ణి. మా యింట్లో తోటకూర బాగా ఎక్కువగా పండేది. అంతటి

బీదరికాన్ని అనుభవిస్తూ కూడా అందరికి అంటే మాకంటే స్థితిపరులకు కూడా తోటకూర దానం చేసేవాడిని. కాని వాళ్ళెవ్వరూ నాకు కొంచెం కూడా ప్రత్యుపకారం చేసేవారు కాదు. నేను చేసిన దానం వల్ల నాకు ఈ రాచజన్మ లభిస్తే నా దగ్గర దానం తీసుకున్న వాళ్ళు ఈ జన్మలో నా రాజ్యంలో బ్రాహ్మణుల్లా జన్మించారు. ఆ కొంచెం తోటకూరకే ఈ రాచజన్మ లభించింది కదా! మరి ఇపుడు బళ్ళకొద్ది చేసే తోటకూర దానానికి ఫలం ఏమిటని అడుగుతున్న నా ప్రశ్నకు మీరు ఒక్కరే సరియైన జవాబు ఇచ్చారు."

"ఆ జన్మలో ఎంతో బీదరికంలో ఉన్న మీ పరిస్థితుల దృష్ట్యా తోటకూర దానం చాలా గొప్పది. కాని ఈ జన్మలో మహారాజులై ఉండి వెండి, బంగారం, మణులు, మాణిక్యాలు దానం చేయగల్గే స్తోమత ఉండి కూడా కేవలం తోటకూర దానం చేసినట్లయితే అంతకు వందరెట్ల తోటకూర మీకు దొరుకుతుందేమో గాని వేరే ఫలితాలు ఉండవు," అని నేను వివరించాను. రెండవ పరీక్ష మొదలైంది, రాజగురువు వేళ్ళను చూపుతూ ఒకటా? రెండా? అని సైగలతో ప్రశ్నించారు. వచ్చినవారు ఒక్కరా? ఇద్దరా? అని అడుగుతున్నారేమో అనుకొని నేను ఒక్కడినే వచ్చానని చెప్పడానికి ఒక్క వేలు చూపించాను. తిరిగి వారు మూడు వేళ్ళు చూపించి మూగగా ప్రశ్నిస్తే మూడు తలల దత్తుడు స్మరణకు వచ్చి, 'భక్తి ఇతరులతో చర్చించేది కాదని, రహస్యమైన విషయం,' అని చెప్పడానికి నేను గుప్పిడి బిగించి చూపించాను. వారు నాకు తీయటి తినుబండారాలు ఇవ్వబోయారు. నేను వద్దని వారించి నా దగ్గర ఉన్న అటుకులని వారికి ఇవ్వబోయాను.

**లోకో భిన్న వ్యాఖ్యాన పద్ధతి :**

రాజగురువు ఎంతో సంతోషించి, "మహారాజా! వీరు మూగ భాషలో కూడా ఉద్దండ పండితులు. శివకేశవులు ఇద్దరా? కాదా? అని రెండు వేళ్ళు చూపిస్తే వారిద్దరూ ఒక్కరే యని ఒక్క వేలు చూపించారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురని మూడు వేళ్ళు చూపితే త్రిమూర్తులది సమిష్టి రూపం కదా! అని పిడికిలి చూపించి వివరించారు. నన్ను శిష్యుడిగా స్వీకరించండి అని భక్తితో తీపి పదార్థాలు ఇవ్వబోతే నాకు ఈ శిష్యుల, ప్రశిష్యుల గొడవ

వద్దు, నేను కుచేలునిలా నావద్ద ఉన్నదానితోనే తృప్తి పడుతాను అని చెప్పడానికి అటుకులు చూపించారు," అని పరీక్షా ఫలితాలను ప్రకటించారు.

ఆహా! లోకంలోని మనుష్యులు! వాళ్ళ విలక్షణ వ్యాఖ్యాన పద్ధతులు! అనుకొంటూ నేను ఆశ్యర్యపోయాను. మూడవ పరీక్షగా చమకంలోని వనసలను వ్యాఖ్యానించమని ఉత్తరువు. శ్రీపాదులపై భారం వేసి మొదలు పెట్టాను:

ఏకాచమే అంటే 1, త్రిస్రశ్చమే అంటే 3, ఈ రెండు కలిపితే 4, వర్గమూలం 2; పంచచమే అంటే 5నకు ఇంతకు ముందటి మొత్తం 4 కలిపితే 9, వర్గమూలము 3; సప్తశ్చమే అంటే 7నకు ఇంతకు ముందటి మొత్తం 9 కలిపితే 16, వర్గమూలము 4: నవచమే అంటే 9కి ఇంతకు ముందటి మొత్తం 16 కలిపితే 25 వర్గమూలము 5; ఏకాదశచమే 11నకు ఇంతకు ముందటి మొత్తం 25 కలిపితే 36 వర్గమూలము 6,

ఇట్లా నవత్రింశతిశ్చమే (39+361=400 వర్గమూలం 20) వరకు వివరించి 20వ వర్గమూలంతో ముగించి, 'ఇది అంతా సృష్టి పరమాణువుల రహస్యమని, ఇది కాణాద మహర్షికే తెలుసు అని, పరమాణువుల సూక్ష్మకణ భేదాన్ని బట్టి ధాతువులు ఏర్పడుతాయి,' అని ముగించాను. నా వివరణ నాకే ఆశ్చర్యాన్ని కల్గించింది. సభలోని వాళ్ళంతా ఒప్పుకోవడంతో నేను రెండవ సారి గాడిదను ఎక్కే ప్రమాదం నుండి తప్పించుకొని బయట పడ్డాను.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 3వ అధ్యాయం

## శ్రీపాదుల లీలా వైభవం-పళనిస్వామి

### భార్యోపహతుడు

శ్రీపాదుల అనుగ్రహంవల్ల విచిత్రపురం నుండి విచిత్రంగా తప్పించుకొని నా ప్రయాణం కొనసాగించాను. మూడు రోజులు నాకు అడగకుండానే భోజనం దొరికింది. నాల్గవ నాడు ఒక గ్రామంలోని ఇంటి ముందు నిల్చొని భిక్ష అడిగాను. లోపలినుంచి ఒక స్త్రీమూర్తి చాలా కోపంగా బయటకు వచ్చి అన్నంలేదు, సున్నం లేదు, పొమ్మని గదమాయించి సుడిగాలిలా లోపలికి వెళ్ళి పోయింది. కొంతసేపు అయ్యాక యజమాని బయటకు వచ్చి, “స్వామీ! నాభార్య పరమ గయ్యాళి, కోపంతో నా తల మీద కుండలు పగులగొట్టి వాటి వెల చెల్లించమని గద్దిస్తుంది. ఇప్పుడే నా నెత్తి మీద కుండలు పగిలాయి. వాటి ధర నేనిచ్చుకోవాలి. కాబట్టి మీతో భిక్షకి నేను కూడా వస్తాను. భగవంతుడి దయవల్ల ఇంత దక్షిణ దొరికితే అప్పునుండి విముక్తుణ్ణి అవుతాను,” అని దీనంగా చెప్పాడు. “హా! హతవిధీ! అనుకుంటూ ఇద్దరం కలిసి బయలుదేరి బ్రాహ్మణుల ఇళ్ళలో భిక్ష అడిగాము. దక్షిణ మాట అటుంచి మాకు పట్టెడు మెతుకులు పెట్టేవారే కరువయ్యారు. నీరసంతో దగ్గర్లో ఉన్న చెట్టుకింద చతికిలబడి శ్రీపాద నామస్మరణ మొదలు పెట్టాం. ఇంతలో కొందరు రాజభటులు మా దగ్గరికి వచ్చి, ‘తక్షణమే సభలో హాజరు కావాలి,’ అన్న రాజాజ్ఞను చెప్పి మమ్మల్ని గుర్రాలపై కూర్చుండబెట్టి సాదరంగా రాజభవనానికి తీసుకొని పోయారు.

### యువరాజు స్వస్థత

“మీరు వెళ్ళిన తర్వాత యువరాజు మూర్ఛపోయి కొద్ది సేపటికి తేరుకొని, అద్భుతమైన అందంతోను, చక్కటి దేహకాంతితోనూ ప్రకాశిస్తున్న

పదహారేండ్ల యతి ఎవరో తన నోటిలో విభూతి వేసారని, వారు శ్రీపాదులని చెప్పుతున్నారు. ఇదంతా ఏమిటి?వారెవరు? వివరిస్తారా?" అని రాజు నన్ను అడిగారు.

"ప్రభూ! శ్రీపాదులవారు దత్తావతారమని వినడమే తప్ప వారి గురించి నాకు పెద్దగా ఏమీ తెలియదు. వారి దర్శనం కోసమే నేను కురువపురం వెళ్ళుతున్నానని," నేను చెప్పాను. రాజు నన్ను బంగారంతో సత్కరించారు. మా మాధవుని పుణ్యమా అని నలభై రోజులు దత్త దీక్షలో ఉన్నాం. ఫలితంగా మీరు రావడం, మాకు విముక్తి లభించడం జరిగాయి. ఇకపై శైవ వైష్ణవ భేదాలు లేకుండా సామరస్యంతో ఉంటాము, అని రాజగురువు నాకు మాట ఇచ్చారు.

## మాధవుని నిరాడంబర జీవనం

మాతో మాధవుడు బయలుదేరాడు. నేను ఆ బంగారమంతా బ్రాహ్మణుడికి ఇచ్చాను. ఆయన భార్యలో మార్పు వచ్చి, దత్త భక్తురాలు అయింది. నేనూ, మాధవుడు చిదంబరం వైపు మా ప్రయాణం సాగించాము. మాధవుని పూర్వీకులు గర్తపురీ (గుంటూరు) మండలంలోని నంబూరు వాస్తవ్యులు. ప్రకాండ వేదపండితులు. మళయాళ దేశపు రాజు వీరిని తమ దేశానికి రావలసినదిగా ఆహ్వానించడంతో వీళ్ళు మళయాళ దేశానికి వలస పోయి క్రమక్రమంగా అక్కడే స్థిర నివాసం ఏర్పరచుకొన్నారు. వాళ్ళు మంత్ర, తంత్ర, యంత్ర విద్యలలో నిష్ణాతులు. కాని మాధవుడు మాత్రం నిరక్షర కుక్షి. చిన్నప్పుడే తల్లి తండ్రులు మరణించడంతో బ్రాహ్మణుల ఇండ్లలో వంట చేసి జీవితం గడుపుతున్నాడు. దత్త ప్రభువులపై అపారమైన భక్తి శ్రద్ధలు. శ్రీపాదుల గురించి విని వారిని చూడాలని తపన పడుతున్నాడు.

మేము చిదంబరం దగ్గర కొండగుహాలో ఏకాంతంగా ఉన్న పళనిస్వామిని కలిశాము. మమ్మల్ని చూస్తూనే, "అరే, మాధవ

శంకరులు ఇద్దరూ కలిసి వచ్చారే," అంటూ ఎంతో ఆప్యాయంగా లోపలికి తీసుకొని వెళ్ళారు. "శంకరా! నీవు విచిత్రపురంలో చెప్పిన కాణాద మహర్షి కణ సిద్ధాంతాన్ని వివరిస్తావా?" అంటూ నన్ను ప్రశ్నించారు.

## కణ సిద్ధాంతం

"స్వామీ! క్షమించండి. నేను చెప్పినదంతా అప్రయత్నంగా వెలువడిందే తప్ప నాకు తెలిసింది కాదు," అని వినయంగా జవాబు చెప్పాను. వారు నవ్వుతూ ఇలా వివరించారు: "ఈ సృష్టి అంతా పరమాణువులతో నిర్మింపబడి ఉంది. వీటికంటె సూక్ష్మకణాల ఉనికి వల్ల విద్యుల్లతలు వస్తుంటాయి. స్థూలమైన ఈ సూక్ష్మకణాలు తమ కేంద్ర బిందువుని అనుసరించి మహావేగంతో తమ తమ కక్ష్యలలో తిరుగుతూ ఉంటాయి. ఈ సూక్ష్మకణాల కంటె సూక్ష్మమైన స్థితిలో ప్రాణుల భావోద్వేగ స్పందనలు ఉంటాయి. ఈ స్పందనల కంటె కూడా సూక్ష్మ స్థితిలో దత్త ప్రభువులు ఉంటారు. ప్రతికణాన్ని అనంత భాగాలుగా విభజిస్తే ఒక్కొక్క కణ భాగం శూన్య సమానం అవుతుంది. అనంతాలైన మహా శూన్యాల సంయోగ ఫలితమే ఈ చరాచర సృష్టి," అని చెప్పి మరల గాయత్రి మంత్రం గూర్చి వివరిస్తూ అది 24 అక్షరాల, నాల్గు పాదాల మహామంత్రమని, "పరోరజసి సావదోమ్" అనేది నాల్గవ పాదమని, ఈ మంత్ర స్వరూపం శ్రీపాద వల్లభుల నిర్గుణ పాదుకలే," అని తెల్పారు.

## బ్రహ్మకమలాలు

"నాయనా! మానవుల స్థూల శరీరం 12 రకాల భేదాలు కలిగి ఉండి ద్వాదశాదిత్యులచే ప్రభావితం అవుతూ ఉంటుంది. అయితే శ్రీపాద శ్రీవల్లభులు ద్వాదశాదిత్యుల కంటె కూడా అతీతమైన వారు కాబట్టి వారి దివ్య శరీరం చిత్ర విచిత్రాలైన దివ్యస్పందనలను కలిగి ఉంటుంది. పీఠికాపురంలో అవతరించడానికి 108 సంవత్సరాలకి ముందే వారు శ్రీపాద శ్రీవల్లభ రూపంలో ఇక్కడికి వచ్చారు. హిమాలయాలలో యోగులు బదరీ నారాయణుని బ్రహ్మ కమలాలతో పూజిస్తుంటే ఆ పూలు ఒక్కొక్కటి ఇక్కడ శ్రీచరణుల పాదాలపై పడటం నేను కళ్ళారా చూసాను. ఈ బ్రహ్మ కమలాలు హిమాలయాలలో సంవత్సరానికి

ఒకసారి మాత్రమే పుష్పిస్తాయి. ఇవి వికసించేటపుడు అద్భుత పరిమళం వెదజల్లుతుంటాయి. ఇవి శరత్కాలం నుండి వసంతం వరకు మంచులోనే కూరుకొని ఉండి, చైత్రంలో బయటకు రాగా, గ్రీష్మమంతా మెల్లమెల్లగా విచ్చుకుంటూ, అమరనాథ్‌లో అమరలింగేశ్వరస్వామి యొక్క హిమలింగ దర్శనమయ్యే సమయానికి అంటే శ్రావణ శుద్ధ పూర్ణిమ అర్థరాత్రి సమయానికి పూర్తిగా విచ్చుకుంటాయి. వీటి దర్శనం వల్ల అన్ని పాపాలు పోతాయి," అని వారు మాకు ఎన్నో కొత్త విషయాలు చెప్పారు.

తరువాత తాము పదిరోజుల దీక్షలో తపస్సమాధిలో ఉంటామని, ప్రశాంతంగా భక్తులకు దర్శనం చేయించమని, ఎవరైనా భక్తులు పాముకాటుతో మరణించిన వారిని తీసుకొని వచ్చినట్లయితే శాస్త్ర ప్రకారం పూడ్చిపెట్టడం కాని, లేదా నదీ ప్రవాహంలో వదిలివేయమని కాని చెప్పమని మాకు ఆదేశాలు ఇచ్చి ఆయన సమాధిలోకి వెళ్ళారు.

## మాధవుని మృతి

మేము వారి ఆదేశాన్ని అక్షరాలా పాటించడం మొదలు పెట్టాం. భక్తులు ఇచ్చిన సంభారాలతో మాకు వంట చేస్తానని చెప్పి, మాధవుడు దగ్గరలో పడి ఉన్న కొబ్బరి మట్ట తీసుకురావడానికి వెళ్ళి, మట్ట కింద ఉన్న పాము కాటు వేయడంతో మరణించాడు. నేను కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తూ మాధవుడి శరీరాన్ని ఖననం చేసాను. తర్వాత పాముకాటుతో మరణించిన 18 సంవత్సరాల యువకుడి శరీరాన్ని బంధువులు తీసుకొని వస్తే స్వామి మాకు అంతకు ముందే జారీ చేసిన ఆదేశ ప్రకారం ఆ శవాన్ని కూడా ఖననం చేయించాము.

పదకొండవ రోజు స్వామి కళ్ళు తెరుస్తూనే, "మాధవా!" అని పిలవడంతో పదిరోజుల నా బాధ అంతా ఒక్కసారి ఉప్పెనలా పొంగి వెక్కి వెక్కి ఏడుస్తూ జరిగినదంతా చెప్పాను. స్వామి నన్ను ఓదారుస్తూ మాధవుడు

మరణించలేదని, స్థూల శరీరంతో ఈ జన్మలో స్వామిని దర్శించే భాగ్యం అతనికి లేకపోవడం వల్ల కర్మ సూక్ష్మాన్ని అనుసరించి స్వామి ఇలా చేసారని, ఈ పది రోజులు మాధవుడు సూక్ష్మ శరీరంతో కురువపురంలో స్వామి వద్ద ఉన్నాడని చెప్పారు. నా ఆనందానికి హద్దులు లేక పోయాయి.

## మాధవుని పునరుజ్జీవనం

వారి ఆజ్ఞ మేరకు మాధవుని శరీరాన్ని బయటికి తీసి, దక్షిణ దిక్కున ఉన్న తాటి చెట్ల దగ్గరకు వెళ్ళి, "మాధవుని కరచిన ఓ నాగరాజమా! శ్రీపాదుల ఆజ్ఞ మేరకు నీవు పళని స్వామి దగ్గరికి రావాలి," అంటూ గట్టిగా అరిచి చెప్పాము. వారు శవానికి నాల్గు వైపులా నాల్గు గవ్వలు ఉంచి ఏదో ధ్యానం చేసారు. గవ్వలు ఆకాశంలో రివ్వున ఎగిరి పోయాయి. కొద్ది సేపటికి పాము చాలా అసహనంగా బుసలు కొడ్తూ వచ్చింది. దాని పడగకి నాల్గు వైపులా గవ్వలు గుచ్చుకొని దాన్ని లాక్కొని వచ్చినట్లు అనిపించింది. స్వామి ఆజ్ఞని పాటిస్తూ ఆ పాము తాను కాటు వేసిన చోటునుండి విషం లాగివేసింది. అప్పటివరకు అసహనంగా ఉన్న పాము పళనిస్వామి దానిపై నీళ్ళు చల్లడంతో శాంతించి నమస్కరించి వెళ్ళి పోయింది.

## సర్ప వృత్తాంతం-అన్న దాన మహిమ

"ఈ పాము పూర్వజన్మలో ఒక స్త్రీ. కొంత పాపం చేసింది కాని, దత్త భక్తుడికి అన్నం పెట్టడం వల్ల కొంత పుణ్యం కూడా సంపాదించింది. చనిపోయిన తర్వాత చిత్రగుప్తుడు, " నీ పాప ఫలాన్ని తగ్గించి పుణ్య ఫలాన్ని పెంచమని శ్రీపాదులు మాకు ఆదేశం ఇచ్చారు. ముందుగా దేన్ని అనుభవిస్తావు? పాప ఫలమా? పుణ్య ఫలమా?" అని ప్రశ్నించినపుడు ఆ స్త్రీ పాప ఫలం కొద్దిగానే ఉంది కాబట్టి అదే అనుభవించడానికి సిద్ధపడటంతో ఈ పాము జన్మ లభించింది. కాని పూర్వపు రజోగుణం ఇంకా మిగిలి

ఉండటం వల్ల కనిపించిన వారినల్లా కాటు వేస్తూ తిరిగి పాపం మూట కట్టుకుంటున్నది. కాని, మాధవుని వంటి ఉత్తమ వ్యక్తిని కాటు వేయడం వలననూ, శ్రీపాదుల అనుగ్రహం వలననూ పాపం నశించి పుణ్య లోకాలకు చేరింది,"అని స్వామి వివరించారు.

**మాధవునికి దత్త సాన్నిధ్యం**

తరువాత, **దత్తుడు అన్నదాన ప్రియుడని, యోగ్యులకు అన్నదానం చేసినట్లయితే ఆ అన్న సారంలోని కొంత భాగం మనస్సుగా మారి అన్నదాత మనసు, బుద్ధి, చిత్తం, శరీరాలను శుభస్పందనలతో నింపుతుందని, దానివల్ల సృష్టిలోని పదార్థాలను ఆకర్షించే శక్తి పెరుగుతుందని, వస్తు సమృద్ధినే లక్ష్మీకటాక్షం అంటారని** చెప్పారు. మాధవునికి స్పృహవచ్చింది. అతడు తన అనుభవం ఇలా చెప్పాడు: "నేను సూక్ష్మ రూపంలో కురువపురం వెళ్ళి స్వామిని దర్శించాను. వారు మూర్తీభవించిన కరుణలా ఉన్నారు. వారు నన్ను దీవి మధ్య భాగానికి వెళ్ళమని ఆదేశించారు. నేను మధ్య భాగపు లోతుల్లోకి వెళ్ళాను. నేను సూక్ష్మ శరీరంతో ఉండటం వల్ల కేవలం సూక్ష్మ శరీరులకే కనిపించాను. అక్కడ ఎన్నో భవనాలు, కొన్ని వేల పాములు ఉన్నాయి. ప్రభువు వేయి పడగల ఆదిశేషుడిపై విష్ణువులా పడుకుని ఉన్నారు. నా పక్కనే కూర్చుని ఉన్న ఒక పాము, 'ప్రభువు అత్రి అనసూయల పుత్రుడైన దత్తుడని, గోరక్షానాథునికి క్రియాయోగం నేర్పించారని, జ్ఞానేశ్వరునికి నిరాకారయోగి రూపంలో దర్శనమిచ్చారు,' అని చెప్పింది.

"వేల సంవత్సరాలపాటు రాజ్యం పాలించిన దత్తులు గుప్తంగా ఉండాలనుకొని నదీగర్భంలో ప్రవేశించారు. భక్తులందరం వారికోసం ఒడ్డున వేచి ఉండగా కొన్ని సంవత్సరాల తరువాత తమ ప్రక్కన విలాసవతివలె ఉన్న ఒక స్త్రీతో, చేతిలో మధుపాత్రతో నీటి నుండి బయటికి వచ్చారు. ఇలాంటి వారినా ఇంతకాలం పూజించాము? అనుకుంటూ మేము వెనుదిరిగాము.

కాని వారు మాయమైన వెంటనే మాకు జ్ఞానోదయమై ఆ మాత అనఘ అని, వారి చేతిలోని పానీయం అమృతం అని తెలుసుకొని పశ్చాత్తాపం చెంది కఠిన తపస్సు చేసి, స్వామిని మెప్పించి శ్రీపాద శ్రీవల్లభుని అవతారము వరంగా పొందాము," అని ఇంకొక పాము చెప్పింది.

మొదటి పాము జ్యోతి రామలింగస్వామిలా అవతరిస్తుందని, రెండవ పాము సదాశివ బ్రహ్మేంద్రునిలా పుట్టి ఎన్నో లీలలు చూపిస్తుందని స్వామి నాతో చెప్పారు. తరువాత నన్ను పీఠికాపురంలో తన పాదుకలు ఎక్కడ ప్రతిష్టించారో దాని కింద పాతాళంలో కాలనాగుల్ని చూసి రమ్మని చెప్పారు. ఈ విధంగా మాధవుడు వివరించుతుండగా పళనిస్వామి మధ్యలోనే ఆపి, "మాధవా! ఈ ప్రసంగాలు తరువాత కొనసాగించవచ్చు. మనం వెంటనే స్నానాలు చేసి ధ్యానం చేసుకోవాలి. ఇది స్వామివారి ఆజ్ఞ," అని చెప్పారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



జ్ఞానేశ్వరుడు



గోరక్షానాథుడు



సదాశివ బ్రహ్మేంద్రుడు



జ్యోతి రామలింగస్వామి

# 4వ అధ్యాయం

## శ్రీపాద-వాసవాంబికల సోదర-సోదరీ బంధం

### భక్తత్రయపు ధ్యానం



"మాధవా! శంకరా! మనం ముగ్గురం ఒకేసారి శ్రీపాదుల పై మనసు లగ్నం చేసి ధ్యానం చేద్దాము, తరువాత మనం మన అనుభవాలను చర్చించుకుందాము," అని స్వామి సూచించారు. నేను ఆశ్చర్యంతో నా సందేహాన్ని వ్యక్తం చేస్తూ, "స్వామీ! మీరిద్దరూ ప్రభువులని చూసి ఉండడం వల్ల మీకు వారిని ధ్యానించడం సులభం. ఆయన పేరు తప్ప ఇంకేమీ తెలియని నేను వారిని మనసులో ఎలా నిలుపుకొనగలను? ఎలా ధ్యానించగలను?" అని ప్రశ్నించాను. దానికి స్వామి నవ్వుతూ, "శ్రీపాదుల అనుగ్రహం ఉంటే ఏదీ అసాధ్యం కాదు. తాబేళ్ళు, పిల్లులు, కోతులు తమ తమ పిల్లల్ని ఎలా కాపాడుకుంటాయో అదే విధంగా ఆయన తన భక్తుల్ని రక్షిస్తారు. సాధనా మార్గంలో చక్కటి అభివృద్ధిని సాధించిన తరువాత తల్లి చేప వెంట వెళ్ళే పిల్ల చేపల్లా సాధకులు శారీరికంగా కాని, మానసికంగా కాని వారి వెంటే ఉంటారు. కాబట్టి ఇందులో ఆలోచించాల్సింది ఏమీ లేదు. నీవు వారి ధ్యానంలో కూర్చుంటే అన్నీ ఆయనే చూసుకుంటారు. ధ్యానంలో ఉన్నపుడు వారి ఆజ్ఞ ఎపుడు వస్తే అపుడు నేను సూక్ష్మ రూపంలో కురువపురం వెళ్తాను," అని చెప్పారు. పది ఘడియల వరకూ ధ్యానం చేసి తర్వాత ముగ్గురమూ ఒకేసారి ధ్యానం నుండి బైటకు వచ్చాము.

## శివశర్మ వృత్తాంతం

స్వామి తమ అనుభవాన్ని ఈ విధంగా చెప్పారు: "కురువపురంలో శివశర్మ, అంబిక అనే దంపతులు ఉండేవాళ్ళు. వాళ్ళు శ్రీపాదుల భక్తులు. శివశర్మకు పుట్టిన పిల్లలు చనిపోతూ చివరిగా ఒక్క కొడుకు బ్రతికాడు. దురదృష్టవశాత్తు వాడు తెలివితేటలు లేని మందబుద్ధి అయ్యాడు. శివశర్మ ఒకనాడు తన వేదనను స్వామికి చెప్పి పుత్రుని పండితుని చేయమని ప్రార్థించారు. "ఎటువంటి వారికైనా పూర్వజన్మలో చేసిన కర్మ ఫలం అనుభవించక తప్పదు. మీ దంపతులు మీ సంతానానికి పూర్ణ ఆయుర్దాయాన్ని మాత్రమే కోరుకున్నారు. అదీగాక నీ కుమారుడి పూర్వజన్మ పాపఫలం నశించాలి అంటే నీవు నీ ప్రాణాన్ని త్యాగం చేయాల్సి ఉంటుంది," అని శ్రీపాదులు చెప్పారు. దానికి శివశర్మ వెంటనే అంగీకరించడంతో ఈ విషయం అతని భార్యకు కూడా చెప్పవద్దని, శివశర్మ చనిపోయాక ధీశిలా నగరంలో నింబవృక్షం క్రింద కొంత కాలం తపస్సమాధిలో ఉండి పుణ్యభూమి మరాఠాలో తిరిగి జన్మిస్తారని ప్రభువు ఆశీర్వదించారు. శివశర్మ మరణం తరువాత భార్యా పుత్రులు భిక్షాటన చేసి బ్రతకాల్సి వచ్చింది. తోటివారి సూటిపోటి మాటలు, వెక్కిరింపులు భరించలేక కొడుకు ఒకనాడు ఆత్మహత్యకు సిద్ధం అయినాడు. తల్లి కూడా అతని వెన్నంటి పరుగెత్తుతుండగా శ్రీపాదులు వాళ్ళని అడ్డగించి శివశర్మకు ఇచ్చిన మాట ప్రకారం ఆ పుత్రుని మహాపండితునిగా చేసారు. అంబికను శివ ప్రదోష పూజ చేయమని, తమతో సమానమైన కుమారుడు ఆమెకు జన్మిస్తాడని వరం ఇచ్చి, తమతో సమానులు ముల్లోకాలలో ఎవ్వరూ లేకపోవడం వల్ల తామే నృసింహసరస్వతిలా జన్మించడానికి నిర్ణయించుకొన్నారు," అని తెల్పి తాము చూసిన మరియొక అద్భుత దృశ్యాన్ని ఇలా వర్ణించారు:

## పరబ్రహ్మ తత్త్వ నిరూపణ

"అదృష్టవశాత్తు శ్రీపాదులతో కలిసి కృష్ణా నదిలో నేను స్నానం చేసాను. తరువాత వారు ఆత్మ శక్తితో యోగాగ్ని ప్రజ్వలింప చేసారు. దాని నుండి వాసవీ మాత, వారి తల్లి తండ్రులైన కౌసుంబీ కుసుమశ్రేష్ఠి, నగరేశ్వరస్వామి, విరూపాక్షులు, అగ్ని ప్రవేశం చేసిన 108 గోత్రాల గోమఠ దంపతులు బయటకు వచ్చారు. శ్రీపాదులు ఒక్క క్షణంలో కురువపురాన్ని అద్భుతమైన రాజభవనంలా మార్చారు. మేమందరమూ రత్న ఖచిత సింహాసనాలపై కూర్చున్నాము. అప్పుడు శ్రీచరణులు ఈ విధంగా చెప్పారు, "దత్త నామస్మరణ జరిగే చోట వాసవీ మాత, వాసవీ మాత నామ స్మరణ జరిగేచోట దత్తులు గుప్త రూపంలో ఉండి ధర్మబద్ధమైన అన్ని కోరికలను తీర్చుతారు. నాలోనే కోటి కోటి బ్రహ్మాండాలు, 33కోట్ల దేవతలు, జీవులందరూ ఉన్నారు. కాబట్టి ఏ దేవతని ఆరాధించినా అది నన్నే చేరుతుంది. త్రిశక్తి స్వరూపిణి అయిన అనఘాదేవి నా ఎడమ భాగంలో, త్రిగుణాత్మక త్రిమూర్తి స్వరూపం నా కుడి భాగంలో ఉన్నందువల్ల నేను ఒకే సమయంలో శక్తిని, శాక్తుడను అవుతున్నాను. జగన్మాత అంటే మూర్తీభవించిన అపారమైన దయ, కరుణల రూపం, కాబట్టి నాలో ఉన్న మాతృ స్వరూపం భక్తులు ఎక్కువ తప్పులు చేసినా వాటిని తక్కువగా భావించి, కొద్దిపాటి పుణ్యానికి గొప్ప ఫలితాలను ఇస్తుంది. జగత్పిత–ఈ విశ్వానికి తండ్రి అంటే కఠోరమైన దివ్య న్యాయాన్ని అమలులో పెట్టేవారు కదా! కాబట్టి నా పితృ స్వరూపం జీవులు చేసిన కర్మలకు కఠోర ఫలితాలను అనుభవించాలని శాసిస్తుంది," అని పరబ్రహ్మ తత్త్వ నిరూపణ చేసారు. తరువాత వాసవీమాత, శ్రీపాదులు ఏ రకంగా అన్నా చెల్లెళ్ళు అయ్యారు? అనే నా సందేహాన్ని తీరుస్తూ వాసవీమాత జననం గూర్చి శ్రీపాదులు ఇలా వివరించారు:

## పళనిస్వామి సందేహ నివృత్తి

"ఒకనాడు నా తల్లి అనసూయ నన్ను ఉయ్యాల ఊపుతూ, ఒక ఆడపిల్ల ఉంటే ఎంత బాగుండును! అని మనసులో తలచింది. మహా పతివ్రత కనుక ఆమె తీవ్ర కాంక్ష వెంటనే ఫలవంతం అయ్యి ఊయల ఒకవైపు పోయేటపుడు ఆ శిశువు దత్తుడిలా కనిపించి, వెనక్కి వచ్చేటపుడు వాసవిలా కనిపించడం మొదలు పెట్టింది. వాళ్ళ కోరిక మేరకు మేము మా రెండు రూపాలను వేరు చేసాము. ఈ రకంగా అంబిక నా చెల్లెలై నాకు రక్షాబంధనం కట్టింది," అని నా సందేహాన్ని తీర్చారు.

తరువాత శ్రీపాదులు వాసవీమాతతో, "చంచలంగా కదులుతూ ఉండే ఈ అనంత చైతన్య సముద్రంలో అలలు లేని మహా సముద్రంలా నేను నిశ్చలమైన స్థితిలో ఉండదలచి ఈ రూపాన్ని ఈ నాడు గుప్త పరచాలి అని అనుకుంటున్నాను. ఈ విషయంపై నీ అభిప్రాయం ఏమిటి?" అని ప్రశ్నించారు. "అనంత కళ్యాణగుణాత్మకమైన ఈ రూపాన్ని మరికొంత కాలం ధరించిన తర్వాత గుప్తం చేసుకొనవచ్చు. **గుప్తపరచిన తరువాత కూడా ఈ రూపాన్ని నిజమైన సాధకులు దేశ, కాల భేదం లేకుండా చూడగలిగేటట్లుగా అనుగ్రహించ,"** మని వాసవీమాత ప్రార్థించింది. "నీ సంకల్పమే నెరవేరుగాక! ఇంకొక 14 సంవత్సరాల వరకు ఈ శరీరంలోనే ఉండి అటు తర్వాత గుప్తం చేసి మరల నృసింహసరస్వతిలా జన్మించి 80 సంవత్సరాలు సన్యాస ధర్మాన్ని ఉద్ధరించి, తరువాత 300ల సంవత్సరాలు కదళీవనంలో తపస్సు చేసి ప్రజ్ఞాపురంలో స్వామిసమర్థ పేరున అవతారాన్ని చాలిస్తాను," అని శ్రీపాదులు అభయం ఇచ్చారు.

## శ్వేతజాతీయ భక్తుని ఆగమనం

తరువాత విరూపాక్షుని పిలిచి శ్వేతజాతివాడు ఒకడు ఎన్నో కష్టాలు

ఎదుర్కొంటూ కురుంగడ్డ చేరారని అతన్ని తమ వద్దకు తీసుకొని రావలసినదని చెప్పి పంపారు. ఆ శ్వేతజాతీయుడు శ్రీచరణులను చూడగానే మహదానందాన్ని పొంది వారి పాదాలపై పడి చిన్న పిల్లవాడిలా వెక్కి వెక్కి ఏడ్చారు. శ్రీవల్లభులు వారిని జాన్ అని సంబోధిస్తూ మాట్లాడారు. శ్రీచరణులు తెలుగులో మాట్లాడుతుండగా జాన్ జర్మన్ భాషలో అర్థం చేసుకొంటున్నారు. **“త్రికరణ శుద్ధిగా నన్ను నమ్మిన భక్తుల కోసం నేను చేయలేని పని కాని, ఎత్తలేని బరువుకాని పరిష్కరించలేని సమస్యకాని ఏదీలేదు. నా వాళ్ళని కంటికి రెప్పలా కాపాడుతాను. నాయొక్క వాత్సల్యము మీమీద ప్రసరించేటపుడు ప్రకృతిలోని సమస్త శక్తులు మీకు శ్రేయోదాయకమైన స్పందనలను కలిగిస్తాయి. నేను ప్రేమ స్వరూపుణ్ణి. నన్ను ప్రేమ ద్వారా మాత్రమే తెలుసుకోగలుగుతారు,”** అని శ్రీచరణులు సెలవిచ్చారు. అటు పిమ్మట చిన్న వయసులోనే పట్టుదలతో ఆత్మవిశ్వాసంతో శ్రీమన్నారాయణుని మెప్పించిన పరమ భక్తుడైన ధ్రువుని వృత్తాంతాన్ని ఇలా వివరించారు:

స్వాయంభువ మనువుకి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులు ఉన్నారు. వారిలో ఉత్తానపాదుడికి సునీతి వలన ధ్రువుడు, సురుచి వలన ఉత్తముడు అనే ఇద్దరు కుమారులు కలిగారు. ఉత్తానపాదుడికి సునీతి కంటే సురుచి అంటే ప్రేమ, అనురాగం ఎక్కువగా ఉండేవి. ఒక రోజు సురుచి కుమారుడైన ఉత్తముడు తండ్రి తొడపై కూర్చొని ఉండగా చూసి ధ్రువుడు కూడా తండ్రి తొడపై కూర్చోడానికి ప్రయత్నం చేస్తుండగా సురుచి చూసి, ‘నీకు తండ్రి తొడపై ఎక్కే అదృష్టం లేదు, అదే కనుక ఉన్నట్లయితే నువ్వు నా కడుపునే పుట్టి ఉండేవాడివి, నీకా అదృష్టం కలగాలంటే శ్రీహరిని ప్రార్థించు ఫో,’ అని ఛీత్కరించి తోసివేసింది. ఏడుస్తూ వచ్చిన కుమారుణ్ణి సునీతి ఎదురెళ్ళి హత్తుకొని, కష్టం కలిగించే పలుకులైనా

పినతల్లి సరైన విషయం చెప్పిందని, **శ్రీహరి పాదధ్యానం వలన సమస్తమూ సమకూరుతాయి,** అని చెప్పింది. అప్పుడు ధ్రువుడు శ్రీహరిని ప్రసన్నం చేసుకోడానికి అడవికి బయలుదేరాడు.

మార్గమధ్యంలో నారదుడు కనిపించి ధ్రువుడి పట్టుదలకు మెచ్చి యమునా నదీ తీరంలో ఉన్న మధువనంలో దర్భాసీనుడవై ప్రాణాయామనిష్ఠతో శ్రీ మహావిష్ణువుని ఆరాధించమని, 'ఓం నమో భగవతే వాసుదేవాయ,' అనే నారాయణ మంత్రము ఉపదేశించారు. ధ్రువుడు ఆ విధంగానే నారాయణుని గురించి తపస్సు ప్రారంభించాడు. ముందు మూడు రోజులకు ఒకమారు వెలగపండు లేదా రేగి పండు తినేవాడు. తరువాత ఆరు రోజులకు ఒకమారు పండి రాలిన ఆకులు తింటూ, ఆ తరువాత తొమ్మిది రోజులకు ఒకమారు మంచి నీరు త్రాగుతూ, ఆ తరువాత 12రోజులకు ఒకమారు గాలి పీల్చి, మరికొన్ని రోజులకు గాలి కూడా పీల్చకుండా తపస్సు చేస్తూ ఉండగా నారాయణుడు ధ్రువుడికి శంఖ–చక్రాలతో ప్రత్యక్షమైనాడు. తన  తండ్రి తొడపై తాను కూడా కూర్చోవాలనే కాంక్షతో తపస్సు చేసిన ధ్రువునికి శ్రీమన్నారాయణుని దర్శనంతో ఆ కోరిక నశించింది. నారాయణుడు బాలుని శిరస్సు నిమిరి, పితృ ప్రేమకై పరితపించిన ఆ పసివాడిని తమ అంకపీఠంపై కూర్చోబెట్టుకొనడమే కాక అతనికి అంతరిక్షంలో సప్తఋషులు, నిఖిల తారాగణాలు, సూర్య చంద్రులు నిరంతరం ప్రదక్షిణం చేసే ధ్రువక్షితి అనే స్థానాన్ని కల్పించారు.

## ధ్రువుడే ఏసుప్రభువు

కలియుగంలో ధ్రువుడే క్రీస్తు ప్రభువులా జన్మించాడు. మరియ అనే పవిత్రాత్మకు శ్రీవాసవీకన్యకాంబ తన శక్తిని ఇచ్చారు. మరియ కన్యగా ఉండగానే ధ్రువుడు క్రీస్తు ప్రభువుగా జన్మించాడు. క్రీస్తు ప్రభువు మాతాపితల సంయోగంవల్ల జన్మించలేదు. క్రీస్తు పదేపదే 'నా తండ్రి' అని చెప్పుకొన్నది

శ్రీమన్నారాయణుని గురించి అని గ్రహించండి. ఆ శ్రీమన్నారాయణుడే మీ ఎదురుగా ఉన్న ఈ శ్రీపాదశ్రీవల్లభుడు," అని చెప్పారు.

ఆ శ్వేత జాతీయుడు రాబోయే జన్మలో హిమాలయ ప్రాంతంలో ఉత్తమ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి యోగి అవుతారని తెలిపారు. తరువాత సిద్ధ వైశ్య మునులను వేదగానం చేయమని ఆదేశించారు. ప్రభువులకు వేదగానం అంటే ఎంతో ప్రీతి. తర్వాత యోగాగ్ని నుంచి వచ్చిన వాళ్ళందరు తిరిగి అగ్ని గుండంలో ప్రవేశించి అదృశ్యులు అయ్యారు. శ్వేత జాతీయుని మనస్సులో ఉన్న కోరికను గుర్తించిన గురుసార్వభౌములు రాబోయే శతాబ్దంలో శ్రీపాద శ్రీవల్లభ చరితామృతం జర్మన్ భాషలోకి అనువదింపబడుతుంది," అని అభయం ఇచ్చి జాన్‌కు వీడ్కోలిచ్చి పంపారు. ఈ ప్రకారం పళనిస్వామి తమ ధ్యానంలో చూసిన అనుభవాలని మాతో పంచుకున్నారు.

## శ్రీసాయిబాబా వృత్తాంతం

తరువాత నేను నా అనుభవాలు చెప్పుతూ ధ్యానంలో నేను ఒక యవన సన్యాసిని చూసానని వారు తాను ముసల్మానునని కొందరితోను, భరద్వాజ గోత్రీయ బ్రాహ్మణుడనని కొందరితోను చెప్పుతున్నారని, నింబ వృక్షం క్రింద గుహలో నాల్గు నందాదీపాలను కూడా చూసానని, ఆ బాబా అది తమ గురుస్థానమని ఎవరితోనో చెప్పటం విన్నానని తెలిపాను. పళనిస్వామి ఆ యతి వృత్తాంతాన్ని ఇలా విశదీకరించారు,

"నాయనలారా ! శ్రీవల్లభులు అచింత్య తత్త్వ స్వరూపులు. లోకంలోని సమస్త ధర్మాలను, సంప్రదాయాలను, పద్ధతులను అన్నింటిని సమన్వయం చేసి సనాతన ధర్మంలో కలిపివేయడమే వారి సంకల్పం. "యహోవా" అనగా 'నేను ఉన్నాను' అని అర్థం. అది తన పరబ్రహ్మ స్వరూపమే అని, విశ్వమంతటా ప్రతిబింబంచే చైతన్యమంతా దైవతనయుడిగా భావించే

క్రీస్తు చైతన్యమని, శాంతి సౌఖ్యాలను అనుగ్రహించే పవిత్ర స్వరూపమే పరిశుద్ధతను పొందిన 'పవిత్రాత్మ' అని, ఈ మూడు రూపాలు తనవే అని, విశుద్ధ ప్రేమతో అలభ్యమైన తన దర్శనభాగ్యం పొందవచ్చని జాన్‌నకు శ్రీపాదులు చెప్పారు. అదే విధంగా యవన తత్త్వం కూడా దత్తతత్త్వంలోని అంతర్భాగమని చెప్పారు. మహామతి అనే మహాత్ముడు నిరాకారుడైన మఖ్ఖేశ్వరుని భక్తుడు. అతడు దైవాన్ని అల్లాగా తలచేవారు. అల్లాను చూడగోరి సప్త స్వర్గాలను దర్శించారు, కాని అతనికి శ్రీపాదుల ప్రతిబింబం మాత్రమే కనిపించింది. అరబ్బీ భాషలో అల్ అనగా శక్తి, ఆహ్ శాక్త–శక్తిని ధరించిన వాడని అర్థం. అందువల్ల అల్లాహ్ అనగా శివ–శక్తుల సంయోగ స్వరూపమని చెప్పారు. శంకరభట్టూ! నీవు చూసిన ఆ సన్యాసి భారద్వాజ బ్రాహ్మణుడే. చిన్నతనంలోనే తల్లి తండ్రుల్ని పోగొట్టుకొని ముస్లిం ఫకీరు పెంపకంలో ఇస్లాం ధర్మాలను, హిందూ మహాత్ముని సాంగత్యంలో హిందూధర్మాలను తెలుసుకొన్నారు. వారణాసిలో మహాయోగి దగ్గర క్రియాయోగం నేర్చుకొన్నారు. దత్త చైతన్యంతో ప్రభావితులై ధీశిలానగరం చేరారు. నీవు చూసిన [2]భూగృహంలో శ్రీపాదులు 12సంవత్సరాలు తపస్సు చేసారు. నాయనలారా! ఇవన్నీ రాబోవు శతాబ్దంలో జరగబోయే సంఘటనలు సుమా," అని స్పష్టంగా చెప్పారు.

## కర్మధ్వంస విధానం

యుగాలు మారుతున్నకొద్ది మానవుల శక్తి తగ్గుతుంటుందని, కాబట్టి కలియుగంలో కేవలం నామ సంకీర్తనతో దైవానుగ్రహం కలుగుతుందని,

---

2. ఆ భూగృహం తమ పూజ్యగురువుల ఆవాసమని, పరమ పునీతమైన ఆస్థలాన్ని ఎప్పటివలెనే తిరిగి మూసి వేయాలని, ఆ పవిత్ర స్థలంలో గురుపౌర్ణిమ నాడు గురుపూజ చేసినవారికి ముక్తి లభిస్తుందని శ్రీసాయిబాబా చెప్పారని శ్రీసాయిచరిత్ర చదివిన సాయి భక్తులందరికి తెలిసిన విషయమే.

స్మరణ, అర్చనల వల్ల భక్తులలోని చెడు సంస్కారాలు, విషయ వాసనలు శ్రీపాదుల చైతన్యంలో ప్రవేశించి వారి శ్రేయోదాయక స్పందనలు ఆశ్రితులలో ప్రవేశిస్తాయని, శ్రీపాదులు వివిధ పద్ధతులలో ఆశ్రితుల కర్మధ్వంసం చేస్తారని చెప్పారు.

"గ్రహ సంబంధ దోషాలను గురువు ఎలా పోగొట్టగలరు?" అని నేను ప్రశ్నించాను. దానికి స్వామి,"గ్రహాలు జీవుల పట్ల మిత్రభావం కాని, శత్రుభావం కాని కలిగి ఉండవు, కాని ప్రతి గ్రహానికి మానవ శరీరంలోని కొన్ని ప్రత్యేక భాగాలపైన ఆధిపత్యం ఉంటుంది. గ్రహ బాధలు కలిగినపుడు మానవ శరీరంలో ఏ భాగంలో ఆ గ్రహాల ఆధిపత్యం ఉందో అవి రోగగ్రస్తం అవడమే కాకుండా విశ్వ చైతన్యంలో ఉండే స్పందనలని తీసుకుంటున్నప్పుడు చెడు స్పందనలని తీసుకోవడం, దానివల్ల కష్ట నష్టాలకు గురి కావడం, అకారణ కలహాలు, బంధు వియోగం, చెడ్డవాళ్ళతో స్నేహం వంటివి జరుగుతుంటాయి. కొంతకాలం గడిచిన తరువాత ఆ స్పందనలు ఆ వ్యక్తిని వదిలిపెట్టి విధి ప్రకారం ప్రభావితుడు కావలసిన వేరొక జీవి శరీరంలో చేరుతాయి. మానవులు దైవభక్తి కలిగి జపం, తపం, పూజలు చేసినట్లయితే వాటి తీవ్రత కొంత తగ్గుతుంది. మహర్షులు విశ్వ కళ్యాణం కోసం యజ్ఞాలు చేసి తమ తపః ఫలాన్ని విశ్వానికి ధారపోస్తారు. దీనివల్ల చెడు స్పందనలు ఒక వ్యక్తి తర్వాత మరొక వ్యక్తిని పీడించడానికి బదులు ఎక్కడ నుండి ఉత్పన్నం అయ్యాయో ఆ మూలబిందు స్థానాన్నే చేరుకుంటాయి," అని నా సందేహ నివృత్తి చేసి, "నాయనా! శంకరా! ఆ నందా దీపాలని చూడగల్గటం అసాధారణ విషయం. శ్రీపాదులు ఏదో మంచి ఉద్దేశ్యంతో నీకు ఈ అనుభవాన్ని కల్పించారు," అన్నారు. వారి వివరణ నాకెంతో ఆనందాన్ని కలిగించింది. శ్రీచరణుల అద్భుత లీలలను గ్రంథస్థం చేయాలన్న కోరిక మొదటిసారిగా నా మనసులో ఉత్పన్నం అవడం, స్వామి

అది గ్రహించడం ఒకేసారి జరిగాయి. వారు వెంటనే "నీ ప్రయత్నానికి శ్రీపాదుల ఆశీర్వాదం తప్పక లభిస్తుంది," అని శుభాశీసుల్ని అందించారు.

**శ్రీవాసుదేవానందసరస్వతి-శ్రీవెంకావధానుల సంవాదం**

ఏదో ఒక విషయమై తీవ్రంగా చర్చించుకుంటున్న ఒక వేద పండితుణ్ణి, ఒక బ్రాహ్మణ సన్యాసిని తాను తన ధ్యానంలో చూసానని అంటూ మాధవుడు తన అనుభవాన్ని ఇలా చెప్పారు: "మీరు ఇచ్చిన శ్రీఫలాన్ని ఆ యవన సన్యాసికి పంపాలని అనుకుంటున్నాను. వారు భూత, భవిష్యత్, వర్తమానాలు తెలిసిన జ్ఞాని. మీదగ్గర ఉన్న శ్రీపాద శ్రీవల్లభ చరితామృత తాళపత్ర గ్రంథాన్ని నాకు ఇవ్వండి. నేను అది వారికి ఇచ్చి దాన్ని గురించిన సత్యాసత్యాలు ఏమిటో తెలుసుకుంటాను," అని ఒక బ్రాహ్మణ సన్యాసి ఒక వేద పండితుని అడగటం నేను నా ధ్యానంలో గమనించాను. దానికి ఆ వేదపండితుడు "అయ్యా! ఈ గ్రంథం ఎన్నో తరాల నుండి మా దగ్గర ఉంది. మాకు అది గ్రంథంగా కాక సాక్షాత్తు ఆ శ్రీవల్లభుని లాగానే కనిపిస్తుంది. శ్రీపాదుల ఆజ్ఞలేనిదే దీనిని ఎవ్వరు స్పృశించలేరు. తెలుగు అనువాదం వెలుగులోకి వచ్చాక ఈ శిథిల ప్రతిని నదిలో కలపమని శ్రీపాదుల ఆజ్ఞ. దీనిని మీకు ఇవ్వడం ఎలా సంభవం? నేను మీకిచ్చిన ఈ శ్రీఫలాన్ని కూడా మీరు ఆ యవన యోగికి అందజేయలేరు. మీరలా ఈ శ్రీఫలాన్ని ధీశిలానగరం చేర్చినట్లయితే ఈ గ్రంథాన్ని ఖచ్చితంగా మీ చేతికి ఇచ్చి తీరుతాను. ఇక శ్రీపాదుల పాదుకలని ప్రతిష్ఠించాలనే మీ నిర్ణయం వ్యర్థ ప్రయాస. శ్రీపాదుల సంకల్పం లేనిదే మీరు పీఠికాపురంలో వారి పాదుకలని ఒక్కనాటికి ప్రతిష్ఠించలేరు," అని నిష్కర్షగా చెప్పటం నేను విన్నాను. పళని స్వామి దీన్ని మాకు ఇలా వివరించారు: "ఆ బ్రాహ్మణ సన్యాసి టెంబే స్వామి, ఆ వేదపండితుడు శ్రీపాదులవారి మేనమామ, వారి వంశంలో శ్రీపాదులను దివ్యశిశువుగా భావించి

వారిని వాత్సల్య భక్తితో వ్యవహరిస్తారు. శ్రీపాదుల నిష్క్రమణ తరువాత కొన్ని సంవత్సరాలకు వీళ్ళంతా పీఠికాపురం వదిలి వలస పోయారు. ఇక వారు మాట్లాడుకొన్న ముస్లిం బాబా వేరే ఎవరో కాదు, సాక్షాత్తు శ్రీసాయిబాబాయే. కాలాంతరంలో శ్రీపాదులు వారిలో సంపూర్ణ శక్తిపాతం చేస్తారు. అలాగే జగజ్జనని కాళికాంబ తమ అంశాలను వారిలో నిక్షిప్తం చేస్తుంది. అది మొదలు వారు భక్తులపై మాతృవాత్సల్యాన్ని చూపిస్తారు."

## శ్రీపాదుల పాదుకా ప్రతిష్ఠాపనకై విఫల ప్రయత్నం

తర్వాత పళనిస్వామి వారికి ఆ బ్రాహ్మణ అవధూత చేసిన పాదుకా ప్రతిష్ఠా ప్రయత్నం విచిత్రంగాను, వినోదంగాను ఎలా విఫలమయిందో కూడా వివరించారు: "ఆ వేద పండితుని స్నేహితులైన అంటే శ్రీపాదుల మేనమామ స్నేహితులైన వైశ్యశ్రేష్ఠి ఒకరు అవధూతను తమ యింట భిక్ష స్వీకరించమని ఆహ్వానించగా ఆ కర్మఠ బ్రాహ్మణుడు భిక్షను స్వీకరించనని ఖచ్చితంగ చెప్పారు. ఇది వైశ్యకులంలో పుట్టిన వాసవీమాతకు, సోదరులైన శ్రీచరణులకు కోపకారణం అయ్యింది. ఇది ఇలా ఉండగా ఆ యతి మొండిపట్టుదలతో పీఠికాపురంలో అన్యాక్రాంతమైన శ్రీపాదుల [3]తాతగారి ఇంట్లో పాదులకను ప్రతిష్ఠింప చేసారు. అర్ధరాత్రి ఒక దొంగ ఆ వెండి పాదుకలను దొంగిలించడానికి వస్తే, 'తనకు స్వామిపైన కాని శ్రీపాదులపైన కాని బొత్తిగా నమ్మకం లేదని, దొంగిలించిన సొత్తుని అమ్మి అందులో సగభాగం తనకు ఇమ్మని' ఆ ఇంటి కొత్త యజమాని దొంగతో ఒప్పందం కుదుర్చుకున్నాడు. పాదుకలు పోవడంతో ఎంతో దుఃఖించి ఆ యతి తిరిగి పాదుకా ప్రతిష్ఠ చేసి రాత్రి తానే పహారా కాస్తుండగా అకస్మాత్తుగా పాదుకలు గాలిలో లేచి అదృశ్యమయ్యాయి. తర్వాత యతి పంపిన శ్రీఫలం ధీశిలా నగరం చేరదని, మార్గమధ్యంలోనే

3. ఆ ఇంటిని అప్పటికే వేరే ఎవ్వరో కొనుక్కొని ఉంటున్నారు.

తినివేయబడుతుందని, చరితామృత గ్రంథం తీసుకొనే బాధ్యత అతనిది కాదని, తమ ఇష్టానికి వ్యతిరేకంగ పాదుకా ప్రతిష్ఠ జరగదని శ్రీపాదుల శ్రీవాణి వినిపించింది. మర్నాడు ఆ పురవాసులు అతన్ని దొంగ సన్యాసి అని, దొంగ అని దూషించి వెళ్ళగొట్టారు. నాయనలారా! ఇది అంతా భవిష్యత్తులో జరుగబోయేది," అని చెప్పి స్వామి తమ వివరణ ముగించారు.

మాధవుడు తాను సూక్ష్మశరీరంతో పీఠికాపురంలో ఒక ఇంటిలో ప్రవేశించానని, అచట అదృశ్యంగా ఉన్న దివ్య పాదుకలచే ఆకర్షింపబడ్డానని చెప్పాడు. దానికి స్వామి, "ఆ ప్రదేశం శ్రీపాదుల జన్మస్థలం, అచటనే భవిష్యత్తులో పాదుకలు, దత్త, శ్రీపాద, నృసింహ సరస్వతుల విగ్రహాల ప్రతిష్ఠ జరుగగలదు. అటు తర్వాతనే చరితామృతం వెలుగులోకి వస్తుంది," అని చెప్పారు.

## పళని స్వామి పరకాయ ప్రవేశం

అటు తరువాత 'తమ స్థూల శరీరానికి 300 సంవత్సరాలు నిండాయని, ప్రభువుల ఆజ్ఞ ప్రకారం ఆ శిధిల దేహాన్ని వదిలి క్రొత్త శరీరంలో మరొక 300 సంవత్సరాలు జీవించి ఉంటాను,' అని చెప్పి పాముకాటుతో మరణించి ఖననం చేయబడిన ఆ యువకుని శరీరాన్ని బయటికి తీయించి పళనిస్వామి ఆ భౌతిక శరీరంలోనికి ప్రవేశించారు. వ్యాఘ్రేశ్వరశర్మ శిథిల దేహాన్ని నదిలో పారవేయడానికి తీసుకొని వెళ్ళారు. స్వామి నన్ను తిరుపతికి, మాధవుని విచిత్రపురానికి వెళ్ళమని ఆదేశించడంతో మేము మా దారుల వైపు ప్రయాణం సాగించాము.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

## 5వ అధ్యాయం

# తిరుపతిలో శంకరభట్టు అనుభవాలు

### ఏలిన నాటి శనిదశ ప్రారంభం



నేను తిరుపతి చేరుకున్నాను. ఏదో తెలియరాని శాంతి మనస్సుని, శరీరాన్ని ఆవరించింది. పుష్కరిణిలో స్నానంచేసి శ్రీవెంకటేశ్వరుని దర్శనం చేసుకుందామని ఆలయానికి వెళ్ళాను. శ్రీవారు మొదట బాలాత్రిపురసుందరిలా, తరువాత పరమేశ్వరునిలా, శ్రీమహావిష్ణువులా, చివరగా ఎంతో అందంగా ఉన్న పదహారేళ్ళ యతిలా కనిపించారు. ఇంతలో నల్లగా వికృతంగా ఉన్న ఎవరో ఒక వ్యక్తి ఆ యతిని సమీపించి, “స్వామీ! మీ భక్తుడికి ఈ రోజునుండి ఏలిననాటి శని ప్రారంభం. ప్రపంచంలో ఉన్న కష్టాలన్ని అతను అనుభవించేలా చేస్తాను. మీ ఆజ్ఞకోసం ఎదురు చూసున్నాను,” అని వినయంగా చెప్పారు. “శనిదేవా! జీవులతో వాళ్ళ కర్మ ఫలాలని అనుభవింపచేసి నీవు వాళ్ళని కర్మ విముక్తుల్ని చేస్తున్నావు. నీ ధర్మం నీవు చేయి, నా భక్తుని నేను ఏ విధంగా రక్షిస్తానో నీవు చూస్తూ ఉండు,” అని స్వామి చెప్పారు. తర్వాత ఇద్దరూ మాయమయ్యారు. అటు తర్వాత నాకు బొత్తిగా ధ్యానం కుదరలేదు. నాకు శని దశ మొదలైంది, అని అర్థం చేసుకున్నాను.

### నిర్బంధంలో శంకరభట్టు

తిరుపతి వీధుల్లో గమ్యం లేకుండా తిరుగుతున్న నా దగ్గరకు ఎవరో ఆగంతకుడు వచ్చి, “ఏంటి, సుబ్బయ్యా! తల్లితండ్రుల్ని, భార్యని వదిలి ఇలా యిల్లు పట్టకుండా తిరగడం బాగుందా? ఎంత కోపమయినా 20

సంవత్సరాల వరకా?" అంటూ నా రెక్క పుచ్చుకొని లాక్కొని వెళ్ళడం మొదలు పెట్టారు. నేను శంకరభట్టునని, సుబ్బయ్యను కానని ఎంత చెప్పినా వినలేదు. దారినపోయే వాళ్ళు అందరూ తలా ఒక రకంగా నాకు బుద్ధి చెప్పడం ప్రారంభించారు. నన్ను సుబ్బయ్య అనే మంగలి ఇంటికి తీసుకొని వెళ్ళారు. నేను వాళ్ళ కొడుకునని నమ్మి ఆ సుబ్బయ్య తల్లితండ్రులు నన్ను ఎన్నో రకాలుగా బ్రతిమాలడం మొదలు పెట్టారు. నేను సుబ్బయ్యను కానని, బ్రాహ్మణుణ్ణి అని, శ్రీపాద శ్రీవల్లభుల దర్శనానికి వెళ్తున్నానని ఎంత నమ్మచెప్పినా వినలేదు సరికదా, సుబ్బయ్యని బ్రాహ్మణ భూతం పట్టుకుందని భూతవైద్యుణ్ణి పిలిపించారు.

## శంకరభట్టునకు భూతవైద్యుని చికిత్స

భూతవైద్యుడు నాకు నున్నగా తల గొరిగించి కత్తిగాటు పెట్టి దానిమీద నిమ్మరసం, నాకు పేర్లు తెలియని ఏవో వేరే రసాలు పోసి నన్ను నానా రకాలుగా హింసించాడు. ఇంతటి బాధలో కూడా నేను శ్రీచరణుల నామ జపం మానలేదు. 'ఈ మంగలి జాతివాళ్ళు నాతో బలవంతంగా మాంసం తినిపిస్తారేమో, నన్ను కాపాడు తండ్రీ!' అంటూ మొర పెట్టుకున్నాను. వారి దయవల్ల ఈ గండం గట్టెక్కింది. సుబ్బయ్యకు పట్టింది బ్రాహ్మణ దయ్యం. కాబట్టి బ్రాహ్మణ భోజనమే పెట్టాలి అన్న భూతవైద్యుని సలహాను అక్షరాలా పాటించారు. ఒక్క క్షణం కూడా ఆపకుండా ఆ మహా ప్రభువుల నామస్మరణ చేస్తుండగా అది అమృతంలా పనిచేసి శారీరికబాధ నాకు అనుభవంలోకి రావడంలేదు. ఇంకా విచిత్రంగా నాలుగవరోజు నుండి దెబ్బలు నావంటి పైన పడుతుంటే, బాధ భూతవైద్యుడుకి వేయడం మొదలైంది. పాపం! అతనికి ఇదంతా అగమ్య గోచరంగా ఉంది. ఇంతేకాకుండా వైద్యం పేరు చెప్పి మేకలూ, కోళ్ళూ దిట్టంగా తింటున్నా, నీరసపు రోగిలా అతడు ఉంటే, నానా హింసలు పడుతూ, కేవలం పథ్యాహారం తింటూ నేను నిక్షేపంగా

దిట్టంగా ఉన్నాను. అయిదవనాడు అకారణంగా నిప్పంటుకొని భూతవైద్యుడి ఇల్లు కాలి బూడిద అయింది. సుబ్బయ్యకు పట్టింది బ్రాహ్మణ మాంత్రిక దయ్యమని, కొత్తపూజలు చేయాలి అని, దానికి బోలెడు ధనం ఖర్చు అవుతుందని ఆ వైద్యుడు చెప్పుతుంటే విని, ఆ వృద్ధ దంపతులు పడే బాధ భరించలేక నేనే వాళ్ళ కొడుకునని, నన్ను క్షమించమని ప్రాధేయపడ్డాను. మరి సుబ్బయ్య భార్యని స్వీకరించాలంటే ఎలా? పరస్త్రీ తల్లితో సమానం కదా! కాబట్టి శ్రీచరణుల చరణాలే శరణని భావించాను. ఏడవరోజున నాగురించి తన అభిప్రాయం చెప్పమని ఆమెనే సూటిగా ప్రశ్నించాను. "నా భర్త నన్ను 20 సంవత్సరాల క్రితం వదిలి వెళ్ళారు. నాకప్పుడు రెండేళ్ళు. కాబట్టి వారెలా ఉంటారో ఏమిటో నాకేమి తెలియదు. మీరే నా భర్త అయితే మీ పాదదాసిని వదలవద్దు. అలా కాని పక్షంలో మీరు ఆరాధించే శ్రీపాదుల వారినే దారి చూపించమని మనం ప్రార్థన చేద్దాం," అని సుబ్బయ్య భార్య పలికింది. ఆ రోజునే మాల జంగం ఒకరు మా వాడకు వచ్చారు.

## శంకరభట్టు పూర్వజన్మ వృత్తాంతం

అతన్ని మాయింటికి తీసుకొని వచ్చారు. అతడు నాతో కొన్ని గవ్వలు వేయించి, ఏవో లెక్కలు కట్టి తన దగ్గర ఉన్న ఒక పాత తాళపత్ర గ్రంథం నుంచి ఒక పత్రం తీసి ఇలా చదివాడు, "ఇతడు శంకరభట్టనే బ్రాహ్మణుడు. పూర్వ జన్మలో ఇతని అన్న స్వయంభూదత్త దేవాలయ పూజారి. అన్న లేనపుడు ఇతడు మందిరంలో అర్చనాదికాలు చేసేవాడు. ఆలయ ప్రాంగణంలో తన మిత్రునితో జూదం ఆడుతుండేవాడు. ఒకనాడు 'తాను గెలిస్తే మిత్రుడు తన భార్యని ఇతని పరం చేయాలి, మిత్రుడు గెలిస్తే ఇతను అతనికి ధనం ఇవ్వాలి,' అంటూ ఒక విచిత్ర నిబంధనతో జూదం ఆడటం మొదలు పెట్టారు. దీనికి దత్తులవారిని సాక్షిగా ఉంచారు. మిత్రుడు ఓడిపోయాడు, కాని భార్యని ఇవ్వడానికి

సిద్ధపడకపోవటంవల్ల తగాదా గ్రామపెద్దల వరకు వెళ్ళింది. పరస్త్రీని కావాలనుకొన్న ఇతని తలపై వేడివేడి నూనె పోయవలసినదని, భార్యను పందెం కాచిన ఇతని మిత్రుడికి అంగవిచ్ఛేదం చేసి నపుంసకుడిగా చేయాలని, ఇద్దరిని గ్రామం నుండి బహిష్కరించాలి అని పెద్దలు తీర్పు ఇవ్వడం, దాన్ని అమలులో పెట్టడం జరిగాయి. స్వల్ప కాలమైనా సరే, దత్తసేవ చేసి ఉండటం వల్ల ఇతడు దైవభక్తితో జన్మించాడు. రెండవవాడు సుబ్బయ్యగా జన్మించి, మతిచెడి దేశాంతరం పట్టాడు. 'ఇది చదివిన రెండవరోజు యింటికి  తిరిగి వస్తాడు,' అని చదివి వెళ్ళిపోయారు. ఎనిమిదవ రోజు ఉదయాన్నే సుబ్బయ్య యింటికి తిరిగి రావడంతో నాకు విముక్తి లభించింది. వారందరి దగ్గర సెలవు తీసుకొని నేను బయలుదేరాను.

**ప్రభువుల కారుణ్యామృతవృష్టి**

**స్వామి తమ దయతో 71/2 సంవత్సరాల ఏలిననాటి శనిదశను 7 1/2 రోజులలోనే పోగొట్టారు. భగవంతుని సాక్షిగా చేసికొని అబద్ధపు ప్రమాణాలు చేసేవారిని దత్తప్రభువు కఠినంగా శిక్షిస్తారు అనే మాట ఎంత నిజమో శరణాగతితో ఆర్తితో వారి పేరు తల్చుకుంటే చాలు తక్షణమే వచ్చి ఆదుకొంటారు అనేది కూడా అంతే నిజమని చెప్పడానికి ఇంతకు మించిన ఉదాహరణ మరొకటి ఉందా?**

తరువాత చిత్తూరుకు కొద్ది దూరంలో ఉన్న కాణిపాకం చేరుకున్నాను. అక్కడ శ్రీవరదరాజ స్వామి, శ్రీమణికంఠేశ్వర స్వామి, శ్రీవరసిద్ధి వినాయకుల ఆలయాలు ఉన్నాయి. నేను వరసిద్ధి వినాయకుల దర్శనం చేసుకొని బయటికి రాగానే అక్కడ ఒకదాని తర్వాత ఒకటి వచ్చిన నాలుగు ఎత్తయిన కుక్కలని చూసి భయపడ్డాను. నాలుగూ వచ్చిన తరువాత పూజారి వాటికి ప్రసాదం మూటను అందించారు. అవి పోకుండా, నా దగ్గరే నిల్చుండి పోయాయి. ఇది విడ్డూరంగా చూస్తున్న నాతో, "ఇవి తిరుమలదాసు

అనే చాకలివాడి పెంపుడు కుక్కలు. రజకులకి ఆలయ ప్రవేశం నిషిద్ధంకాక పోయినా అతడు ఆలయానికి రాడు. ప్రతిదినం ఈ నాలుగు కుక్కలు వచ్చి ప్రసాదం తీసికొని వెళ్తుంటాయి. అవి మిమ్మల్ని తమతో రమ్మంటున్నట్లు నాకు అనిపిస్తున్నది," అని చెప్పిన పూజారి మాటలను విని, 'బహుశా స్వామి ఆజ్ఞ కూడా ఇదేనేమో,' అని తలచి వాటిని వెంబడించాను.

## తిరుమలదాసు వృత్తాంతం

70 సంవత్సరాల తిరుమలదాసు శ్రీపాద శ్రీవల్లభుల భక్తుడు. నాకు ప్రసాదం ఇచ్చిన తరువాత వారిలా చెప్పారు, "నాయనా! మీరు ఎపుడెపుడు వస్తారా? మీకు మాల్యాద్రిపుర విశేషాలు ఎపుడు చెప్తానా? అని తహతహలాడుతున్నాను. శంకరా! నేను చెప్పబోయే విషయాలను శ్రద్ధగా విను. పూర్వ జన్మలో నేను గొప్ప వేద పండితుడనే. కాని పరమ పిసినారిలా ఉండేవాడిని. అవసానకాలంలో అప్పుడే పుట్టిన ఆవు దూడ పాత గుడ్డ పీలికని నములుతుండటం చూసి ఆ బట్టని జాగ్రత్తగా పెట్టుకోమని నా పిల్లలకి చెప్పి మరణించాను. మరణకాలంలో నాదృష్టి పాత బట్టలపైన ఉండటంచేత నాకు ఈ చాకలి జన్మ వచ్చింది. అదృష్టవశాత్తు ఈ జన్మలో నేను మాల్యాద్రిపురంలో జన్మించాను. అది క్రమంగా మల్లాది అయింది. మల్లాది యింటి పేరుతో ఆ గ్రామంలో రెండు కుటుంబాలు ఉండేవి. బాపన్నావధానులు హరితస గోత్రీకులు. శ్రీధర అవధానులు కౌశికశ గోత్రీకులు. వీరి చెల్లెలినే బాపనార్యులు వివాహం చేసుకొన్నారు. ఇద్దరూ ప్రకాండ పండితులు. అయినవిల్లిలో జరిగే యజ్ఞానికి ఇద్దరూ ఆధ్వర్యులై వచ్చారు. యజ్ఞం చివరలో వినాయకుడు స్వయంగా తన తొండంతో ప్రసాదం తీసుకొనేలా చెయ్యాలని కొందరు పండితులు వాదించారు. వీరిద్దరు తాము మహాగణపతిని ప్రత్యక్షపరచగలమని ప్రతిజ్ఞ చేసారు. వేదోక్తంగా పూజ ముగిసిన తరువాత స్వర్ణమయ కాంతులతో గణపతి దర్శనమిచ్చి తన

తొండంతో ఆహుతిని తీసుకొని, కొద్ది రోజుల్లో గణేశ చతుర్థి నాడు శ్రీపాద శ్రీవల్లభ రూపంలో తాము అవతరించగలమని చెప్పారు. ఆ సభలో ఉన్న ముగ్గురు నాస్తిక సోదరులు ఇది అంతా ఇంద్రజాలమని, స్వామి ఇంకొకసారి నిదర్శనం ఇవ్వాలి అని వాదించారు. అపుడు హోమగుండంలోని విభూతి వినాయక రూపంలో దర్శనం ఇచ్చి, "మూర్ఖులారా! దేవతలూ, ఋషులూ మొదలైన వారితో ఆది పూజలు అందుకొనే భగవంతుణ్ణి నేనే, విఘ్నాలకు అధిపతిని నేనే. అందరు దేవతలు నన్ను ఆరాధించిన తరువాతనే తమ తమ కోరికలను నెరవేర్చుకోగలిగారు. మీ సోదరులు ముగ్గురు నన్ను ప్రత్యక్షంగా చూసి కూడా చూడనట్లు మాట్లాడారు. కాబట్టి మీలో ఒకరు గుడ్డివానిలా, అవహేళన చేసినందుకు ఒకరు మూగవానిలా, సత్యం విని కూడా పెడచెవిన పెట్టినందుకు ఒకరు చెవిటివానిలా పుడతారు. నా స్వయంభూమూర్తిని దర్శించిన తర్వాతనే మీమీ అంగ వైకల్యం దూరమవుతుంది," అని చెప్పారు.

### కాణిపాకఘట్టం

ముగ్గురు సోదరులు కాణిపాకంలో గుడ్డి, మూగ, చెవిటివారిలా జన్మించి, కాణి (ఎకరంపావు) భూమిని సాగు చేసికొని జీవనం గడుపుతున్నారు. పొలంలో ఒక దిగుడు బావి ఉంది. అనావృష్టి వల్ల ఒక మారు బావిలో నీళ్ళు పూర్తిగా ఎండిపోవడంతో ముగ్గురూ లోపలికి దిగి పారతో ఇసుకను తోడుతుంటే, అది లోపల ఉన్న స్వయంభూమూర్తి శిలకు తగిలి రక్తం పైకి చిమ్మింది. ఆ స్పర్శతో ముగ్గురి అంగవైకల్యం దూరమయింది. బాపనార్యులు, శ్రీధరావధానులు శాస్త్రోక్త విధానాలతో ఆ స్వయంభూవినాయక విగ్రహ ప్రతిష్ఠ చేసారు. "జల, అగ్ని, వాయు, ఆకాశ తత్త్వాలలో నా అవతరణ ఇదివరకే జరిగింది. ఇపుడు పృథ్వీ తత్త్వంలో అవతరించాను. అయినవిల్లిలో మీరు చేసిన హోమ భస్మమే ఈ రూపు ధరించింది. శ్రీశైలపు లింగంలో కళలు తక్కువగా ఉన్నాయి. మీరు

దానిలో శక్తిపాతం చేయండి. సరిగ్గా అదే సమయంలో నేను గోకర్ణం, కాశీ, బదరీ, కేదారాలలో శక్తిపాతం చేస్తాను. శ్రీధరా! ఈ నాటి నుండి మీ ఇంటి పేరును 'శ్రీపాద'గా మారుస్తున్నాను," అని వరసిద్ధి వినాయకుడు వారితో చెప్పి అంతర్ధానం అయ్యారు. శంకరా! మాల్యాద్రిపురం నుండి వీరిద్దరు పీఠికాపురానికి వలస వచ్చారు. ఆ విశేషాలు, శ్రీపాదుల బాల్య లీలలు రేపు వివరిస్తాను. నేను కూడా పీఠికాపుర వాసినే. శ్రీపాదుల ఆజ్ఞమేరకు నేను ఇక్కడ నా రెండవ భార్యతోనూ, ఆమె సంతానంతోనూ ఉంటున్నాను. నామొదటి భార్య కొడుకు, రవిదాసు ప్రభుసేవలో ఉన్నాడు. పీఠికాపురంలో వేంకటప్పయ్యశ్రేష్ఠి, నరసింహవర్మ కుటుంబాలతో శ్రీపాదులకి ఎంతో అనుబంధం ఉన్నది," అని చెప్పి ఆ రోజు కథను ముగించారు తిరుమలదాసు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**





కాణిపాక స్వయంభూ వినాయకుడు

# 6వ అధ్యాయం

# శ్రీపాదుల దివ్య అవతరణ

## బాపన్నావధానులు పీఠికాపురానికి వచ్చిన వైనం

ఆ మరునాడు జపం, పూజ, ధ్యానం అయిన తరువాత తిరుమలదాసు బాపన్నావధానులు పీఠికాపురానికి వచ్చిన వైనం ఇలా తెలిపారు:

ఒకసారి పీఠికాపురంలో జరుగుతున్న యజ్ఞానికి ఆధ్వర్యునిగా బాపన్నావధానులు వచ్చారు. వత్సవాయి నరసింహవర్మగారు వారిని పీఠికాపురంలోనే ఉండమని కోరితే వారు నిరాకరించారు. ఆ సమయంలోనే వర్మగారి 'గాయత్రి' అనే పేరుగల గోవు తప్పిపోయింది. బాపన్నావధానులు లెక్కవేసి అది సామర్ల కోటలో ఖాన్‌సాహెబ్ అనే కసాయివాని వద్ద ఉందని, త్వరగా వెళ్ళకపోయినట్లయితే గోవుకి మరణం తప్పదని చెప్పారు. వారు చెప్పినట్లు గాయత్రి తమకు దొరికిన పక్షంలో బాపన్నావధానులు తమ వద్దనుంచి 24 ఎకరాల భూమిని, ఉండడానికి ఒక ఇల్లు తీసుకుంటానని వాగ్దానం చెయ్యాలని, దీనికి బాపనార్యులు అంగీకరి స్తేనే గాయత్రిని తీసుకొని వస్తానని వర్మగారు చెప్పారు. ఈ షరతులు నిరాకరించినట్లయితే గోహత్యాపాతకం చుట్టుకుంటుందని భావించి బాపనార్యులు విధిలేని పరిస్థితులలో వర్మగారి షరతుని అంగీకరించడం, గాయత్రి దొరకడం, వారు పీఠికాపురవాసి అవడానికి దారి తీసాయి.

## సుమతీ-రాజశర్మల వివాహం

బాపనార్యులకు[4]సుమతీ అనే ఒక కూతురు, వెంకావధానుల నేకుమారుడు ఉన్నారు. అయినవిల్లి గ్రామవాసి అయిన ఘండికోట అప్పలరాజుశర్మ బాపనార్యుల దగ్గర చదువుకోవడం కోసం వచ్చారు.

---

4. మహారాణిలా వయ్యారంగా నడవటం వల్ల ఆమెను సుమతి మహారాణి అని పిలిచేవారు.

అతడు భారద్వాజ గోత్రీకుడు. కాలాగ్నిశమనదత్త ఆరాధకుడు. పూజా సమయంలో ఆ విగ్రహం రాజశర్మతో మాట్లాడుతుండేది. తమ విద్యార్థి [5]యాయవారం చేయరాదని, బాపన్నావధానులు రాజశర్మకు



వాళ్ళ ఇంట్లోనే భోజన సదుపాయం చేసారు. ఒకరోజు శని ప్రదోష పూజ తరువాత కుక్కుటేశ్వర ఆలయంలో ఆకాశవాణి 'సుమతికి అప్పల రాజశర్మకి వివాహం జరిపించమని,' ఆజ్ఞాపించింది. ఆలయంలో ఉన్న భక్తులందరకు ఆ వాణి వినిపించింది. చిన్నతనంలోనే రాజశర్మ తల్లిదండ్రులు మరణించడంవల్ల అయినవిల్లి గ్రామంలో ఉన్న వారి బంధువులను పిలిపించి ముహూర్తాలు నిర్ణయించారు. శర్మకు ఇల్లు కూడా లేకపోవడం వలన, అతడు అయాచితంగా ఎవ్వరి దగ్గర నుండి దేనిని అంగీకరించని తత్త్వం కలవాడు అవడం వలన, అతనికి పిత్రార్జితంగా లభించిన ఇల్లు ఒక్క వరహా విలువ మాత్రమే చేస్తున్నందువలన వెంకయ్యశ్రేష్ఠి 12 వరహాల విలువ గల తమ ఇంటిని ఒక్క వరహాకు శర్మకు విక్రయించారు.

## శ్రీపాద శ్రీవల్లభ జనన శుభసూచకములు

వివాహానంతరము వారికి ఇద్దరు పుత్రులు అంగవైకల్యంతో జన్మించారు. పెద్దవాడు అంధుడు. రెండవవాడు కుంటివాడు. అయినవిల్లి నుండి వచ్చిన వినాయక ప్రసాదం తిన్న తరువాత సుమతి తిరిగి గర్భవతి అయింది. ఆమెకు వివిధ రకాల స్వప్నాలు వస్తుండేవి. ఆ స్వప్నాలలో దేవతల ఆయుధాలు, సిద్ధులు, యోగులు, ఋషులు కనిపిస్తుండేవారు.

---

5. భిక్ష యాచించి కడుపు నింపు కోవడం.

తండ్రికి ఈ విషయాన్ని తెలుపగా వారు ఇది శుభప్రదమని, మహాపురుష జనన సూచకమని చెప్పారు. ఇదే విషయాన్ని శర్మ తన పూజా సమయములో కాలాగ్నిశమనుని ప్రశ్నించగా వారు శర్మ కనుబొమ్మల మధ్య ప్రదేశాన్ని తాకారు. వెంటనే రాజశర్మకు పూర్వజన్మ జ్ఞానము కలిగింది.

## ఆనాటి సుశీలా-విష్ణుదత్తులే ఈనాటి సుమతీ-రాజశర్మలు

ఆ జన్మలో అతడు విష్ణుదత్తుడనే పేద బ్రాహ్మణుడని, భార్య సుశీల అని స్ఫురణకు వచ్చింది. "నీకు దత్తునిగా దర్శనమిచ్చి ఏదేని వరము కోరుకొనమని అడిగినపుడు నీవు నీ తల్లిదండ్రుల ఆబ్ధికానికి నన్ను భోక్తగా ఆహ్వానించావు. నేను సూర్యాగ్నులతో కలసి మీ ఇంట శ్రాద్ధ భోజనము చేసి నీ పితృదేవతలకు శాశ్వత బ్రహ్మలోక ప్రాప్తిని కలిగించాను', అని దత్తులు శర్మకు పూర్వజన్మ వృత్తాంతం జ్ఞప్తి చేసి, "నేను శ్రీపాద శ్రీవల్లభ రూపమున అవతరింపదలచాను. గత నూరు సంవత్సరాలుగా నేను ఆ రూపంలోనే యోగులకు, సిద్ధులకు దర్శనము ఇస్తున్నాను," అని చెప్పారు. ఈ విషయాన్ని శర్మ తన భార్యకు, మామగారికి చెప్పగా బాపనార్యులు, "నాయనా! పూర్వజన్మలో సూర్య, అగ్ని, దత్తదేవులకు శ్రాద్ధ భోజనము పెట్టిన పుణ్యాత్ముడవు. దత్తుడు ఈ జన్మలో కూడా ఏదో ఒక రూపంలో నీ దగ్గరకు వచ్చి భోజనం అడగవచ్చును. ఆ రోజు ఆబ్ధికమైనాసరే, భోక్తలు తిన్నా, తినకపోయినా, అర్థించిన ఆగంతకునికి భిక్షను మాత్రం తప్పక ఇవ్వవలసిందే," అని స్పష్టంగా చెప్పారు.

## సుమతీమాతకు అవధూత-శ్రీపాదుల దర్శనం-వాగ్దానం

ఒక మహాలయ అమావాస్యనాడు రాజశర్మ పితృశ్రాద్ధానికి సంబంధించిన ఏర్పాట్లు చేస్తుండగా, "భవతీ! భిక్షాందేహి!" అని వినిపించింది. సుమతి ఆ అవధూతకు భిక్షని ఇవ్వగా అతడు ఏదైనా

ఒక వరము కోరుకొమ్మని అడిగారు. "దత్తప్రభువులు ఇపుడు శ్రీపాదుల రూపంలో సంచరిస్తున్నారు అని విన్నాను. ఆ రూపాన్ని నాకు చూపించండి," అని ఆమె ప్రార్థించింది.

తక్షణమే సుమతి యెదుట 16సంవత్సరాల సుందర యతి దర్శనం ఇచ్చి, "అమ్మా! నేనే శ్రీపాదుడను. నేనే దత్తుడను. ఈ శ్రీవల్లభ రూపంలో నన్ను ఏదైనా ఒక వరము కోరుకో. జనులు తెలిసి తెలిసి పాప కర్మలు చేసిన పాప ఫలితాలు, పుణ్య కర్మలు చేసిన పుణ్య ఫలితాలను పొందుతారు. ఏ కోరిక లేకుండా పుణ్యకర్మలు ఆచరించినట్లయితే దాన్ని అకర్మ అంటారు. దీనికి ఎటువంటి ఫలితాలను ఇవ్వాలి అనేది భగవంతుడు నిర్ణయిస్తాడు. అర్జునుడు అలాంటి అకర్మ చేయటం వలననే శ్రీకృష్ణుడు కౌరవులను వధించమని ఆదేశించాడు. దానివలన అర్జునుడికి ఎటువంటి పాపము కలుగలేదు. మీ దంపతులు ఇద్దరు విశేషమైన అకర్మ చేయటం వలన లోకహితార్థంగా ఏదైనా ఫలితాన్ని ఇవ్వవలసి ఉంది. సందేహించక కోరుకో," అని పలికారు.

సుమతి భావోద్వేగంతో ఆ యతి పాదాలపై పడి నమస్కరించింది. శ్రీపాదులు ఆమెను లేవనెత్తి, "అమ్మా! బిడ్డ కాళ్ళపై తల్లి పడరాదు," అన్నారు. "తండ్రీ! నన్ను అమ్మా అని పిలిచావు. నీది సిద్ధ వాక్కు. కాబట్టి దానినే నిజం చేయవలసింది," అని సుమతి తన కోరికను వ్యక్తం చేసింది. "తథాస్తు! తల్లి బిడ్డ పాదాలకు మొక్కినట్లయితే ఆయుఃక్షీణం అంటారు. కాబట్టి నేను మీ పుత్రునిగా మీరు చెప్పినట్లు నడచుకొంటూ 16సంవత్సరాలు మాత్రమే మీయింటిలో ఉంటాను. నా సంకల్పానికి వ్యతిరేకంగా నా పైన ఆంక్షలు విధించినా వివాహ ప్రయత్నాలు చేసినా మరుక్షణమే ఇల్లు వదిలి వెళ్ళి పోతాను," అని చెప్పి అంతర్ధానమయ్యారు.

సుమతి ఈ విషయాన్ని బాపన్నావధానులతో చర్చించినపుడు

పుత్రుడికి పాద నమస్కారం చేస్తే ఆయు:క్షీణం కాని అవధూతకి నమస్కరించడం తప్పుకాదని సమాధానపరిచారు. పీఠికాపురంలో ఈ విషయం చర్చనీయాంశం అయ్యింది. బ్రాహ్మణులు చాలా ఈర్ష్య వహించారు. వారిలో నరసావధానులు మొట్టమొదటివారు. భోక్తల విషయం గడ్డు సమస్య అయ్యింది. కాని రాజశర్మ కాలాగ్నిశమనుని ప్రార్థించగా, ముగ్గురు అతిథులు భోక్తలుగా రావడంతో పితృకార్యం నిరాటంకంగా కొనసాగింది.

## ఆశుతోషుని వృత్తాంతం

ఒక పర్యాయం బంగాళా దేశములోని నవద్వీపం నుండి ఆశుతోషుడనే పండితుడు పాదగయకు వచ్చారు. "వేదాలలో చెప్పిన విధంగా వైశ్యులు ఉపనయనం చేసుకొనవచ్చా? లేదా?" అనే విషయం చర్చించడానికి ఆ రోజు బ్రాహ్మణ పరిషత్తు సమావేశం అయ్యింది. ఆశుతోషుణ్ణి కూడా సభకు ఆహ్వానించారు. 'నియమ నిష్ఠలలో వైశ్య, క్షత్రియులు బ్రాహ్మణులతో సమానంగా ఉన్నందువల్ల వారు వేదోక్త విధానంగా ఉపనయనం చేసుకోవచ్చు. మిగిలిన వర్ణాలవారు పురాణాలలో చెప్పిన విధానంగా ఉపనయనం చేసుకోవచ్చు. జ్ఞానసిద్ధిని పొందడానికి కులము, లింగము, వయస్సు, ఆటంకాలు కావు, లాభాదుడనే వైశ్య మహర్షి దత్త అనుగ్రహంతో సిద్ధుడు అయ్యారు. దత్తుని దయ ఉన్నట్లయితే మానవుడు చేసే ప్రతి పనిలోనూ లాభం కలుగుతుంది,' అని బాపనార్యులు సభకు వివరించారు.

నరసావధానులు బగళాముఖీ ఉపాసకులు. వాదనకు ముందు బగళాముఖీ మంత్రాన్ని చదువుకొని వాదనని ప్రారంభించడం వారి అల వాటు. ఆ సమయంలో వారిని ఓడించడం అసాధ్యం. అయితే అంతవరకు బాపనార్యులు, నరసావధానులు ఇద్దరూ ముఖాముఖిగా ఎన్నడూ వాదనకు దిగలేదు. బాపనార్యులు కొన్ని కోట్లసార్లు గాయత్రీ మంత్రాన్ని జపించిన

అనుష్ఠానపరులు.

బాపనార్యుల వాదాన్ని ఖండించడానికి ముందు నరసావధానులు ఆ దేవిని తలచుకొని, మంత్రజపం ప్రారంభించబోయి అంతలోనే తాతగారితో వచ్చిన శ్రీపాదులను చూసి, “నీకు ఇక్కడ ఏమి పని? వెళ్ళు,” అంటూ కోపంతో గద్దించారు. “తాతా! నీవు నన్ను పిలిచావు. అందుకే నేను వచ్చాను. పొమ్మనట్లయితే ఇప్పుడే వెళ్ళిపోతాను,” అని పలికి తండ్రితో శ్రీపాదులు వెళ్ళిపోయారు. అటుపిమ్మట ఎంత ప్రయత్నించినా నరసావధానులకు నోటినుంచి ఒక్క మాట రాలేదు.

## ఆశుతోషునకు బగళాముఖీ దర్శనం

సాంద్రసింధు వేదంలో చెప్పబడిన గణితం ప్రకారం శ్రీపాదులు గణేశ చతుర్థి ఉషఃకాలంలో సింహలగ్నం, చిత్తా నక్షత్రం, తులారాశిలో జన్మించారని, శ్రీపాదులు దత్తావతారం అని, వారి పాదాలలో సర్వ శుభ లక్షణాలు ఉండటం వలన శ్రీపాద శ్రీవల్లభ నామము సార్థకమైందని, వారి జన్మకుండలి ఎవ్వరికి ఇవ్వ కూడదని, కాలాంతరంలో త్రిపుర దేశస్థుడు, జైన మతస్థుడు అయిన అక్షయకుమారుని వంశీకుల ద్వారా వారి జన్మకుండలి పీఠికాపురం చేరుతుందని ఆశుతోషుడు తన నాడీ గ్రంథంనుండి చదివి చెప్పారు.

ఆశుతోషుడు శ్రీపాదుల ఇంటికి వెళ్ళారు. శ్రీవల్లభులు వారితో, “ఈ రోజు చిత్తా నక్షత్రం, నా జన్మ నక్షత్రాన నన్ను ఆరాధించినట్లయితే నేను మిక్కిలి ప్రసన్నుడిని అవుతాను. నీవు ఈ రోజున నిష్కల్మష భక్తితో నా వద్దకు వచ్చావు. కాబట్టి ఏదైనా కోరుకో,” అని అన్నారు. “నేను నరసావధానులని ఆశ్రయించి బగళాముఖీదేవిని దర్శించాలి అని అనుకొన్నాను. కాని ఈ రోజు దేవి వారికి ప్రసన్నంగా లేదని గ్రహించాను. దీనితో నాకు కూడా ఆ దేవి దర్శన భాగ్యం కలుగలేదు,” అని ఆశుతోషుడు విచారం వ్యక్తం

చేయగానే శ్రీపాదులు ఆశుతోషునికి బగళాంబికగా దర్శనం ఇచ్చి అతని ధన్యుణ్ణి చేసారు. తరువాత శ్రీపాదులు తాము మహారాష్ట్రలో అవతరిస్తామని, వారి ముఖ్యశిష్యులలో ఆశుతోషుడు ఒకరై ఉంటారని తెల్పి ఆశుతోషుని కణ్వమహర్షి తపోభూమికి వెళ్ళవలసిందిగా ఆజ్ఞాపించారు.

తనకు బగళాముఖీ అనుగ్రహం కలుగకుండా ఉండటానికి బాపనార్యులే కారణమని నరసావధానులు భావించారు. నాడీగ్రంథం ద్వారా శ్రీపాదుల గురించి తెలిసిన వివరాలు వారికి పుండుమీద కారం చల్లినట్లు బాధను కలిగించాయి.

## శ్రీపాదుల జన్మ సమయ లీలలు

శ్రీపాదులు జన్మించినపుడు మూడు తలల నాగుపాము, 18రోజుల పాటు వారిని ఎక్కడ పరుండబెట్టినా పడగ పట్టుతుండేది. శ్రీపాదులు పుట్టిన వెంటనే సుమతీ మహారాణి సొమ్మసిల్లి  పోయింది. శ్రీపాదుల సన్నిధికి నాల్గు వేదాలు, 18పురాణాలు, మహాపురుషులు జ్యోతి స్వరూపంతో వచ్చారు. పవిత్ర వేదమంత్రాలు బయట వరకు వినిపించాయి. శ్రీపాదుల  వయసు ఒక సంవత్సరం పూర్తి కావస్తుంది. నెలల బాలుడిగా ఉన్నపుడు కూడా స్వేచ్ఛగా నడచి వెళ్ళేవారు, శాస్త్రప్రసంగాలు, చిత్ర విచిత్రమైన లీలలు చేసేవారు. ఎవరో మహాపండితుడు మరణించిన తరువాత ఈ బాలునిలో ప్రవేశించి ఇలాంటి వయసుకి మించిన పనులు చేయించుతున్నారని, తల్లితండ్రులు తగిన వైద్యం  చేయించకుండా వానిని దత్తావతారమని తప్పుగా భావిస్తున్నారు అని పీఠికాపుర వాసులు అనుకొనేవారు," అని ఇంతవరకు శ్రీపాదుల లీలలు వర్ణించిన తిరుమలదాసు తన విషయం చెప్పసాగారు:

## నరసావధానులతో తిరుమలదాసు అనుభవాలు

"నేనుకూడా బాపనార్యుల కుటుంబంలాగానే మాల్యాద్రిపురం నుండి

వచ్చాను. అందువల్ల బాపనార్యుల, రాజశర్మగారి బట్టలను ఉతికేవాడిని. బాల్యంనుండి బాపనార్యులతో సంబంధం కలిగి ఉండటమే కాకుండా మొదటి నుండి ఆధ్యాత్మిక చింతన ఎక్కువగా ఉండటం వలన నేను నరసావధానుల బట్టలు ఉతికేవాడిని కాదు. వారి దుష్ట స్పందనల ప్రభావం ఎంత తీవ్రంగా ఉండేదంటే పొరపాటున ఎప్పుడైనా వారు ఎదురై వారిని చూడటం జరిగినట్లయితే ఆనాడు భోజనం చేయలేక పోయేవాడిని. అందువల్ల నా పెద్ద కుమారుడు రవిదాసుకి వారి ఇంటి బట్టలు ఉతికే బాధ్యత అప్పగించాను. ఈ విషయం నరసావధానులకు తెలిసి తమ దుస్తులను నన్నే ఉతకమని ఆజ్ఞాపించారు. గత్యంతరంలేని పరిస్థితిలో నేను వారి కుటుంబసభ్యుల అందరి బట్టలు ఉతికాను. నేను ఉతికిన బట్టలు ధరించిన వారి ఇంటివారి ఎవ్వరికి ఏమీ జరగలేదు కాని, నరసావధానులకు మాత్రం అవి అగ్ని వస్త్రాల్లా శరీరం అంతా విపరీతమైన మంటలు. నేనేదో క్షుద్ర విద్యా ప్రయోగం చేసి ఉంటానని న్యాయాధికారికి ఫిర్యాదు చేసారు, కాని వారు నన్ను నిర్దోషిగా తీర్పును ఇచ్చారు. నేను ఇంటికి వచ్చిన కొద్ది సమయానికి శ్రీపాదులు 16సంవత్సరాల యతి రూపంలో మా ఇంటికి వచ్చారు. “మేము చాకలివాళ్ళం, మీరు మా ఇంటికి రావడం తప్పు కదా!” అని అడిగిన నాకు “ఎటువంటి తప్పు లేదు, బ్రహ్మజ్ఞానం ఉండటంవల్ల నీవు బ్రాహ్మణుడవు. ఆ నరసావధానులు చాకలి మూట అంత పాపం నెత్తిన పెట్టుకున్న రజకుడు,” అని చెప్పి నా శిరస్సుపై చేతిని ఉంచారు, వెంటనే నాలోని కుండలినీ శక్తి జాగృతమైంది, ఆత్మ పరమాత్మతో అనుసంధానమై ఒళ్ళు తెలియని పరవశంతో ఎంతోసేపు ఉండిపోయాను.

### నరసావధానుల తోటకూర వ్యామోహం

నరసావధానుల ఇంటిలో తోటకూర విస్తారంగా పండేది. ఎంతో రుచిగా ఉండేది. అవతల వ్యక్తివల్ల తనకు లాభం ఉంటుంది అని

తోచినట్లయితేనే తప్ప వారు ఎవ్వరికీ తోటకూర ఇచ్చేవారు కాదు. ఒకరోజు శ్రీపాదులు తన తల్లితో నరసావధానుల ఇంటి తోటకూరతో కూర వండి పెట్టమని మారాం చేసారు. దానికి బాపనార్యులు, "రేపు నీవే స్వయంగా అడిగి తీసుకో. వారు ఇవ్వనంటే ఇక ఆ విషయంలో పట్టు పట్టకూడదు," అని చెప్పారు.

ఉదయాన్నే బాపనార్యులు శ్రీపాదులని నరసావధానుల ఇంటికి తీసుకొని వెళ్ళారు. వారు అరుగుపై కూర్చొని క్షురకర్మ చేయించుకొనే ప్రయత్నంలో ఉండగా శ్రీపాదులు చేతులెత్తి వారికి నమస్కరించగానే వారి శిఖ ఊడి క్రిందపడింది. శ్రీపాదులు తాతగారితో, "అసలే బాధలోఉన్న నరసన్న తాతను మరింత బాధించ వద్దు," అని చెప్పడంతో వెనుతిరిగి ఇంటికి వెళ్ళిపోయారు.

## నరసావధానుల దుర్దశ

నరసావధానులు ఆ రోజు ధ్యానంలో కూర్చొని ఉండగా వారిలో నుండి వారిని పోలిన వర్చస్వి బయటికి వచ్చి, "నేను నీ పుణ్య శరీరాన్ని. శ్రీపాదులు నాకు నమస్కరించి నన్ను రమ్మనమని ఆజ్ఞాపించారు. మోహము క్షయించడమే మోక్షం. నీకు తోటకూరపై, శిఖపైగల మోహం సాక్షాత్ దత్తప్రభువైన శ్రీపాదులపై లేదు. నీకు దరిద్ర దశ రాబోతున్నది. దానిని నివారించడానికై శ్రీపాదులు తోటకూరని కోరారు. నీవు నిరాకరించి దౌర్భాగ్యాన్ని ఆహ్వానించావు. రాబోయే జన్మలో నీవు బీద బ్రాహ్మణునిలా జన్మిస్తావు. వారు నరసింహసరస్వతి అవతారంలో మీ ఇంట భోజనం చేసినపుడు నీవు మళ్ళీ ఉచ్చదశను చేరుకుంటావు. నేను మంచి సమయంలో మళ్ళీ నీలో ప్రవేశిస్తాను," అని చెప్పి వెళ్ళిపోయారు. ఆ రోజు మొదలు వారికి దుర్దశ ప్రారంభం అయ్యింది.

శ్రీపాదుల జన్మదినమైన గణేశచతుర్థినాడు రాజశర్మ కుటుంబం బాపనార్యుల ఇంటికి భోజనానికి వెళ్ళారు. బాపనార్యులు శ్రీపాదుల చరణాలలో శుభలక్షణాలను చూడటం కోసం ఎన్నిమార్లో ప్రయత్నించి విఫలులయ్యారు. ఆరోజు తవుడులో  కాలిముద్రలలో దత్తావతారాన్ని సూచించే శుభలక్షణాలు స్పష్టంగా కనిపించాయి. వారి నోట అప్రయత్నంగా శ్రీపాదులపై ఆశువుగా కవిత్వం వచ్చింది. వారి కవితలలోని భక్తిభావం వ్యాకరణ ఛందస్సులకు అతీతమైంది. వారి ఆనంద బాష్పాలను శ్రీపాదులు తుడిచి, "తాతా! నీవు సత్యఋషివి. యతి రూపంలో ఉన్న నాకు అమ్మ నమస్కరించడం వలన నేను అల్పాయుష్కుడను కానని నీవు చెప్పావు. శ్రీపాదుల రూపంలో ఉన్న నాకు నమస్కరించడం వల్ల అల్పాయుర్దాయం కలుగుతుందని నేను చెప్పాను. ఈ రెండిటిని నిజం చేస్తూ నేను 16సంవత్సరాల వయసులో యతినై ఈ శ్రీపాద రూపాన్ని నిత్య సత్య రూపంగా నిలిచి ఉంచుతాను," అని చెప్పారు.

## నరసావధానుల మృతి - పునరుజ్జీవనం

అదే రోజు నరసావధానులు కుక్కుటేశ్వరాలయ సందర్శనానికి వెళ్లినపుడు అక్కడ స్వయంభూదత్త విగ్రహం లేదు. నరసావధానులపై ఈర్ష్య ఉన్న ఒక తాంత్రికుడు నరసావధానులు క్షుద్రవిద్యోపాసకుడని, వారే విగ్రహాన్ని మాయం చేసారని ప్రచారం చేసాడు. నరసావధానుల ఇంటిలో తవ్వి చూడగా మానవ కపాలాలు, క్షుద్రవిద్యకు సంబంధించిన వస్తువులు బయటపడ్డాయి. దీనితో నరసావధానులు పూర్తిగా కృంగి పోయారు. పులిమీద పుట్రలా వారి తల్లి ఆబ్దీకంనాడు తాంత్రికుడు వారి ఇంటిలోని ఆవులో క్షుద్రశక్తిని ప్రవేశపెట్టాడు. అది భీకరంగా అరుస్తూ కట్లు తెంచుకొని తోటకూరనంతా ధ్వంసం చేసి వంటింట్లో ఉన్న భోజనపదార్థాలన్ని తిన్నది. ఇంతలో శ్రీపాదులు తన తండ్రితో ఆప్రదేశాన్ని చేరుకొన్నారు. ఆవు

శ్రీపాదులకు మూడుసార్లు ప్రదక్షిణం చేసి చనిపోయింది. నరసావధానులు పూర్తిగా మంచం పట్టారు. రాజశర్మ వైద్యం చేస్తున్నా ఫలితం లేకపోయింది. నరసావధానులు మరణించారు, నరసావధానుల శవాన్ని స్మశానానికి తీసుకొని వెళ్ళుతున్నారు. వారి భార్య శ్రీపాదుల చేతులు పట్టుకొని, "చిటికెడు పసుపు కుంకుమ కోసం ఎంత దూరమైనా పేరంటానికి వెళ్ళేదాన్ని. నీవు దత్తుడవే అయితే మీ తాతను బ్రతికించడం అసాధ్యమా?" అని విలపించింది. శ్రీపాదులేమీ మాట్లాడలేదు. స్మశానంలో పుత్రుడు తండ్రి చితికి కొరివి పెట్టబోతుండగా , "బ్రతికి ఉన్న తండ్రికి కొరివి పెడుతున్న పుత్రుణ్ణి ఎక్కడా చూడలేదు," అని శ్రీపాదులు గద్దించారు. శవం వద్దకు వెళ్ళి కనుబొమ్మల మధ్య వేలితో ముట్టుకున్నారు. నరసావధానులు జీవితులయ్యారు. వారికి కర్మ సూత్రపు సూక్ష్మాంశాలు కూడా అర్థం అయ్యాయి. చనిపోయిన ఆవు వారి తల్లి అని, ఇంట్లో పడి ఉన్న ముసలి ఎద్దు వారి తండ్రి అని, తమ తల్లిదండ్రులను సరిగా చూడకపోవడం వల్ల వారికి ఈ నీచజన్మ వచ్చిందని, తాంత్రికుడు చనిపోయి బ్రహ్మరాక్షసిగా మారుతాడని, శ్రీపాదులు తమ నృసింహసరస్వతి అవతారంలో వానికి ముక్తి ఇస్తారని, మరుజన్మలో తనను కూడ కనికరించి ఐశ్వర్యప్రాప్తి కలగచేస్తారని తెలిసింది. ఇంతవరకు చెప్పిన తిరుమలదాసు శ్రీవారు నరసావధానులకు, వారి భార్యకు చేసిన ఉపదేశం రేపు వివరంగా చెపుతానని ముగించారు. ఇటువంటి ఉత్తమ సాంగత్యం లభించినందుకు నేను ఆనందంతో పరవశించాను.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

# 7వ అధ్యాయం

## ఏడాది శిశువు లీలలు

ఉదయాన్నే పనులను ముగించుకొని తిరుమలదాసు, "శ్రీపాదుల వారికి నీపై చాలా అనుగ్రహం ఉంది, అందువల్లనే వారి చరిత్రను గ్రంథస్థం చేసే భాగ్యం నీకు కలిగింది," అని చెప్పి నిన్నటి కథను కొనసాగించారు.

### ఒకేపర్యాయం మూడు భిన్న స్థలాలలో శ్రీపాదులు

గతంలో నరసావధానులను చూసి భయపడిన వాళ్ళు ఇప్పుడు వెక్కిరించడం, వ్యంగ్య విమర్శలు చేయడం మొదలుపెట్టారు. ఆర్థిక పరిస్థితి రోజురోజుకు క్షీణించడం మొదలుపెట్టింది. వారు తన దుస్థితికి విలపిస్తూ వీధిలోకి వచ్చారు. బాపనార్యులు శ్రీపాదులని ఎత్తుకొని వారింటికి తీసుకొనిపోతూ కనిపించారు. తరువాత వారు శ్రేష్ఠి యింటికి వెచ్చాలకై వెళ్ళారు. అక్కడ శ్రీపాదులు శ్రేష్ఠి ఒడిలో కూర్చుని కన్పించారు. వెచ్చాలు ఇంట్లో పెట్టి వర్మగారింటికి వెళ్ళితే, అక్కడ కూడా శ్రీపాదులు వర్మగారి భుజాలపై కూర్చుని ఆడుతూ కనిపించారు. నరసావధానులను చూసి వారు ముగ్ధమనోహరంగా నవ్వారు. ఇలా ఒకేసారి మూడు చోట్లలో శ్రీపాదులు ఉండటం చూసి వారికి కలయో వైష్ణవ మాయయో తెలియలేదు.

పిచ్చివానివలె ఉన్న భర్తను చూసి దుఃఖిస్తూ నరసావధానుల భార్య పూజామందిరంలోనికి వెళ్ళింది. అక్కడ పూజామందిరంలో శ్రీపాదులు కూర్చొని కనిపించారు. వెంటనే భర్తను పిలిచింది. ఇద్దరు ఆనందంతో వారిని భోజనం చేయమని అడిగినపుడు, 'అది ఈ జన్మలో జరగదని, మరుజన్మలో వారింట అన్నం తిని వారికి భోగభాగ్యాలను ప్రసాదిస్తానని,' శ్రీపాదులు వాగ్దానం చేసారు.

## నరసావధానుల ప్రశ్నలకు ఏడాది పసికందు జవాబులు

తరువాత "తండ్రీ! నీవెవ్వరవు?" అని అడిగిన నరసావధాన్ల ప్రశ్నకు వారు సమాధానమిస్తూ , 'పంచభూతాత్మకమైన ఈ సృష్టిలోని ప్రతి అణువులోనూ నేను ఉన్నాను, నేనే నిర్గుణ, నిరాకార దత్తుడను, శరీరధారుల కోసం సశరీరుడనై వచ్చాను. సాకార నిరాకార, సగుణ, నిర్గుణాలకు ఆధారభూతుడను, అతీతుడను కూడా నేనే,' అని తెలిపారు. 'అన్నీ మీరే అయినపుడు జీవులకు కష్టసుఖాలు రెండూ ఎందుకు?' అని ప్రశ్నించగా, 'ప్రతి జీవికి కర్తృత్వభావన, నేను, నాది అనే అహంకారం ఉన్నంతవరకు ద్వంద్వాల నుండి – అంటే సుఖదుఃఖాలు, పాపపుణ్యాలు మొదలైన వాటినుండి బయట పడలేడు. ప్రతి జీవిలోను పరమాత్మ నిత్యమై, సత్యమై నిలిచి ఉన్నాడు. కాని మాయలో చిక్కుకొన్న జీవులు అది గుర్తించక నేను అనే అహంకారంతోను, నాది అనే మమకారంతోను కొట్టుమిట్టాడుతుంటారు. ఎప్పుడైతే నేను, నాది అనే సంకుచిత భావాలు క్షీణదశకు చేరుకొని, జీవిలోని పరమాత్మ ఉచ్చదశకు చేరుకుంటాడో, అప్పుడే జీవి తనలోని **పరమాత్మకు** దగ్గర కాగలడు,' అని స్పష్టంగా చెప్పారు.

'జీవాత్మ, పరమాత్మ వేరు వేరా?'

"అహంకారం నశించినపుడు వేరుగా ఉన్నా నష్టం లేదు, మోహము క్షయించగానే మోక్షస్థితి కలుగుతుంది. జీవిలోని 'నేను' మిగలక, పరమాత్మ అనెడి నేను మిగిలినపుడు బ్రహ్మానంద స్థితి లభిస్తుంది. ఆ స్థితిని అనుభవించి తెలుసుకోవాల్సిందే తప్ప వర్ణించడానికి వీలుకాదు."

## అవధూత – పరమాత్మల మధ్య కల భేదం

అవధూతకు తనకు మధ్య కల భేదాన్ని వివరిస్తూ, **'నేను బ్రహ్మము, బ్రహ్మమే సర్వస్వం అనేది అవధూత అనుభవం, నేను బ్రహ్మము, నేనే సర్వస్వం అనేది నా అనుభవం,'** అని చెప్పారు. 'సంకల్పంతో కూడిన

సత్య, జ్ఞాన, ఆనందరూపం నాది అయితే, సంకల్పము నశించిన సత్య, జ్ఞాన, ఆనందరూపం అవధూతలది. నాలో లీనమైయున్న అవధూతకు వ్యక్తిత్వము, సంకల్పము లేదు. నేను ఆజ్ఞాపించినట్లయితే నాలో లీనమై ఉన్న అవధూత మళ్ళీ జన్మించి తీరాలి. నాది మహాసంకల్పము, మహాశక్తి,' అని వివరించారు.

'బ్రహ్మమే తానయిన అవధూత తిరిగి జన్మించుట ఎట్లు?' **'వేయించిన విత్తనములు మొలకెత్తక పోవుట సృష్టి ధర్మం, వేయించిన విత్తనములనే తిరిగి మొలకెత్తింప చేయడం సృష్టికర్త శక్తి సామర్థ్యాలు,' అని విశ్లేషించారు.** జీవుల పరిణామక్రమం చైతన్యాల గురించి వివరిస్తూ ఖనిజాలు సంపూర్ణ నిద్రాస్థితిలో ఉన్న చైతన్యాలని, వృక్షాదులు, తత్సంబంధిత పదార్థాలు అర్ధనిద్రాణ స్థితిలో ఉన్న చైతన్యాలని, జంతువులు సంపూర్ణ చైతన్యస్థితిలో ఉన్న జీవులని చెప్పారు. ఖనిజంగా పుట్టి, ఖనిజంగా చచ్చి, చెట్లు, లతల్లాగా జన్మించి, తరువాత జంతు జన్మలను ఎత్తి, ఆఖరున మానవజన్మని పొందిన మానవుడు వివేక, జ్ఞాన, వైరాగ్యవంతుడై తనలో నిద్రాణ స్థితిలో ఉన్న పరమాత్మ శక్తిని మేల్కొలిపి మోక్షాన్ని పొందాలని చెప్పారు. అయితే ఈ పరిణామ క్రమాన్ని కూడా పరంజ్యోతి అనుగ్రహంతో మార్చవచ్చనే విషయాన్ని అనసూయామాత నిరూపించిందని, జాగ్రదవస్థలో ఉన్న త్రిమూర్తుల చైతన్యాలను నిద్రావస్థలోనికి మార్చి పసిబాలురను చేసిందని తెలిపారు. **త్రిమాతల శక్తులు ఏకమై అనఘ అవతరించిందని, ఎడమవైపు అనఘాదేవి, కుడివైపు దత్తాత్రేయుడు కలిగిన అర్ధనారీశ్వర రూపంతో జన్మించిన తమకు అవసరమయితే సృష్టి ధర్మాలను మార్చగల శక్తి కలదని విశదీకరించారు.**

'శ్రీపాదా! ఇంతటి సమర్థుడవు, నా దారిద్ర్యాన్ని పోగొట్టవేమి?' అని నరసావధానులు దీనంగా ప్రశ్నించినపుడు, అది మరుజన్మకు వాయిదా వేసానని, వారి పుణ్యఫలం వెచ్చించి ఆయువు పొడిగించడం జరిగిందని,

స్వయంభూదత్త ఆరాధనా ఫలితంగా రెండువేళలా భోజనానికి మాత్రం లోటు ఉండదని హామీ ఇచ్చారు. తమకు బాపనార్య, శ్రేష్ఠి, వర్మగారి కుటుంబాలతో జన్మ జన్మాంతర అనుబంధం ఉన్నదని, వారి వంశజుల పైన కూడా తమ అభయహస్తం ఉంటుందని సెలవిచ్చారు.

## భగవంతుని స్థితి - అనుపస్థితుల వలన పరిణామాలు

'వైశ్యులకు వేదోక్త ఉపనయనము చేయవచ్చునని బాపనార్యులు తీర్పునివ్వడం తప్పు కాదా?' అని నరసావధానులు ప్రశ్నించినపుడు, 'అటువంటి **ధర్మాధర్మముల ప్రశ్న తలయెత్తినపుడు శాస్త్రాన్ని ఆశ్రయించాలి. శాస్త్రంలో చెప్పింది ఆచరణీయమా? కాదా? అనే మీమాంస ఎదురైనపుడు శాస్త్రానికి విరుద్ధమైనా సరే నిర్మలాంత: కరణులు చెప్పిందే వేద మంత్రం,'** అని స్పష్టంగా చెప్పారు. దీనిని సమర్థిస్తూ **హింస పాపమే అయినా శ్రీకృష్ణభగవానుని సమక్షంలో జరిగిన యుద్ధం ధర్మయుద్ధం అయిందని, క్షేత్రము ధర్మక్షేత్రమయిందని, శివుని ఆహ్వానించని, శివుడు లేని దక్షయజ్ఞం సంగ్రామక్షేత్రం అయ్యిందని** చెప్పారు. ఇక తమ భక్తుల విషయానికి వస్తే రోగి శరీరస్థితిని అనుసరించి మందులు, మూలికలతోనో లేదా కత్తి చేత పట్టుకొనో చికిత్సచేసే వైద్యునిలా సాధకుని పరిణతి యొక్క స్థాయి, స్వభావం, శుభాశుభకర్మలను బట్టి తాను వ్యవహరిస్తానని శ్రీపాదులు వివరించారు.



## సృష్టిరహస్య వివరణ

ఉపనయనం వల్ల అంతఃకరణ పరిశుద్ధమై బ్రహ్మాజ్ఞానం సంప్రాప్తించాలి, ఇది ఉపనయం యొక్క ముఖ్య ఉద్దేశం. **బ్రహ్మ పదార్థం**

**కుల మత దేశ కాలాలకు అతీతమైనది, దైవము భావప్రియుడు కాని బాహ్యప్రియుడు కాదు, భక్తుల భావనను బట్టే దైవానుగ్రహం పనిచేస్తుంది,"** అని చెప్పారు. 'అసలు సృష్టి ఎలా ఏర్పడింది?' అన్న నరసావధానుల ప్రశ్నకు జవాబునిస్తూ, 'పరమాత్మ యొక్క అనంతమైన శక్తిలోని ఒక చిన్న అంశం జగత్తును సృష్టించడానికి బ్రహ్మగా ఏర్పడింది. పరమాత్మ నుండి ఏర్పడిన జలము సర్వవ్యాప్తమైంది, అందులో పరమాత్ముని తేజం వలన స్వర్ణమయమైన అనేక కోట్ల అండములు ఏర్పడ్డాయి, అందులో మనము నివసించే బ్రహ్మాండం ఒకటి,' అని తెలిపారు. 'చీకటిగా ఉన్న అండం లోపలి ప్రదేశాన్ని తన తేజో మహిమతో ప్రకాశింపచేసినందువల్ల సూర్యుని, సవిత, పరంజ్యోతి అనే పేర్లతో పిలుస్తున్నారు,' అని చెప్పారు.

కారణ బ్రహ్మలోకము చతుర్ముఖ బ్రహ్మ నివాసస్థానము. దాని పైన ఆదివిద్యాస్థానం అని పేరుగాంచిన శ్రీనగరము; దాని పైన మహా కైలాసం; దాని పైన కారణ వైకుంఠం ఉన్నాయి. సత్యలోకంలోని పురాణపురంలో విద్యాధరులు; తపోలోకంలోని అంజనావతీపురంలో సాధ్యులు; జనలోకంలోని అంబావతీపురంలో సనకసనందనాది ఋషులు; మహర్లోకంలోని జ్యోతిష్మతీపురంలో - సిద్ధులు; స్వర్గలోకంలోని - అమరావతీపురంలో దేవేంద్రాది దేవతలు; భువర్లోకంలోని రథంతరపురంలో దేవశిల్పి విశ్వకర్మ ఉంటారు.

ఖగోళానికి సంబంధించిన గ్రహాలు, నక్షత్రాలు భువర్లోకంలో ఉంటాయి. భూలోకం భూగోళం, మహాభూమి అని రెండు భాగాలు. భూగోళం మానవులు నివసించే భూమి; మహా భూమి భూగోళానికి అయిదుకోట్ల బ్రహ్మాండ యోజనాల దూరంలో దక్షిణంగా ఉంది. భూలోక, భువర్లోకాలను మర్త్యలోకం అని, అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతలాలను పాతాళలోకం అని అంటారు.

సృష్ట్యాదిలో అంతా జలమయమే. ప్రజాపతి సృష్టి చేయదలచి తపస్సు చేయగా పుష్కరవర్ణం కనిపించింది. వరాహరూపం ధరించి పుష్కరవర్ణ సమీపంలో మునిగి దిగువన ఉన్న మహాభూమికి చేరారు. అక్కడి తడి మట్టిని కొద్దిగా తీసికొని వెలుపలికి వచ్చారు. ఇదే భూగోళం అయింది. వరాహమనగా సూకరము కాదు. ఒక కోర ఉన్న ఖడ్గమృగమని తెలిపారు. తరువాత మహాభూమిలోని జంబూ ద్వీపం, దానిలోని నవఖండాలు, వాటిలో నివసించేవారి గురించి తెలియచేసారు.

అటు తరువాత, దత్తతత్త్వం అనుభవంలోకి రావడం సులభ సాధ్యం కాదని, అది అనుభవంలోకి రావాలంటే కొన్ని లక్షల కోట్ల జన్మలు ఎత్తవలసి ఉంటుందని, **కోటానుకోట్ల బ్రహ్మాండములంతటా వ్యాపించి, వానిని అతిక్రమించి ఉన్న ఏకైక తేజో మహారాశియే దత్త ప్రభువులు** అని బోధించారు. సాక్షాత్తు ఆ దత్త ప్రభువులే వారి ఎదుట ఉన్న శ్రీపాదులు అని చెప్పారు. పసికందైన శ్రీపాదుల నోటినుండి లోకాలోకాలు, వాటి నిర్మాణం, దత్తతత్త్వంలాంటి మహత్తర విషయాలు విన్న భార్యాభర్తలిద్దరు నిర్ఘాంతపోయి వెక్కివెక్కి ఏడుస్తూ వారి చరణాలను స్పృశింపగోరారు. కాని శ్రీపాదులు నిరాకరించడంతో కూర్చున్న చోటునుండి కదలలేక పోయారు. ఆ జన్మలో వాళ్ళిద్దరు తమ పాదాలు తాకేంత పుణ్యం చేయలేదని, ఆ యోగం మరుజన్మలోనే లభిస్తుందని, ఎవరు త్రికరణ శుద్ధిగా దత్త దిగంబరా! శ్రీపాదవల్లభ దిగంబరా! నరసింహసరస్వతీ దిగంబరా! అంటూ కీర్తన చేస్తారో అక్కడ తాను సూక్ష్మరూపంలో ఉంటామని చెప్పి వారు అదృశ్యులయ్యారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

## 8వ అధ్యాయం

## తిరుమలదాసు - అద్భుత అనుభవాలు

## (శ్రీపాదులకు రెండుపళ్ళు)

తిరుమలదాసు తమ కథనాన్ని ఇలా కొనసాగించారు, "నాయనా! శంకరభట్టూ!

| | | | |
|---|---|---|---|
| ప్రాణం | విశ్వాసం | ఆకాశం | వాయువు |
| అగ్ని | జలం | భూమి | ఇంద్రియాలు |
| మనస్సు | అన్నం | జలం | ఆలోచన |
| మంత్రాలు | కర్మలు | లోకాలు | లోకంలోని వివిధ పేర్లు |

వీటిని షోడశ కళలు అంటారు. ఆత్మ సాక్షాత్కారమైనపుడు ఈ షోడశ (16) కళలు తమతమ భూతములలోకి చేరిపోతాయి. ఆయా దేవతాశక్తులు మూలభూతమైన తమ చైతన్యాలలో చేరుతాయి. కర్మలు, ఆత్మజ్ఞానం మొదలైనవి అన్ని బ్రహ్మ స్వరూపంలో ఐక్యం అవుతాయి. అటువంటి బ్రహ్మజ్ఞానం కోసం తపించు వారు ఎవరైనా బ్రాహ్మణులే.

### మన ఆహారమే మన మనసు

అటువంటి తపన కొరకు మనోనైర్మల్యము ఎంతో అవసరం. దీనికై మానవులు ఆహార విషయంలో తగు జాగ్రత్తలు తీసుకోవాలి. ఆహారం యొక్క సూక్ష్మాతిసూక్ష్మ అంశాలవల్ల మనస్సు ఏర్పడుతుంది. ఆహారంతో మనస్సు దృఢమైతే ఆలోచనలు కలుగుతాయి. ఈ ఆలోచనా స్రవంతిని క్రమబద్ధం చేసి, అదుపులో ఉంచినట్లయితే అలాంటి ఆలోచనా ప్రతిబింబాన్నే 'మంత్రం' అంటారు. యజ్ఞయాగాది క్రతువులని యధావిధిగా ఆచరిస్తూ ఆయా కర్మ కలాపాలలో పద్ధతి ప్రకారం మంత్రాలను ఆలాపించినట్లయితే దాన్ని 'కర్మ' అంటారు. కర్మలను బట్టే ప్రపంచనిర్మాణం జరిగింది. కర్మేంద్రియాలు,

జ్ఞానేంద్రియాలు ఉన్న మానవులు కర్మలను చేయకుండా ఉండలేరు. మనలోని ఒక్కొక్క ఇంద్రియము ఒక్కొక్క దేవత చేత ప్రభావితమవుతుంది. సమాధి స్థితిలోని యోగికి ఆత్మ సాక్షాత్కారం అయినపుడు 16కళలు తమతమ భూతములలో లీనమవుతాయి. భౌతిక ఇంద్రియాలలోని శక్తులు విశ్వాంతరాళంలోని భూతములలో లీనమవుతాయి. **అహం పూర్తిగా నశించనిదే ఆత్మసాక్షాత్కారం కాదు. ఆత్మ సాక్షాత్కారం పొందిన యోగికి పూర్వజన్మల్లోని కర్మఫలాలు, అహం యొక్క కేంద్రం ఇవి ఏవి మిగలక శాశ్వతుడైన పరమాత్మలో లీనమై, యోగి సిద్ధావస్థకు చేరుతారు. స్థూలదేహము కర్మఫలములను అనుభవిస్తున్నా యోగికి స్థూలదేహ స్పృహలేనపుడు ముక్తావస్థలో ఉంటారు. అట్టి సిద్ధావస్థలోనున్న యోగి ద్వారా పరమాత్మ తమ దివ్యలీలల్ని ప్రకటిస్తుంటారు. కాని ఈ శక్తులు తనవేనని యోగి అహంకరించినట్లయితే పరమాత్మ వాటిని హరించి గర్వభంగం చేస్తారు.**

అవతరించినది మొదలుగా, అనేక లీలల ద్వారా తాము షోడశ కళాప్రపూర్ణులని శ్రీపాదులు తెలియజేసారు. వారు అంతర్ధానమయ్యేంత వరకు 16సంవత్సరాల ప్రాయంలోఉన్న వారివలెనే కనిపించేవారు.

దత్తాత్రేయుని అవతారములు పదహారు. అవి వరుసగా –

యోగిరాజు, అత్రివరదుడు, దిగంబరావధూత శ్రీదత్తాత్రేయుడు, కాలాగ్నిశమనుడు, యోగిజనవల్లభుడు, లీలా విశ్వంభరుడు, సిద్ధరాజు, జ్ఞానసాగరుడు, విశ్వంభరావధూత, మాయాముక్తావధూత, ఆదిగురువు, సంస్కార హీనశివ స్వరూపుడు, దేవదేవుడు, దిగంబరుడు, దత్తావధూత, శ్యామకమలలోచనుడు.

## **క్రియాయోగ విశిష్టత**



శ్రీపాద శ్రీవల్లభులుగా గణేశచతుర్థి నాడు అవతరించడానికి ఖచ్చితంగా 2498 సంవత్సరాలకు పూర్వం శ్రీదత్తులు 25 సంవత్సరాల నవ యువకుని రూపంలో బదరికాశ్రమ యోగులకి దర్శనమిచ్చి, జీవుల పరిణామ క్రమాన్ని వేగిరపరిచే యోగాన్ని బోధించారు. **సహజపరిణామ దశలో లక్ష సంవత్సరాలకు గాని పూర్ణత్వం అందుకోలేని మానసిక చైతన్యం క్రియాయోగం వలన కొద్ది సంవత్సరాలలోనే సిద్ధిస్తుంది. దీని వలన శరీరంలోని కణాలు ప్రాణవాయువుతో నిండి, శరీరంలోని కృష్ణాంగారకము (మాలిన్యము) హరింపబడుతుంది. ఈ క్రియాయోగాన్ని బోధించిన పరమ గురుస్వరూపం శ్రీబాబాజీ.** వీరే ఆది శంకరులకు చండాలరూపంలో కన్పించి జ్ఞానబోధ చేసారు. వీరిప్పటికి సశరీరులై ఉన్నారు.

దత్తులు శ్రీవిశ్వేశ్వర మహాప్రభువువలె సిద్ధులకు గోచరించినపుడు వారితో 2498 సంవత్సరముల తరువాత శ్రీపీఠికాపురములో శ్రీపాద శ్రీవల్లభ రూపముతో అవతరిస్తామని, వారి అంశావతారములు పన్నెండుసార్లు అవతరిస్తాయని, 12వ అంశావతారమైన శ్రీరామలాల మహాప్రభువు వాసుదేవానందసరస్వతి అనే యతికి నిర్వికల్ప సమాధి స్థితిని అనుగ్రహిస్తారని, వారు పీఠికాపురంలో శ్రీపాదుల పాదుకలను ప్రతిష్ఠించడానికి విఫల ప్రయత్నం చేస్తారని, ఆ యోగం వేరొకరికి అనుగ్రహింపబడిందని సెలవిచ్చారు.

## **పాదుకల మహిమ**

అపుడు నేను, "అయ్యా! పాదుకలను ప్రతిష్ఠించుట అనే చిన్న కార్యానికి కూడా శతాబ్దాలవరకు వేచి ఉండాలా?" అని నా సందేహాన్ని

వెలిబుచ్చాను. తిరుమలదాసు ఇలా ప్రత్యుత్తరం ఇచ్చారు, “నాయనా! అదే శ్రీపాదులవారి చమత్కారం. వారి ఆజ్ఞలేనిదే చిన్న ఆకు కూడ కదలలేదు. వారిని ఆరాధించాలంటే వారి పాదుకలను ఆరాధిస్తే చాలు. వారి పాదుకల చెంత నాలుగు వేదములు నాలుగు శునకములై నిలిచి ఉన్నాయి. అన్ని అపవిత్రతలను దూరం చేసే పవిత్ర వేదాలే అపవిత్ర శునకములై వారి పాదుకల వద్ద ఉంటున్నాయి. అటువంటి వారి పవిత్రతను ఊహించడం దేవతలకే అసాధ్యం, కాగా ఇక సామాన్యులైన ఈ మానవులెంత?

## శ్రీపాదుల జన్మ (దిన) రహస్యం

పూర్వము వామనావతార సమకాలికులయిన వామదేవ మహర్షి జన్మించినపుడు మాతృగర్భం నుండి తల ఒకసారి బైటికి పెట్టి పరిసరాలను చూసి తిరిగి గర్భస్థులయ్యారు. దేవతలు, ఋషులు ప్రార్థించిన తరువాత మరల జన్మించారు. వారు ఆజన్మ బ్రహ్మజ్ఞానులు. అలాగే శ్రీపాదులు ఆజన్మద్విజులు, బ్రహ్మజ్ఞాన సంపన్నులు. కాబట్టి ఈ అవతారంలో వారికి గురువనే వ్యక్తియే లేరు. వారిది త్రిమూర్తులకి అతీతమయిన ఒకానొక ప్రత్యేక తత్త్వమని సూచించడానికి చతుర్థినాడు, సృష్టియందలి ప్రవృత్తి నివృత్తి గణాలకు అధిపతి అయిన గణేశతత్త్వాన్ని సూచించడానికి గణేశచతుర్థినాడు అవతరించారు. చిత్తానక్షత్ర అధిపతి అంగారకుడు. అంగారకుడు పాపస్థుడయితే అమంగళాలు కల్గుతాయి. అలాంటి అమంగళాలను పరిహరించి సర్వ శుభాలను ప్రసాదించడానికి చిత్తా నక్షత్రాన, తాను సాక్షాత్తు ధర్మశాస్త అయిన అయ్యప్పస్వామినని నిరూపించడానికి తులారాశిలో జన్మించారు. గ్రహాలకు రాజైన సూర్యుని యొక్క సింహలగ్నంలో జన్మించి తాను విశ్వప్రభువునని తెలియచేసారు. ధర్మసంకటం ఏర్పడినపుడు వారిని ప్రార్థించినట్లయితే సరియైన ధర్మమార్గం వ్యక్తమవుతుంది.

**శ్రీదత్తుల నుండి త్రిమూర్తులు, వారి నుండి ముక్కోటి దేవతలు, వారి నుండి 33కోట్ల దేవతలు వచ్చారు. అందువల్ల దత్త నామ స్మరణం చేసినట్లయితే సమస్త దేవతా స్మరణ చేసినంత ఫలం సిద్ధిస్తుంది.** వారి బ్రహ్మ ముఖమునకు ఋషిపూజ, విష్ణు ముఖమునకు సత్యనారాయణ వ్రతము మరియు విష్ణు సహస్రనామము, రుద్ర ముఖమునకు రుద్రాభిషేకము చేయాలి. సృష్టిలోని సమస్త స్త్రీదేవతా శక్తులు శ్రీపాదుల వామభాగంలో, పురుషదేవతాశక్తులు కుడిభాగంలో ఉన్నవి. తిరుపతిలో ఏడుకొండలపై వెల సిన వేంకటేశ్వరుడు శ్రీపాద శ్రీవల్లభులు అభిన్న మూర్తులు."

అపుడు నేను, "అయ్యా! శ్రీపాదులు వర్ణాశ్రమ ధర్మాచరణ విషయమై కొంత భిన్నంగా చెప్పుతున్నట్లు అనిపిస్తున్నది. నా సందేహ నివృత్తి చేయవల సింది," అని కోరాను.

## జాతులు - కర్మలు - ఫలితాలు

"నాయనా! సద్బ్రాహ్మణుడు బ్రహ్మజ్ఞానాన్ని అన్వేషిస్తూ తన ధర్మాల ను ఆచరిస్తూ జీవితం గడపాలి. వ్యసనపరుడు అయినట్లయితే అతనిలో బ్రాహ్మణ తేజస్సు లోపిస్తుంది. జీవకణాలు సహితము మార్పులు పొంది చండాల సమానుడు అవుతాడు. క్షత్రియుడు బ్రహ్మజ్ఞాన కాంక్షుడై నిరంతర తపోనిష్ఠలో ఉండి విశ్వామిత్రునిలా బ్రాహ్మణత్వాన్ని పొందవచ్చును. క్షత్రియుడు శాంతరస ప్రధానమైన వాణిజ్యవృత్తి యందు అనురక్తుడై వ్యవహరించినట్లయితే మనస్సు, బుద్ధి, శరీరం అనేక మార్పులకు లోనై వైశ్యత్వాన్ని పొందుతాడు. బ్రాహ్మణుడు క్షత్రియవృత్తి చేపట్టినట్లయితే పరశురాముడు, ద్రోణ, కృపాచార్యులవలె అవుతాడు. వైశ్య కుసుమశ్రేష్ఠి క్షాత్రవృత్తిని చేపట్టడం వల్ల రాజు కాలేదా? శూద్రుడనైన నేను బ్రహ్మజ్ఞానాన్ని పొందలేదా? శిక్షలు, ఫలితాలు జాతిని బట్టి కాక కర్మను బట్టే ఉంటాయి.

శంకరభట్టూ! నీవు మా ఇంటిలో ఆతిథ్యం స్వీకరిస్తున్నావు. మా

ఇంటి భోజనం బ్రాహ్మణ భోజనమే. నిరంతరం శ్రీపాదుల స్మరణలోను, ధ్యాసలోను ఉండే ఈ పరిసర ప్రాంగణం అంతా శుభప్రదములు, పవిత్రములు అయిన దివ్యస్పందనలతో నిండి ఉంది. జన్మతః బ్రాహ్మణుడే అయినా నరసావధానులు ఇంట్లో భౌతిక, ఆధ్యాత్మిక, మానసిక స్పందనలు అన్నికూడా విషపూరితాలై ఉంటాయి. అందువల్ల కలుషభరితమైన వాయుమండలంతో నిండి ఉన్న ఆ బ్రాహ్మణ గృహంలో శ్రీపాదులు ఆతిథ్యం స్వీకరించలేదు. జీవులకు తమతమ కర్మలని అనుసరించి పరి ణామ లేదా విపరిణామ క్రమంలో జన్మించడానికి కులాలు ఏర్పడ్డాయి. జాన్ జర్మనీ దేశస్థుడే అయినా, బ్రహ్మజ్ఞానాన్వేషి అయినందువల్ల పరిణామక్రమ చివరిదశలో శ్రీపాదుల దర్శన భాగ్యమై వారి అమోఘ అనుగ్రహాన్ని పొందగలిగాడు.

## జాతి - ఆత్మల సంబంధం

అయ్యా! ప్రతి జాతికి ఆత్మ ఉంటుందా?" అని నేను నా సందేహాన్ని ప్రకటించాను.

తిరుమలదాసు ఇలా వివరించారు, "ప్రతి జాతికి ఒక ఆత్మ ఉంటుంది, అది ఒక మానసిక పదార్థం, దివ్యాత్మ అయిన శ్రీదత్తుని నుండి వెలువడిన ఒక భాగము.

'జాతి' అంటే ఆ జాతిలో జన్మించిన వ్యక్తుల సమూహం కాదు. ఆ సామూహిక వ్యక్తుల యొక్క శక్తి సామర్థ్యాలు, గుణగణాలు అంతర్లీనమై ఉన్న ఒక మానసిక చైతన్య పదార్థం. అలాగే ప్రతి పల్లెకు, పట్టణానికి ఒక ఆత్మ ఉంటుంది. మనం నివసించే భూమి యొక్క ఆత్మను మనము భూమాత అంటున్నాం."

"అయితే పార్వతీదేవిని హిమవన్నగపు కుమార్తె అనడంలో కూడా అంతరార్థం ఇదేనా?" అని నేను ప్రశ్నించాను. "భూమాత యొక్క ఆత్మ

అంటే పరమాత్మనుండి వెలువడిన ఒకానొక మనస్సంబంధము కల్గిన మహాశక్తి. ఆవిధంగానే హిమవన్నగం పైన అభిమానంకల దేవతాశక్తికి హిమవంతుడని పేరు. ఆ హిమవంతుడి కుమార్తె హైమవతి. అలాగే యమధర్మరాజు అంటే జీవుల శుభాశుభ కర్మలను బట్టి తీర్పు చెప్పి పాపుల ను శిక్షించు పవిత్రాత్మ అని అర్థం."

## పంచకన్యల వివరణ

అపుడు నేను, "అయ్యా! అహల్యా, ద్రౌపదీ, సీతా, తారా, మండోదరీ, పంచకన్యాం పఠేన్నిత్యం మహాపాతక నాశనమ్," అనే ఉక్తిని వివరించమని ప్రార్థించాను. తిరుమలదాసు ఇలా వివరించారు, "అహల్యను మోహించిన దేవేంద్రుడు ఆమెను మాయోపాయంతో పొందాలనుకొని ఒకనాడు కోడిలా అరిచాడు. గౌతముడు వేకువఝాము అయిందని భ్రమించి అనుష్ఠానం కోసం వెళ్ళాడు. దేవేంద్రుడు మహాపతివ్రత అయిన అహల్యను తాకలేడు. తీవ్ర వ్యామోహంలో ఉన్న దేవేంద్రుని తీవ్ర మనశ్శక్తి నుంచి వేరొక అహల్య రూపం ఉద్భవించింది. మాయా అహల్యతో సంగమించిన ఇంద్రుని చూసి ఉగ్రుడైన గౌతముడు వారిద్దరిని శపించాడు. "ఓ తెలివి తక్కువ మునీ! ఎంత పని చేసావు?" అని అహల్య బాధ పడింది. ఆధ్యాత్మికంగా అహల్య పరిణతి గౌతముని కంటె ఎక్కువగా ఉండటం వల్ల, ఆమె పలికిన వాక్కు సత్యమై గౌతముడు 12 సంవత్సరాలు మన:స్థిమితము కోల్పోయి శివార్చనతో మళ్ళీ స్వస్థుడు అయ్యాడు. అహల్య మనశ్శక్తితోపాటు శరీరము కూడా జడత్వాన్ని పొంది శ్రీరామ పాదధూళితో శాపవిమోచనం అయింది. ఇట్లు అహల్య పతివ్రతామ తల్లి.

శాపగ్రస్తుడైన ఇంద్రుడు పంచపాండవులవలె జన్మించాడు. అయిదు రూపాలు ఉన్నా, అయిదు మనసులు ఉన్నా వాటికి ఆధారభూతమైన ఆత్మ ఒకటే. శచీదేవి ద్రౌపది వలె అయోనిజగా ఆవిర్భవించినది.

పంచపాండవుల ఆత్మ ఒకటే అయినందువల్ల, అలా ఉన్నప్పటికి ద్రౌపది శయ్యా సుఖమునిచ్చినది అర్జునునకు మాత్రమే అయినందునను ద్రౌపది పతివ్రతామ తల్లి. అసలైన సీతను అగ్ని తన గర్భమున దాచుకొన్నాడు. సీత అగ్నిప్రవేశం చేసినపుడు ఇద్దరు సీతలు బయటికి వచ్చారు. లంకలో ఉన్నది మాయా సీతయే. కనుక సీత మహా పతివ్రతయే.

పన్నెండు రాశులలోని 27నక్షత్రాల అభిమానదేవత తారాదేవి. నిండు యౌవనవతియైన తారాదేవిని వృద్ధుడు, గురుగ్రహ అధిపతియైన బృహస్పతి వివాహం చేసుకున్నా, భర్తృధర్మాన్ని నిర్వహించక, వివాహ సందర్భంలో చేసిన ప్రమాణాలను ఉల్లంఘించిన వాడయ్యాడు. తారాదేవికి బృహస్పతిపై ఏనాడు భర్తృభావన కలగలేదు. అట్టి భావనను కల్గించుట భర్త యొక్క బాధ్యత. తారాదేవి మనసులో చంద్ర రూపం నిల్చి ఉండటం వల్ల ఆమె శరీరంలోని జీవాణువులు ఆమె మనః ప్రవృత్తికి తగ్గట్టుగా మారిపోయాయి. అలాంటి మానసిక శారీరిక పరివర్తన చెందిన తారాదేవి బృహస్పతి వివాహమాడిన తారాదేవి ఎంతమాత్రం కాదు. అందువల్ల తారాచంద్రుల కలయిక ధర్మవిరుద్ధం కాదు. మరియు సృష్టి నియమం ప్రకారం 27నక్షత్రాలను చుట్టి రావడం చంద్రుని ధర్మము, గురుగ్రహ ధర్మము కాదు. ధర్మ సూక్ష్మాన్ని అనుసరించి తారాదేవి మహాపతివ్రత.

మండోదరి ఒకానొక జన్మలో పురుషుడై ఉండగా ఆమెకు ముగ్గురు భార్యలు–చంచల స్వభావురాలు, దుష్ట ప్రవృత్తి కలది, మృదు స్వభావము కలది. వీరే వరుసగా వాలి, రావణ, విభీషణులవలె జన్మించగా మండోదరి వారి భార్య అయినది. వాలికి పత్నిగా ఉన్నపుడు, వాలి మరణానంతరం, రావణుని భార్యగా ఉన్నపుడు, రావణ మరణానంతరం, విభీషణుని పట్టమహిషగా ఉన్నపుడు ఆమెలోని జీవాణువులు వేర్వేరుగా ఉండటం వల్ల మండోదరి కూడా మహా పతివ్రత.”

## జన్మ- కర్మల చక్రవలయం

"బహుభార్యాత్వము కాని బహుభర్తృత్వము కాని గర్హనీయముకాదా?" అని నేను ప్రశ్నించాను. "నీవు చెప్పేది అక్షరాలా నిజం. ఒక పురుషుడు నలుగురయిదుగురు స్త్రీలను వివాహం చేసుకొన్నట్లయితే మరుజన్మలో అతను స్త్రీగాను వీరు పురుషులుగాను జన్మించి కామవాసన అంతరించక పోయినట్లయితే ఆ స్త్రీని అనుభవిస్తారు. అది వ్యభిచారం అవుతుంది. వీరు నలుగురు వేర్వేరు జన్మలో ఆమెకు భర్తగా జన్మించిన యెడల దోషం లేదు. స్త్రీజన్మలో స్త్రీ ధర్మాన్ని, పురుషజన్మలో పురుష ధర్మాన్ని నిర్వర్తించాలి. బ్రాహ్మణునిగా జన్మించినవానికి మాంసము నిషిద్ధము. అయిననూ మేకను వధించి పదిమందితో కలిసి దానిని తిన్నట్లయితే తన ప్రాణం పోయే సమయంలో బాధని అనుభవించే మేక, దానికి కారణమైన మానవుని నిందిస్తూ ఆ ధ్యాసలో మానవ జన్మ ఎత్తుతుంది. వీరు మేక జన్మని ఎత్తి ఉంటారు. మానవ జన్మ ఎత్తిన మేక సాత్వికమై, పూర్వజన్మలో తనను తిన్న మనిషే ఈ మేక అయినప్పటికి క్షమించి వదిలినట్లయితే కర్మచక్రం అంతటితో నిలిచిపోతుంది. లేదా ఈ రకంగా బంధంలో ఇరుక్కున్న వీళ్ళంతా మళ్ళీమళ్ళీ జన్మలని ఎత్తాల్సే ఉంటుంది. నాయనా! వాయుమండలములో బాధామయ, ఆనందమయ స్పందనలు నిక్షిప్తమై ఉంటాయి. సత్కర్మల వల్ల ఆనందమయ స్పందనలు, దుష్కర్మల వలన దుఃఖమయ స్పందనలు ఉత్పన్నం అవుతాయి, ఆకర్షింపబడుతాయి.

పీఠికాపురవాసుల సాంఘాతిక పుణ్యము, పాపము ఒక్కసారి ఫలించి శ్రీపాదుల జననానికి కారణం అయింది. దత్తునిగా గ్రహించినవారు శుభఫలితాలను పొందగా, పాప జనులు, అహంకార ప్రేరితులు అశుభఫలితాలు పొందారు. మనసా, వాచా, కర్మణా శ్రీదత్త నామస్మరణ చేసినవారికి సర్వ మనోరథములు అయాచితంగా, అప్రయత్నంగా

సిద్ధించుతాయి. శ్రీపాదులను నిందించే వారికి విచిత్ర పద్ధతిలో విఘ్నములు, అనిష్టములు జరుగుతుంటాయి.

## విద్యారణ్యుల ఆవిర్భావం

పీఠికాపురానికి ఒక విచిత్ర సాధువు వచ్చారు. వారి తిట్లు దీవెనలు కాగా, దీవెనలు శాపనార్థాల్లా అవతలి వ్యక్తి పుణ్యఫలాలను క్షీణింపచేసేవి. మాయమయిన స్వయంభూవిగ్రహము గూర్చి వారిని ప్రశ్నిస్తే అన్ని పుణ్యక్షేత్రాలలోను స్నానం చేసి ప్రస్తుతం అది ఏలానదిలో ఉన్నదని చెప్పారు. ఏలానదిలో దొరికిన ఆ విగ్రహాన్ని వారి సలహాపై సుమతీ అప్పల రాజశర్మలతో మళ్ళీ ఆలయంలో ప్రతిష్ఠింప జేసారు. అది పెద్ద ఉత్సవంలా జరిగింది.

ఆ సిద్ధులు బాపనార్యుల ఆహ్వానంపై వారి ఇంటికి వచ్చి రెండుసంవత్సరాల ప్రాయంలో ఉన్న శ్రీపాదులను చూసి, ఆధ్యాత్మిక ఆనంద ప్రవాహంలో ఓలలాడారు. "మాధవా! నాకు 16ఏళ్ళు వచ్చినపుడు, హరి హర బుక్కరాయలకు నీవు అండగా నిలబడి వారిచే సామ్రాజ్య స్థాపన చేయించి విద్యారణ్యమహర్షిగా ప్రఖ్యాతి పొందుతావు. తిరిగి నీ సోదరుని ఇంట రాబోవు శతాబ్దంలో గోవిందదీక్షితులుగా జన్మించి తంజావూరు మహామంత్రి పదవి నిర్వహిస్తావు . తిరిగి కృష్ణసరస్వతి పేరుతో జన్మించి నా నరసింహసరస్వతి అవతారంలో నాకు కాశీలో సన్యాసదీక్షను ఇస్తావు," అని చెప్పి శ్రీపాదులు వారికి నమస్కరించారు. ఇంతవరకు చెప్పి, "నాయనా! రేపు మరి కొన్ని విషయాలు చెప్తాను," అని తిరుమలదాసు ఆనాటి వృత్తాంతాన్ని ముగించారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

# 9 వ అధ్యాయం

# కర్మఫలాలు - నివారణోపాయాలు

# (శ్రీపాదులకు రెండుపళ్ళు)

## గురుసార్వభౌముల లీలలు

ఆ మరునాడు గురువారం. సూర్యోదయ సమయాన మేమిద్దరము గదిలో ధ్యానస్థులమైనాము. గదిలోకి ప్రసరిస్తున్న సూర్యకాంతి కిరణాలలో శ్రీపాదులను క్షణకాలం దర్శించాము. వారు 16 సంవత్సరాల వయసులో అద్భుతకాంతులను విరజిమ్ముతూ మా ఇరువురికి కన్పించారు. వారికి నైవేద్యంగా ఉంచిన శనగలు ఆ కిరణ ప్రసారంతో లోహపు ముక్కలుగా మారిపోయాయి. శ్రీపాదుల దర్శనం అనుగ్రహ సూచకం అయితే లోహపు ఖండాలు ఆగ్రహ సూచకమా? అని మథనపడి తిరుమలదాసుకు నా బాధను తెలిపాను. తిరుమలదాసు, "శ్రీపాదులవారు శ్రీదత్తులేనా? అనే చిన్న సందేహం నీ మనసున బీజరూపంలో ఉన్నది. **లోహపు శనగలను తినుటకు యోగ్యమైన శనగలుగా మార్చిన అనసూయా మాత పుత్రుడను, దత్తుడను నేనే అని తెలియచేయడానికి** ఇలా చేసారు. ఇదే కాక నీ జాతకంలో గురుడు రోగస్థానమందు ఉండటం వలన నీకు రాబోయే విపత్తులను బీజరూపంలోనే మొలకెత్తుటకు వీలులేని లోహపు ఖండాలుగా మార్చివేసానని చెప్పడానికి ఇలా చేసారు," అని నా సందేహ నివృత్తి చేసి శ్రీపాదుల తత్త్వం విశ్లేషించారు. **"శ్రీచరణుల దివ్య మానసమందు వీక్షించలేని జీవియన్నది ఈ సృష్టిలోనే లేదు. మానవుడుగాని, మరే ఇతర ప్రాణికాని చేసే చిన్న ప్రార్థన అయినా సరే అసంఖ్యాకములైన వారి తేజోపుంజాలను చేరి తీరవలసిందే. అనేక కోటి బ్రహ్మాండాలలో వెలుగుతున్న కోటానుకోట్ల గ్రహ నక్షత్రాల సంయుక్త ప్రకాశం కూడా**

**వారి తేజస్సు ముందు సూర్యుని ముందు దివిటీలా వెలాతెలాబోతూ ఉంటుంది.** వారి అతిమానస వేగం (Speed of Super mind) మహా ప్రచండం, ఊహాతీతం. కాంతి వేగంకంటె కొన్ని కోట్లరెట్లు ఎక్కువ. కాబట్టే వారు ప్రతి క్షణం కోట్లకొలది ప్రార్థనలను స్వీకరించి ధర్మబద్ధమైన ప్రతి ప్రార్థనకు స్పందించి (responds), బాధా నివారణ చేస్తారు.

## శ్రీపాదుల దివ్యస్వరూపం

మానవుడికి దైవం వైపు మొగ్గడం అనివార్యం. దైవం తన అనంత పరిమితులను తగ్గించుకుంటూ క్రింద స్థాయిలకి దిగి వస్తారు. దీనినే 'అవతరణ' అంటారు. సత్య, జ్ఞానానంత స్వరూపులైన శ్రీపాదులు అనేక దివ్య సత్యాలను సృష్టిలో ప్రతిష్ఠించే సంకల్పంతో అవతరించారు. ఒకసారి సత్యం ప్రతిష్ఠింపబడినట్లయితే అది స్వతస్సిద్ధంగా జరిగిపోతూ ఉంటుంది. మనం తినే ఆహారం మన ప్రమేయం లేకుండానే స్వతస్సిద్ధంగా జీర్ణం అవుతుంది. అది మన శరీరానికి నిర్ణయింపబడిన విధి. దానికి సంబంధించిన సత్యం మన శరీరంలో ప్రతిష్ఠింపబడింది. సూర్యాస్తమయాలు, గ్రహ, నక్షత్రాది గతులు సత్య ప్రతిష్ఠాపన వల్లనే సహజంగా జరిగిపోయే పనులు.

## సందేహ నివృత్తి

ఇలా ప్రకృతిలోని చర్యలు, ప్రతిచర్యలు అనుల్లంఘనీయమైన శాసనానికి లోబడి వ్యవహరిస్తుండగా సర్వజ్ఞుడైన ప్రభువు మానవుడి మీద దయతో, యుగధర్మాన్ని, మానవుని శక్తి యుక్తులను ఆధారంగా చేసుకొని వారి విధులను సులభం చేసారు. **మూడు అహోరాత్రుళ్ళు నిరంతరం శ్రీపాదులను ధ్యానం చేసిన వాళ్ళకు వారు సశరీరులై దర్శనం ఇస్తారు. మానవుడు పతనం అవడానికి లక్ష మార్గాలు ఉంటే వానిని ఉద్ధరించడానికి దైవం పది లక్షల మార్గాలను అనుసరిస్తారు.** కలియుగ హిరణ్యకశ్యపుల

అహంకారాన్ని అణచడానికి, ప్రహ్లాదునివంటి భక్తులని కాపాడటానికి దత్తప్రభువు నృసింహసరస్వతిగా అవతరిస్తారు." తిరుమలదాసు ఇలా వివరిస్తుండగా భవిష్యత్తులో ప్రజలు ఎటువంటి పత్రం మీద వ్రాస్తారు? శ్రీకృష్ణుని నిర్యాణం ఎపుడు జరిగింది? కలియుగం ఎపుడు ఆరంభమైంది? అనే ప్రశ్నలు నా మనసులో తిరగసాగాయి. భవిష్యత్తులో జనులు వ్యవహరించే కాలగణన ప్రకారం, భవిష్యత్తులో జనులు ఉపయోగించే పత్రంపై శ్రీపాదులు నా ప్రశ్నలకు సమాధానాలు వ్రాసి చూపించినట్లయితే శ్రీపాదులు దత్తప్రభువే అని నేను నమ్ముతానని మనసులో అనుకున్నాను. ఇంతలో అకస్మాత్తుగా తిరుమలదాసుకి మాట్లాడే శక్తి పూర్తిగా పోయింది, ఎంత ప్రయత్నించినా నోటినుండి ఒక్క శబ్దం రావటం లేదు. నాకు ఏదో పెద్ద భయంకర ధ్వని వినిపించి, తరువాత ఏ చిన్న ధ్వని కూడా వినలేని అశక్తుడను అయ్యాను.

## ఇందుగలడందులేడని సందేహము వలదు

ప్రభువులని సందేహించినందుకు ఇది ప్రతిఫలమా? అని భయం వేసింది. లోహపు శనగలు "శ్రీపాదరాజం శరణం ప్రపద్యే," అనే ఆకారంలో నిలబడ్డాయి. వాటిపై మొదట చిన్న దీర్ఘ చతురస్రాకారపు పత్రం కనిపించి, చూస్తూ ఉండగానే అది పెద్దది అయ్యి దానిపై నలుపు రంగులో తెలుగు లిపిలో ముత్యాలొలికే అక్షరాలతో ఈ విధంగా వ్రాసి ఉంది, **"శ్రీకృష్ణ నిర్యాణం క్రీస్తు పూర్వం 3102 సంవత్సరం, ఫిబ్రవరి నెల 18వ తేదీన రాత్రి 2 గంటల 27 నిమిషముల 30 సెకండ్లకు జరిగింది. శ్రీకృష్ణ నిర్యాణానంతరం కలి ప్రవేశించింది."** నాకు ముచ్చెమటలు పోయసాగాయి. శ్రీపాదులు అదృశ్యరూపంలో ఇక్కడే ఉన్నారన్నది రూఢి అయింది. వారిని శంకించినందుకు వారు నరసింహావతారం ఎత్తి నన్ను సంహరించినా ఆశ్చర్యపడనక్కర లేదు అని తోచింది, లేదా

చాకలి తిరుమలదాసుకు నన్ను అప్పగిస్తేచాలు, నన్ను చాకలి బండపై ఉతికి, పిండి, ఆరవేయడానికి కూడా ఆతడు వెనుకాడడు. హా! ఇక నా కురువపురయాత్ర కల్ల. శ్రీపాదా! నీవే శరణు! ప్రభో! నన్ను మన్నించు! అని మనసులో ఎన్నోవిధాలుగా పరితపించి, ప్రాధేయపడ్డాను. తిరుమలదాసు ముఖం బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతూ ఉండటం చూసి విశుద్ధ మనస్కుడైన అతడు బ్రాహ్మణుడని, శంకచిత్తుడను, మలినమనస్కుడను అయిన నేనే చాకలిని అని నిర్ధారణ చేసుకున్నాను. ఇంతలో లోహపు శనగలు తిరిగి సాధారణ శనగలుగా మారడంతో నా మనసు కొద్దిగా కుదుటపడింది.

## కర్మవిధ్వంసన విధానం



దేహపతనానంతరం శ్రీపాదుల ఆజ్ఞ మేరకు తాను మరాఠా దేశంలో గాడ్గే మహారాజ్ పేరున రజక కులమున జన్మిస్తానని, ప్రభువు ఆ సమయంలో సమర్థ సద్గురు సాయిబాబా అవతారంలో ఉంటారని, వారి సంపూర్ణ అనుగ్రహం తనపై ఉంటుందని తిరుమలదాసు చెప్పాడు. అపుడు నేను, "శ్రీకృష్ణుడు భగవద్గీతలో కర్మ ఫలములు అనుభవించే తీరాలి అని సెలవిచ్చారు కదా, మరి శ్రీచరణులు నియమోల్లంఘున కాకుండా కర్మధ్వంసం ఎలా చేస్తారు?" అని నా సందేహం వ్యక్త పరిచాను. "శ్రీకృష్ణుడు చెప్పినట్లు కర్మ ఫలాలను అవశ్యం అనుభవించ వలసిందే. కాని, కేవలం జాగ్రదవస్థలోనే అనుభవించాలనే నియమం లేదు. స్వప్నావస్థలోనో, లేదా మానసిక క్షోభ వల్లనో, శారీరికంగా కొన్ని సంవత్సరాలు అనుభవించవలసిన కర్మను శ్రీపాదులు కొద్ది ఘడియలలో అనుభవింప చేస్తారు. యోగులకు,

సత్పురుషులకు దాన ధర్మాలు చేయడం వల్ల కర్మ కొంత క్షయం అవుతుంది. దేవతామూర్తులు పుణ్యమూర్తులు. వాటికి కైంకర్యం చేయటం వలన భక్తుల పాపకర్మలు వాటిలో చేరి ఆ దేవతా మూర్తుల పుణ్యం వీరికి ప్రాప్తిస్తుంది. సద్గురువుని సేవించడటం వలన శిష్యుల పాపకర్మలు వాళ్ళు గ్రహించి తమ తపఃఫలాన్ని శిష్యులకు ధారబోస్తారు. మొత్తం మీద పాప ఫలాన్ని ఎవరో ఒకరు అనుభవించ వలసినదే. దేవతామూర్తులు, అవతార పురుషులు అగ్ని స్వరూపులు కనుక వాళ్ళు తాము స్వీకరించిన పాప కర్మల ను దగ్ధం చేసేస్తారు. భక్తుల ఆర్తి, భక్తి, శరణాగతి ఎంత తీవ్రంగా ఉంటే బదలాయింపు అంత తీవ్ర స్థాయిలో జరుగుతుంది. సాక్షాత్తు పరమాత్మ అయిన శ్రీపాదులకు కూడా కర్మఫలం అనుభవింపక తప్పలేదు," అంటూ ఆ విషయాన్ని వివరించసాగారు:

## శ్రీపాదుల పాల సమస్య

"శ్రీపాదులకు పుట్టినప్పటి నుండి పాల సమస్యే. తల్లి వద్ద తగినంత పాలు లేవు. వారి ఇంటనున్న గోవు ఒక విచిత్ర జీవి. కాలాగ్నిశమనదత్తుడి నైవేద్యానికి సరిపడే పాలు మాత్రం ఇచ్చేది. కాని దూడకు పాలు సమృద్ధిగా ఉండేవి. అయితే శ్రీపాదులకి మాత్రం పాలు ఉండేవి కావు. దత్తుడికి నివేదించిన తరువాత ఆ పాలు శ్రీపాదులకు ఇచ్చేవారు. ఒక్కొక్క మారు శ్రీపాదులు పూజ గదిలో జొరబడి నైవేద్యం అర్పించడానికి ముందే ఆ పాలు త్రాగేవారు. అప్పుడు బెల్లం మాత్రం నైవేద్యం పెట్టి ఆ దంపతులు పస్తు ఉండేవారు. శ్రేష్ఠిగారు, వర్మగారు క్షీర సమృద్ధి గల గోవును ఇవ్వడానికి ఎంత ప్రయత్నించినా రాజశర్మ అంగీకరించలేదు. శ్రీపాదుల వంటి పుత్రుడికి కడుపు నిండుగా పాలు కూడా ఇవ్వలేని స్థితి చాలా బాధాకరంగా ఉందని, తన పుట్టింటి వాళ్ళు నిష్ఠాగరిష్ఠులు. కాబట్టి వారినుండి గోవును స్వీకరింపవచ్చునని సుమతి

ఒకరోజు భర్తతో అన్నది. దానికి  శర్మ, 'ధర్మశాస్త్ర ప్రకారం ఆమోదం లేనిదే స్వీకరింపలేనని, శ్రీపాదులు నిజంగా దత్తులే అయినట్లయితే తన సోదరుల అంగవైకల్యాన్ని పోగొట్టాలి కదా!  ఇక పాల విషయంలో కూడా నీకైనా లేదా గోవుకైనా క్షీర సమృద్ధిని కలిగించక నా నియమానికి ఉల్లంఘన జరిగే విధంగా పరిస్థితులను ఎందుకు కల్పించాలి?' అని ఎదురు ప్రశ్నలు వేసారు. ఈ విషయమే సుమతి తన తండ్రితో సంప్రదించగా, "సోదరుల అంగవైకల్యం పోగొట్టినా, క్షీర సమృద్ధి కలిగించినా శ్రీపాదులకు మీతో ఋణానుబంధం తీరిపోతుంది. ఋణానుబంధం తీరిన శ్రీపాదుడు మీ యింట్లో ఉండక జగద్గురువై లోకాన్ని  ఉద్ధరించడానికి వెళ్ళిపోతాడు. కాబట్టి కొంతకాలం ఓపిక వహించు. దత్తుడు సృష్టించిన సమస్య దత్తులే పరిష్కరిస్తారు," అని బాపనార్యులు సలహా ఇచ్చారని చెప్పిన తిరుమలదాసు దీనికి సంబంధించిన కర్మపరమైన కారణాన్ని కూడా వివరించారు:

## అవతారపురుషులూ కర్మ అనుభవించవలసినదే

''రాజశర్మ కుటుంబానికి అయినవిల్లి గ్రామాధిపత్యం ఉండేది. జమిందారు ఆజ్ఞను అనుసరించి రాజశర్మ పితామహులు తమ ఇష్టాయిష్టములకు వ్యతిరేకంగా, కొన్నిమార్లు హింసా పద్ధతుల ద్వారా రైతుల వద్దనుండి బలవంతంగా పన్ను వసూలు చేయవలసి వచ్చేది. అది వారి ధర్మబద్ధ కర్తవ్యం అయినా, ఈ స్వల్ప పాపకర్మ ఫలాన్ని శ్రీపాదులకు కూడా అనుభవించ వలసి వచ్చింది. అవతార పురుషులే అయినా కర్మఫలాన్ని తానూ అనుభవించి మనకు మార్గ దర్శకత్వం వహించారు.

## పాపయ్యశాస్త్రి వృత్తాంతం

ఈ పాల సమస్య తీర్చడానికి వర్మ, శ్రేష్ఠిగార్లు ఇద్దరు ఒక ఉపాయాన్ని పన్నారు. శ్రేష్ఠిగారు ఒక గోవును వర్మగారి వద్ద నుండి కొన్నారు. ఆ ధనాన్ని

వర్మగారు భద్రంగా ఉంచారు. రాజశర్మ వర్మగారి కుటుంబ పురోహితులు. కనుక ఒకమారు రాజశర్మ వారి యింట పూజాదికాలు చేసిన తర్వాత వర్మగారు ఆ ధనం మొత్తం సంభావనలా శర్మకు ఇచ్చారు. సాధారణంగా ఇచ్చే మొత్తం కంటె చాలా రెట్లు ఎక్కువగా ఉండటంతో రాజశర్మ ఆ ధనాన్ని నిరాకరించారు. క్షత్రియ వంశంలో పుట్టి, ఒకరికి ఇచ్చిన ధనం తిరిగి వెనక్కి తీసుకోనని వర్మగారి వాదం. ఈ తగాదా బాపనార్యుల ఆధ్వర్యంలో బ్రాహ్మణ పరిషత్తు ముందుకు తీసికొని రాబడింది. రాజశర్మ నిరాకరించిన మొత్తం సొమ్మును ఎవరు తీసుకోవాలి? అనే చర్చలో పాపయ్యశాస్త్రి అనే తరుణ వయస్కుడైన బ్రాహ్మణుడు, 'శ్రీపాదులు నిజంగానే దత్తుడు అయినట్లయితే సోదరుల అంగవైకల్యం ఎందుకు పోగొట్టలేదు? ఇటువంటి విచిత్ర పాల సమస్య ఎందుకు తల ఎత్తింది?' అని శ్రీపాదులను విమర్శిస్తూ తాను దత్త భక్తుడనని, శ్వేతార్కరక్షను గురువు నుండి పొందిన వాడినని, తాను ఏ దానానికైనా అర్హుడనే అని ఘంటాపథంగా చెప్పడంతో బాపనార్యులు ఆ మొత్తాన్ని బ్రాహ్మణ పరిషత్తు అంగీకారంతో అతనికే ఇచ్చారు. రొక్కం తీసుకొని శాస్త్రి ఇంటికి వచ్చేసరికి ఇంటి దగ్గర మేనమామ ఇతనికై వేచి ఉన్నారు. మాటల సందర్భంలో సంవత్సరానికి ఒకసారి మాత్రమే తాను అన్నం తింటానని, త్వరలో కలుసుకొందాం అని చెప్పి మేనమామ వెళ్ళిపోయారు. తరువాత భార్య వచ్చి, "స్వామీ! వీరు గత సంవత్సరం మరణించిన మీ మేనమామలా ఉన్నారే," అన్నది. వెంటనే శాస్త్రి గుండె జారింది. తాను చూసింది మేనమామ ప్రేతాత్మనా? దత్తుడు తనపై ఆగ్రహించారా? వెళ్తూ వెళ్తూ మేనమామ త్వరలో కలుసుకొందాం అన్నారు. అంటే తాను త్వరలో మరణించబోతున్నాడా? మనసు బరువెక్కింది. దత్తజపం చేసుకుందామంటే మనసు నిలకడ లేకుండా ఉంది. కుక్కుటేశ్వరాలయానికి వెళ్ళాడు. అక్కడ దత్త విగ్రహానికి శిరస్సు

లేనట్లుగా కనిపించింది. ప్రసాదాన్ని ఇస్తున్న పురోహితులు ఆశీర్వదిస్తుండగా, 'ఇది తిని తొందరగా మరణించు,' అని శపించినట్లు అనిపించింది. నిస్పృహతో ఇంటికి వచ్చి చూస్తే భార్య నుదుట బొట్టు లేదు. 'నేను బ్రతికి ఉండగానే బొట్టు తీసేసావేంటి?' అని భర్త గద్దించి అడుగుతుంటే రూపాయి కాసంత బొట్టు ఉండగా భర్త తనపై అరవడం ఆమెకు వింతగా తోచింది. శాస్త్రికి మనస్థిమితం తప్పిందన్న వార్త దావానలంలా వ్యాపించింది. నోరు లేని పాషాణమూర్తులని సేవించటం కంటె దివ్యాంశలు వెదజల్లే శ్రీపాదుని శరణు వేడటం మేలని శాస్త్రి భార్య శ్రీపాదుల యింటికి వెళ్ళింది. ఎవరూ దగ్గర లేని సమయంలో భర్త తరపున మన్నింపు వేడుకొని అనుగ్రహించమని ప్రార్థించింది. 'నూతన గృహ నిర్మాణం చేయించు, వాస్తు పూజ, గృహ ప్రవేశం తరువాత పరిస్థితి అంతా చక్కబడుతుంది,' అని శ్రీపాదులు చెప్పారు.

## యద్భావం తదనురూప ఫలం

ఆమె ఈ విషయాన్ని ఎవ్వరికి చెప్పకుండా అద్దె ఇంట్లో ఉండటం వలన ఇలాంటి అవస్థలు కలుగుతున్నాయని చెప్తూ నూతన గృహ నిర్మాణం చేసింది. గృహప్రవేశం తరువాత పాపయ్య శాస్త్రి స్వస్థుడయ్యాడు. శ్రీపాదులు పాపయ్య కర్మను రాళ్ళలోకి ఆకర్షించి వాటిని ఖండించడం అనే ప్రక్రియ ద్వారానూ, ధన వ్యయం, అవమానాల ద్వారానూ అతని కర్మ ప్రక్షాళనం చేయడమే కాకుండా నూతన గృహాన్ని బహూకరించారు. "సశరీరుడయిన ఈ దత్తునిపై నమ్మకం ఉంచినట్లయితే నీ దుష్ట సంస్కారాలన్ని నా శరీరం పైకి ఆకర్షించుకొని ఇటువంటి బాధలు, అవమానాలు ఏమీ లేకుండా నీ కర్మని ధ్వంసం చేసి ఉండేవాడిని. **భక్తుని యొక్క భావనని బట్టే దైవం యొక్క అనుగ్రహం ఉంటుంది,"** అని శ్రీపాదులు శాస్త్రికి హితవు చెప్పారు.

## శ్రీసచ్చిదానందావధూత ఆగమనం

ఇక శ్రీపాదుల పాల సమస్య విషయంలో శ్రేష్ఠిగారు పూనుకొని అన్ని శుభలక్షణాలు కలిగిన గోవును కొని, బాపనార్యులకు ఇచ్చి దానిని ఏదో ఒక విధంగా రాజశర్మకు ఇవ్వమని ప్రార్థించారు. కాని రాజశర్మ ఏ రకంగాను అంగీకరించడానికి సిద్ధపడలేదు. అదే సమయాన హిమాలయాలలోని శతోపథ ప్రాంతం నుండి శతాబ్ద వయస్కులు, శ్రీవిశ్వేశ్వరప్రభువుల శిష్యులు అయిన సచ్చిదానందావధూత అనే మహాత్ములు పీఠికాపురం వచ్చారు. వారి ముందు ఈ విషయం గురించి మాట్లాడినపుడు, 'శ్రీపాదులు సాక్షాత్తు దత్త ప్రభువులని, తమ గురువు ఆదేశ ప్రకారం దత్తుని బాల్య రూపమైన శ్రీపాదుల రూపాన్ని దర్శించి చరితార్థులు అవడానికి తాము అక్కడికి వచ్చామని' తెలిపారు. దత్త ప్రభువులకు క్షీరమునిచ్చే భాగ్యాన్ని పోగొట్టుకోవద్దని రాజశర్మకు నచ్చచెప్పి పంచ భూతాలచే సాక్ష్యం ఇప్పించుతానని యజ్ఞం ప్రారంభించారు.

## పంచభూతాల సాక్ష్యం

'శ్రీపాదులవారు శ్రీదత్తులే, కనుక రాజశర్మ గోవుని స్వీకరించవచ్చు. మామగారు అల్లునికి ప్రేమపూర్వకంగా ఇచ్చేది దానం కాదు,' అని భూమాత సాక్ష్యం పలికింది. శ్రీపాదులు దత్తులే అని ఆకాశం నుంచి దివ్యవాణి వినిపించింది. వరుణుడు, వాయుదేవుడు యజ్ఞ ప్రాంతము మినహా తక్కిన ప్రదేశాలలో కుండపోతగా వర్షంతో, తీవ్రమైన ఈదురు గాలులతో తమతమ ప్రతాపాలని చూపించారు. ఇది వాళ్ళు ఇచ్చిన సాక్ష్యంలా లెక్క వేయబడింది. ఇక అగ్నిదేవుడు స్వయంగా వచ్చి హవిస్సులను అందుకున్నాడు. ఇలా పంచభూతాలు శ్రీపాదులే దత్తులు అని తమతమ విధానాలతో సాక్ష్యం ఇచ్చాక రాజశర్మ గోదానాన్ని అంగీకరించడంతో వర్మ, శ్రేష్ఠిగార్లకు అపూర్వ

పుణ్యం లభించింది.

అవధూత పీఠికాపురవాసులకు వారి మూర్ఖత్వాన్ని ఎత్తి చూపుతూ, 'పాషాణ మూర్తులకు పూజలు చేస్తూ, సగుణ, సాకారాలతో వారి మధ్య నడయాడుతున్న సజీవ దత్తుని గ్రహించలేకపోతున్నారు,' అని మందలించారు. పూర్వ జన్మలో సుమతీ రాజశర్మలు, సుశీల విష్ణుశర్మ దంపతులని, వారు సాక్షాత్తు దత్త, సూర్య, అగ్ని దేవులను శ్రాద్ధ భోక్తలుగా ఆహ్వానించి, తమ పూర్వీకులకు పుణ్యగతులను కల్పించిన పుణ్యాత్ములని, ఇక బాపనార్యులు స్వయంగా కృష్ణ పరమాత్మకు తండ్రి అయిన నందులే అని విశదీకరించారు.

## నరసింహవర్మగారే ఛత్రపతి శివాజీ

శ్రీపాదుల పెద్ద అన్నగారు అంధత్వము నుండి విముక్తులై మహాపండితుడు అవుతారని, మరుజన్మలో మరాఠా దేశములో సజ్జనఘడ్‌లో సమర్థ రామునిగా జన్మిస్తారని, చిన్న అన్నగారు కూడా స్వస్థ శరీరులై శ్రీధర అవధూతగా జన్మించుతారని, గోదాన పుణ్య విశేషం వలన వర్మగారు హిందూ సామ్రాజ్య స్థాపకుడు ఛత్రపతి శివాజీవలె జన్మించి సమర్థరాముని శిష్యులు అవుతారని చెప్పారు. భవిష్యత్తులో పిఠాపురం, వాయసపురం (కాకినాడ), శ్యామలాంబాపురం (సామర్లకోట) మూడు కలిసి మహా పట్టణం ఏర్పడుతుందని చెప్పారు. ఈ విధంగా కూలంకషంగా కర్మ ఫలాలను గురించి వివరించి తిరుమలదాసు నన్ను కురువపురం బయలుదేరమని ఆదేశించారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 10 వ అధ్యాయం

# సుబ్బయ్యశ్రేష్ఠి వృత్తాంతం

# (శ్రీపాదులకు మూడుపళ్ళు)

## ...మూర్ఖుని మనసు రంజింపరాదు

నేను కురువపురం దిశగా ప్రయాణం సాగిస్తూ, శ్రీపాదుల లీలలను మనసులో తలచుకుంటూ దారిలో ఒక రావిచెట్టు నీడలో కొద్దిసేపు సేద తీర్చుకోవడానికి అటు వెళ్ళాను. ఆ చెట్టు నీడలో కూర్చున్న వ్యక్తి నన్ను సాదరంగా ఆహ్వానించాడు. అతని ముందు ఒక జంగిడి, అందులో ఒక రాగి పాత్ర ఉన్నాయి. మీరు శ్రీపాదుల భక్తులా? అని నేనడిగితే, వారిలా చెప్పారు, "నేనొక వైశ్యుడిని. చిన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోయినా, వాళ్ళు నాకు మిగిల్చి ఇచ్చిన ఐశ్వర్యంలో పెరిగి, యుక్తవయసు రాగానే వ్యాపారం మొదలుపెట్టాను. బిల్వమంగళుడనే బ్రాహ్మణ వ్యాపారితో స్నేహం కుదిరి, మెల్లగా ఇద్దరం చింతామణి అనే వేశ్య సాంగత్యంలో పడ్డాము. ఇద్దరం కలిసి అరబ్బు దేశంతో గుర్రాల వ్యాపారం చేసాము. మొదట్లో చాలా లాభాలు గడించాము. కాని, తరువాత చాలా నష్టపోయాము. నా భార్య ఈ మనోవ్యధతోనే చనిపోయింది. మనస్థిమితం లేని కొడుకు కొంత కాలానికి తల్లి దగ్గరకు వెళ్ళిపోయాడు. నేను పీఠికాపురంలోనే ఉంటున్నా శ్రీపాదులను గుర్తించలేక పోగా నిందిస్తూ ఉండేవాడిని. ఒకసారి రాజశర్మ నా దుకాణం నుండి ఒక వరహా విలువచేసే వస్తువులు తీసుకున్నారు. ఆయన బాకీ తీర్చడం ఆలస్యం చేసేసరికి నేను వడ్డీ మీద వడ్డీ వేసి ఒక వరహా బాకీని పది వరహాలు చేసి, దానికి చెల్లుగా వాళ్ళ ఇల్లు జప్తు చేసుకుంటానని అందరితో డాంబికాలు చెప్తూ ఉండేవాడిని. ఈ ఆలోచన నా వినాశానికే అని శ్రేష్ఠిగారు నన్నెంతో మందలించారు. కాని నేను ఆయన మాట పెడచెవిన పెట్టాను.

**వినాశకాలే విపరీత బుద్ధిః**

ఒకసారి శ్రేష్ఠిగారి ఒడిలో ఉన్న శ్రీపాదులతో వారి అన్నలు అవిటివాళ్ళని, వారి తండ్రి బీదవాడని చులకనగా మాట్లాడడమే కాకుండా నా దుకాణంలో పని చేసి వాళ్ళ బాకీ తీర్చాలని గద్దించాను. మూడు సంవత్సరాల శ్రీపాదులు నా మాటను ఒప్పుకుంటూ, బాకీ తీర్చిన తరువాత నా ధనం నా దగ్గర నిలవదని హెచ్చరించారు. శ్రేష్ఠిగారు శ్రీపాదులను ఎత్తుకొని నా దుకాణానికి తెచ్చి, శ్రీపాదునికి బదులుగా తను నా వద్ద పని చేస్తానని చెప్పారు. ఇంతలో పెద్దగిరజాల జుట్టుతో సన్యాసిలా ఉన్న ఒక వ్యక్తి వచ్చి, 'రాగి పాత్రలున్నాయా?' అని అడిగి తనకు ఒక రాగిపాత్ర చాలా అవసరమని, ఎంత ఖరీదయినా సరే కొంటానని చెప్పాడు. నా దగ్గర 32 పాత్రలు ఉన్నా, ఒక్కటే ఉందని అబద్ధం చెప్పి పది వరహాలు ఖరీదని చెప్పాను. దానికి ఆ వ్యక్తి ఒప్పుకొని పాత్రను మాత్రం శ్రీపాదుల చేత ఇప్పించమని అడిగాడు. నేను అలాగే చేసాను. పాత్రని అతని చేతికిచ్చిన శ్రీపాదులు ఆ వ్యక్తితో, "నీ కష్టాలన్నీ తీరిపోయాయి. నీ భార్యాబిడ్డలు నీ కోసం ఎదురు చూస్తున్నారు. వెళ్ళు," అని చెప్పారు. చాలా మంచి లాభసాటి బేరం తగిలిందన్న ఆనందంతోనూ, అహంకారంతోనూ వారి బాకీ తీరి పోయిందని, శ్రీపాదులు నాకు దాస్యం చేయనవసరంలేదని గాయత్రీదేవి సాక్షిగా ప్రమాణం చేసి చెప్పాను. వారు వెళ్ళిన తరువాత చూస్తే 31 రాగి పాత్రలకు బదులు దుకాణంలో ఒక్కటే పాత్ర మిగిలి ఉంది. ఒక్కటే పాత్ర ఉందని నేను చెప్పిన అబద్ధాన్ని శ్రీపాదులు నిజం చేసి, దొంగలెక్కలతో నేను పదింతలు పెంచిన వారి తండ్రి బాకీని తీర్చివేసారు". ఇంతవరకు తన కథ చెప్పిన ఆ స్వామి "అయ్యా! మీరు ఆకలిగా ఉన్నారు. ఆ కొల నులో స్నానంచేసి రండి భోజనం చేద్దాం, తరువాత మాట్లాడుకోవచ్చు," అని చెప్పి కథని మధ్యలో ఆపివేసారు.

ఎదురుగా ఉన్న కొలనులో స్నానం చేసి వచ్చేలోగా తాటి ఆకులతో దొన్నెలు, అరటి ఆకు విస్తర్లు సిద్ధం చేసారు. కళ్ళు మూసుకొని కొద్దిసేపు ధ్యానం చేసి, ఖాళీగా ఉన్న రాగిపాత్ర నుండి దొన్నెలలో నీళ్ళు పోసారు. నాకు ఒక వైపు ఆశ్చర్యంగానూ మరోవైపు కుతూహలంగానూ ఉంది. అదే పాత్రతో విస్తరాకులో అన్నం బీరకాయ పప్పు వడ్డించారు. అమృతం లాంటి ఆ భోజనం కడుపు నిండా తిన్నాకే ఆ పాత్ర ఖాళీ అయింది.

## శ్రీపాదుల సర్వజ్ఞత

సుబ్బయ్య శ్రేష్ఠి మళ్ళీ తన కథను ఇలా మొదలు పెట్టారు, "శ్రీపాదులు తండ్రి ఋణాన్ని ఒక వింత పద్ధతిలో తీర్చారన్న విషయం పిఠాపురం అంతా గుప్పున పాకిపోయింది. రాజశర్మ దీన్ని ఒప్పుకోకపోవడంతో పెద్దలందరు సమావేశం అయ్యారు. బాపనార్యులు శ్రీపాదులను, 'ఆ జటాధారి నీకు తెలుసా?' అని ప్రశ్నించారు. నాకు 'ఆ జటాధారి మాత్రమే కాదు అందరు జటాధారుల గురించి తెలుసు,' అని వారు సమాధానం చెప్పారు. మూడేళ్ళ వాడివి ఇలా పెద్ద మాటలు మాట్లాడకూడదని తాతగారు మందలిస్తే తన వయసు కొన్ని లక్షలసంవత్సరాలని, సృష్టి ప్రారంభం కాకముందునుండే తాను ఉన్నానని చెప్పారు. ఇలా అన్నీ తనకు తెలుసననే సర్వజ్ఞత్వం, అన్నింటిలోనూ తానున్నాననే సర్వవ్యాపకత్వం చెప్పుకోవడం తప్పని తాతగారు మందలించారు. దానికి సమాధానంగా శ్రీపాదులు, "నిరూపించక పోతే నిజాలు అబద్ధాలవుతాయా? మనుషులందరిలోని అన్ని కోశాలలో నేను ఉన్నాను, అది అనుభవించే వ్యక్తికి తెలుస్తుంది. అలా ఆ అనుభవం లేనంత మాత్రాన, ఆ వ్యక్తికి తెలియనంత మాత్రాన నా ఉనికి అబద్ధం కాదు కదా? ఈ సృష్టి అంతా నా సంకల్ప బలంతోనే నడుస్తుంది," అని చెప్పారు. సుబ్బయ్య దుకాణం నుండి ముప్పై రాగి పాత్రలు మాయం చేసింది నువ్వేనా? అని బాపనార్యులు అడిగితే అది

పూర్వజన్మకు సంబంధించిన విషయమని తెలిపి ఆ కథ ఇలా చెప్పారు:

## సుబ్బయ్యశ్రేష్ఠి పూర్వజన్మగాథ

"సుబ్బయ్యశ్రేష్ఠి పూర్వజన్మలో అడవి ప్రాంతంలోని గుడిలో దత్తపూజారి. కాంతాలోలుడైన ఇతడు అనాదిగా ఆరాధింపబడుతున్న దత్త విగ్రహాన్ని అమ్మి, ఆ సొమ్మును ఉంపుడుకత్తెకి ఇచ్చి విగ్రహాన్ని దొంగలు అపహరించారని అసత్య ప్రసారం చేసాడు. కొద్ది ధనానికి ఆశపడి ఆ విగ్రహాన్ని కరిగించిన ఆ కంసాలియే ఈ జన్మలోని జటాధారి. కంసాలి ఆ విగ్రహాన్ని కరిగించి ముప్పై రెండు రాగి పాత్రలుగా చేసాడు. యాదృచ్ఛికంగా ఈ పని అంతా వారి కులదైవమైన నృసింహుని విగ్రహం ముందు జరగడంతో దైవ సంకల్పం వల్ల నృసింహుడి 32 అంశలు ఆ పాత్రలలో ప్రవేశించాయి. పూర్వజన్మల పుణ్యంవల్ల శ్రేష్ఠి ధనవంతుల ఇంట్లో జన్మించగా ఆ కంసాలి పూర్వజన్మ జ్ఞానంతో నిరుపేదల ఇంట్లో జన్మించాడు. నన్ను అనన్య భక్తితో పూజించి దరిద్రాన్ని దూరం చేయమని అహోరాత్రులు ప్రార్థించాడు. అప్పుల వారి బెడద నుండి తప్పించుకోవడానికి మారువేషంలో తిరుగుతున్న అతనికి నేను కలలో కనిపించి రాగిపాత్రని నాచేతి మీదుగా కొనమని, నన్ను దాస్య విముక్తుడను చేయమని చెప్పాను. ఆ విధంగా అతనికి మహదైశ్వర్యాన్ని కల్పించాను." ఈ విధంగా చెప్పిన శ్రీపాదులు నాతో కఠినంగా, "సుబ్బయ్యశ్రేష్ఠి! నీవు నా తండ్రికి చేసిన మోసమే కాకుండా చింతామణితో నీ శృంగారం, వెకిలి చేష్టలు అన్నీ నాకు తెలుసు. కొద్ది కాలంలో నీవు దరిద్రుడివి కాబోతున్నావు. జంగిడిలో పిల్లల మిఠాయి అమ్ముకొని బ్రతుకు. అంతకంటే గతిలేని పరిస్థితి వస్తే ఈ రాగి పాత్రనుండి నీకు అన్నం, బీరకాయ పప్పు వస్తాయి. నీ దగ్గర కొన్న సామాన్లతో మా తండ్రి మా బంధువులకు తినిపించింది అవే. కాబట్టి అవి మాత్రమే వస్తాయి. నీవు తినగా అతిథులకు కూడా పెట్టగలిగేంత ఆహారం

పాత్రలోంచి వస్తుంది," అని చెప్పారు.

## 16వేల స్పందనలే 16వేల గోపికలు



నాకు అహంకారం హెచ్చు మోతాదులోనే ఉండడంతో, "ఆహా! అవతార పురుషుల విషయం అయితే అది లీల, మా బోటివారి విషయం అయితే స్త్రీ లంపటమా?" అంటూ ఎద్దేవా చేసాను. "శ్రీకృష్ణుడికి ఎనిమిది భార్యలు, పదహారువేల మంది గోపికలు ఉన్నా అతడు నిత్య బ్రహ్మచారి. అది దేహ సంబంధం కాదు, ఆత్మ సంబంధం. భరింపబడే ఆత్మ భార్య, భరించే ఆత్మ భర్త. "శాపంవల్ల దేవేంద్రుడు మానవుడిలా జన్మించవలసి వచ్చినపుడు ఐదు రూపాలతో ఒకే ఆత్మతో పంచ పాండవులుగా జన్మించాడు. శచీదేవి ద్రౌపదిగా జన్మించింది. అయిదుగురు భర్తల భార్య అయినప్పటికీ శయ్యాసుఖం ఇచ్చింది అర్జునుడికి మాత్రమే. భీముడికి దాసిలా, ధర్మజుడికి మంత్రిలా, నకులసహదేవులకు తల్లిగా వ్యవహరించింది," అని శ్రీపాదులు వివరించారు. నేనంతటితో ఆగక, 'ఈ జన్మలో నీకు పదహారువేల మంది గోపికలు, అష్టభార్యలు ఉన్నారా!' అంటూ వెక్కిరించాను. వారు నవ్వుతూ, "నా అష్టవిధ ప్రవృత్తులే నా అష్టభార్యలు. నాది షోడశకళా ప్రపూర్ణ అవతారం. నా ఆత్మ, శరీరం, మనస్సులనుంచి ప్రతిక్షణం పది దిక్కులకు దివ్య స్పందనలు ప్రసరింప బడుతుంటాయి. అంటే 10 (ఆత్మ) x 10 (శరీరం) x 10 (మనసు)= 1000 స్పందనలు. ఇలా 16 కళల నుండి ప్రతి క్షణం 16 x 1000 = 16000 స్పందనలు ఉత్పన్నం అవుతుంటాయి. అవే నా పదహారువేల గోపికలు. కృష్ణావతారంలో ఈ స్పందనలు మానవాకారంలో ఉంటే ఇప్పుడు నిరాకారంగా ఉన్నాయి," అని స్పష్టంగా వ్యక్తపరిచారు.

తరువాత 32 నరసింహమూర్తుల పేర్లను వరుసగా చెప్పి, అందులో 30వ నరసింహమూర్తిగా శ్రీపాదుని, 31- నృసింహసరస్వతిగా, 32వ నరసింహమూర్తి  అవతారంగా స్వామి సమర్థ పేరు సూచించారు.

ఇంతవరకే కథను చెప్పిన సుబ్బయ్యశ్రేష్ఠి శంకరభట్టుతో, "మనం ఈ రోజు రాత్రంతా శ్రీపాదుల దివ్యనామ సంకీర్తనలో గడుపుదాం. రేపు నేను మరికొన్ని దివ్యలీలల్ని వివరిస్తాను," అని చెప్పి నన్ను దగ్గరలో ఉన్న కుటీరానికి తీసుకొని వెళ్ళారు. శ్రీపాదుల దివ్యనామం, నామస్మరణం అనేక జన్మలనుండి పేరుకున్న పాపపు రాశులన్నింటిని భస్మం చేస్తుంది.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 11వ అధ్యాయం

## శ్రీపాదప్రభువుల తత్త్వం

## (శ్రీపాదులకు మూడుపళ్ళు)

ఆ మరునాడు సుబ్బయ్యశ్రేష్ఠి శ్రీపాదుల దత్తతత్త్వాన్ని ఇలా వివరించారు: "సుమతీ మహారాణి అనసూయామాతతో సమానమైన స్థితిలో ఉండటంవల్ల శ్రీపాదులు ఆమె గర్భంలో జన్మించారు. వారు మాతాపితల సంయోగంవల్ల కాక యోగనిష్ఠులైన రాజశర్మ, సుమతి నేత్రాలనుండి యోగజ్యోతులు ప్రభవించి వాటి సంయోగం వల్ల జన్మించారు. వేరువేరు దేవతలను ఆరాధించేటపుడు ఆయా దేవతలలో దత్త ప్రభువు చైతన్యం ప్రతిబింబించి ఒక కొత్త చైతన్యంగా మార్పుపొంది సాధకుల కోరికలను నెరవేరుస్తుంది. దత్తప్రభువునే ఆశ్రయించినట్లైతే ఏ దేవతలతో, ఎంత మేరకు, ఏ పనిని నిర్వర్తింపచేయాలో వారే నిర్ణయించి, ఆ నిర్ణయం మేరకు ఆ పనిని జరిపించి, సాధకుని కంటికి రెప్పలా కాపాడుతారు. శ్రీదత్తప్రభువు సగుణ, నిర్గుణ తత్త్వాలకు అతీతము, ఆధారభూతము అయిన పరమతత్త్వం, అదే ఆదితత్త్వం, ఆద్యంతరహిత తత్త్వం.

### దత్త పంచకం

ఒకసారి బాపనార్యులవారు శ్రీపాదుల్ని, 'నీవు దత్తుడివా? దత్త ఉపాసకుడివా?' అని అడిగారు. దానికి వారు, 'నేను దత్తుడను అని చెప్పినపుడు దత్తుడనే అవుతున్నాను. నేను దత్త ఉపాసకుడను అని చెప్పినపుడు దత్త ఉపాసకుడనే అవుతున్నాను. నేను శ్రీపాదుడను అని చెప్పినపుడు శ్రీపాదుడనే అవుతున్నాను. నేను ఏది సంకల్పించిన అదే అవుతాను, అదే జరుగుతుంది,' అని చెప్పారు. తాతగారికి ఇదంతా అయోమయంగా ఉంది. శ్రీపాదులు మెల్లగా వారి కనుబొమ్మల మధ్య

తాకడంతో, బాపనార్యులకి మొదట హిమాలయాల్లో బాబాజీ, వారు ప్రయాగలోని త్రివేణీ సంగమంలో స్నానం చేయడం, తరువాత శ్రీపాదులు, వారి రూపం కుక్కుటేశ్వరాలయంలో స్వయంభూదత్తునిలో లీనమవడం, దానిలో నుండి అవధూత స్వరూపం బయటకు రావడం, ఆ రూపం సుమతి ఒడిలో పసిపిల్లవాడిలా మారడం, 16ఏండ్ల ప్రాయపు శ్రీపాదునిలా కనిపించి తరువాత ముమ్మూర్తులా తనను పోలిన స్వరూపం ఏవో రెండు పవిత్ర నదుల సంగమంలో శిష్యులతో స్నానంచేసి నన్ను నృసింహసరస్వతి అంటారు, ఇది గంధర్వపురం అని చెప్పి నదిలో అంగవస్త్రం విసిరివేయడం, దానిపై కూర్చొని శ్రీశైలం దగ్గర ఉన్న కదళీవనానికి వెళ్ళడం, అక్కడ కొన్నివందల సంవత్సరాలు తపస్సు చేసాక కౌపీనధారి అయిన ముసలివారిలా కనిపించి తాము స్వామి సమర్థ అని చెప్పి శరీరత్యాగం చేసాక ప్రాణశక్తిని ఒక రావిచెట్టులోను, దివ్యాత్మని మల్లిఖార్జునిలోను లీనం చేయడం వరుసగా ఒక సంఘటన తరువాత ఒకటి కళ్ళముందు కనిపించాయి.

## శ్రీపాదుల అమోఘ సంకల్ప మహిమ

తరువాత కొద్దిసేపటికి బాపనార్యులు కళ్ళు తెరిచి తమకు ఎదురుగా అమాయకమైన ముఖంతో కూర్చున్న శ్రీపాదులను చూసి వారిని తనివితీరా గుండెలకు హత్తుకున్నారు. తరువాత కొద్ది సేపటికి అగ్నిహోత్ర కార్యక్రమం చేయడం మొదలుపెట్టారు. వారు అగ్ని ప్రజ్జ్వలింపజేసే విధానం ప్రత్యేకంగా ఉంటుంది. అగ్నికుండంలో సమిధల్ని ఉంచి వేదమంత్రాలను చదువుతుంటే అగ్ని తనంతట తానే ప్రజ్వరిల్లుతుంది. కాని ఆ రోజు ఎన్నిమార్లు ప్రయత్నించినా అగ్నిసృష్టి జరగలేదు. అపుడు శ్రీపాదులు, "ఓయీ అగ్నిదేవా! నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. తాతగారి దైవకార్యానికి అటంకం కలిగించకు," అని ఆదేశించిన వెంటనే అగ్ని సృష్టి అయ్యింది. కలశం నుండి నీళ్ళు తీసుకొని శ్రీపాదులు అగ్నికుండంలో పోస్తే అది

నెయ్యి వేసినట్లుగా మరింతగా ప్రజ్వరిల్ల సాగింది. "తాతా! నా సంకల్పం లేనిదే బాపనార్యులవంటి మహా తపస్వి కూడా అగ్నిని సృష్టించలేరు. నా సంకల్పంలో మార్పు జరిగితే ధనవంతులైన శ్రేష్ఠి, వర్మగార్లు నిలువ నీడలేని నిరుపేదలు కాగలరు. **నన్నాశ్రయించిన భక్తునికి ఏది కోరినా ఇవ్వగలను. కాని అంతటి ఉన్నతశక్తిని ఆ భక్తుడు నిలుపుకొనగలడా? జనుల శ్రేయస్సు కొరకు ఉపయోగించునా?లేదా? అని పరీక్షించిన తరువాతనే ఇస్తాను.** ఈ పీఠికాపుర అగ్రహారంలో అడుగు పెట్టడానికి ఎన్నో జన్మలు పుణ్యం చేసుకుని ఉండాలి. నా అవతరణలో నాతో మీరు సమకాలికులుగా ఉండటం గొప్ప విశేషం," అని చెప్పారు.

## బీరపంట

ఆ మరునాడు వర్మగారు తమ భూములను చూపించడానికి శ్రీపాదులను తీసుకొని వెళ్ళారు. ఆ భూములలో అన్ని రకాల పంటలు పండుతాయి. కాని బీరకాయలు మాత్రం పిందెలు కూడా రావు. వస్తే ఎండిపోతాయి. ఒక వేళ పెద్దకాయలు అయితే నోటిలో పెట్టుకోలేనంత చేదు అని వర్మగారు చెప్పారు. ఆ భూమి తన పాద స్పర్శకై తపించి ఉన్నదని, ఆ రోజున భూమితల్లి కోరిక నెరవేరడంతో ఇకపై చక్కటి బీరపంట వస్తుందని, ఆ పంటని నిర్భయంగా తమ ఇంటికి కూడా పంపమని శ్రీపాదులు చెప్పారు. చిత్రం! ఆ రోజునుండి ఆ నేలలో మంచి రుచి కలిగిన బీరకాయలు విపరీతంగా పండాయి.

## చిత్ర విచిత్రాల చిత్రాడ

ఇంతలో కొంతమంది చెంచు యువతీ యువకులు అక్కడికి వచ్చారు. శ్రీపాదులు నవ్వుతూ, 'వాళ్ళు నరసింహావతారానికి సంబంధించిన వాళ్ళు అని, నృసింహుడి భక్తులని, అందువల్ల నృసింహ దర్శనం కావాలనుకుంటే

వాళ్ళు చేయించగలరు,' అని వర్మ గారితో చెప్పారు. వర్మగారు కూడా నవ్వుతూనే వాళ్ళని, "నృసింహుడి జాడ తెలుసా"? అని ప్రశ్నించారు. "అదేమంత భాగ్యం! సింహపు తల, మనిషి శరీరంతో ఒకడు మా సోదరి చెంచులక్ష్మి పై మరులు కొన్నాడు. త్వరలో వారికి వివాహం జరిపిస్తాం. ఇద్దరినీ ఇపుడే తీసుకుని వస్తాం," అని చెప్పి వాళ్ళు వెళ్ళారు.

అదే సమయంలో ఆ దారిలో వెళ్తున్న నన్ను శ్రీపాదులు పిలిచారు. భూములకి అడ్డంగా ఎవరో ఇద్దరు యువతీ యువకులు అటుపక్కగా వస్తూ కనిపించారు. దగ్గరకు రాగా వాళ్ళు చింతామణి బిల్వమంగళులే. వాళ్ళు గురువాయూర్‌లో శ్రీకృష్ణుని సేవించి కురూరమ్మ అనే మహా యోగి దర్శనం చేసుకుంటే ఆమె 'శ్రీపాద శ్రీవల్లభ దర్శన ప్రాప్తిరస్తు' అని దీవించారు. ఆ ఆశీస్సు ఫలించి వారిద్దరూ ఇక్కడికి చేరారు. శ్రీపాదులు నన్ను చితులను పోగుచేసి మంట చేయమని ఆదేశించారు. ఆ మంట ప్రజ్వరిల్లుతుంటే వాళ్ళిద్దరూ తమ శరీరాలే దహిస్తున్నంతగా నరకబాధను అనుభవించారు. కొంతసేపటికి వాళ్ళ శరీరాలనుండి వాళ్ళని పోలిన నల్లటి రూపాలు బైటకు వచ్చి మంటలోపడి ఆహుతి అయిపోయాయి. ఇంతలో చెంచులు నృసింహుని పెడరెక్కలు విరిచి కట్టి చెంచులక్ష్మితో సహా అక్కడికి వచ్చారు. శ్రీపాదులు బంధితుడైన ఆ నృసింహుని "నీవేనా నృసింహుడివి? చెంచులక్ష్మి నీ భార్యయేనా? హిరణ్యకశ్యపుని వధించి ప్రహ్లాదుని రక్షించింది నీవేనా?" అని శ్రీపాదులు అడిగారు. మూడు ప్రశ్నలకూ అవునంటూ జవాబు చెప్పాక చెంచులక్ష్మి నృసింహులు ఇద్దరూ జ్యోతి స్వరూపాలుగా మారి అందరూ చూస్తుండగా శ్రీపాదులలో లీనమయ్యారు.

బిల్వమంగళుడు మహర్షిగాను, చింతామణి యోగిగానూ మారి పోయారు. నృసింహ దర్శనం కల్గించమని మంగళగిరిలో వాళ్ళు మనస్ఫూర్తిగా కోరుకున్నందువల్ల సాక్షాత్తు నృసింహస్వామిని ఆ పవిత్ర

భూమిలో చూడగలిగారు. చిత్రాతి విచిత్రమైన లీలలు జరిగిన ఆ భూమి భావికాలంలో చిత్రాడ అనే గ్రామం అవుతుందని శ్రీపాదులు చెప్పారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 12వ అధ్యాయం

# వర్మకళ - మర్మకళ

## (నాలుగు సంవత్సరాల వయసు)

### శ్వాస - ఆయుర్దాయాల సంబంధం

సుబ్బయ్యశ్రేష్ఠి ఇలా ఎన్నో కొత్త విషయాలు నాకు తెలియచెప్పారు. కలియుగాంతంలో శ్రీపాదులే కల్కి అవతారంగా వస్తారని కూడా చెప్పారు. శ్వాసకు ఆయుర్దాయానికి మధ్య గల సంబంధాన్ని గురించి చెప్తూ, 'బ్రహ్మ ఒక వ్యక్తికి నూట ఇరవై సంవత్సరాల ఆయుష్షును ఇచ్చారంటే భౌతికంగా వాడు అన్ని సంవత్సరాలు జీవిస్తాడని అర్థంకాదు. ఆ నూట ఇరవై సంవత్సరాల్లో ఎన్ని శ్వాసప్రశ్వాసలు సామాన్యంగా తీసుకొనగలుగుతాడో అంతకాలం జీవించి ఉంటాడు,' అని వివరించారు. మనశ్చాంచల్యం కల వారు, ఎపుడూ దిగులుగా ఉండేవారు, కోపస్వభావులు, దుష్ట ప్రవృత్తులు తమ శ్వాసలని తక్కువకాలంలో ఖర్చు చేసుకుంటారు, చంచల స్వభావంకల కోతి కొంత కాలమే జీవిస్తుంది, తక్కువ శ్వాస-ప్రశ్వాసలు తీసుకునే రాకాసి తాబేలు 300 సంవత్సరాలు జీవిస్తుందని చెప్పారు. ప్రతి 10 సంవత్సరాలకు పాత జీవాణువుల స్థానంలో కొత్త జీవాణువులు పుట్టి శరీర భాగాలలో మార్పులు వస్తుంటాయని, అలాగే ప్రాణశక్తి మానసిక శక్తులలో కూడా మార్పు వస్తూ ఉంటుందని చెప్పారు. దీనివల్ల మనసు, ప్రాణం పరి శుద్ధం అవుతాయని, ఈ మార్పులు త్వరగా రావడానికి శ్రీపాదశ్రీవల్లభ చరితామృతం సహాయం చేస్తుందని, ఈ గ్రంథ పారాయణ మనలోని చెడు స్పందనలను శ్రీపాదుల చైతన్యంలో కలిపి వాటిని శుద్ధి చేసి తిరిగి మనలో చేరుస్తుందని చెప్పారు.

## వర్మకళ

శ్రీపాదులు నాలుగు సంవత్సరాల ప్రాయంలో ఉండగా పీఠికాపురానికి వర్మకళ అనే మర్మకళ తెలిసిన కులశేఖరుడనే మలయాళీ వ్యక్తి వచ్చాడు. మర్మలు అని పిలువబడే శరీరంలోని జీవశక్తి కేంద్రాలపై ఒత్తిడి కలిగించి కాని, ఆ స్థానంలో దెబ్బ కొట్టడం వల్ల కాని మనిషికి ప్రాణాపాయం కలిగించవచ్చు. ఇది వైద్యపరంగా ఉపయోగించినట్లయితే దీర్ఘవ్యాధులను కూడా నయం చేయవచ్చు. ఈ మర్మ చికిత్సను కనిపెట్టిన ప్రాచీన వైద్యుడు సుశ్రితుడు.

## కులశేఖరుడు-అష్టావక్ర భీముడు

కులశేఖరుడు ఏడుకొండలవాడి భక్తుడు. ప్రతి రాజ్యంలో మల్లయోధులను ఓడించి జయపతాకాలు తీసుకుంటూ పీఠికాపురం వచ్చాడు. అక్కడి మల్లయోధులందరు సమావేశమై కులశేఖరుడి చేతిలో చావడమో, ఓడటమో ఖాయం అని తలచి, శ్రీపాదులు నిజంగా దత్తులే అయితే ఏదో పరిష్కారం చూపుతారని ఆశించి వారిని ఆశ్రయించారు. వర్మగారి వద్ద భీముడనే అష్టావక్ర గూనివాడు ఉండేవాడు. వాడు దుర్బలుడు కూడా. కాని శ్రీపాదులంటే విపరీతమైన ప్రేమాభిమానాలు, అచంచల విశ్వాసం. తరచు తన గూనిని బాగు చేయమని శ్రీవారిని కోరుతుండేవాడు. ఆ భీముడినే శ్రీపాదులు కులశేఖరునికి పోటీగా ఎంపిక చేసారు.

## విద్యా దుర్వినియోగ దుష్ఫలితాలు

మల్లయుద్ధం ప్రారంభమయ్యింది. పీఠికాపురవాసులు భీముడిచావో, శ్రీపాదుల మహిమో, రెంటిలో ఏదో ఒకటి తేలిపోతుందని నిర్ధారించుకున్నారు. కులశేఖరుడు భీముణ్ణి ఒక్కొక్క దెబ్బ కొడుతున్నప్పుడల్లా ఆ దెబ్బ అతనికే తగలడం కాకుండా, ప్రతీ దెబ్బకూ భీముడి అష్టవంకరలు, గూని పోయి అతని శరీరం శక్తివంతం అవసాగింది. దెబ్బలు కొట్టి కొట్టి అలసిపోయిన

కులశేఖరుడు నిస్సత్తువతో శ్రీపాదులను శరణు కోరాడు. శ్రీపాదులు అతనితో, “ఈ రోజునుండి భీముని శరీరంలోని దుర్బలత్వం నీ శరీరంలోకి బదలాయించుతున్నాను. నీవు మానవ శరీరంలోని 108 వర్మలు తెలిసికొని, వాటిపై దెబ్బ తీస్తూ అహంకారవంతుడివి అయ్యావు. మర్మకళను దుర్వినియోగం చేసినందుకు నీ విద్యను ఉపసంహరిస్తున్నాను,” అని చెప్పారు

క్షణకాలం కులశేఖరుడికి శ్రీపద్మావతీ వేంకటేశ్వరులుగా దర్శనమిచ్చి శ్రీపాదులు అతనిని కృతార్థుణ్ణి చేసారు. అహంభావులను, అనర్హులను సైతం అనుగ్రహించే స్వామి కారుణ్యామృతాన్ని ఎంత వర్ణించినా తక్కువేకదా?

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 13వ అధ్యాయం

# ఆనందశర్మయే వెంకయ్య అవధూత

## (శ్రీపాదులు అయిదు సంవత్సరాల బాలుడు)

సుబ్బయ్యశ్రేష్ఠి వద్ద అనుమతి తీసుకొని నేను కురువపురం వైపు ప్రయాణం సాగించాను. రాత్రి సమయంలో ఒక గ్రామంలో వీధి అరుగుపైన కూర్చున్న ఒక బ్రాహ్మణుడు నన్ను సాదరంగా ఆహ్వానించి భోజనం పెట్టి, గాయత్రీమాత తన అంతర్నేత్రంలో కనిపించి ఒక దత్తభక్తుడు అటుపక్కగా వస్తాడని, అతనికి కడుపునిండుగా భోజనం పెట్టమని చెప్పిందని నాతో చెప్పారు. నేను నాగురించిన వివరాలు చెప్పి, శ్రీపాద శ్రీవల్లభుల పేరుతో అవతరించిన శ్రీదత్త ప్రభువుల దర్శనం కోసం కురువపురం వెళ్తున్నానని చెప్పాను. ఆనందశర్మ అనే ఆ బ్రాహ్మణుడు తన అనుభవాన్ని నాతో ఇలా పంచుకున్నారు:

### కణ్వాశ్రమ దర్శనం

"అయ్యా! నా ఉపనయన సందర్భంలో ఒక అవధూత మా ఇంటికి వచ్చారు. వారు గాయత్రీ మంత్ర అనుష్ఠాన విషయాలు చెప్పి, పెంచల కోనలోని నృసింహుడి దర్శనం చేసుకోమని చెప్పారు. నృసింహ దర్శనం తరువాత మా నాన్నగారు ధ్యానంలో మునిగిపోయారు. రాత్రి పగలు ధ్యానంలోనే ఉండిపోయారు. ఎవరో ఒక ఆగంతకుడు నాకు భోజనం పెట్టి, అడవి దారివెంట కొండగుహలోకి తీసుకొని వెళ్ళి అంతర్ధానమయ్యాడు. ఆ గుహలో 201ఋషులతో సేవింపబడే ఒక వృద్ధ తపస్వి తాను కణ్వమహర్షి అని, ఎంతో మహాపుణ్యం చేసుకోవడం వల్లనే నేను అక్కడికి రాగలిగానని, ప్రస్తుతం దత్త ప్రభువు శ్రీపాదులుగా పీఠికాపురంలో ఉన్నారని, వారి దర్శనం నాకు ప్రాప్తించాలని నా తలపై వారి అమృత హస్తాన్ని ఉంచి దీవించారు.

మరుక్షణమే నేను మా తండ్రిగారి దగ్గర ఉన్నాను. మా నాన్నగారు ధ్యానం ముగించి కళ్ళు తెరిచాక మేము మా గ్రామానికి తిరిగి వచ్చాము.

## ఎదురులపల్లిలో మునికూడలి

ఒకసారి పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ మా బంధువులతోపాటు మేము రాజమహేంద్రవరానికి బయలుదేరాము. నాలుగు దిక్కులలోని కొండల పైన, గుహలలోనూ తపస్సు చేసుకొనే ఋషులు, వారి వారి తపోప్రదేశాల నుండి బయలుదేరి శివరాత్రి నాటికి అందరూ 'ఎదురులపల్లి' గ్రామంలో కలుసుకొని, దగ్గరలో ఉన్న మునికూడలి గ్రామంలో చర్చలు చేసుకునేవారు. ఆసారి కూడా ఋషులు, పండితులు మునికూడలిలో సమావేశమయ్యారు. శ్రీపాదుల మహిమల గురించి వారందరూ చర్చలు జరిపాక ఆ పండిత బృందంతోపాటు మా నాన్నగారు నన్ను కూడా పిఠాపురం తీసుకుని వెళ్ళారు.

బాపనార్యుల ఇంట విందుభోజనం ఏర్పాటు చేసారు. శ్రీపాదులకి అపుడు అయిదు సంవత్సరాలు. నేను వారి పాదాలను తాకి నమస్కరించగా తమ అమృతహస్తాన్ని నా తలపై ఉంచి, "జన్మ జన్మాంతరాలలో కూడ నా అనుగ్రహం నీపై ఉంటుంది. నీవు నీ చివరి జన్మలో వెంకయ్య అనే అవధూతగా జన్మించి అకాలం సంభవించినపుడు వర్షాలు కురిపించగలిగే సమర్థతతోనూ, గృహస్థుల ఈతిబాధలను తీర్చగలిగే సమర్థత తోనూ వెలుగొందెదవు గాక!" అని ఆశీర్వదించారని చెప్పిన తరువాత ఆనందశర్మ గాయత్రీ మంత్ర సాధనా రహస్యాలను వివరించారు:

## గాయత్రీ - పరబ్రహ్మ - మాయాతత్త్వాల నిరూపణ

"గాయత్రీ మంత్ర సాధన వల్ల భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక క్షేత్రాలలో అన్ని విధాల పరిణతిని పొందవచ్చు. మన శరీరంలో వివిధ భాగాలలో 24 గ్రంథులు ఉన్నాయి. 'ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం భర్గో



దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్,' అనే 24 అక్షరాలు కల మంత్రాన్ని చదువుతున్నపుడు ఒక్కొక్క గ్రంధిలోని శక్తి ఒక్కొక్క అక్షరాన్ని ఉచ్చరించడం వల్ల జాగృతం అవుతుందని, గాయత్రీ మంత్రం కల్పవృక్షం వంటిదని చెప్పి ఎటువంటి మార్పులకు లోనుకాని [6] 9 అను సంఖ్య సుస్థిరమైన బ్రహ్మతత్వాన్ని సూచిస్తే [7] 8 మాయా స్వరూపమైన లక్ష్మీదేవిని సూచిస్తుంది," అని వివరించారు.

"శ్రీపాదులు నృసింహసరస్వతిలా అవతరిస్తారు. అపుడు వారు శ్రీకృష్ణసరస్వతి అనే యతిని తమ గురువులుగా స్వీకరిస్తారు," అని తెలిపారు. "అవతార పురుషులకు కూడా గురువుల అవసరం ఉందా?" అని నేను ప్రశ్నించాను. "భగవంతుడు అవతారం ధరించేదే భక్తుల కొరకు. మానవ రూపం ధరించి వచ్చినపుడు ఉత్కృష్ట వ్యక్తి ఎలా నడచుకోవాలో తాను ఆచరించి మనకు దారి చూపుతారు. వారికి గురువుగా వచ్చే వ్యక్తి చాలా యోగ్యుడై ఉండాలి. శ్రీపాదులు వాజపేయవంశంలోని మాయణాచార్యుల పుత్రుడైన మాధవాచార్యుని తమ గురువుగా ఎన్నుకున్నారు. మాధవాచార్యులు ఒక జన్మలో విద్యారణ్యస్వామిగా, తరువాత జన్మలో కృష్ణసరస్వతిగా అవతరించి నృసింహసరస్వతుల గురువులుగా ఉంటారు," అని వివరించారు. 'శ్రీవారి అవతార విశేషాలను తెలుసుకోవాలి,' అనే నా కుతూహలాన్ని వ్యక్తం చేసాను. వారెంతో సంతోషించి ఈ క్రింది సంఘటన చెప్పారు.

---

6. 9ని దేనితో గుణించినా వచ్చే గుణాంకంలోని రెండు అంకెలను కలిపితే వచ్చే మొత్తం మళ్ళీ 9 అవుతుంది.

7. 8ని 1తో గుణిస్తే వచ్చే గుణాంకం 16లోని రెండు అంకెలను కలిపితే 1+6=7 ఇలా అంకెల మొత్తం ఒకటి ఒకటిగా తగ్గుతూ వస్తుంటుంది..ఇది మాయాతత్త్వం.

## వేంకటశ్రేష్ఠి ప్రాణరక్షణ

"పీఠికాపురంలో ఒక జ్యోతిష్కుడు ఉండేవారు. ఒక వ్యక్తి ప్రాణం ఏ సమయంలో పోతుందో ఘడియలు, విఘడియలతో సహా చాలా ఖచ్చితంగా చెప్పేవాడు. అతని జోస్యం పొల్లుపోయిన దాఖలాలు ఎక్కడా లేవు. అతను ఫలానా రోజున ఇన్ని ఘడియల, విఘడియలకు నీవు మరణిస్తావని శ్రేష్ఠితోనే చెప్పి తాను ఒక ఔషధం, తాయెత్తు ఇస్తానని, అపమృత్యు దోషం తొలగి పోతుందని భరోసా ఇచ్చి దానికి ప్రతిఫలంగా అప్పలరాజశర్మ స్థానంలో తనని కులపురోహితునిలా చేసుకోమని అడిగారు. శ్రేష్ఠి అంగీకరించలేదు. శ్రేష్ఠి మరణగండం రోజున రాజశర్మ, సుమతి, బాపనార్యులు, శ్రీపాదులు వారింటనే ఉన్నారు. శ్రేష్ఠికి అకస్మాత్తుగా గుండెలో బాధ కలిగి అమ్మా! అంటూ మూల్గారు. వెంటనే సుమతి వారి గుండె మీద చేతితో సున్నితంగా రాయడం, శ్రీపాదులు 'ఫో' అని అరవడం, వాళ్ళ ఇంట్లోని ఆంబోతు గిలగిలా తన్నుకొని చనిపోవడం, అన్నీ ఒకేసారి జరిగాయి. దీనితో శ్రేష్ఠిగారి మృత్యుగండంతొలిగి పోయింది. విషయం తెలిసిన జ్యోతిష్కుడు పరుగుపరుగున వచ్చాడు. "నీవు అమోఘ జ్యోతిష్కుడవే, శ్రేష్ఠి విషయంలో నీ లెక్క కూడా అక్షరాలా సరి అయినదే, కాని నేనుండగా శ్రేష్ఠి వద్దకు మృత్యువు ఎలా వస్తుంది? నీ తండ్రి జీవించి ఉన్నపుడు శ్రేష్ఠి వద్ద అప్పు తీసుకొని గాయత్రీ సాక్షిగా తాను అప్పు తీర్చానని అబద్ధం చెప్పాడు. అందువల్ల శ్రేష్ఠి ఇంట్లో ఆంబోతులా జన్మించాడు. నేను శ్రేష్ఠి అపమృత్యు దోషాన్ని ఆంబోతుకి బదలాయించి వారిని రక్షించాను. నీవు ఆ ఆంబోతు రూపంలో ఉన్న నీ తండ్రికి దహన సంస్కారాలు చేసి అన్నదానం చేసినట్లయితే దానికి ఉత్తమ గతి ప్రాప్తిస్తుంది," అని శ్రీపాదులు ఆ జ్యోతిష్కునికి చెప్పారు. అతడు ఆ విధంగానే చేసాడు.

"నాయనా! శంకరభట్టూ! **శ్రీపాదులు ఇలా కర్మను బదలాయించో,**

**రాబోయే జన్మలోని ఆయుష్షుని కొంత ఈ జన్మలో ఇచ్చి, లేదా మృత్యువుని శాసించి రకరకాల పద్ధతుల ద్వారా భక్తుల ప్రాణాలు నిలుపుతారు. వారిది యోగ సంపూర్ణ అవతారం,"** అని ముగించారు. నేను ఉదయాన్నే లేచి కాలకృత్యాలు తీర్చుకొని కురువపురం వైపు బయలు దేరాను.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



వెంకయ్య అవధూత



విద్యారణ్యస్వామి



కృష్ణసరస్వతి

## 14వ అధ్యాయం

## దత్తులు గౌడకులస్థునిలా శంకరభట్టుని కలుసుకోవడం

## (శ్రీపాదులు ఆరు-ఏడు సంవత్సరాల బాలుడు)

### దత్తులు పరీక్షా ప్రియులు

కొద్దిరోజులు ప్రయాణం చేసి ముంతకల్లు అనే గ్రామం చేరుకున్నాను. ఆ గ్రామంలో నడచి వెళ్తుండగా చేతిలో కల్లుముంతతో ఒక వ్యక్తి నేను ఎటు వెళ్తుంటే అటే నడుస్తూ, తప్పించుకుందామని నేను ఎంత ప్రయత్నించినా లెక్క చేయకుండా తొందర తొందరగా నడచి నన్ను కలుసుకున్నాడు. "ఓయీ! నీవెవరవు?" అని కొంచెం విసుగు వ్యక్తం చేస్తూ అడిగిన నా ప్రశ్నకు, "ముందుగా నీవెవడివో, ఎక్కడి నుండి వచ్చావో తెలుసుకోవడం ఉత్తమం కదా!" అని జవాబిచ్చాడు. ఇక్కడ కల్లు అమ్ముకునే వ్యక్తికి కూడా వేదాంతం బాగా తెలుసు కాబోలు అనుకున్నాను. ఇంతలో అతను దారి నపోయే వారందరిని పిలిచి, "అయ్యా! నేను కల్లు తీసి అమ్ముకునేవాడిని. నాకు తాటిచెట్టే కల్పవృక్షం. నేను తాటిచెట్టు ఎక్కి కల్లు తీస్తుంటే ఇతను నా వద్దకు వచ్చి తాను బ్రాహ్మణుడనని, కల్లుకి అలవాటు పడ్డానని, తన వద్ద పైకం లేదని, కాస్త కల్లు పోయమని బ్రతిమిలాడి తీరా నేను చెట్టు దిగి రాగానే ఇక్కడ మనుష్య సంచారాన్ని చూసి మొహమాటపడి వద్దని మొరాయిస్తున్నాడు. ఇతడికి ధర్మోపదేశం చేసి వాగ్దానభంగం అయ్యే పాపం నుండి నన్ను రక్షించండి," అని చెప్పాడు. వాళ్ళంతా గౌడ కుల స్థులే అవడంతో నా మాట నమ్మక అందరూ కలిసి నాతో బలవంతంగా కల్లు తాగించారు. అటు తరువాత ఆగంతకుడితోసహా అందరూ తలా ఒక దారిన వెళ్ళిపోయారు. బ్రాహ్మణ పుట్టుక పుట్టి కల్లు తాగవలసి వచ్చిన నా దుర్దశకు కుములుతూ, తడబడే అడుగులతో నడిచి వెళ్తూ దారిలో నేను

ఒక ఆశ్రమం చూసాను. కాని అందులో ప్రవేశించే అర్హత నాకు లేదని తలచి ముందుకు సాగిపోయాను. ఇంతలో వెనుక నుండి ఒక వ్యక్తి, "ఓయీ శంకరభట్టు! దత్తానందులవారు నిన్ను రమ్మంటున్నారు," అంటూ పిలిచి నన్ను స్వామి దగ్గరకు తీసుకొని వెళ్ళాడు. నేను స్నానం చేసాక మధురఫలాల ను తినడానికి ఇచ్చి ఆ స్వామి నాతో ఇలా అన్నారు, "దత్త ప్రభువులకు నీపై ఎంత అనుగ్రహం! వారు స్వయంగా తమ దివ్యహస్తాలతో నీకు అమృతాన్ని తాగించారు. నీవు ఒకానొక జన్మలో గౌడ కులస్థుడవై ఉండి అమితంగా కల్లు తాగేవాడివి. ఆ కోరిక ఈ జన్మలోనూ నీ అంతరాంతరాలలో ఉండటం వల్ల నీ కోరిక ఈ విధంగా తీర్చి నిన్ను పతనాన్నుంచి కాపాడారు. నీకు తెలియకుండానే నీ వెంట వస్తూ గండాంతరాల నుంచి కాపాడుతూ కంటికి రెప్పలా నిన్ను చూసుకుంటున్నారు."

## దత్తానందుల వృత్తాంతం

ఆ తరువాత స్వామి తన గురించి ఇలా చెప్పారు. "నాకు చిన్నప్పటి నుండి నత్తి ఉండేది. దీనికి తోడు ఒక వింత జబ్బు మొదలైంది. పది సంవత్సరాల వయసులో యాభై సంవత్సరాల వృద్ధుడిలా కనిపించేవాడిని. పీఠికాపురిలో బాపనార్యుల ఆధ్వర్యంలో యజ్ఞం జరుగుతుందని విని నా తండ్రి నన్ను అక్కడికి తీసుకొని వెళ్ళారు. అక్కడ యజ్ఞానికి కావలసిన నెయ్యిని సేకరించి ఒక వృద్ధుని ఇంట ఉంచారు. అతడు లోభి, పైగా దురాశాపరుడు. ఆ ఘృతంలోని ఒక వంతు దాచివేసి మూడువంతులు యాగస్థలానికి పంపాడు. యజ్ఞకార్యానికి నెయ్యి సరిపోలేదు. అప్పటికప్పుడు నెయ్యి సేకరించటం కూడా కష్టం. కాబట్టి శ్రీపాదులు ఆ వృద్ధ బ్రాహ్మణుని పిలిచి ఒక తాళపత్రంపై, "అమ్మా! గంగమ్మ తల్లీ! యజ్ఞానికి అవసరమైన నెయ్యిని ఇవ్వవలసినది. నీ బాకీని మా తాతగారైన శ్రేష్ఠిగారు తీరుస్తారు," అని వ్రాయించి శ్రేష్ఠిగారి అంగీకారం తీసుకొని వృద్ధబ్రాహ్మణుడితో సహా

నలుగురిని పాదగయా తీర్థానికి పంపారు. వారు ఆ పత్రాన్ని ఆ తీర్థంలో వేసి పాత్రలలో నీటిని తీసుకొని వచ్చారు. యాగస్థలంలో అందరు చూస్తుండగా ఆ నీరంతా నెయ్యిలా మారిపోయింది. యజ్ఞం నిర్విఘ్నంగా సమాప్తి అయ్యాక శ్రేష్ఠి ఆ పాత్రల నిండుగా నేతిని గంగకు సమర్పించినపుడు నీటిలో పడుతూనే నెయ్యి నీరుగా మారిపోయింది.

మా నాయన నా దుస్థితిని శ్రీపాదులకు విన్నవించగా, "మీ అబ్బాయి జబ్బుని, నత్తిని కూడ పోగొడతాను," అని అభయం ఇచ్చారు. ఆ వృద్ధబ్రాహ్మణుని పిలిచి, "ఒక ఇంటిని పరశురామప్రీతి (దహనం) చేయాలి. ముహూర్తం నిర్ణయించండి,"అని అడిగారు. యజ్ఞానికి అవసరమైన నేతిని దొంగలించడంవల్ల ఏదైనా కీడు జరుగుతుందేమో అని భయపడుతున్న ఆ వృద్ధుడు, "ఇల్లు కట్టడం, వివాహం చేయడంలాంటి శుభకార్యాలకి ముహూర్తాలు ఉంటాయి. కాని దొంగతనాలు, గృహదహనాల వంటి కార్యాలకు ముహూర్తాలు ఉండవు, అవి వర్జిత సమయాలలో చేయవచ్చునేమో," అని తన అభిప్రాయం వెలిబుచ్చారు. వెంటనే శ్రీపాదులు, "అటువంటి వర్జిత దుర్ముముహూర్తం ఇప్పుడు ఉందా?" అని అడిగి, అటువంటి దుర్మహూర్తం అపుడు నడుస్తుందని తెలుసుకొని, "యజ్ఞం కోసం సేకరించిన పరమ పవిత్రమైన ఘృతాన్ని దొంగిలించిన ఒక ధూర్తుడి ఇంటిని ఈ వర్జిత సమయంలో అగ్ని దేవుడు దహించి తన ఆకలిని తీర్చుకుంటున్నాడు," అని చెప్పారు. ఇది వినడంతోనే ఆ వృద్ధ బ్రాహ్మణుడి ముఖం వెలతెలాపోయింది. అతని ఇల్లు కాలి బూడిద అయ్యింది. ఆ కాలిన ఇంటి భస్మాన్ని తీసుకు రమ్మని శ్రీపాదులు ఆ బ్రాహ్మణునికి చెప్పి, తెచ్చాక దానిని నీటిలో వేసి తాగమని నాకు ఇచ్చారు. ఆ విధంగా మూడు రోజులు త్రాగాక నా వింత వ్యాధి, నత్తి రెండూ మాయమయ్యాయి. శ్రీపాదులు నాకు శక్తిపాతం చేసి మా ఇద్దరి వృత్తాంతం ఈ విధంగా చెప్పారు:

## దత్తానందుల పూర్వజన్మగాథ

"పూర్వజన్మలో మీరిద్దరు కలిసి వ్యాపారం చేసేవాళ్ళు. మెల్లగా ఇద్దరి మధ్యా శతృత్వం పెరిగి ఒకరినొకరు చంపడానికి ప్రయత్నించుకున్నారు. నువ్వు ఈ బ్రాహ్మణునికి పాయసంలో విషం కలిపి ఇచ్చావు. అదే సమయానికి అతడు నీ ఇంటిని కాల్చి భస్మం చేసాడు. ఇంటితో పాటు నీ భార్యా పిల్లలు కూడా దహనం అవడంతో నీవు అక్కడికక్కడే గుండెపోటుతో మరణించావు. విషప్రయోగం చేసినందువల్ల నీకు ఈ వింత వ్యాధి వచ్చింది. ఈ నాటితో మీరిద్దరు కర్మ విముక్తులు అయ్యారు," అని వివరించి ఆ బ్రాహ్మణునికి కొత్త ఇల్లు కట్టించి ఇచ్చారు. శ్రీపాదుని లీలలు అనితరసాధ్యాలు.

## దత్తాదాస ప్రబోధిత శ్రీపాదుల సంక్షిప్త చరిత్ర

శ్రీపాదులకు ఏడేళ్ళు రాగానే ఎంతో వైభవంగా ఉపనయనం చేసారు. కాని పంచమజాతివాడైన మాలదాసరికి దీన్ని చూసే అవకాశం లేకుండా పోయింది. ఆ ఉత్సవాన్ని చూడలేకపోతున్నానే అనే ఆవేదన, తన పరమాత్ముని ఉపనయనోత్సవ రూపంలో చూడాలనే ఆర్తిని అణచుకోలేక ఆ జగత్ప్రభువులపై కల మమకారాన్ని తనకు తోచిన విధంగా నలుగురితో పంచుకోవడానికి తన జాతి వాళ్ళందరిని పిలిచి వాళ్ళకి దత్తచరిత్ర ఈ విధంగా వివరించాడు: **"పూర్వయుగంలో అనసూయామాతకు, అత్రి మహర్షికి కుమారుడిగా అవతరించిన ఆ పరంజ్యోతియే ఈనాడు కలియుగంలో శ్రీపాద శ్రీవల్లభరూపంతో మన పీఠికాపురంలో అవతరించారు. ఆ మహాప్రభువునకు నేడు ఉపనయనం జరుగుతున్నది. ఉపనయనం జరిగాక మన ప్రభువు దివ్యతేజోవిరాజితుడై ప్రకాశిస్తుంటారు. దీనజనుల నుద్ధరించే ఆ ప్రభువునకు నిత్య శ్రీరస్తు, నిత్య శ్రీ మంగళం అగుగాక"!** ఇంతకంటె చెప్పడానికి అతనికి పాండిత్యం లేదు. అతడు పదే పదే అదే చెప్పుకుపోతున్నాడు. శ్రోతలుకూడా తన్మయులై వింటున్నారు.

ఈ విధంగా 53 సార్లు జరిగింది. ఇక్కడ శ్రీపాదులు అతన్ని అనుగ్రహించి, 'పవిత్ర మనస్కుడైన మాలదత్తదాసు నా చరిత్రను 53 సార్లు చెప్పాడు. కాబట్టి 53అధ్యాయాల నా చరిత్ర పారాయణం చేస్తే ఇచ్చే ఫలితాన్ని నేనతనికి ఇవ్వాలి. నేను అతని ఇంటికి వెళ్తున్నాను,' అని ప్రకటించారు. కాని పీఠికాపుర బ్రాహ్మణులు ఒక మాలవాడి ఇంటికి శ్రీపాదులు వెళ్ళకూడదని అభ్యంతరం చెప్పారు. కోపంతోను, ఆవేశంతోను శ్రీపాదులు, "మీరు ఎవరినైతే పంచమజాతి అంటూ అణచివేయాలని చూస్తున్నారో వాళ్ళే నా అనుగ్రహంతో భవిష్యత్తులో ఉన్నతస్థితిలో ఉంటారు. మీరు సేవావృత్తి చేసుకుంటూ ధర్మ కర్మభ్రష్టులై వ్యవహరిస్తారు," అని కఠినంగా పలికి దత్తదాసు ఇంటికి వెళ్ళారు. అక్కడ పరమానందంతో వాళ్ళు ఇచ్చిన పాలని తాగి స్వహస్తాలతో వాళ్ళందరికి మిఠాయి పంచిపెట్టారు.

"నాయనా! శంకరభట్టూ! దత్త ప్రసాదాన్ని ఏ కులం వాళ్ళు ఇచ్చినా నిరాకరించకుండా భక్తితో గ్రహించాలి. అలా కాని పక్షంలో కష్టనష్టాలకు గురి అవుతారు," అని తమ కథనాన్ని ముగించారు దత్తానందస్వాములు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 15వ అధ్యాయం

# వినూత్న యోగ ప్రక్రియ

## (శ్రీపాదులు ఏడు - ఎనిమిది సంవత్సరాల బాలుడు)

## బంగారప్ప కథనం

దత్తానందుల దగ్గర సెలవు తీసికొని నేను దారివెంట పోతూ, దప్పిక వేసి దగ్గరలో ఉన్న బావి వద్దకు వెళ్ళాను. అక్కడ నీళ్ళు తోడుకోడానికి త్రాడుకు కట్టిన చేద కూడా ఉంది. బావిలోకి తొంగి చూడగా లోపల ఒరల మధ్య మొలచిన చెట్టుని ఆధారంగా చేసుకొని తలక్రిందులుగా వ్రేలాడుతున్న ఒక వ్యక్తి కనిపించాడు. అతడు నన్ను ప్రేమతో, "శంకరభట్టూ! వచ్చావా? నీకోసమే ఎదురుచూస్తున్నాను," అంటూ రెప్పపాటులో నా ప్రక్కన నిల్చున్నాడు. నీ దాహం తీరుస్తానంటూ చేదను బావిలో వేసి నీటిని తోడి, తాను నీటిని గడగడ తాగడం మొదలు పెట్టాడు. విచిత్రంగా నా దాహం తీరింది. కళ్ళ ముందు జరుగుతున్న విచిత్ర సంఘటనలను ఆశ్చర్యంగా చూస్తున్న నాతో అతడు తన కథని ఇలా చెప్పసాగాడు:

## బాపనార్యులు-శ్రీపాదులపై తాంత్రిక ప్రయోగాలు

"నా పేరు బంగారప్ప. నేను మంత్ర-తంత్రాలలో ప్రావీణ్యత సంపాదించాను. నాకు భూత-ప్రేతాలతో కూడా సన్నిహితత్వం ఉండేది. నా సంచారాలలో ఒకసారి పీఠికాపురం వచ్చాను. బాపనార్యులు, శ్రీపాదుల గురించి విచిత్ర విషయాలను విన్నాను. మొదట బాపనార్యులను చంపదలచి, ఒక కొలను దగ్గరకు పోయి దోసిళ్ళకొద్ది నీరు త్రాగసాగాను. ఈ మారక ప్రక్రియ ప్రకారం నేను చంపదలచిన వ్యక్తి పొట్టలోనికి ఈ నీరంతా చేరి అతడు పొట్ట పగిలి మరణిస్తాడు. కాని, సరిగ్గా అదే సమయంలో బాపనార్యుల చెంత ఉన్న శ్రీపాదులు తమ అమృతహస్తంతో వారి పొట్ట నిమురుతూ ఉండటంతో నీరంతా ఆవిరి అయ్యి బాపనార్యులకు ఎటువంటి

ప్రమాదం జరగలేదు. పట్టువదలని నేను ఒక సర్పమంత్రాన్ని చదివాను. దానివల్ల ఎక్కడెక్కడి పాములు నేను ధ్యానించే వ్యక్తి ఇల్లు చేరి అతనిని కాటు వేస్తాయన్నమాట. ఎన్నో పాములు బాపనార్యుని ఇంటికి అయితే వెళ్ళాయి, కాని అక్కడ ఉన్న పందిరికి కొద్దిసేపు పొట్లకాయల్లా వేలాడి తరువాత వెనక్కి తిరిగి వెళ్ళిపోయాయి. భూత ప్రేతాలయితే వాళ్ళ ఇంటి దరిదాపులకే పోలేమని నిష్కర్షగా చెప్పాయి. పట్టుదలతో నేను శ్మశానానికి పోయి శ్రీపాదుల పిండి బొమ్మను తయారుచేసి 32స్థానాలలో సూదులు గుచ్చాను. దీనివల్ల శ్రీపాదులకు ఆయా స్థలాలలో విపరీతమైన బాధ కలిగి, ఆ సూదులు ద్రవించటం మొదలైన వెంటనే శరీరం విషపూరితమై మరణిస్తారు. విచిత్రం! ఇది కూడా విఫలమైంది.

## తాను తీసిన గోతిలో తానే పడిన బంగారప్ప

పైపెచ్చు ఒక అర్ధరాత్రి అకస్మాత్తుగా నాకు పొట్టనిండుగా నీరు చేరి, ప్రాణాంతకంగా ఉన్న స్థితిలో నా మంత్రాల వల్ల ప్రభావితమైన పాములన్ని వచ్చి నన్ను కాటు వేసాయి. బొమ్మకు ఏయే ప్రదేశాలలో సూదులు గుచ్చానో సరిగ్గా ఆ ప్రదేశాలలో విపరీతమైన బాధ మొదలైంది. శరీరం విషపూరితమై మరణమే మేలనిపించేంత నరకయాతన అనుభవిస్తూ, మనసులో శ్రీపాదులను శరణు జొచ్చాను. **నిస్సహాయ స్థితిలో ఎటువంటి వారికైనా గుర్తు వచ్చేది పరమాత్మ ఒక్కడే కదా!** వెంటనే వారి రూపం కళ్ళకు కనిపించి, “బంగారప్పా! నీవు మహా పాతకాలు చేసావు. ఎందరో అమాయకులను హింసించావు. బాపనార్యుల వంటి పుణ్యాత్ముణ్ణి చంపాలని చూసావు. అయినా నిన్ను అనుగ్రహించి ఎన్నో జన్మజన్మాంతరాల వరకు అనుభవించ వలసిన బాధను ఈ ఒక్క రాత్రి మాత్రమే అనుభవిచేలా చేస్తాను. ఇకపై నీ క్షుద్రవిద్యలు పనిచేయవు. దప్పిక వేసినవారు నీ మనోనేత్రం ముందు కన్పించినపుడు నీవు నీరు త్రాగినట్లయితే వారి దాహం

తీరుతుంది. తలక్రిందులుగా వ్రేలాడటం అనే యోగ ప్రక్రియను నేర్చుకొని ఆనందాన్ని అనుభవించు. శంకరభట్టు అనే బ్రాహ్మణుడు కనిపించిన తర్వాత నీ పాపం నిశ్శేషం అవుతుంది," అని చెప్పారు. అప్పటినుండి నీ కోసమే ఎదురు చూస్తున్నాను," అనిచెప్పి తన కథ ముగించారు.

## విచిత్ర యోగప్రక్రియ

"అయ్యా! నీళ్ళు మీరు త్రాగితే నా దాహం ఎలా తీరుతున్నది?" అని నాసందేహం వ్యక్తపరిచాను. "నా ప్రాణమయ శక్తిని ఒక యోగ ప్రక్రియ ద్వారా దప్పికతో బాధ పడుతున్న ఇతర జీవుల ప్రాణమయ శక్తితో అనుసంధానం చేయటం వల్ల ఇది సాధ్యం అవుతుంది. 'వాలి' ఇలాంటి ప్రక్రియ వల్లనే ఎదుటివారి శక్తిని ఆకర్షించేవాడు. అందుకే శ్రీరాముడు చెట్టుచాటునుండి అతన్ని వధించారు, రామలక్ష్మణులు బల, అతిబల విద్యలతో విశ్వశక్తిని తమలోకి ఆకర్షించేవారు. శరీరం పరిశుద్ధంగా లేకపోయినట్లయితే ఈ శక్తిని భరించలేక మరణం కూడా సంభవించవచ్చు. పరిశుద్ధతా క్రమంలో శ్రీరాముని శరీరం 12వ దశకు చెందితే శ్రీపాదుల శరీరం 12వ దశకంటె అతీతమైన స్థితిలో ఉంది," అని విశదీకరించారు.

## వివిధ స్థితులలో ఆత్మ అనుభవాలు

"అయ్యా! గౌతమముని శాపంవల్ల అహల్య నిజంగా శిల అయిందా?" అని ప్రశ్నించాను. దానికి బంగారప్ప, "చైతన్య పరిణామ క్రమంలో శిల ప్రథమ స్థానంలో ఉన్నది. దానిలో ఆత్మ నిర్జీవ స్థితిలో ఉంటుంది. దిగ్భ్రాంతి చెందిన అహల్య ఆత్మ శ్రీరాముని పాదధూళి సోకేంత వరకు నిర్జీవ స్థితిలో ఉండి తరువాత చైతన్యవంతమైందని చెప్పి జీవుల పరిణామ ప్రక్రియని ఇలా వివరించారు: "శిలాస్థితిలో ఆత్మకు జీవం లేదు. కాని, బాధానుభవం మాత్రం ఉంటుంది. ప్రాణంలేని స్థితిలో అనుభవించే మహాదుఃఖమది. ఎన్నో శిలల్లో ఆత్మ పరిభ్రమిస్తూ లోహంలో ప్రవేశించి, వివిధ లోహాలలో

సంచరిస్తుంటుంది. ఇక్కడ ప్రాణం నిద్రాణ స్థితిలో ఉంటుంది. తరువాత ఆత్మ వృక్షాలలో ప్రవేశించగానే ప్రాణం చైతన్యవంతమై, తరువాత క్రిమి కీటకంగా పరిణతి చెందుతుంది. తర్వాత వరుసగా చేప, పక్షి, జంతువుల జన్మలను ఎత్తి, ఆవు జన్మలో తల్లిలా క్షీరం ఇచ్చి, వృషభ జన్మలో ఆహార ఉత్పాదనకు తోడ్పడి తమకు తెలియకుండానే పుణ్య సముపార్జన చేసి మానవ జన్మ ఎత్తుతుంది."

## సప్తభూమికల వివరణ

అటు తరువాత వారు సాధకుని సప్త భూమికలను ఈ విధంగా వివరించారు: "మొదటి భూమికలో స్థూల, సూక్ష్మ, దేహేంద్రియాలు ఏకకాలంలో ఉపయోగింపబడుతాయి. 2వ భూమికయందు చిన్న మహిమలను చేయగల శక్తి 3వ భూమికలో సుదూర ప్రాంతాలకు సూక్ష్మ శరీరంతో పయనించే శక్తి వస్తుంది. 4వ భూమికలో విస్తారమైన యోగశక్తులు లభించుతాయి. వాటి దుర్వినియోగం వల్ల తిరిగి శిలాస్థితికి చేరే ప్రమాదం ఉంది. 5వ భూమికలో సంకల్పజ్ఞానాన్ని పొంది దైవసాక్షాత్కారం కోరుతూనే ప్రాపంచిక కార్యకలాపాలను నిర్వహిస్తారు. 6వ భూమికలో భావ, జ్ఞాన ప్రాప్తి కలుగుతుంది. అందువల్ల ప్రాపంచిక ధ్యాస తక్కువగా ఉంటుంది. 7వ భూమికయందు పరమాత్ముని అనంత స్థితి అవగాహన కలుగుతుంది."

## ద్వంద్వాల ప్రాధాన్యత

"అవతార పురుషులకు, సాధకులకు మధ్యగల భేదం ఏమిటి?" అని నేను ప్రశ్నించాను. "మానవుడు తాను చేసే సత్కార్యాలవల్ల భగవంతుడైనట్లయితే సమర్థ సద్గురువు అని పిలువబడతారు. దైవం మానవరూపంలో జన్మించినట్లయితే అవతారం అని అంటారు. అవతారాలు కాలానుగుణంగా వస్తుంటాయి. ఒక్కొక్క అవతారం ఒక్కొక్క గుణానికి ప్రతీక. **శ్రీపాదుల అవతారం అద్భుతమైన, విలక్షణమైన యుగావతారం. ఈ**

**సృష్టికంతటికి ఆది, అంత్య బిందువులు వారే . సృష్టి, స్థితి, లయలు వారి సంకల్పాలే,"** అని చెప్పారు. "అయ్యా! అన్ని కర్మలకు వారే ప్రబోధకులైతే కొందరిని మంచిగాను, కొందరిని చెడుగాను సృష్టించడం ఎందుకు?" అని అడిగాను. దానికి బంగారప్ప పెద్దగా నవ్వి, "ద్వంద్వం సృష్టికి ఆధారం. మృత్యుభయం లేనిదే కన్నతల్లి కూడా తన పిల్లలను ప్రేమించలేదు. ద్వంద్వం లేకపోతే వికాసం, పరిణతి ఉండవు. భగవంతుడు సర్వశక్తిమంతుడు అంటే మంచి శక్తులు, దుష్ట శక్తులూ కలిగినవాడని అర్థం. దుఃఖానుభవం లేనిదే సుఖాన్ని ఎలా ఆస్వాదించగలడు? **ఈ జన్మలో సత్పురుషుడైన వాడు పూర్వ జన్మలలో దుష్కర్ముడై ఉండవచ్చును, అదేవిధంగా దుర్మార్గుడు సత్కర్ముడై ఉండవచ్చును. సుఖ దుఃఖాలు, పురాకృత పుణ్య పాప ఫలాలే. సామాన్య పాప పుణ్యాలు వెంటనే ఫలితాలని ఇవ్వవు. అధర్మం మితిమీరినప్పుడు పరమాత్మ అవతరిస్తాడు.**

చావు పుట్టుకలు లేని పరమాత్మ జరా మరణ భరితమైన మానవుని జన్మ ఎత్తి మన మధ్య సంచరించడం అద్భుత విషయం కాదా?" అంటూ వివరించారు.

## పీఠికాపుర మహారాజు వృత్తాంతం

తరువాత పీఠికాపుర మహారాజు వృత్తాంతాన్ని చెప్పడం మొదలుపెట్టారు: ‘‘పీఠికాపుర రాజునకు శ్రీపాదులని చూడాలని కోరిక కల్గింది. వెంటనే భటులను పంపి వారందరిని తమ సమ్ముఖానికి రావలసిందిగా వర్తమానం పంపారు. దానికి శ్రీపాదులు ‘తాను సమస్త భువనాలకు సార్వభౌముడనని, కాబట్టి రాజే స్వయంగా తమ వద్దకు రావాలని, వచ్చేటప్పుడు ఉత్తచేతులతో రాకూడదని, నజరానా తేవాలని, తమను గురువుగా భావించినట్లయితే గురుదక్షిణ కూడా తీసుకురావాలని,’ భటులతో చెప్పి పంపారు.

## రాజునకు చక్కటి నజరానా

శ్రీపాదులు సమస్యలను సృష్టించడంలో బహునేర్పరి. అలాగే సమస్యలను పరిష్కరించడంలో కూడా బహుచతురులు. భటులు తెచ్చిన వార్త విన్న రాజు ఆవేశంతో, "నేను తలచుకుంటే ఈ బడుగు బాపనుల బ్రతుకెంత? నా శక్తి వారికి తెలియదు," అంటూ బిగ్గరగా అరిచారు. వెంటనే శరీరంలోని శక్తి అంతా పోయి నిర్వీర్యుడయ్యారు. అతని మనోనేత్రాలకు వికార రూపంతో ఉన్న ఒక స్త్రీ కనిపించి 'నేనే శక్తిని' అంటూ అతనిలోనికి ప్రవేశించింది. ఆ ధాటికి తట్టుకోలేక రాజు, 'నాలోనుండి వెళ్ళిపో!' అని బాధతో గట్టిగా అరిచారు. 'ఇదిగో, వెళ్ళుతున్నాను,' అంటూ ఆ శక్తి మహాధాటితో బయటకు వెళ్ళిపోయింది. ఈ విధంగా శక్తి రాక–పోకల వల్ల నరక యాతన అనుభవిస్తున్న రాజు, కుల పురోహితుడైన సుందరరామశర్మను పిలిపించారు. అతడు స్వయంభూదత్తుడి అర్చన చేసి తీర్థం ఇచ్చి, విభూతిని నొసట పెట్టగానే శక్తి రాకపోకలు తగ్గాయి. తనపై శ్రీపాదులు క్షుద్రవిద్యను ప్రయోగించారని, తరుణోపాయం చూపమని రాజు పురోహితుని ప్రార్థించారు. 'దత్తపురాణ పారాయణం, దత్తుని అర్చన, భూరిదక్షిణలతో బ్రాహ్మణ సమారాధన, అష్టాదశవర్ణాలవారికి అన్నదానం' ఇవే నివారణోపాయాలని చెప్పిన శర్మ సూచనని వెంటనే అమలులో పెట్టారు.

## దత్తపురాణ పారాయణ ఫలితాలు

దత్తపురాణ పారాయణం మొదలు పెట్టిన దగ్గర్నుంచి నగరంలో విపరీతమైన దొంగతనాలు మొదలయ్యాయి. రాజుకి వారి పితృదేవతలు కలలో కనిపించి, అనుష్ఠానం ఏమాత్రం పాటించని బ్రాహ్మణులతో నిర్వర్తింపబడిన శ్రాద్ధకర్మల వల్ల శ్రాద్ధభోజనం తమకు అందటంలేదని, తమకు సద్గతి కల్పించమని అడిగారు. కళ్ళు మూసుకుంటే చాలు, ఈ

గోల ప్రారంభం. దీనితో రాజుకి రాత్రుళ్ళు నిద్ర లేదు. అన్నం తిందామని కంచం ముందు కూర్చుంటే అన్నమంతా పురుగులమయంలా కనిపించేది. అన్నదానం జరిగేచోటుకి వెళ్ళి చూస్తే తినేవాళ్ళందరు ప్రేత కళలతో కన్పించేవారు. పులి మీద పుట్రలా రాకుమార్తెకు భూతం ఆవహించి జుట్టు విరబోసుకొని అరుస్తూ విపరీత చేష్టలు చేయడం మొదలు పెట్టింది. శర్మ ఇంటిలోను వాతావరణం ఇంచుమించు ఇలాగే ఉంది. ఇల్లాలు వంటపాత్రలతో భర్తని ఇష్టం వచ్చిన చోట మోదటం, పుత్రుడు తండ్రిని తాడుతో కట్టివేయడం, కుమార్తె పాదరక్షలతో బాదడం, ఆకలివేసి అన్నం అడిగితే ఎండుగడ్డి తినమని ఇచ్చి, తినకపోతే చంపుతామని బెదిరించడం. ప్రతిదినం బ్రాహ్మణుల భోజనం అయిన వెంటనే ఇంట్లో భూత, ప్రేత, పిశాచాల స్వేచ్ఛావిహారం, విలయతాండవకేళి. ఇలా ఇల్లంతా అస్తవ్యస్తంగా ఉంది. 'హాయిగా భర్తలతో కాపురం చేసుకుంటున్న తమ కాపురాలు చెడగొట్టి ఆ రాజు పూర్వీకులు తమని బలవంతంగా అనుభవించారని, అంతేకాక ద్రవ్యశుద్ధి లేని ఆ రాచధనంతో చేస్తున్న పిండ ప్రదానం వల్ల తమకు సద్గతి లభించడం లేదని' కొందరు ప్రేత స్త్రీలు శర్మ దగ్గర తమ గోడు వెళ్ళబోసుకున్నారు.

## దత్తులు సాక్షాత్తు త్రిమూర్త్యాత్మకులే

భయభ్రాంతులైన రాజు, బ్రాహ్మణులు, శర్మ మొదలైన వారందరూ, "దత్తపురాణ పఠనం వల్ల దత్తులు ప్రసన్నులవుతారని భావించాము. నిజమే, త్రిమూర్త్యాత్మకులైన దత్తులు ప్రసన్నులై మమ్ములను అనుగ్రహించి తమ బ్రహ్మతత్త్వంతో అశ్లీల భాషతో తమను వేధించే జీవులను సృష్టించారని, అన్నార్తులకు భోజనం, తమకు పస్తు అనుగ్రహించి చావడానికి వీలులేని పరిస్థితులు కల్పించి తమ విష్ణురూపంలోని స్థితి తత్త్వంతో సజీవంగా ఉండేలా చేస్తున్నారని, తమ భూతగణాలతో కరాళనృత్యం చేయిస్తూ

తమను జీవచ్ఛవాలుగా చేస్తూ లయ ప్రధానమైన తమ శివతత్త్వంతో అనుగ్రహిస్తున్నారని, ఇటువంటి దత్తభక్తి జన్మజన్మలకు వద్దు మహాప్రభో!" అని పరితపించి "ప్రభో! నీవే దిక్కు!" అంటూ శ్రీపాదుని శరణు వేడారు.

## శ్రీపాదులే వేతన నిర్ణేత

"సృష్టిలోని ప్రతి మానవుడు కూలీయే, నేను యజమానిని. నేను ప్రసన్నుడను అయితే రావలసిన దానికంటె ఎక్కువ, అప్రసన్నుడను అయితే ఎంత తగ్గించాలో అంత తగ్గించి ఆచి తూచి కూలి ఇస్తాను. దత్తపురాణంలోని విష్ణుదత్తుడు, సుశీల దంపతులే నాతల్లి తండ్రులైన సుమతీ అప్పలరాజశర్మలు. వినాయకుని పుత్రుడైన లాభుడే బాపనార్యులు, వారే లాభాద మహర్షిగాను, భాస్కరాచార్యులుగాను జన్మించారు. సాక్షాత్తు శ్రీపాద రూపంలో ఉన్న నేనే స్వయంభూదత్తుడను, కాలాగ్ని శమనదత్తుడను. నా ముఖమునకు హారతి ఇచ్చి, కాళ్ళకు మేకులు కొట్టినట్లయితే ఏమి ఫలం ఉంటుంది? నన్ను ప్రేమతో 'శ్రీపాదా! దత్తా! శ్రీవల్లభా! దిగంబరా!' అని పిలిచిన క్షణంలో పాపాలన్ని దహించి వేసి పుణ్యాత్ములను చేస్తాను. సత్యాన్ని అసత్యంగా, అసత్యాన్ని సత్యంగా భావించటం వల్ల మీకు ఇలాంటి కష్టాలు కలిగాయి," అని శ్రీపాదులు ఉద్బోధించారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 16వ అధ్యాయం

# శిష్ట రక్షణ-దుష్టశిక్షణ

# (శ్రీపాదులు ఎనిమిది సంవత్సరాల బాలుడు)

## శ్రీమన్నారాయణుని కథనం

శ్రీపాదుల దివ్య చరితాన్ని మననం చేసుకుంటూ వెళ్ళుతుండగా దారిలో చెరకు తోటలో కూర్చొని ఉన్న ఒక రైతు సాదరంగా నన్ను పిలిచి, త్రాగడానికి చెరకు రసం ఇచ్చారు. నా గురించిన వివరాలను విని, సంతోషించి తమ కథనిలా చెప్పసాగారు: “నా పేరు శ్రీమన్నారాయణుడు. మేము మల్లాదివాళ్ళమే, కాని కమ్మవారం. ఆర్థికంగా చితికిపోయి, ఉన్న ఆస్తిపాస్తుల్ని అమ్ముకొని సొంత గ్రామం వదిలి పీఠికాపురం చేరి బాపనార్యులను ఆశ్రయించాము. శ్రీపాదులు అపుడు 8 సంవత్సరాల బాలుడు. బాపనార్యులు మమ్మల్ని ఎంతో ఆదరించి మాకు అన్నపానాలు ఏర్పాటు చేసారు. దండగమారి తిండి తినడం మాకు కష్టంగా తోచి, అదే మాట బాపనార్యులకు చెప్పి వారి పొలాన్ని కౌలుకి ఇస్తే బాగుంటుంది,” అని మా అభిప్రాయాన్ని వెలిబుచ్చాము. భూములు ఇదివరకే పంట కాపులకు ఇచ్చామని, కారణం లేకుండా కౌలు రద్దు చేయడం భావ్యం కాదని, కొంత కాలం ఓర్పు వహించి ఉండమని వారు చెప్పారు. అక్కడే ఉన్న శ్రీపాదులు గుప్పెడు మినుములు మా చేతికి ఇచ్చి ఒక గుడ్డలో మూట కట్టుకొని పశ్చిమ దిశగా వెళ్ళమని, అనుకున్నది నెరవేరిన తరువాత ఆ మినుములను పారవేయమని చెప్పి దీవించి పంపారు.

## వృద్ధ దంపతుల ఇంట నారాయణుని బస

మేము ఆంధ్ర దేశాన్ని దాటి కర్ణాటక చేరుకున్నాము. అక్కడ ఒక వృద్ధ దంపతుల ఇంట్లో బస చేసాము. వాళ్ళూ కమ్మవాళ్ళే. ఉన్న ఒక్క కొడుకు పాముకాటు వల్ల, స్నానం చేస్తున్న కోడలు నదిలో మునిగిపోవడం

వల్ల మరణించడంతో ఆ ముసలి దంపతులకు తమవారంటూ ఎవరూ లేకుండాపోయారు. వారికి మాపై పుత్ర వాత్సల్యం పెరిగింది. ఆస్తి పైన లోభం కొద్ది వాళ్ళ ఇంట్లో చేరిన దాయాదులకు మాపై కంటగింపుగా ఉండేది. అక్కడి నుండి వెళ్ళి పోదామని మేము ఎప్పుడు బయలుదేరినా, ఏదో ఒక ఆటంకం వచ్చేది. మినుములనుండి కూడా దుర్వాసన రావడం వల్ల అక్కడ ఉండడమే శ్రీపాదుల అభిమతం కాబోలు అనుకొని అవి పారవేసి అక్కడే ఉండిపోయాము.

## దత్తస్వీకారం

ఆ దంపతులు మమ్మల్ని దత్తత తీసుకుందామని అనుకున్నారు. దాయాదులు ఒక జ్యోతిష్కునితో మేము నష్ట జాతకులమని, మేమున్నచోట జ్యేష్ఠాదేవి ఉంటుందని చెప్పించారు. ఆ దంపతులు దీనికి కొంచెం కూడా చలించక పోగా, యోగం ఉన్నట్లే పరిహారం కూడా శాస్త్రంలో చెప్పి ఉంటుంది. కాబట్టి, ఆ చెడు యోగం పోయేలా, మంచి ఫలితాలు కలిగేలా పూజలు చేయించమని ఆ జ్యోతిష్కుని కోరారు. జ్యోతిష్కునికి గత్యంతరం లేకపోయింది. అమంగళ పరిహారార్థం యజ్ఞం చేయించారు. నాయనా! శంకరా! దేవ, మనుష్య, భూత, పితృ, బ్రహ్మయజ్ఞం అని యజ్ఞాలు 5 రకాలు. ఆహారానికి వర్షం కావాలి. వర్షం కురిపించేది యజ్ఞం. మనుష్యులు యజ్ఞాలతో దేవతలను ఆరాధిస్తే, వారు సంతుష్టులై శ్రేయస్సులను ఇస్తారు. ఇలా దేవతల మనుష్యుల మధ్య పరస్పర ఆశ్రయత్వం ఉంది. శ్రీపాదుల దయ వల్ల పరమ పవిత్రమైన యజ్ఞం చూడగలిగాము. వృద్ధ దంపతులు మమ్మల్ని తమ వారసులుగా ప్రకటించారు.

ఇదంతా దాయాదులకు కష్టంగా ఉంది. ఒకరోజు నేను పొలానికి వెళ్ళేసరికి ఆ దాయాదులు బస్తాల కొద్ది మిరపపళ్ళు ఎడ్లబండిపై వేసి దొంగతనంగా తోలుకొనిపోవడానికి సిద్ధంగా ఉన్నారు. నేనా ఒంటరివాడిని.

ఏమి చేయాలో తోచలేదు. ఇంతలో దగ్గరలో ఉన్న ఒక తాటిచెట్టుపై నుండి ఒక ఎలుగుబంటి కిందకు దూకింది. దాయాదులు భయంతో పరుగులు తీసారు. బండికి ముందుగా పహారా నడుస్తూ మా యింటికి వచ్చిన ఎలుగుబంటి మాలో ఒకరిలా ఉంటూ చేనుకు కాపలా కాస్తుండేది. మా ఇంట్లో జరిగే శ్రీపాద శ్రీవల్లభ నామసంకీర్తనను అది కూడా తన్మయత్వంతో వింటుండేది.

## చైతన్యాల బదలాయింపు, విపరీత పరిణామాలు

ఇలా ఉండగా ఒక తాంత్రికుడు మా ఊరికి వచ్చాడు. దాయాదులు అతన్ని ఆశ్రయించారు. అతడు ఒక యోగ ప్రక్రియతో ఎలుగుబంటి చైతన్యంతో కలిసిపోయి వేరొక ప్రక్రియతో దాని శక్తులన్నిటినీ తనలోకి ఆకర్షించుకున్నాడు. సత్త్వం పోగొట్టుకున్న ఎలుగుబంటి శ్రీచరణులని తలచుకుంటూ మౌనంగా ఏడవసాగింది. **జీవుల రోదనలను శ్రీపాదులు తప్పక వింటారు. వారివారి కర్మలను బట్టి తమ అనుగ్రహంతో పాపకర్మ ఫలితాల తీవ్రతని తగ్గిస్తారు.** ఆ రోజు నామపారాయణం జరిగేటపుడు జీవచ్ఛవంలా పడి ఉన్న ఎలుగుబంటిలో చైతన్యం వచ్చి ఆనందంతో లయబద్ధంగా గంతులు వేయసాగింది. ఏ భల్లూక చైతన్యంలో మాంత్రికుడు లీనమై ఆ మూగజీవిని బాధించాడో అదే భల్లూక చైతన్యాన్ని శ్రీపాదులు అతనికి బదలాయించి, ఆతని చైతన్యాన్ని భల్లూకంలో ప్రవేశపెట్టారు. దీనితో మానవరూపంలో ఉండి భల్లూకంలా ప్రవర్తిస్తున్న మాంత్రికుణ్ణి అతని అనుచరులే తాళ్ళతో కట్టి అడవిలో దించారు.

మానవ చైతన్యం తనలో ప్రవేశించడంతో ఎలుగుబంటి మానవభాషలో మాట్లాడుతూ, “గత జన్మలో నేనొక వడ్డీ వ్యాపారస్థుణ్ణి. వడ్డీ వసూలు చేసేటపుడు అప్పు తీసుకున్న వాళ్ళపైన ఏమాత్రం దయా దాక్షిణ్యాలు లేకుండా బాధించడంవల్ల ఈ జన్మ లభించింది. ఇపుడు శ్రీపాదుల

అనుగ్రహంతో నాకు ఉత్తమజన్మ లభింపబోతున్నది. మీరు నామపారాయణ కొనసాగించండి," అని అభ్యర్థించింది. శ్రీపాద శ్రీవల్లభుల నామకీర్తన జరుగుతుండగా ఎక్కడినుండో మూడు నాగుపాములు వచ్చాయి. భల్లూకం ప్రశాంతంగా ప్రాణాలు వదిలింది. ఆ పాములు భల్లూకం చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణ చేసాయి. ఆ ఎలుగుబంటికి మనుషులకు చేసే పద్ధతిలో దహన సంస్కారాలు చేసాము. పాములు మా ఇంట్లో ఉన్న పుట్టలో బస చేసాయి. శ్రీవల్లభులకు నైవేద్యం పెట్టిన పాలను అవి త్రాగుతుండేవి. ఇది ఇలా ఉండగా దాయాదులు మాయింటి భాగంలో కొంత స్థలం ఆక్రమించుకున్నారు. ధనానికి ఆశపడిన గ్రామపెద్దలు అది వివాదాస్పద స్థలమని, తీర్పు ఇచ్చేవరకు దాయాదులకే దానిపై హక్కు ఉంటుందని తమ నిర్ణయాన్ని చెప్పారు. ఆ రోజు నాగుల చవితి. "ఓ నాగదేవతా! నీ సాక్షాత్కారం ఇవ్వు," అని ప్రతి సంవత్సరం భక్తితో పుట్టలో పాలు పోసే వాళ్ళంతా పుట్టలో పాములున్నాయనే భయంతో ఈసారి పుట్ట దరిదాపులకే రాలేదు. మేము పెట్టిన పాలను మూడు పాములు త్రాగాయి.

## సర్పమాంత్రికుని విఫల ప్రయత్నం

ఆరోజే మా దాయాదులు, గ్రామపెద్దలు ఒక మంత్రగాడిని మా ఊరికి ఆహ్వానించారు. అతని చేతిలో గరుడరేఖ ఉండడంవల్ల ఎంతటి విషసర్పమైనా సరే అతనికి వశం అవుతుంది. పాముల్ని చంపడానికి పుట్ట చుట్టూ మంటలు పెట్టి మంత్రగాడు బిగ్గరగా మంత్రాలు చదవ సాగాడు. మంత్రశక్తికి లోబడ్డాయా! అన్నట్లు ఆ పాములు పుట్ట నుండి బైటకు వచ్చాయి. కాని క్షణక్షణం వాటి ఆకారాలు పెద్దగా అవుతూ అవి ఎటువైపు పాకితే అటువైపు మంటలు చల్లారసాగాయి. అవి స్వేచ్ఛగా ఎటో వెళ్ళి పోయాయి. ఇంతలో గ్రామపెద్ద పెద్ద కుమారుడి శరీరంలో పాము కరచిన లక్షణాలు కనిపించసాగాయి. రెండవ కొడుక్కి

చూపు తగ్గిపోయింది. మాంత్రికుడి చేతిలో గరుడరేఖ మాయమై అతడు మరణించాడు. గ్రామపెద్దలు మాదగ్గరకు వచ్చి గోడు గోడున ఏడ్వసాగారు. శ్రీపాదుల కంటే వేరే దిక్కు ఏదీ లేదని, వారి నామస్మరణే తరుణోపాయమని చెప్పి మేము గ్రామపెద్ద ఇంటిలో దత్త ప్రభువుల నవావతారమైన శ్రీపాద శ్రీవల్లభుల దివ్యనామ సంకీర్తన చేయసాగాము.

## మాంత్రికుని పరివేదన

అక్కడ శ్మశానంలో మాంత్రికుడి శవాన్ని పడుకోబెట్టి చితికి నిప్పు అంటించగానే అకస్మాత్తుగా శవంలో చైతన్యం వచ్చి రక్షించమని కేకలు వేయడం మొదలుపెట్టింది. చనిపోయిన మాంత్రికుడే దయ్యమై తిరిగి తన శరీరంలో ప్రవేశించాడని, మరణించి ఏ శరీరం లేకుండా తిరిగే ప్రేతాత్మకంటె ప్రాణంతో ఉండి తన సొంత శరీరంలోనే ప్రవేశించిన ప్రేతాత్మ సమాజానికి ఎక్కువ వినాశం కలిగిస్తుందని భావించి ఒక్కరూ రక్షించడానికి ముందుకు రాలేదు. **ప్రారబ్ధాన్ని బట్టి ఎవరి మనసుల్లో ఎలాంటి భావాలు పుట్టించాలో అలా పుట్టించి, వారి వారి కర్మఫలాన్ని వాళ్ళు అనుభవించేటట్టు చేయడమే శ్రీచరణుల విచిత్ర విధానం.** కాటికాపరులలో ఒకడు దయ తలచి కాలుతున్న శవంపైన నీళ్ళు పోస్తే మంటలు ఆరకపోగా ఆజ్యం పోసినట్లు ఇంకా పెరిగాయి. మంటల్లో చిక్కుకున్నా కూడా శరీరం కాలక, అవయవాలు వికృతంగా మారక, కాలేమంటల బాధ మాత్రం శారీరి కంగా అనుభవిస్తూ ఆ మాంత్రికుడు పడే వేదన నరకయాతనను మించి ఉంది. **ధర్మ నిష్ఠలైన వారికి శ్రీపాదులవారు కొంగు బంగారం అయితే ధర్మభ్రష్టులు, మహాపాపులకు వారు యమధర్మరాజు వంటివారు.**

## అనూహ్య గుణపాఠం

అగ్నివల్ల అటు కాలిపోక, ఇటు మంటల వల్ల విపరీతమైన బాధ భరించలేక గెంతులు వేస్తూ సజీవంగా నడిచి వస్తున్న ఆ శవం

గ్రామపెద్ద ఇంటికి చేరింది. అక్కడి వాయుమండలమంతా “దత్తదిగంబరా! శ్రీపాదవల్లభా! దత్తదిగంబరా!” అనే దివ్య నామస్పందనలతో నిండి ఉంది. ‘శ్రీపాదుడే దత్తుడా? అతడు కూడా దిగంబరుడా? వస్త్రం లేని పిచ్చివాడా?’ అని వెక్కిరించిన ఆ మాంత్రికుణ్ణి ఆ మహాప్రభువు దిగంబరుణ్ణి చేసి అగ్నిశిఖలతో బాధ పెడుతూ, శరీరాన్ని మాత్రం దగ్ధం చేయకుండా తన భక్తుల ముందు తెచ్చి నిలబెట్టారు. ఆహా! శ్రీపాదుని లీలలు ఇలా ఉంటాయని చెప్పగలమా? వారి లీలలు ఊహించలేనివి, ఎన్నడూ కని విని ఎరుగనివి, తర్కానికి అంతుపట్టనివి.

మాంత్రికుడు నామసంకీర్తనకు అనుగుణంగా నాట్యం చేయసాగాడు. దిగంబరంగా అందరిముందు నాట్యం చేయడానికి సిగ్గుపడుతూ నాట్యం ఆపితే చాలు, విపరీతమైన బాధకు గురిఅవుతూ అతడు తన పాపాలను, అహంకారాన్ని గుర్తు చేసుకొని, పశ్చాత్తాపం కలిగి శ్రీపాదుల ను త్రికరణశుద్ధిగా శరణు వేడుకున్నాడు. అతని మనసులో ఈ మార్పు వచ్చిన తక్షణమే మంటలు చల్లారాయి. ఎవరో ఇచ్చిన ఉత్తరీయం చుట్టుకొని ఆనందంతో అందరితోపాటు భగవన్నామ సంకీర్తనలో పాల్గొన్నాడు. గ్రామపెద్ద ఇద్దరు కొడుకులు కూడా స్వస్థులయ్యారు. గ్రామపెద్ద ఆ స్థలం వృద్ధ దంపతులకే చెందుతుందని తీర్పు ఇచ్చారు.

### ఔదుంబర వృక్షాలు

మూడు పాములు నివసించే పుట్టనుండి మూడు ఔదుంబర వృక్షాలు మొలిచాయి. దత్తానంద అనే అవధూత ఆ మూడు వృక్షాలు శ్రీపాద శ్రీవల్లభ, నృసింహసరస్వతి, స్వామి సమర్థ అనే ముగ్గురి పేర్లకు సంకేతాలని, పీఠికాపురంలో తాతగారింటిలో తల్లి సుమతి శ్రీపాదులకు ఔదుంబర వృక్షం కింద ప్రేమతో వెండిగిన్నెలో హల్వా తినిపించేదని చెప్పారు. ఆ ఔదుంబర వృక్ష బీజమే శ్రీపాదుల జన్మస్థలంలో తిరిగి మొలుస్తుందని,

అక్కడే వారి దివ్యవిగ్రహం ప్రతిష్ఠింపబడుతుందని, శనిప్రదోష సమయంలో ఆ చెట్టుకింద హల్వా నైవేద్యంగా పెట్టేవారికి శ్రీపాదుల అనుగ్రహం కొంగు బంగారం," అని చెప్పారు. భక్తి శ్రద్ధలతో శ్రీవారి దివ్య గాథలను విన్నాక నేను తిరిగి నా ప్రయాణం కొనసాగించాను.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 17వ అధ్యాయం

## అయోగ్యులపై కూడా ప్రభువుల అనుగ్రహం

## (శ్రీపాదులు తొమ్మిది సంవత్సరాల బాలుడు)

### శంకరభట్టు అభయప్రదానం

నేను పోతుండగా మార్గమధ్యంలో జుట్టు విరబోసుకొని మనస్థిమితం లేనిదానిలా కనిపిస్తున్న ఒక స్త్రీ పరుగున వచ్చి నా కాళ్ళమీదపడి తనను రక్షించమని ప్రార్థించింది. నేను అప్రయత్నంగా, "శ్రీపాద శ్రీవల్లభులు నిన్ను తప్పక కాపాడుతారు. నిర్భయంగా ఉండు," అని ధైర్యం చెప్పాను. పహల్వానుల్లా బలిష్ఠమైన శరీరాలతో చేతిలో కర్రలతో ఆమెను తరుముకొని వస్తున్న ఇద్దరు పురుషులు శరీరబలంలో వాళ్ళతో ఏవిధంగాను సరితూగని నన్ను వింతగా చూస్తూ, "ఓ! బక్క బ్రాహ్మడా! ఈమెను మేము చంపదలచుకున్నాము. అడ్డగించినట్లయితే నిన్ను కూడా వధిస్తాము," అని బెదిరించారు.

### యదార్థ వాణి

"బ్రాహ్మణ జన్మనెత్తి గతరాత్రి ఆవును చంపి, ఆ మాంసాన్ని తిని అన్ని రకాల చెడు పనులు చేస్తున్న మీకు మమ్మల్ని చంపడం ఏమంత కష్టమైన పని కాదు. కాని ఈ స్త్రీని వధించిన తరువాత నికృష్టమైన కుష్టు వ్యాధి పీడితులు అవుతారు. ఆపైన మీ యిష్టం," ఏదో అదృశ్యశక్తి ఆవహించిన వాడిలా అప్రయత్నంగా నానోటినుండి ఈ వాక్కులు వెలువడ్డాయి, వారి గత జీవితానికి సంబంధించిన నా పలుకులు నిజం అవడంతో భవిష్యవాణి కూడా ఖచ్చితంగా జరిగి తీరుతుందని భయపడి క్షమించమని వాళ్ళు నన్ను ప్రార్థించారు. నేను వాళ్ళ వృత్తాంతం చెప్పమని అడిగాను. వాళ్ళు,"అయ్యా! బ్రాహ్మణ జన్మ ఎత్తి కూడా గోమాంస భక్షణం, సురాపానం, వ్యభిచారానికి

అలవాటుపడి అన్ని రకాలుగా భ్రష్టులం అయ్యాము. ఒక గుట్టపై కూర్చొని ఉన్న ఈ స్త్రీని చూచి అనుభవించాలనుకొని ఆమె నిరాకరించడంతో తరుముకొని వస్తూ అదృష్టవశాత్తు మిమ్మల్ని కలుసుకొన్నాం," అని చెప్పారు.

**సుశీల కథ**

అటు తరువాత ఆమె తన వృత్తాంతాన్ని ఇలా చెప్పసాగింది: "నన్ను రక్షించిన మీరు నాకు తండ్రితో సమానం. కాబట్టి చెప్పరాని విషయాలను కూడా చెప్తాను. వినండి. నా పేరు సుశీల. సద్బ్రాహ్మణ వంశంలో పుట్టిన నాకు చిన్న వయసులోనే వివాహమైంది. నా భర్త నపుంసకుడే కాక సందేహాల పుట్ట. అన్నం తిన్నా, తినకపోయినా తప్పే. తల్లో పూలు పెట్టుకొని తయారయితే సాధింపు, అవకపోతే సాధింపు. పరాయి మగవాళ్లతో నాకు అక్రమ సంబంధం అంటగట్టి ఎప్పుడూ నన్ను మానసికంగా హింసిస్తూ ఉంటారు. మా అత్తమామలు కాని, ఇంట్లో ఉన్న వేరే పెద్దలు కాని ఇది ఏమిటని వారిని ప్రశ్నించరు. ఇంతలో మా ఊరికి వచ్చిన ఒక మంత్రజ్ఞుణ్ణి మాయింటికి ఆహ్వానించారు. నా కారణంగానే నా భర్తకు నపుంసకత్వం ప్రాప్తించిందని, నన్ను వెళ్ళగొట్టితే అంతా చక్కబడుతుందని వాడు చెప్పాడు. అందరూ కలిసి నన్ను ఇంటినుంచి తరిమివేసారు. కాలినడకన పుట్టినింటికి పోతున్న నన్ను మాంత్రికుడు దారిలో అడ్డగించి తన కామవాంఛకు బలిచేయబోయాడు. నేను భద్రకాళినై ఒక బండరాతిని బలంగా వాడి మీదకు విసిరాను. అతడు అక్కడికక్కడే మరణించాడు. బ్రాహ్మణ హత్య చేసిన నేను పుట్టింటికి ఎలా వెళ్ళగలను? తల్లితండ్రులు ఆదరించినా, అన్నావదినలు, ఇరుగు పొరుగు వారు ఊరుకుంటారా? దారి తెన్నూ లేకుండా తోచిన దిక్కున నడుస్తూ అలసటతో ఒక ఔదుంబర వృక్షం క్రింద కూర్చొని దత్తనామ స్మరణం చేసుకుంటున్న నేను ఈ దుష్టుల బారిన పడి మీచే రక్షింపబడ్డాను," అని చెప్పి ఆమె తన కథను ముగించింది.

## నామానందుల వృత్తాంతం

"అమ్మా! శ్రీపాదుల దయ ఉండబట్టి నీవు రక్షింపబడ్డావు. వారు **అంతర్యామిగా ఉండని దేశం కాని, వారి ఎరుకలో లేని కాలం గాని, మనుష్యులు కాని, వారి స్వభావాలు కాని ఈ సృష్టిలో లేనే లేవు. మనము వారి నామస్మరణ చేసినట్లయితే వారి అనుగ్రహం సిద్ధించి కష్టనష్టాల నుండి విముక్తిని పొందుతాము,"** అని ఒకవైపు ఆమెను ఓదారుస్తూ శ్రీపాదుల గురించి తెలిపాను. వాళ్ళు కూడా శ్రీపాదుల దర్శనాభిలాషను వ్యక్తం చేయడంతో మేమందరం కలిసి ఆ మహాగురువుల నామకీర్తన చేస్తూ కురుంగడ్డ వైపు ప్రయాణం సాగించాము. మార్గమధ్యంలో నామానందులనే మహాత్ముల ఆశ్రమం చేరుకొన్నాము. వారు మమ్మల్ని సాదరంగా ఆహ్వానించి ఇలా చెప్పసాగారు:

"నా పేరు సాయనాచార్యుడు. మేము భారద్వాజ వైష్ణవులం. నేను తీవ్ర వైరాగ్యంతో నన్ను ఉద్ధరింపగల సద్గురువుకోసం అన్వేషిస్తూ పీఠికాపురం చేరాను. అక్కడ కుంతీమాధవ దర్శనం చేసుకొని బయటకు రాగానే ఒక చండాలుడు నన్ను సమీపించి, "నామానందా! నాకు గురుదక్షిణ ఇమ్ము," అంటూ గద్దించాడు. నేను నిర్ఘాంతపోయి, "ఓయీ! నేను నామానందుడను కాను. నీవెవ్వరవో నాకు తెలియదు," అని చెప్పాను. ఈ వింతను చూడటానికి జనులు పోగయ్యారు. చింతనిప్పుల్లాంటి కళ్ళతో అతడు నన్ను బెదిరిస్తూ, "నేను నీ సద్గురువును. నీకు నామానందుడనే సన్యాస నామం ఇస్తున్నాను. నాకు సాష్టాంగపడి నీవద్ద ఉన్న సొమ్మంతా గురుదక్షిణగా అప్పగించు, లేదా నిన్ను కత్తితో ఖండ ఖండాలుగా నరికి ప్రాణం పోకుండా కట్టడి చేసి నరకయాతన అనుభవించేలా చేస్తాను," అని కటువుగా పలికి కత్తిదూసి నన్ను చంపబోయాడు.

## శ్రీపాదుల అనుగ్రహ వృష్టి

గత్యంతరంలేని పరిస్థితులలో ఆ చండాలుడికి సాష్టాంగపడి రొఖ్ఖమంతా చెల్లించాను. వెంటనే కన్నుల నుండి అనంతమైన ప్రేమ, కరుణ ప్రవహిస్తున్న ఒక దివ్య మంగళమూర్తి కనుల ముందు సాక్షాత్కరించి, "నేను శ్రీదత్తుడను. ప్రస్తుతం శ్రీపాద శ్రీవల్లభ అవతారంలో పీఠికాపురంలో ఉన్నాను. నీవు నావాడవు. నేటి నుండి నామానందుడవై ధర్మప్రచారం ఆరంభించు," అని దీవించి అంతర్హితులయ్యారు. బ్రాహ్మణుడనైన నాకు ఒక చండాలుడు గురువనే వార్త నగరమంతా వ్యాపించి నాకు పిడికెడు అన్నపు మెతుకులు దానమిచ్చే బ్రాహ్మణుడే కరువయ్యాడు. కాళ్ళు ఎటు తీసుకు వెళ్ళుతుంటే అటువైపు నడుస్తూ నేను అప్రయత్నంగా అప్పలరాజశర్మ గారింటికి చేరాను. నేను భిక్ష అడగటానికి నోరు తెరిచే లోపలే శ్రీపాదులు అన్నం పళ్ళెంతో బయటకు వచ్చి నన్ను అరుగు మీద కూర్చోబెట్టి తమ దివ్య హస్తాలతో నాకు తినిపించి, నీవెక్కడ ఉన్నా నిన్ను నేను కంటికి రెప్పలా కాపాడుతానని అభయమిచ్చారు. ఆ రోజు నుండి వారు నన్ను అదృశ్యంగా కాపాడుతూనే ఉన్నారు," అని తెలిపి ముగించారు.

## ముక్తావస్థల వివరణ

'దత్తారాధన శీఘ్ర మోక్షప్రదాయకం కదా, దాని గురించి కొంచెం వివరించమని,' నేను కోరాను. దానికి వారు, "నాయనలారా! శరీర పాతానంతరమే మోక్షం కలగాలి అనే నియమం లేదు. కొంతమందికి శరీరం ప్రారబ్ధ కర్మని అనుభవిస్తుండగా జీవాత్మ ముక్తావస్థలో ఉంటుంది. వీరినే **జీవన్ముక్తులు** అంటారు. ఒకానొక ఆధ్యాత్మ స్థితిని పొందిన దత్తభక్తులకు ఈ పాంచభౌతిక శరీరంలో ఉన్నపుడే సూక్ష్మ శరీరంతో తమ **ఇష్ట దైవం యొక్క లోకంలో నివసిస్తూ** ప్రభువుల చిత్రవిచిత్ర విధానాలను అంతర్ దృష్టితో అవలోకించి ఆనందించే భాగ్యం కలుగుతుంది. దీనినే **సాలోక్యముక్తి** అంటారు. స్వార్థరహితులైన యోగీశ్వరులు, అధిక పుణ్యార్జితులు తమ

**ఇష్టదైవం యొక్క సమీపంలోనే ఉండి** వారి విధానాలను అంతర్ దృష్టితో చూస్తూ వాటిని విశ్లేషణాత్మకంగా తెలిసికొంటారు. ఇది **సామీప్య ముక్తి.** ఇంతకంటె కూడా విశేష పుణ్యరాశి ఉన్నట్లయితే సాధకులు తమ ఇష్టదైవ స్వరూపాన్ని పొందుతారు. దీనినే **సారూప్యముక్తి** అంటారు. ఇంతకంటె పరిణతిని పొంది ఇష్టదేవతా చైతన్యంలో ఐక్యం అవడాన్ని **సాయుజ్యముక్తి** అంటారు. వీరికి దత్తుల దివ్యలీలలు స్పష్టంగా వ్యక్తం అవుతుంటాయి. పరిణతిని పొందినకొద్ది జీవి లఘుత్వాన్ని అనుభవిస్తూ అత్యంత ఆనందాన్ని పొందుతాడు. దేవతలందరూ శ్రీపాదుల దివ్యాంశలే అయినందువల్ల భక్తులు ఏదేవతాస్వరూపంలో ఆరాధిస్తారో ఆ దైవం ద్వారా శ్రీపాదులే భక్తులను అనుగ్రహిస్తారు," అని సెలవిచ్చి మనసుకు హత్తుకొనే ఉదాహరణతో దాన్ని ఈ విధంగా విశ్లేషించారు:

## క్షీరం సంపూర్ణాహారం - దత్తులు సంపూర్ణానుగ్రహ అవతారం

"వివాహమై అత్తవారింటికి వెళ్ళిన ఒక కన్యను చూడటానికి ఆమె అన్నగారు ఒకసారి వాళ్ళ ఇంటికి వెళ్ళారు. చెల్లెలి అత్తగారు అతనితో, 'అయ్యా! మీ చెల్లెలు పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి దొంగతనంగా తింటున్నది. ఇన్ని రకాల దొంతగనాలా?' అని ఫిర్యాదు చేసింది. అన్నగారు చెల్లెలిని పిలిచి, 'ఇన్ని రకాల పదార్థాలను దొంగిలించడం ఈ రోజు నుండి మాని వెయ్యి. నీవు సేవిస్తున్న అన్ని పదార్థాల సత్తువలు ఒక్క చిక్కటి పాలలో ఉన్నాయి. కాబట్టి ఇన్ని రకాల వస్తువులను సేవించటం మాని నీకు కావలసినంత చిక్కటి పాలను త్రాగు. ఆ ఒక్క వస్తువును తాగడం వల్ల నీ అత్తగారి నుండి మాట పడటం తప్పి పోతుంది. అంతేగాక నీకు కావలసిన పౌష్టిక ఆహారం లభిస్తుంది.' అని సలహా ఇచ్చారు. అలాగే ఒక్క శ్రీదత్తులని ఆరాధిస్తే చాలు సమస్తం సమకూరుతాయి. అందరి దేవతల అనుగ్రహం, భక్త రక్షణ ఒకే విధంగానే ఉన్నా ఏ దేవతని ఆరాధిస్తే

వారే ప్రత్యక్షం అవుతారు. కాని వేరొకరు అవరు కదా! కాని **భక్తుని ఆర్తికి, ఆవేదనకు శీఘ్రంగా స్పందించే శ్రీదత్తులవారు ఆయా దేవతలను భక్తుల ఆయా కార్యాలను సఫలీకృతం చేయమని, భక్తుల వివిధ స్థితుల ను మార్చమని ఆదేశిస్తారు. వారు సంకల్పించిన పక్షంలో సామాన్యంగా నడపవలసిన పరిణామక్రమాన్ని శీఘ్రతరం చేయడానికై అజ్ఞాన స్థితిలో భక్తునితో బాధలని అనుభవింపచేస్తారు. లేదా ఆ బరువు బాధ్యతలను వారే తమ భుజస్కంధాలపై వేసుకొంటారు. వారు సంకల్పించినట్లయితే కోటానుకోట్ల జన్మల కర్మబంధాలను, అవి గతించినవైనా సరే, రాబోయేవైనా సరే, పూర్తిగా ధ్వంసం చేసి జీవులకు మోక్షాన్ని ఇస్తారు.** ఒక పర్యాయం శ్రీపాదుల ఆశ్రితునికి గుర్రం మీద నుండి పడి దెబ్బలు తగిలాయి. అదేరోజు వారిపై కొంచెం కూడా నమ్మకం లేని మరొక వ్యక్తికి నూరు వరహాలు దొరికాయి. దీనిని గూర్చి శ్రేష్ఠిగారు ప్రశ్నించగా ఆరోజే మరణించవలసిన మొదటి భక్తుణ్ణి స్వల్ప గాయాలతో కర్మ విముక్తుణ్ణి చేసి రక్షించానని, రెండవ వ్యక్తి నాస్తికుడేకాక భక్తులను అవహేళన చేస్తుండటంవల్ల అతని మహదైశ్వర్యయోగాన్ని నూరువరహాలకు తగ్గించి శిక్షించాను అని విశ్లేషించి నా భక్తుడికి నేను దాసుడను, **నన్ను హృదయంలో బంధించుకొనగల్గిన వాడే నిజమైన ప్రభువు** అని శ్రీపాదులు చెప్పారు."

పచ్చని సంసారం చెడగొట్టినా, అన్యోన్య దంపతులను విడదీసినా, శిశుహత్య, స్త్రీహత్య చేసినా, నిస్సహాయ అనాథల పట్ల కఠిన ప్రవర్తన చూపినా నపుంసకత్వం వస్తుందని వివరించారు. తరువాత మమ్మల్ని ఏకభుక్తం చేస్తూ మండల దీక్షను పాటించమని, సదాచారులుగా ఉండమని ఉపదేశించి సుశీలను అనఘావ్రతం చేయమని, దానివల్ల ఆమె భర్తకు పురుషత్వం సిద్ధించి వారిద్దరూ అనుకూల దాంపత్యంతో మనుగడ సాగిస్తారని చెప్పారు.

అటు తరువాత బాపనార్యుల మనుమడిలో దత్తులను దర్శించారని ఆ ఆనందానుభూతిలో ఆశువుగా చదివిన సిద్ధమంగళ స్తోత్రంలోని ఒక్కొక్క అక్షరం మహాశక్తివంతమని చెప్పి దాన్ని ఇలా గానం చేసారు.

## సిద్ధమంగళ స్తోత్రం

శ్రీ మదనంత శ్రీవిభూషిత అప్పలలక్ష్మీ నరసింహరాజా।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండశ్రీవిజయీభవ॥

శ్రీవిద్యాధరి రాధ సురేఖ శ్రీరాఖీధర శ్రీపాదా।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండశ్రీవిజయీభవ॥

మాతాసుమతీ వాత్సల్యామృత పరిపోషిత జయశ్రీపాదా।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండశ్రీవిజయీభవ॥

సత్యఋషీశ్వర దుహితానందన బాపనార్యనుత శ్రీచరణా।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండశ్రీవిజయీభవ॥

సవితృకాఠకచయన పుణ్యఫల భరద్వాజ ఋషిగోత్ర సంభవా।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండశ్రీవిజయీభవ॥

దో చౌపాతీ దేవ్ లక్ష్మి ఘన సంఖ్యాబోధిత శ్రీచరణా।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండశ్రీవిజయీభవ॥

పుణ్యరూపిణీ రాజమాంబ సుత గర్భ పుణ్యఫల సంజాతా।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండశ్రీవిజయీభవ॥

సుమతీనందన నరహరి నందన దత్తదేవప్రభు శ్రీపాదా।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండశ్రీవిజయీభవ॥

పీఠికాపుర నిత్య విహారా మధుమతి దత్తా మంగళరూపా।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండశ్రీవిజయీభవ॥

## **స్తోత్ర మహిమ**

నాయనలారా! **పరమపవిత్రమైన ఈ స్తోత్రాన్ని చదివితే అనఘాష్టమీ వ్రతం చేసి వేయిమంది సద్బ్రాహ్మణులకు భోజనం పెట్టిన పుణ్యం లభిస్తుంది. మండల దీక్ష వహించి ఏకభుక్తం చేస్తూ కష్టార్జితంతో వేయిమంది సద్బ్రాహ్మణులకు భోజనం పెట్టిన పుణ్యం లభిస్తుంది. దీని పఠనం వల్ల సిద్ధపురుషుల దర్శన, స్పర్శనములు లభిస్తాయి. త్రికరణశుద్ధిగా ఇది చదివినట్లయితే శ్రీపాదుల అనుగ్రహం లభిస్తుంది. ఇది చదివేచోట సిద్ధులు అదృశ్యరూపంలో తిరుగుతుంటారు,"** అని ఈ మంగళస్తోత్ర మహిమను వివరించారు. ఆ రాత్రి అంతా ఆ పవిత్ర ప్రాంగణంలో ప్రభువుల దివ్య నామ సంకీర్తన చేస్తూ గడపాలనే నా కోరికను వారు అంగీకరించడంతో ఉషఃకాలం వరకు శ్రీచరణుల సేవలో గడిపి తరువాత ప్రభువులకు మంగళహారతి ఇచ్చాము. నామానందులవారు ధ్యానంలో ఉన్నపుడు రెండెడ్ల బండిపై ఒక బండివాడు వచ్చి భోజన సామగ్రిని దింపి, 'నీ అత్తమామలు, భర్త వేరొక బండిలో వస్తున్నారు, నిన్ను సాదరంగా తమతో తీసుకొని వెళ్తారు' అని సుశీలకు చెప్పి వెళ్ళిపోయారు. ఇంతలో నామానందులు బయటికి వచ్చి బండి వాని గురించి ప్రశ్నించారు. వెళ్ళిపోయాడని మేము చెప్పగానే, "ఆహా! మీరెంత అదృష్టవంతులు! నేనెంతటి దురదృష్టవంతుణ్ణి," అని బాధపడి, "శ్రీపాదులే బండివాని రూపంలో మీకు దర్శనం ఇచ్చారు. అమ్మా! సుశీలా! నీభర్త నపుంసకత్వం పోయి నిన్ను తీసుకొని వెళ్ళడానికి వాళ్లంతా తరలి వస్తున్నారు," అని చెప్పారు. వారు చెప్పినట్లే జరిగింది. సుశీల ఆనందంగా అత్తవారింటికి, మేము ముగ్గురం కురుంగడ్డ వైపుకు ప్రయాణం సాగించాము.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

# 18వ అధ్యాయం

# పండిత-పామరుల గాథ

## శ్రీపాదుల దివ్య మంగళ దర్శనము

మేము ముగ్గురం కురుంగడ్డ చేరాము. అనంత కోటి బ్రహ్మాండాలకు నాయకుడు, ఆది పురుషుడు, ఆది మధ్యాంతాలు లేనివాడు, 14లోకాలకు సార్వభౌముడు అయిన శ్రీపాద శ్రీవల్లభస్వామి అప్పుడే కృష్ణానదిలో స్నానంచేసి దివ్యకాంతితో ఒడ్డుకు వస్తున్నారు. నేను పాదనమస్కారం చేయగానే కమండలం నుంచి పవిత్రమైన నీరు నా నెత్తిన చల్లి, "నాయనా! శంకరభట్టూ! నీమీద ప్రేమతో నిన్ను ఇక్కడికి రప్పించాను," అని ఎంతో మృదువుగా తెలిపారు. వారి మాటల్లోని తియ్యదనం, దయామృతాన్ని కురిపిస్తున్న వారి చూపులు వర్ణించడానికి ఏ భాషా సరిపోదు. వారు తమ పవిత్ర హస్తాన్ని నా తలపై ఉంచిన వెంటనే నాలో కుండలినీ శక్తి మేల్కొని విద్యుత్తులాగా నరనరంలో పాకుతూ నాకు మైకం కమ్మేలా చేసింది. నేను నేనే, ఫలానా వ్యక్తిని అనే నా అస్తిత్వాన్ని మరిచిపోయి ఏదో తెలియని దివ్య ఆనంద పారవశ్యంలో మునిగిపోయాను. శ్రీపాదులు మళ్ళీ నాపై నీళ్ళు జల్లడంతో మామూలు స్థితికి వచ్చేసాను.

## ఎల్లలే లేని శ్రీపాదుల అనుగ్రహం

నేను ఆ అన్నదమ్ములని చూపించి వాళ్ళుకూడా బ్రాహ్మణులే, అని తమ దర్శనం కోసం వచ్చారని చెప్పాను. దానికి శ్రీపాదులు, "వీళ్ళు బ్రాహ్మణుల్లా లేరే? ఆవు మాంసం తినే మ్లేచ్ఛుల్లా కన్పిస్తున్నారు," అన్నారు. వాళ్ళిద్దరు అవును, మేము మ్లేచ్ఛులమే అని ఒప్పుకుంటూ ముసల్మానులు చదివే కల్మాను చదివారు. అపుడు శ్రీపాదులు, "గోవులో అందరు దేవతలుంటారు. బ్రాహ్మణ జన్మ ఎత్తి గోవును చంపినవాళ్ళని శిక్షించాలి. **పవిత్ర యజ్ఞాలలో మేకను బలి ఇస్తే దానితో సంబంధం ఉన్న తక్కిన మేకలకు కూడా ఉత్తమ**

**జన్మ వస్తుంది. అయితే బలి ఇస్తున్న మేకకు ఉత్తమజన్మ వచ్చేలా చేయగలిగే యజ్ఞబలం, తపోబలం యజ్ఞం చేయిస్తున్న బ్రాహ్మణునికి ఉండాలి. అలా కాకపోతే అది హత్యతో సమానమై ఆ యజ్ఞంతో సంబంధం ఉన్న వాళ్ళందరికి పాపం చుట్టుకుంటుంది.** ఇక మీ విషయానికి వస్తే అన్ని చెడ్డ అలవాట్లకు బానిసలై ఎంతో పవిత్రమైన గోవుని చంపి తిన్నందుకు నిజానికి మీ మీద కొద్దిగా కూడా దయ తలచకూడదు. కాని మీ అదృష్టం బాగుంది కాబట్టి, నా అనుగ్రహం ఉంది కాబట్టి నా దర్శనం మీకు లభించింది. ఈ పుణ్యబలం వల్ల మీకు తిండికి బట్టలకి లోటు లేకుండా గడిచిపోతుంది. కాని మీరు చంపిన ఆవులన్ని మీకు పిల్లలుగా పుట్టి ఎన్నో రకాలుగా మిమ్మల్ని వేధించుకు తింటాయి. నా దర్శనం వల్ల లభించిన ఈ పుణ్యం వల్ల ఎన్నో శతాబ్దాల తర్వాత మీరు బడేబాబా, అబ్దుల్ బాబా అనే పేర్లతో ప్రసిద్ధులయి నా సంపూర్ణ సద్గురు అవతారం అయిన **'సాయిబాబా'** వలన ఉద్ధరింపబడుతారు. ఇక మీరు వెంటనే ఇక్కడి నుంచి వెళ్ళండి!" అని ఆజ్ఞాపించారు. వాళ్ళు వెళ్ళిన తరువాత రవిదాసు అనే చాకలి, అతనితో పాటు ఒక పండితుడు అక్కడికి వచ్చారు. శ్రీపాదులు రవిదాసుని కొద్దిసేపు నిర్లక్ష్యం చేసి తర్వాత అతనిని చూసి నవ్వారు. ఎందుకు నవ్వారో నాకు అర్థం కాలేదు. స్వామి నా కనుబొమల మధ్య వేలితో తాకారు. వెంటనే రవిదాసు వృత్తాంతం నా కళ్ళ ముందు కనిపించడం మొదలైంది.

### (కు) పండితుని వృత్తాంతం

రవిదాసు కురుంగడ్డ వైపు పడవ నడిపించుకొని వస్తున్నాడు. పడవలో ఒక గొప్ప పండితుడు కూర్చొని ఉన్నాడు. రవిదాసు నది దాటించడానికి కూలీ అడిగితే ఆ పండితుడు తానొక గొప్ప పండితుడనని, తన పాండిత్యం మెచ్చి శ్రీపాదులు ఇచ్చే ధనంలో నుండి కొంతభాగం అతనికి నది దాటించినందుకు ముట్టజెప్తానని చెప్పారు. కొద్దిదూరం వెళ్ళగానే

పడవ లోపలికి నీళ్ళు రావడం మొదలైంది. కాని ఏదో అదృశ్యహస్తం నీళ్ళను బయటకు పారబోస్తున్నట్లు అనిపించింది. ఇద్దరూ శ్రీపాదుల దగ్గరకు వచ్చారు. ఆ పండితుని చూస్తూనే స్వామి కోపంతో, "ఓరీ! మంచి కుటుంబంలో పుట్టి, గొప్ప పండితుడవై ఉండి కూడా అహంకారంతో పాపాలను మూటకట్టుకుంటున్నావు. సుఖంగా భర్తతో కాపురం చేసుకుంటున్న చాకలివాడి భార్యను నీ ఉంపుడుకత్తెగా చేసుకున్నావు. శరీరాన్ని నీకు అప్పగిస్తున్నా మనసులో నిన్ను శాపాలు పెడుతూనే ఉంది ఆ ఇల్లాలు. ఇదంతా తెలిసిన నీ భార్య కుమిలి కుమిలి ఏడుస్తున్నది. వచ్చే జన్మలో నీ భార్య కావలసిన నీ చాకలి ఇల్లాలిని ఈ జన్మలోనే బల వంతంగా అనుభవిస్తున్నావు. ఏ జన్మలోని ధర్మాలు ఆ జన్మకే పరిమితమై ఉంటాయి. కాబట్టి ఈ పాపానికి నీవు రాబోయే జన్మలో నపుంసకునిగా పుట్టి, ధనవంతులుగా పుట్టిన ఆ చాకలి దంపతులకు ఊడిగం చేస్తావు. నీ జాతకాన్ని బట్టి ఈ రోజు నీవు చనిపోయే రోజు. కాని దయతో ఇంకొక 3 సంవత్సరాలు నీ ఆయుష్షును పెంచుతున్నాను. ఇప్పుడైనా బుద్ధి తెచ్చుకొని మెలిగితే వచ్చే జన్మలో నీది బానిసబ్రతుకే అయినా కనీసం తిండికి బట్టకి లోటు లేకుండా గడిచిపోతుంది. లేదా నరక యాతనే. ఆపైన నీ ఇష్టం. ఇక నీవు వెళ్ళవచ్చు," అని కఠినంగా చెప్పారు.

## పామరుడైన రవిదాసు భావి జన్మలో రారాజు

ఆరోజు నుండి రవిదాసు స్వామివారి బట్టలు ఉతకడం, ఆశ్రమం ఊడవటంలాంటి సేవ చేయడం మొదలు పెట్టాడు. ప్రభువులు స్నానానికై నదికి వెళ్ళేటప్పుడు రోజూ సాష్టాంగం పడేవాడు. ఒకనాడు ఎంతో వైభవంగా తన భార్యలతో నదిలో స్నానం చేస్తున్న మహారాజుని చూసి, 'ఆ జన్మ రావడం ఎంత అదృష్టం!' అని రవిదాసు మనసులో భావించాడు. అతని మనసులోని మాట గ్రహించిన శ్రీపాదులు యవన వంశంలో

వైడూర్యపు రాజుగా పుట్టేలా వరమిచ్చి, నవ్వుతూ అతని వైపు చూడగానే రవిదాసు అక్కడికక్కడే చనిపోయాడు. నా కళ్ళముందు కనిపించిన ఈ సంఘటనలను జరిగిపోయినవి కొన్ని, జరగబోతున్నవి కొన్ని చూసి నేను ఆశ్చర్యంలో మునిగి పోయాను.

## వల్లభేశుని వృత్తాంతం

ఇంతలో భక్తులు రావడం మొదలైంది. పెళ్ళి అయిన ఆడవారికి సౌభాగ్యంకోసం, కన్యలకి మంచి వరునికోసం శ్రీపాదులు పసుపుకొమ్ములు పంచి పెట్టారు. మధ్యాహ్నమైంది. ఏదో అందుకుంటున్నట్లుగా శ్రీపాదులు చేతులు పైకెత్తగానే వారి చేతుల్లోకి పెద్ద వెండిగిన్నె వచ్చింది, దాని నిండుగా పాయసం ఉంది. పాయసం అందరికి పంచుతున్నా అక్షయంలా వస్తూనే ఉంది. ఆ పాయసం పిఠాపురంలో మల్లాదివారు, శ్రేష్ఠిగారు, వర్మగారు తమకు పెట్టిన నైవేద్యమని అది తిన్నవాళ్ళకి అన్ని బాధలు తొలగిపోతాయని శ్రీచరణులు చెప్పారు. నా పక్కన సుబ్బణ్ణశాస్త్రి అనే కన్నడ బ్రాహ్మణుడు కూర్చొని ఉన్నాడు. వల్లభేశుడనే యువకుడు పిఠాపురం నుండి వచ్చాడు. అదే సమయంలో అక్కడకు వచ్చిన ఒక బీద బ్రాహ్మణుడు తన కూతురికి వివాహం కుదర్చమని స్వామిని ప్రార్థించాడు. వెంటనే శ్రీపాదులు, "ఈ వల్లభేశుడే మీ అల్లుడు. ఈ సుబ్బణ్ణశాస్త్రి పురోహితునిలా ఉండి వివాహం చేయిస్తాడు. కాని వల్లభేశుని పితృదేవతలు చాలా కోపంగా ఉన్నారు. చనిపోయిన పెద్దవాళ్ళ మీద ఒక ఇష్టం, గౌరవం లేకుండా చేసే తద్దినాలు, పిండదానాలు వాళ్ళకి చేరవు. అందుకని వాళ్ళ ఆత్మకి ముక్తి లభించదు. అదేవిధంగా మీవాళ్ళ ఆత్మలకి విముక్తి రాక వాళ్ళు బాధ పడుతున్నారు. అందువల్ల ముందుగా గరుడపురాణంలోని శ్రాద్ధమంత్రాలను చదివి ఆ తరువాతనే వివాహమంత్రాలు చదవవలసి ఉందని సుబ్బణ్ణశాస్త్రికి సూచనలను ఇచ్చి పసుపు కొమ్మును ఇచ్చారు.

మేమందరము ఆవలి ఒడ్డుకి చేరాము. పెళ్ళికుమార్తె ఇంట్లో మండపం కట్టి వధూవరులను కూర్చోబెట్టారు. సుబ్బణ్ణశాస్త్రికి పెళ్ళి మంత్రాలు తప్ప వేరే ఏ మంత్రాలురావు. శ్రీపాదులను ధ్యానించి మొదలు పెట్టగానే అప్రయత్నంగా నోటినుండి శ్రాద్ధమంత్రాలు వచ్చాయి. ఈ విధంగా శ్రాద్ధమంత్రాలతో మొదటగా వల్లభేశుని పితృ దేవతలను శాంతింపజేసి దాని తర్వాత పెళ్ళి మంత్రాలు చదివి శ్రీచరణులు ఇచ్చిన పసుపుకొమ్మునే మంగళసూత్రంగా కట్టించడంతో పెళ్ళితంతు ముగిసింది. మళ్ళీ అందరం శ్రీవారి ఆశీర్వాదం కోసం కురుంగడ్డ వచ్చాము. ఆ మహాగురువులు ఆశీసులిచ్చి మమ్మల్ని కొంచెంసేపు ధ్యానం చేయమని ఆదేశించారు. ఈసారి నాకు ధ్యానంలో వల్లభేశుని జీవితంలో జరగబోయే సంఘటనలు కన్పించాయి. తరువాత వారు తమ తత్త్వం గురించి వివరిస్తూ ఉన్నప్పుడు ఎక్కడినుండో ఒక ఘంట వారి పాదాలదగ్గర పడి కొద్ది క్షణాల తరువాత అదృశ్యమయింది.



## వల్లభేశునికి ప్రాణదానం

శ్రీపాదులు వల్లభేశునితో, "నీ చిన్న తనంలోనే తల్లితండ్రులు చనిపోతే నీ పినతండ్రులు ఆస్తి అంతా కాజేయ్యడమే కాకుండా నిన్ను ఎంతో కష్టపెట్టారు. వాళ్ళ పిల్లలు కూడా నిన్ను శత్రువునిలా చూస్తున్నారు. ఇది అంతా నాకు తెలుసు. చనిపోయిన నీ పినతండ్రులు మళ్ళీ జన్మించి దొంగలుగా మారి నీవు కురువపురం వస్తుంటే దారిలో నిన్ను చంపి నీ సొమ్ము దొంగిలించడానికి ప్రయత్నిస్తారు. నీవు నన్ను తలచుకున్నట్లయితే నేను వాళ్ళని చంపి నిన్ను రక్షిస్తాను," అని చెప్పారు. వల్లభేశుడు పసుపు వ్యాపారంలో చాలా ధనవంతుడు అవడం, స్వామి మళ్ళీ బ్రతికించాక కురువపురంలో

నాలుగువేలమంది బ్రాహ్మణులకు అన్నసంతర్పణ చేయడం కూడా నేను అంతకు ముందే నా ధ్యానంలో చూసాను. దీనికంతటికి కారణం వ్యాపారం బాగా కలిసివస్తే చెల్లిస్తానన్న మొక్కుబడి అతను వాయిదా వేయడమే అని కూడా తెలుసుకున్నాను. వారి మాటలు విని వల్లభేశుని భార్య కళ్ళనీరు పెట్టుకుంటే స్వామి ఓదార్చి పసుపుకొమ్మును ఇచ్చి 'నీవు సుమంగళిగానే జీవిస్తావు,' అని ఆశీర్వదించారు. ఆ ఘంట గురించి తెల్పుతూ అది భూమి పొరలలోనుంచి ప్రయాణం చేస్తూ ఎన్నో ఆకారాలు మారి అన్ని దేశాలు తిరిగి శంకరభట్టు 'శ్రీపాద శ్రీవల్లభ చరితామృతం' 18వ అధ్యాయం వ్రాయడం పూర్తి చేసేటప్పటికి తమ సంకల్పం ప్రకారం పిఠాపురం చేరుతుందని అక్కడ తమ పేరున నిర్మించే మహా సంస్థానంలో దీనినే కడతారని చెప్పారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 19వ అధ్యాయం

## లింగణ్ణ - గణపతిశాస్త్రుల వృత్తాంతం

## (శ్రీపాదులు పదిఏళ్ళ బాలుడు)

### లింగణ్ణశాస్త్రి కథ-వ్యథ

మేము అందరం కూర్చొని శ్రీపాదుల లీలలు తలచుకుంటుంటే వేదాలలో, వేదాంగాలలో పండితుడైన లింగణ్ణశాస్త్రి అనే వ్యక్తి వచ్చారు. వారు తమ విషయం ఇలాచెప్పారు. మా నాన్నగారు, తాతగారు బాగా ఆచారవంతులు, ధనవంతులై చాలా పిసినిగొట్టులు. పితృదేవతలకి తద్దినాలు పెట్టేటపుడు ఒకభక్తిభావం లేకపోగా అనవసరంగా డబ్బు ఖర్చవుతుందని, కర్మ చేస్తున్న బ్రాహ్మణులు-భోక్తలు విపరీతంగా తింటున్నారని బాధ పడేవాళ్ళు. నేను మాత్రం నా శక్తిమేరకు శ్రాద్ధకర్మలన్ని శ్రద్ధగా చేస్తుండేవాడిని. ఇలా ఉండగా అకస్మాత్తుగా మా ఇంటి వ్యవహారమంతా పూర్తిగా మారిపోయింది. ఇంట్లో ఎప్పుడూ పోట్లాటలు. ఎంతో శాంతస్వభావం కలవారు కూడా మా ఇంట అడుగు పెట్టగానే దుర్వాసమహామునుల్లా మారేవారు. ఇది చాలనట్లు ఏ కారణం లేకుండానే మా ఆవిడ నామీద అలిగి పుట్టింటికి వెళ్ళిపోయింది. కొడుకు, కోడలు, కూతురు, అల్లుడు, నాతో గొడ్డుచాకిరి చేయించుకొని నన్ను నానా మాటలు అంటుండేవారు. నా మకాం గొడ్లచావడిలోకి మార్చారు.

### బాధానివారణ

ప్రపంచంలో ప్రతి మనిషికి బ్రతకడానికి ఒక కారణం, బ్రతుకు పైన మమకారం, ఒక ఆశ, ప్రేమ, బ్రతుకులో ఒక మధురిమ ఉంటాయి. నాకు అందులో ఏ ఒక్కటి లేకపోగా, ఆత్మహత్య చేసుకొని ఈ సారహీనమైన సంసారం నుండి విముక్తి పొందాలన్న కోరిక తీవ్రతరంగా ఉన్నా ఆత్మహత్య చేసుకుంటే ఏ దయ్యమో, భూతమో అవుతానేమో అన్న భయం నన్ను

వెనుకకి లాగుతూ ఉండేది. ఒకరోజు పని అంతా చేసి తిందామని కంచం ముందు కూర్చుంటే పాసిపోయిన అన్నం, పైగా దాన్నిండా పురుగులు. భగవంతుడా! నాకు ఏడవడానికి కూడా ఓపికలేదు తండ్రీ! అంటూ చతికిలబడ్డాను. ఎక్కడినుండో ఒక అవధూత నాదగ్గరకు వచ్చారు. వారిని చూస్తూనే ఎన్నో జన్మలనుండి ఆయన నాకు తెలుసునని అనిపించింది. మనకు బాగా ఆప్తులైన వారిని చూస్తే కలిగే ఆప్యాయత, దగ్గరతనం, భావోద్వేగం కలిగి వారిని గట్టిగా పట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చాను. కొన్ని నెలలుగా గుండె లోతుల్లోనూ, మనసు పొరలలోనూ పేరుకున్న బాధ అంతా కన్నీటి రూపంలో బయటకు వచ్చింది. వారు నన్ను తమ అమృతస్పర్శతో ఊరడించి, నన్ను అనునయిస్తూ హల్వా తినిపించారు. తర్వాత ఈశాన్యమూల తవ్వమని ఆదేశించారు. నిలువు లోతు తవ్వగానే కుక్కల అస్థిపంజరాలు బయట పడ్డాయి. వాటిని బయట పారవేయించి ఆ గోతిలో నా దగ్గరున్న గంజి పోయమన్నారు. ఆ తర్వాత స్థలశుద్ధి జరిగిందని, ఇకపై పరిస్థితులు చక్కబడతాయని చెప్పి నన్ను పిఠాపురం వెళ్ళమని అక్కడ కలుసుకుందామని అన్నారు. దారిలో నాకు దేనికి కష్టం కలగదని హామీ ఇచ్చారు.

**పీఠికాపుర ప్రయాణం**

నేను అప్పటికప్పుడే ఎవ్వరికి చెప్పకుండా కట్టుబట్టలతో బయలుదేరాను. దారిలో ఒక మామిడితోట యజమాని నరసింహప్ప అనే వ్యక్తి నన్ను ఆదరించి తినడానికి రుచికరమైన వేడివేడి అన్నమే కాకుండా కొత్త బట్టలు, దక్షిణ కూడా యిచ్చారు. ఒక అవధూత తమ కలలో కనిపించి, 'ఒక బ్రాహ్మణుడు నీ తోటనుండి నడిచి వెళ్తుంటారు. ఆయనకు ఆతిథ్యం, బట్టలు, దక్షిణ ఇవ్వమని చెప్పారు,' అని ఆ తోట యజమాని నాకు తెలియజేసారు. ఆహా! ఆ అవధూతకు ఎన్ని శక్తులు! సాక్షాతు భగవంతుడేనేమో! అని నాకు అనిపించింది. వారి ఆతిథ్యం తీసుకొని,

సేదతీరి మళ్ళీ ప్రయాణం సాగిస్తుంటే ఒక వేద పండితుడు కలిసారు. "మీరు ఎంత అదృష్టవంతులు! స్వయాన శ్రీపాద శ్రీవల్లభులే మిమ్మల్ని పిఠాపురం రమ్మని పిలిచారు," అని చెప్తూతూ తమ సంతోషాన్ని వ్యక్తం చేసారు. నేను శ్రీపాదుల గురించి ప్రశ్నించాను. వారు దత్తుని అవతారమని, సవితృకాఠక చయనం చేసిన భరద్వాజమునికి ఇచ్చిన మాట ప్రకారం పీఠికాపురంలో పుట్టారని చెప్పారు. అంతేకాదు, నాకు ఆతిథ్యం ఇచ్చిన రైతు పూర్వజన్మలో పీఠికాపురంలో వెంకటప్పయ్యశ్రేష్ఠిగారి నాన్నగారి వద్ద పాలేరుగా పని చేసేవారని, పరమ పవిత్రులైన వారి ఇంట భోజనం చేసిన పుణ్యంవల్ల ఈ జన్మలో భూస్వామిలా పుట్టి అన్ని సుఖాలను అనుభవిస్తున్నారని ఆ రైతు పూర్వజన్మ కథ కూడా చెప్పారు. శ్రీపాదులు భక్తరక్షణలో జాతి, మతం, కులం, వయస్సు చూడరని వారిని నమ్మేవాళ్ళనందరిని సమానంగా అనుగ్రహిస్తారని చెప్పి ఆ వేదపండితుడు తన కథని ఇలా చెప్పారు:

## వేదపండితుడు గణపతిశాస్త్రి కథ

"నా పేరు గణపతిశాస్త్రి. నేను మా గ్రామమైన పెనుగొండ నుండి వేదాలు నేర్చుకోడానికి వాయసపురం (కాకినాడ) వచ్చాను. మా గురువుగారికి సేవచేస్తూ వేదం నేర్చుకుంటున్నాను. ఒకరోజు నేను మేతకై పశువులను మా గురుదేవుల పొలానికి తీసుకొని వెళ్ళాను. అక్కడ చాలా అందంగా ఉన్న పదిసంవత్సరాల పశువులకాపరిని చూశాను, మెడలో జందెం చూచి బ్రాహ్మణుడివా? అని ఆ బాలుణ్ణి అడిగాను. "నన్ను బ్రాహ్మణుడు అని అనుకుంటే తప్పు కాదు కాని అది మాత్రమే నిజం కాదు, అలాగే క్షత్రియుడిననో, కోమటివాడిననో, శూద్రుడిననో అనుకున్నా కూడా పొరపాటేమీ కాదు. కాకపోతే అవి ఏవీ పూర్తి నిజాలు అని కాని నిజాలు కావనికాని చెప్పలేను. ఇది నిజం, ఇది అబద్ధం అనిపించే ప్రతి విషయానికి నేను అతీతమైన స్థితిలో ఉంటాను. అంత ఎందుకు? నేనే పరమసత్యం,

నేనే పరమధర్మం కూడానూ. నన్ను మించిన సత్యం కాని, నన్ను మించిన ధర్మం కాని ఈ సృష్టిలో లేవు. నన్ను స్త్రీ అనుకుంటే పురుషునిలా, పురుషుడు అని భావిస్తే స్త్రీలా కనిపిస్తాను. ఇటువంటి నాగురించి నువ్వు ఏమి తెలుసుకోగలుగుతావు? అని ఎన్నో ఎదురు ప్రశ్నలతో అర్థంపర్థం లేనట్లు కనిపించే జవాబు ఇచ్చాడు. బాబోయ్! పైత్యం ఎక్కువయ్యి నోటికి వచ్చినట్లు వాగుతున్నాడురా బాబు! అనుకున్నాను. ఇంతలో అతను తనలో తాను ఏదో మాట్లాడుతుండటం చూసి వెఱ్ఱిమొగం వేసి చూస్తుంటే 'నేను శనిదేవుడితో మాట్లాడుతున్నాను, గణపతిశాస్త్రిని పట్టుకుంటానని శని అంటున్నాడు. అతని కర్మని నేను ఈ ఆవుపాల రూపంలో తీసుకోబోతున్నాను. కనుక అతన్ని నువ్వు ఏమి చేయలేవు అని చెప్తున్నాను,' అని నాతో అంటూనే ఒక గొడ్డుమోతు గోవు దగ్గరకు వెళ్ళి, "గాయత్రీ! నాకు ఆకలిగా ఉంది. కొంచెం పాలివ్వగలవా?" అని అడిగారు. ఆ గోవు సరే అనే అర్థంలో తల ఊపింది. అంతే, దాని పొదుగు పూర్తిగానిండి పాలధారలు నేలపై పడుతూ ఉన్నాయి. ఆ పశువుల కాపరి తృప్తిగా దాని దగ్గర పాలు తాగి వెళ్ళి మామిడిచెట్టు కింద కూర్చున్నాడు. ఆ గొడ్డు ఆవుకి అన్ని పాలు రావడం ఏమిటి? ఆ సమయంలో నా జాతకంలో చెడుదశ నడుస్తున్న మాట వాస్తవమే. కాని ఇతనికి నా చెడు దశ గురించి ఎలా తెలిసింది? ఈ కాపరి నా చెడుదశ పోగొట్టాడా? ఎలా? నాకంతా చాలా ఆశ్చర్యంగానూ అయోమయంగానూ ఉంది.

### అనఘా-అనఘుల దర్శనం

మళ్ళీ అటువైపు చూస్తే ఈసారి అతనితోపాటు పదేళ్ళ అందమైన బాలిక కూడా ఉంది. ఇద్దరి జంట చూడ ముచ్చటగా ఉంది. ఇంతలో వెంకటప్పయ్యశ్రేష్ఠి గుర్రపు బండిలో అక్కడికి వచ్చారు. వారి పొలాలు అక్కడే ఉండటంవల్ల తరచు వారు అక్కడికి వస్తుండేవారు. ఈసారి

ముమ్మూర్తులా పశువుల కాపరిని పోలిన పదేళ్ళ పిల్లవాడు వారితోబాటు వచ్చాడు. శ్రేష్ఠిగారు కూడా ఆ చిన్న పిల్లలిద్దరిని చూసి ఆశ్చర్యపోయారు. అపుడు శ్రీపాదులు దీన్ని గురించి వివరిస్తూ ఆ బాల–బాలికలు ఇద్దరూ అనఘా–అనఘులు అని, వాళ్ళిద్దరిని చూడగల్గటానికి ఎంతో పుణ్యం చేసుకొని ఉండాలని చెప్పి, కాలంకాని కాలంలో చెట్టుపైన మామిడిపండు కాసేలాచేసి దానిని స్వయంగా తన చేతులతో శ్రేష్ఠిగారికి తినిపించారు. ఆ సమయంలో వారు ప్రేమామృతవర్షం కురిపిస్తున్న జగన్మాత అనఘాదేవిలా కనిపించారు. తరువాత తానే అత్రిఅనసూయల కొడుకైన దత్తాత్రేయుడనని కూడా చెప్పారు. వెంటనే శ్రేష్ఠిగారు చేతులు జోడించి, “నాయనా! మా వంశంపైన, మా గోత్రంపైన, మా కులంపైన నీ దయ ఎప్పుడూ ఉండనీ!” అని అడిగారు. శ్రీపాదులు “తథాస్తు” అని శ్రేష్ఠిగారి వంశంలోను, వారి తాతగారి వంశంలోను, వర్మగారి వంశంలోను 33వ తరం నడుస్తుండగా వారి పేరున పీఠికాపురంలో మహా సంస్థానం ఏర్పడుతుందని, వారు అదృశ్యంగా ఇచ్చే ప్రోత్సాహం వల్లనే అది జరుగుతుందని చెప్పారు. ఏదో ఒక రకంగా పీఠికాపురంతో సంబంధం ఉన్న వాళ్ళనుండే ధన సహాయం లభిస్తుంది అని కూడా తెలియజేసారు.

**పుణ్య తిథులు**

పీఠికాపురంలో జరిగే ఏ మంచి పనులలో పాల్గొన్నా, వారి జన్మ నక్షత్రమైన చిత్తానక్షత్రం రోజున అక్కడ పూజ చేసినా అప్పుల బాధలు ఉండవని, వివాహంకాని ఆడపిల్లలకు వివాహం అవుతుందని అన్నారు. శ్రావణపూర్ణిమ రోజున వారి చెల్లెలైన వాసవీకన్యకాపరమేశ్వరి రక్షాబంధనం కడతారని, ఆరోజు పీఠికాపురంలో వారి ఆలయంలో ఉన్నవాళ్ళకి చిత్రగుప్తుడు మహాపుణ్యం కేటాయించుతారని కూడా చెప్పారు.

ఇది అంతా ప్రత్యక్షంగా చూడగల్గినందుకు, స్వామి దయవల్ల శని

బాధ తప్పినందుకు, సాక్షాత్తు అనఘా-దత్తుల దర్శనభాగ్యం కలిగినందుకు తాను ఎంతో పుణ్యం చేసికొని ఉండి ఉండాలని చెప్పి తన కథ ముగించారు ఆ వేదపండితులు గణపతిశాస్త్రి.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 20వ అధ్యాయం

# గురుచరణుల గురుభక్తి

# (శ్రీపాదులు పదిఏళ్ళ బాలుడు)

## పాపశరీర దహనం

నేను ఉదయాన్నే కురుంగడ్డ వచ్చాను. శ్రీపాదుల కనులు శాంతి, కరుణ, ప్రేమ,జ్ఞానం అనే దివ్య జ్యోతులతో ప్రకాశిస్తున్నట్లుగా కనిపించాయి. వారిని చూస్తునే నా శరీరం, ఆత్మ, మనస్సు ఆనందంతో పరవశించాయి. నేను భక్తితో వారి పాదాలకు నమస్కరించాను. వెంటనే నా శరీరంలో నుండి అచ్చు నాలాగే ఉన్న ఒక నల్లని ఆకారం బయటకు వచ్చింది. నేను ఆశ్చర్యపోయి చూస్తుంటే స్వామి ఇలా అన్నారు: "ఇది నీలో ఉన్న పాప శరీరం. ప్రతి మనిషిలోను పాప పురుషుడు, పుణ్య పురుషుడు ఇద్దరూ ఉంటారు. అయితే పాపం పుణ్యం రెండూ ఉన్నప్పుడే మనిషికి ముక్తి దొరుకుతుంది. సద్బ్రాహ్మణుడు మనసా, వాచా, కర్మణా పవిత్రుడై ఉండి తన పాపాన్ని కాల్చి వేయడమే కాకుండా మిగిలిన వారి పాపాలను పోగొట్టగలిగే శక్తిసామర్థ్యాలు కలిగి ఉండాలి. ఇతరులతో పూజలు, కర్మలు చేయించినపుడు బ్రతుకుతెరువుకు కావలసిన దానికంటె ఎక్కువ ధనం తీసుకోరాదు. దక్షిణతో పాటు తమకు తెలియకుండానే బ్రాహ్మణులు వాళ్ళ పాపాలను కూడా తీసుకుంటారు. మళ్ళీ పూజలు, ధ్యానం చేసి ఆ పాపాలు పోగొట్టుకుంటారు. ఇలాంటి వారే నిజమైన బ్రాహ్మణులు. మాతాతగారు, నాన్నగారు ఆ కోవకు చెందినవాళ్ళు. అటువంటి వాళ్ళ పేర్లు తల్చుకుంటేనే చాలు పాపాలు పోతాయి," అని చెప్తూ కుడిచేయిని ముందుకు చాపారు. అందులో నుండి యజ్ఞానికి కావలసిన పదార్థాలు, పళ్ళు, పూలు, నెయ్యి, చివరగా మండుతున్న నిప్పులతో హోమగుండం వచ్చాయి. శ్రీపాదులు నాలోనుంచి వెలువడిన పాపపురుషుని అగ్నిలోకి దూకమని సైగ చేసారు.

ఆ శరీరం నిప్పుల్లో దూకి కాలిపోతున్నప్పుడు నాకు భరించలేనంత బాధ కలిగింది. నాకు తెలియకుండానే నేను మెల్లగా సమాధిలోకి జారిపోయాను.

## గురుచరణునితో సమాగమం

ఆరోజు గురువారం. స్వామి తన చేతులతో అందరికి హల్వా పంచారు. ఇంతలో పద్మశాలి కులసంభవుడైన గురుచరణుడు అనే భక్తుడు అక్కడికి వచ్చాడు. ప్రభువులు వారికి కూడా హల్వా ప్రసాదాన్ని ఇచ్చి, “గురుచరణా! శ్రీగురుచరణములే సర్వదా శరణు శరణు అని త్రికరణ శుద్ధిగా భావిస్తూ పవిత్ర జీవనం గడుపుతున్నావు. ఈనాడు నా కరకమల ముల నుండి ప్రసాదం తీసుకొని ధన్యుడవయ్యావు. శంకరభట్టునకు గురుతత్త్వమును నీకు తెలిసినంతలో వివరించు,” అని ఆజ్ఞాపించారు. గురుచరణుడు ఇలా చెప్పడం మొదలుపెట్టాడు:

“అనేకవేల బ్రహ్మాండాలను సృష్టించి, వాటి ఉనికిని కొనసాగేలా చూస్తూ చివరకు వాటిని నాశనం చేసే మహా సంకల్పాన్ని పరమాత్మ అంటాము. పరమాత్మకు రూపంకాని, గుణం కాని ఉండవు. అటువంటి నిరాకారుడు, నిర్గుణుడు అయిన పరమాత్మ మొట్టమొదట దత్తునిగా అవతరించి, ఇపుడు శ్రీపాదులుగా పీఠికాపురంలో జన్మించారు. సృష్టి మొదలు అయిన దగ్గరనుండి గొప్పగొప్ప ఋషులు తపస్సు చేసి ప్రత్యక్షం చేసుకొన్న అన్ని దేవతల రూపాలు శ్రీపాదులవే,” అని శ్రీపాదుల గురించి మొదట చెప్పి తరువాత తన కథను ఇలా తెలిపారు: “నేను దైవభక్తి ఉన్న ఇంట్లో పుట్టాను. మా కులదైవం దత్తాత్రేయుడు. మాకు ఆర్థికపరంగా చాలా సమస్యలు ఉండేవి. స్వామిని ఎంత వేడుకొన్నా ఏమీ లాభం లేకపోయింది. అందరు కుల దైవాన్ని మార్చుకోమని సలహా ఇచ్చారు. నేను మొదట కొద్దిగా సందేహించినా తరువాత సరే అనుకున్నాను. ఆరోజు రాత్రి నాకు కలలో భయంకరంగా ఉన్న ఒక కసాయివాడు కనిపించి, తాను దత్తుడినని, ఏ

రూపంతో పూజించినా అది తనకే దక్కుతుందని, అయినా కూడా నేను వారి భక్తుణ్ణి కాబట్టి వారిని విడిచి పెట్టినట్లయితే ఆ కత్తితోనే నన్ను చంపుతాను," అని బెదిరించారు. అటుతరువాత ఎంత ప్రయత్నించినా నాకు నిదురే కరువు అయ్యింది.

**మారకయోగం నుండి తప్పించుట**

తెల్లవారగానే ఒక హరిదాసు తలపైన ఉన్న పాత్రలో ఒక చిన్న మేడిచెట్టుతో మా యింటికి వచ్చాడు. హరిదాసుని వట్టి చేతులతో మన ఇంటి నుండి పంపకూడదు. అందుకనే ఇల్లంతా వెతికి వెతికి నేను కొన్ని నూకలు దొరికితే భిక్ష యిచ్చాను. అపుడు అతను నాతో, 'నిన్న రాత్రి గురుచరణుడనే దత్త భక్తుణ్ణి కసాయివాడు ఒకడు చంపాడని, చచ్చిన వ్యక్తి ప్రాణం ఆ మేడి చెట్టులో ప్రవేశించిందని, ఆ మేడిచెట్టుని తీసుకొని యింట్లో పెట్టి పూజ చేయమని,' నాకు చెప్పారు. నేనే గురుచరణుడినని, నన్నెవ్వరు చంపలేదని చెప్పి నాకు వచ్చిన కల అతనికి వివరించి, ఒక మనిషి చనిపోయి ఆ శవం దొరకనపుడు మేడికర్రలను పేర్చి శవానికి జరిపే కర్మకాండ జరుపుతారని విన్నాను. కాని మనిషి బతికి ఉండగానే అతని ప్రాణాలు మేడిచెట్టులోనికి ఆకర్షించి అదే సమయంలో అతని ప్రాణాన్ని నిలపడం గురించి ఎక్కడా వినలేదని చెప్పాను. దానికి హరిదాసు బిగ్గరగా నవ్వి, "మనిషి శారీరి కంగా చనిపోవడం మాత్రమే మరణం కాదు. ఒక వ్యక్తికి మారకదశ నడుస్తున్నప్పుడు నిజమైన గురువు తన శిష్యుణ్ణి భయంకరమైన అవమానాల పాలుచేసో, కష్టనష్టాలకు గురిచేసో, అతడి కర్మని నాశనం చేసి పునర్జన్మని ఇస్తారు. అదే ఒక అవతార పురుషుడు అయినట్లయితే ఏదో కొద్దిపాటి బాధతో కర్మ విముక్తి చేస్తారు. మారకయోగం ఉన్న భక్తుడి ప్రాణాలు దత్త

ప్రభువులు మేడిచెట్టులోకి అకర్షించి,[8]మేడిచెట్టులోని ప్రాణశక్తిని ఆ భక్తుడికి ఇచ్చి అతని ప్రాణం నిలబెట్టారు. మారకదశ వెళ్ళిపోగానే మేడిచెట్టునుండి అతనిలోకి ప్రవహించిన ప్రాణశక్తి స్థిరపడి మరి కొంతకాలంపాటు అతను జీవించి ఉంటారు," అని వివరించారు.

## ముళ్ళచెట్టులా జన్మించిన విస్సావధానులకు విముక్తి

మేము ఆ మేడిచెట్టును చాలా ప్రేమతో పెంచడం మొదలు పెట్టాము. మాకు ఏ కష్టం వచ్చినా మేడిచెట్టుకి ప్రదక్షిణ చేసి దానితో చెప్పుకొనేవాళ్ళం. మాబాధ దత్తులకి చేరి మాకష్టం దూరం అయ్యేది. ఇలా ఉండగా, మాదూరపు బంధువు ఒకరు వృద్ధులు కావడంతో, పిల్లాపాపలు లేకపోవడంతో తన పట్టుబట్టల వ్యాపారాన్ని నాకు అప్పగించారు. వ్యాపారంలో అన్ని ప్రదేశాలు తిరుగుతూ నేను పీఠికాపురం చేరి బాపనార్యుల యింటికి వెళ్ళాను. అపుడు శ్రీపాదులు పెరట్లో ఉన్న ముళ్ళచెట్టుకి శ్రద్ధగా నీళ్ళు పోస్తున్నారు. నీళ్ళు పోయక పోయినా ముళ్ళచెట్టు పెరగడం మానదని నవ్వుతూ అంటున్న తాతగారితో, 'అది పూర్వజన్మలో వారి వీధిలో ఉండే విస్సావధానులు తాతగారేనని, బాపన్నావధానులు, అప్పలరాజశర్మలవంటి పుణ్యాత్ములను మనసు కష్టపడేలా సూటిపోటి మాటలతో, విమర్శలతో బాధ పెట్టినందుకు ఆ స్వభావానికి తగ్గట్టుగా ముళ్ళచెట్టులా పుట్టారని,' శ్రీపాదులు చెప్పారు. తరువాత వారు నన్ను ఆ ముళ్ళచెట్టు దగ్గరకు తీసుకొనిపోయి, "ఓ విస్సన్న తాతా! పుణ్యాత్ములని దూషించడం వల్లనూ, నీ పిల్లలు ఏమాత్రం శ్రద్ధ లేకుండా చేసిన శ్రాద్ధ

8. అయితే ఇలా భక్తులందరికి మేడిచెట్టు ప్రాణశక్తిని పంచియిస్తే కొన్నాళ్ళకు ఆ చెట్టులో ప్రాణశక్తి లోపించిందా అంటే, ఉహూ ! లోపించదు ఎందుకంటే మేడిచెట్టు దత్తాత్రేయుల నివాస స్థానం కదా..

కర్మలవల్లనూ నీకు ఇలాంటి జన్మ వచ్చింది. ఈ గురుచరణుడు పూర్వ జన్మలో నీ పుత్రుడు. ఇతనితో నీ శ్రాద్ధకర్మలు జరిపించనా?" అని అడిగారు. "అంతకంటె అదృష్టమా?" అని విస్సన్నతాత యొక్క ప్రేతాత్మ అనడం స్పష్టంగా వినిపించింది. శ్రీపాదులు రావి, మేడి పుల్లలతో నిప్పు పుట్టించి నన్ను ఆ ముళ్ళచెట్టును కాల్చమన్నారు. తర్వాత నన్ను స్నానం చేసి రమ్మన్నారు. 'విస్సావధానులు పీఠికాపురంలో జన్మించడంవల్ల, నా దర్శనం చేసి ఉండటంవల్ల యోగ్యుడు కాకపోయినా నేను వారికి ముక్తిని ప్రసాదించాను,' అని శ్రీపాదులు వివరించారు. **'ఋణానుబంధం లేకుండా ఎవ్వరు ఎవ్వరి దగ్గరకు రారు. కాబట్టి ఎవ్వరితోను హేళనగానో, చుల కనగానో మాట్లాడకూడదు. నీకు చాతనయితే సహాయం చేయి లేదా శాంతంగా సమాధానం చెప్పు. అంతేగాని కఠినంగా ఎవ్వరితోనూ వ్యవహరించకూడదు,'** అని హెచ్చరించి, "సృష్టి ఎంత సత్యమో సృష్టి అంతటికి తానే మూలకారణం అన్నది కూడా అంతే సత్యమని, సత్యము, జ్ఞానము, అనంతము అయిన బ్రహ్మ తానే," అని చెప్పారు. ఇది అంతా వింటున్న బాపనార్యులు, "బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను, సరస్వతీ, లక్ష్మీ, పార్వతులను సృష్టించినది ఆదిపరాశక్తి కదా! అలాంటప్పుడు నీవెవరివి? నీ అస్తిత్వం ఏమిటి?" అని ప్రశ్నించారు. "ఆ ఆది పరాశక్తికి సృష్టిచేయాలి అన్న ప్రేరణ, సంకల్పం ఇచ్చింది నేనే, ఆవిధంగా ఆదిపరాశక్తికంటె ముందు నిరాకారుడిగా కేవలం సంకల్ప స్వరూపంతో ఉన్నది నేను," అని స్వామి జవాబు ఇచ్చారు.

## దత్తులే ఆదిగురువు

"నేను ప్రతి జీవితోను అంతర్గతంగా సంబంధం కలిగి ఉంటాను. వాళ్ళ పాపాలని, కల్మషాన్ని తీసుకొని జప-తపాదులతో వాటిని దగ్ధం చేసి వాళ్ళ ప్రగతికి సహాయం చేస్తాను. **నిజానికి నేను పూజ చేయాల్సిన అవసరం**

**లేదు. కాని నన్ను పూజించేవాళ్ళ కర్మలను, పాపాలను భస్మం చేయడానికే తపస్సు చేసి ఆ పుణ్యాన్ని వారికి ధార పోస్తాను. కాబట్టే నేను ఆదిగురువును. తల్లితండ్రుల ఆస్తికి పిల్లలు వారసులు అయినట్లే గురువు యొక్క తపశ్శక్తికి శిష్యులు వారసులు,"** అని ధర్మ సూక్ష్మాలను వివరించి, "దత్తుడు స్మృతిమాత్ర ప్రసన్నుడు, మనస్ఫూర్తిగా ఒక్కసారి దత్తా! అని నా పేరు తల్చుకుంటే చాలు ప్రసన్నుడనై భక్తులను ఆదుకుంటాను. భక్తుడు ఒక్క అడుగు నావైపు నడిస్తే నేను నూరు అడుగులు వేసి వాళ్ళని కంటికి రెప్పలా కాపాడుతాను," అని కూడా చెప్పారు. తాను శ్రీపాదులను సంజీవని మూలిక గురించి అడిగానని దాన్ని వారు సృష్టించి తనకు యిచ్చారని, అది యిప్పటికి తమ పూజా మందిరంలో జాగ్రత్తగా ఉందని చెప్పి గురుచరణుడు తన కథ ముగించాడు.

## మాంచాలగ్రామమే మంత్రాలయం

యోగనిద్రనుంచి లేచిన శ్రీపాదులు మా ఇద్దరిని మాంచాల గ్రామం (మంత్రాలయం) వెళ్ళమని, భవిష్యత్తులో ఒక మహా పురుషుని ఉనికి వల్ల ఆ స్థలం క్షేత్రంగా ప్రసిద్ధి పొందుతుందని, వారి లీలలు చిత్రవిచిత్రంగా ఉంటాయని చెప్పారు. రాబోయే కాలంలో స్థాపించబోయే శ్రీపాదుల మహాసంస్థానాన్ని, ఆలయంలోని దత్త, శ్రీపాదశ్రీవల్లభ, నృసింహసరస్వతుల విగ్రహాలను, ఆలయ ప్రాంగణంలోని మేడిచెట్టుని కనులారా చూడమని మా ఇద్దరి కనుబొమల మధ్య తాకారు. మా కంటిముందు ఆ సుందర దృశ్యాలన్ని చక్కగా కన్పించాయి. మేమెంతటి అదృష్టవంతులము! శ్రీపాదుల లీలలను ఏమని వర్ణించగలము? వారి లీలలు అమోఘం! అద్భుతం! వశిష్ఠ అంశ కలవాడు నా సంస్థాన పూజారిగా వస్తాడు, అని కూడా వారు తెలిపారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

## 21వ అధ్యాయం

# దండిస్వాముల వృత్తాంతం

### భావతరంగాల వివరణ

నేను, గురుచరణుడు మాంచాలగ్రామం బయల్దేరాము. భవిష్యత్తులో మహాసంస్థానానికి రాబోయే వశిష్ఠ అంశ కల పూజారి గురించి చెప్తూతూ గురుచరణుడు ఇలా అన్నారు, "తమ సంస్థానానికి గొప్ప తపస్వి పూజారిగా రావాలనేది శ్రీవారి సంకల్పం. కాని అది సంస్థానం స్థాపించిన వెంటనే జరగదు. కొంతకాలం భక్తి శ్రద్ధలతో, పవిత్ర మంత్రాలతో పూజలు, అర్చనలు, యజ్ఞాలు జరిగితే అక్కడి వాయుమండలం శుభ్రమూ, పవిత్రమూ అవుతుంది. ఈ పవిత్ర తరంగాలు పవిత్రభావాలు కలవాళ్ళని ఆకర్షిస్తాయి. అప్పుడు స్వామి చెప్పిన మాట యదార్థం అవుతుంది. ఇక తరంగాల విషయానికి వస్తే వీటిని స్పందనలని కూడా అంటారు. ఆకాశంలో ఎల్లప్పుడూ పవిత్రమైన, అపవిత్రమైన రెండు రకాల భావతరంగాలు ప్రసరిస్తూనే ఉంటాయి. మంచివారు మంచి స్పందనలను ఆకర్షిస్తే, చెడ్డవాళ్ళు చెడు స్పందనల ప్రభావంలో పడ్తారు. **ఒక్కొక్కసారి ఒక పవిత్ర ప్రదేశంలోని స్పందనలు ఎంతో శక్తి కలిగి, మహాపురుషుల మనసును తాకి, వారిని ఆ స్థలానికి రప్పిస్తాయి. అలాగే ఒక చెడు ప్రదేశంలోని దుష్ట స్పందనలు చెడ్డవాళ్ళని ఆ స్థలానికి లాక్కొని వస్తాయి. అందుకనే ధ్యానం కాని, పూజ కాని పవిత్రమైన స్థలంలో పవిత్రమైన భావాలతో చేయాలి. మనస్సు పూర్తిగా పరమాత్మ మీదే లగ్నం కావాలి.** డబ్బుకాని, అన్నంకాని నిజాయితీతో సంపాదించిన వాళ్ళ వద్దనే స్వీకరించాలి," అని తెల్పి అహంకారంతో ప్రవర్తించే వాళ్ళకు స్వామి అనుగ్రహం ఉండదని చెప్తూ ఉదాహరణగా ఈ వృత్తాంతం చెప్పారు:

## దండిస్వామి అహంభావం

"మేము నల్గురం భక్తులం పూరీ జగన్నాథ యాత్రకి వెళ్ళాము. **అక్కడ జగన్నాథ విగ్రహంలో మాకు మొదట శ్రీపాదులు కనిపించాక జగన్నాథుల దర్శనం అయ్యింది. తమను మనస్ఫూర్తిగా నమ్మిన వాళ్ళకి అన్ని దేవతా మూర్తులలో తామే కనిపిస్తామని, దేవతామూర్తులన్ని తామే అని** స్వామి ఇలా మాకు తెలియజేసారు. ఇంతలో దండిస్వామి అనే మహాత్ములు తమ 108శిష్యులతో అక్కడికి వచ్చారు. మేము వారి పాదాలకు నమస్కారం చేయగానే ఆయన మాట పడిపోయింది. మేము భయపడి, "ఓ శ్రీపాదా! ఈ స్వామికి మళ్ళీ నోరు వచ్చేలా చేయమని," ప్రార్థించిన వెంటనే వారికి మాట వచ్చింది. దానితో వారి శిష్యులకి ఒళ్ళుతెలియని కోపం వచ్చి, 'మీ శ్రీపాదుడు వట్టి క్షుద్ర మాంత్రికుడు. మేము పిఠాపురం వచ్చి, ఆయనగారి బండారం బయటపెట్టి మట్టి కరిపిస్తాము,' అని ప్రతిజ్ఞ చేసారు. శ్రీపాదుల లీలలు విచిత్రంగా ఉంటాయి. సమస్యలు వారే సృష్టిస్తారు, పరిష్కారమూ వారే చూపిస్తారు. సరే! దండిస్వామి పిఠాపురం రావడం, ప్రజలు, ప్రత్యేకించి బ్రాహ్మణులు ఆయనకు ఘనంగా స్వాగతాలు పలకడం జరిగాయి. 'మానవమాత్రుడై ఉండి తాను దత్తుడినని డాంబికాలు చెప్తున్న శ్రీపాదుడు కుక్కుటేశ్వరాలయానికి వచ్చి మహాదత్త భక్తులైన దండిస్వామి కాళ్ళపై పడి క్షమార్పణ చెప్పాలి,' అని వాళ్ళు ఊరంతా చాటింపు వేయించారు.

ఇటువంటి అకృత్యాలకు వైశ్యులు ఎటువంటి మద్దతు ఇవ్వకూడదని శ్రేష్ఠిగారి ఆధ్వర్యంలో జరిగిన వైశ్యసభలోనూ, క్షత్రియులు ఎటువంటి మద్దతు ఇవ్వకూడదని వర్మగారి ఆధ్వర్యంలో జరిగిన క్షత్రియ సభలోనూ తీర్మానించారు. కాని శ్రీపాదులు మాత్రం చలించక నిబ్బరంగా వేదఘోషల మధ్య పెరుగు అన్నం తిన్నారు. ఆ పెరుగు ముద్దలు కుక్కుటేశ్వరాలయంలోని స్వయంభూదత్తుడి ముఖంపై కనిపించాయి. ఎంత తుడిచినా

మళ్ళీ వస్తూనే ఉన్నాయి.

## శృంగభంగం

అదే సమయానికి అబ్బన్న అనే పాములవాడు శ్రీపాదుల ఇంటికి వచ్చాడు. వాడికి కడుపునిండా భోజనం పెట్టాక శ్రీపాదులు వాడితో, "నీవు మాదిగ సుబ్బయ్యని తోడు తీసుకొని కుక్కుటేశ్వరుని గుడికి వెళ్ళు. అక్కడ ఉన్న వాళ్ళతో నామాటగా ఇలా చెప్పండి, 'ఏ కారణం లేకుండా ఇతరులని తిట్టేవాళ్ళకి పిశాచ జన్మ వస్తుంది, ఆ యోగం తప్పించుకోవాలంటే నా దగ్గరకు రండి.' ఒప్పుకున్న వాళ్ళపైన నీవు నీళ్ళు చిలకరించు, సుబ్బయ్యని వాడి ముంతలోనుంచి పెరుగన్నం ప్రసాదంలా పంచమని చెప్పు,' అని చెప్పి పంపారు. ఇద్దరూ వెళ్ళి అందరిని తీసుకొని వచ్చారు. శ్రీపాదులు కోపంతో "ఓయీ! దండిస్వామీ! నీకు ఎంత అహంకారం! నీవు ఆరాధించే దత్తుడే ఈ రూపంలో కళ్ళముందు ఉంటే గుర్తుపట్టలేని మూర్ఖుడివి. ఈ శ్రీపాద స్వరూపం భయంకరమైన నిప్పులాంటిది. నిప్పుతో చెలగాటం ప్రాణాలకే ప్రమాదం. నేనే ఈ సృష్టికి మూలం. నేను లేనిదే నీవు లేవు, ఈ సృష్టీ లేదు, గుర్తుంచుకో. నీకు నీ పాత శిష్యులు, వారికి తోడు ఇక్కడ కొత్తగా దొరికిన శిష్యులూ, వాళ్ళ వత్తాసు. బాగుంది. ఒంటెల అందాన్ని గాడిదలు, గాడిదల గాత్రాన్ని ఒంటెలు పొగుడుకొన్నట్లుగా ఉంది. నీకు మోక్షం వచ్చినా, రాకపోయినా ప్రపంచానికి ఏ లోటూ లేదు. కాబట్టి శిష్యుల జంఝాటం లేకుండా హిమాలయాలకు పోయి తపస్సు చేసుకో," అని మందలించి పంపారు.

## షోడశ త్రిదక్షిణ

ఇలా శ్రీపాదుల లీలలు మాట్లాడుకుంటూ మాంచాలగ్రామం చేరాము. ఆ గ్రామదేవత మాకు దర్శనం ఇచ్చి **ప్రహ్లాదుడే గురుసార్వభౌముల రూపంలో అక్కడ జన్మిస్తారని,** ఆ ప్రదేశం మంత్రాలయంగా ప్రసిద్ధి

చెందుతుందని చెప్పి తమ చేతులతో మాకు ప్రసాదం తినిపించారు. మేము తిరిగి వచ్చేటప్పుడు కృష్ణదాసు అనే మాలదాసరి మాతో కలిసారు. **'బ్రహ్మ, విష్ణు, శివుని స్వరూపాలు ఉండటం వల్ల శ్రీపాదులు షోడశ (16) కళాప్రపూర్ణులు. 16, 116, 1116, ఈ మూడింటిని షోడశాది త్రిదక్షిణ అంటారు. ఈ మూడు దానాల వల్ల బ్రహ్మజ్ఞానం వస్తుంది. అంతేకాకుండా శరీరం, ధనం, మనస్సు మూడింటిని దానం చేసిన ఫలం దక్కుతుంది,'** అని కృష్ణదాసు మాతో చెప్పారు. తర్వాత ఒక వింత సంఘటన వివరించారు.

## వినూత్న లీలావైఖరి

"ఒకసారి తమ పొలంలో వర్మగారు శ్రీపాదుల తొడపై తల పెట్టి విశ్రాంతి తీసుకుంటున్నారు. ఇంతలో అక్కడికి చాలా త్రాచుపాములు వస్తే శ్రీపాదులు విచిత్రంగా వాటి  తలలు, మొండాలు వేరుచేసి పడేసారు. పెద్ద చీమలు వస్తే వాటినన్నిటిని చంపి కుప్ప పేర్చారు. వర్మగారు లేచి ఈ వింత చూసి ఇది ఏమిటి? అని అడిగితే, రాజు సేనలని తప్పక రక్షించాలి. చూడు తాతా, చీమల రాజు వస్తున్నాడు అని చెప్పారు. వారి మాట ముగిసేలోగా వింత కాంతులతో మెరుస్తున్న పెద్ద తెల్లచీమ వచ్చి చచ్చిపడివున్న చీమలకు ప్రదక్షిణం చేయగానే అవి అన్ని తిరిగి బ్రతికాయి. ఒక మొండానికి వేరొక పాముతల, ఒక తలకి వేరొక మొండెం ఇలా ఇష్టం వచ్చినట్లు అతికించి శ్రీపాదులు ఆ పాములని కూడా బ్రతికించి, **'రాహు గ్రహబలం చాలనపుడు జాతకునికి అన్నీ కష్టాలే కల్గుతాయి. అదే కాలసర్ప యోగం. నేను చేసిన ఈ పనివల్ల నా భక్తుల జాతకంలోని సర్పదోషాలు తొలగిపోయాయి,'** అని వివరించారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

# 22వ అధ్యాయం

# అహంకారమే అజ్ఞానం

# (శ్రీపాదులకు 10 ఏండ్లు)

## మహాపండితుడు గురుదత్తభట్టు

కురుంగడ్డకు గురుదత్తభట్టు అనే జ్యోతిష్య పండితుడు వచ్చారు. నేను వారిని, "అయ్యా! జ్యోతిష్యశాస్త్రంలో చెప్పే ఫలితాలు అన్ని ఖచ్చితంగా జరిగే తీరుతాయా? లేదా ఏవైనా మార్పులు జరగవచ్చా? మనిషి మనుగడ తాను పూర్వం చేసిన కర్మపైన ఆధారపడి ఉందా? లేక అతను చేసే ప్రయత్నంపైననా?" అని నా సందేహం వెళ్ళబుచ్చాను. వారు దానికి చక్కగా జాతకపరంగా వివరిస్తూ ఇలా చెప్పారు: **"మానవులు వాళ్ళు చేసుకున్న పూర్వ జన్మల ప్రారబ్ధ కర్మలపైన ఆధారపడి జ్యోతిష్యశాస్త్ర గణిత ప్రకారం గ్రహాలు ఆయా స్థానాలలో మారినపుడు పుడ్తారు.** నిజం చెప్పాలంటే గ్రహాలకు మనుష్యులపైన ఇష్టమూ లేదు, కోపమూ లేదు. కాని వాటిలోనుంచి పుట్టే కిరణాలు, స్పందనలు ఒక్కొక్కసమయంలో ఒక్కొక్క రకమైన ఫలితాలను ఇస్తాయి. అందులో నుంచి పుట్టేవి దుష్ట స్పందనలు అయితే వాటిని నిరోధించగలిగే శక్తి ఆ మనిషిలో ఉండాలి. అలాకాని పక్షంలో ఆ చెడు ప్రభావాలకు అతడు బలి అయ్యి కష్ట నష్టాలకు గురి అవుతాడు. **ధ్యానం, జపం, పూజ మొదలైన వాటివల్ల గ్రహాల దుష్ప్రభావాన్ని నిరోధించగలిగే శక్తి కొంత వస్తుంది. కర్మ మరీ బలంగా ఉంటే ఇవి కూడా పని చేయలేవు. అలాంటి స్థితిలో మన తలరాతను మార్చగల్గేవారు శ్రీపాదులు ఒక్కరే. వారి హృదయం నుండి భక్తులపై పొంగే ప్రేమ, కరుణల ఉప్పెనలో కర్మదేవతలు శక్తి విహీనులు అయిపోతారు,"** అంటూ తన జీవితంలో జరిగిన సంఘటన చెప్పారు.

## అఘోరయోగంనుండి తప్పించుట

గొప్ప పండితుడినని, గొప్ప దత్తభక్తుడినని నాకు చాలా అహంకారం ఉండేది. అలాంటప్పుడు శ్రీపాదులు తానే దత్తుడినని చెప్పటం నాకు గొప్పలు చెప్పుకుంటున్నట్లుగా అనిపించడమే కాకుండా ఈయన ఎక్కడ? త్రిమూర్త్యాత్మక అవతారమైన దత్తులెక్కడ? అని నవ్వుకూడా వచ్చేది. అందుకని 'స్వయంభూదత్తునిలా శ్రీపాదులు కూడా శిలయేనా? మరి శిలకు నాడీ ఆడదు, గుండె కొట్టుకోదుగా?' అంటూ గేలి చేసేవాడిని. ఒకసారి కుక్కుటేశ్వర ఆలయానికి వెళ్ళాను. భక్తితో కళ్ళు మూసుకొని దత్తుని ప్రార్థిస్తున్నాను. "ఓరీ! మూర్ఖుడా! నీవు చచ్చి ఎంతసేపయింది? నా భక్తుడినని బీరాలు చెప్తూ నన్నే గుర్తు పట్టలేకపోతున్నావు," అనే మాటలు స్పష్టంగా వినిపించాయి. జ్యోతిష్కుడను కావడంతో గబగబా లెక్కలు కట్టి చూస్తే ఆరోజు ఏ ఘడియ, విఘడియలలో నేను మరణించాలో సరిగ్గా అదే సమయానికి గుడిలో ఉన్నాను. నాడీ, గుండె రెండూ కొట్టుకోవడం లేదు. అక్కడున్న అద్దంలో ముఖం చూసుకుంటే పూర్తి ప్రేతకళ. భయంతో శ్రీపాదుల ఇంటికి పరుగెత్తాను. 10ఏళ్ళ శ్రీపాదులు బయటకు వచ్చి, "ఓరీ! భడవా! **మిడిమిడి జ్ఞానంతో శ్రీచరణులమైన మమ్ము ఏమని చెప్పి వెక్కిరించావో సరిగ్గా అదే స్థితిలో నిన్ను నిలబెట్టాను. శిలగా మార్చాను, కాని ఆకలి దప్పులు అలాగే ఉంచాను. ప్రాణం తీశాను. నాడీ, గుండె రెండూ కొట్టుకోకుండా కట్టడి చేసి బ్రతికి ఉన్న వానిలా లోకం భావించేలా చేశాను,"** అంటూ గద్దించి మాట్లాడుతుండగా సుమతీమాత బయటకు వచ్చి నన్ను చూసి భయపడి, ఎవరీ అఘోరీ? అని ప్రశ్నించారు. "అమ్మా! వీడింకా అఘోరి అవలేదు. మనింట్లో కాస్త చద్ది అన్నం ఉంటే ఇతనికి పెట్టమ్మా," అని తల్లిని బ్రతిమిలాడారు. దయతో ఆ తల్లి ఇచ్చిన అన్నం తీసుకొని వెళ్ళి నేను కుక్కుటేశ్వరుడి గుడి దగ్గర తిన్నాను. మళ్ళీ ప్రభువుల దర్శనం చేసి

మా గ్రామం వెళ్ళిపోయాను. చెప్పుడు మాటలు విని చెడి పోయిన నాపై వారు దయచూపి పరమ పవిత్రమైన వారి ఇంటి ఆహారాన్ని సుమతీమాత ద్వారా అనుగ్రహింపచేసి అఘోరీలా జన్మ ఎత్తాల్సిన దౌర్భాగ్యం నుంచి నన్ను కాపాడారు," అని తమ గాథ వివరించి తరువాత బాపనార్యులతో జరిగిన సంఘటన ఇలా చెప్పారు:

## కర్మబంధ వివరణ

"ఒకసారి మాటల సందర్భంలో సరదాగాకూడా అసత్యం పలకరాదని సత్యఋషీశ్వరులైన బాపనార్యులు చెప్పారు. ఇంతలో శ్రేష్ఠిగారు అక్కడికి వచ్చి మహాలయపక్షంలో ఒకరోజు బాపనార్యులను తమ ఇంటికి భోజనానికి రావాలని, దక్షిణ కూడా తీసుకోవాలని కోరారు. బాపనార్యులు సరే అన్నారు. కాని మహాలయ అమావాస్య గడిచేంత వరకు వాగ్దానం తీసుకున్న వాళ్ళకి కాని ఇచ్చిన వాళ్ళకి కాని  ఆ విషయం గుర్తు లేదు. ఆ రోజు మధ్యాహ్నం శ్రీపాదులు ఈ విషయాన్ని గుర్తు చేస్తే ఇద్దరూ బాధ వ్యక్తం చేసారు. వారిని మరిచిపోయేలా చేసింది తానే అని శ్రీపాదులు నవ్వుతూ చెప్పి కర్మ బంధాలను ఇలా వివరించారు:

**"తల్లితండ్రుల నుండి జీవుడు శరీరాన్నే కాకుండా నేను అనే చైతన్యాన్ని కూడా పొందుతాడు. నేను అనే ఈ చైతన్యానికి పరంపరగా వచ్చే బాధ్యతలతోపాటుగా కర్మ బంధాలు కూడా వారసత్వంగా లభిస్తాయి.** మహాలయ అమావాస్య రోజున బాపనార్యులు శ్రేష్ఠిగారింట్లో అన్నం తినడం అనే కర్మ మీ ఇద్దరిమధ్య ఇపుడు జరగక పోయినా ఏదో ఒక జన్మలో, ఏదో ఒక ప్రదేశంలో మీ ఇద్దరి వంశీకుల మధ్య, అంటే, బాపనార్యుల వంశస్థులలో ఒకరు, శ్రేష్ఠి వంశస్థులలో ఎవరో ఒకరి ఇంట మహాలయ పక్షంలో భోజనం చేస్తారు. ఇలా కొన్ని కొన్ని కర్మలకు భౌతికకాలం, యోగకాలం, యోగదేశం వేరుగా ఉంటాయి," అని చెప్పారు. 'సత్కర్మల

వలన సుఖాన్ని, దుష్కర్మల వలన దుఃఖాన్ని, పూర్వ జన్మల కర్మబంధాల ఫలితాలను మనం తప్పక అనుభవించే తీరాలి. కాని సద్గురువు దయ ఉంటే యోగకాలం ఏర్పడి యోగ దేశంలో ఆ కర్మ తీరిపోతుంది,' అంటూ దీనికి ఒక ఉదాహరణ ఇస్తూ గురుదత్తభట్టు ఈ క్రింది సంఘటన వర్ణించారు.

## శివయ్యకు బ్రహ్మరాక్షస పీడా విముక్తి

"వర్మగారి వద్ద శివయ్య అనే పనిమనిషి ఉండేవాడు ఉన్నట్లుండి ఒక రోజు నేనే సృష్టికి కారణం అంటూ పిచ్చిగా వ్యవహరించడం మొదలు పెట్టాడు. వర్మగారు వాడి పైన దయ చూపమని శ్రీపాదులని ప్రార్థించారు. శ్రీపాదులు వాడిని స్మశానం తీసుకొని పోయి ఎండు మేడి కర్రలు పేర్పించి దహనం చేయించారు. వాడు స్వస్థుడయ్యాడు. తర్వాత శ్రీపాదులు దీన్ని గురించి వర్మగారికి ఇలా వివరించారు, "వాయసపురంలో ఒక పండితునికి నాపైన కోపం. వేలెడంత పసికూన పరమాత్మనని అంటాడేమిటి? అంతా అబద్ధం అని. ఇలాంటి ధ్యాసతోనే మరణించి బ్రహ్మరాక్షసుడు అయ్యాడు. ఒక జన్మలో శివయ్య ఆ పండితునికి బాకీ ఉన్నాడు. అందుకనే అతడు శివయ్యని పట్టుకున్నాడు. నేను ఈ సమయాన్ని యోగకాలంగాను, స్మశానాన్ని యోగదేశంగాను నిర్ణయించి, యోగకర్మగా మేడి కట్టెలతో దహన సంస్కారాలు చేయించాను. దీనితో శివయ్య స్వస్థుడు, ఋణ విముక్తుడు అయితే, ఆ పండితుడికి బ్రహ్మరాక్షస జన్మనుండి విముక్తి దొరికింది."

## భౌతిక కాలం-దేశం, యోగ కాలం-దేశం

ఏ రకమైన జ్యోతిష్య ఫలితాలైనా సరే జాతక ప్రకారం జరగాల్సిన కాలంలోనే, అదే ప్రదేశంలోనే జరిగితీరాలి అన్న నిబంధన లేదు. యోగకాలంలో యోగదేశంలో జరగవచ్చును. **యోగకాలం, యోగదేశం అంటే వేరే ఏమీ కావు, భక్తుని పైన దయతలచిన పరమాత్మ ఆ**

**జాతక ఫలాన్ని తప్పించడం కోసం తామే స్వయంగా నిర్ణయించిన కాలమూ, ప్రదేశమూ అని అర్థం. జ్యోతిష్య ప్రకారం వెయ్యి సంవత్సరాల తర్వాత ఫలానా సంఘటన ఫలానా దేశంలో జరగాలి, అంటే అవి దాని భౌతికకాలం, భౌతికదేశం అన్నమాట. కాని శ్రీపాదుల సంకల్పంతో ఆ ఘటన ఇప్పుడే ఇక్కడే జరగవచ్చు. వారు నిశ్చయించిన కాలం యోగకాలం, ప్రదేశం యోగదేశం, వారు సంకల్పించిన విధానం యోగకర్మ అన్నమాట.**

ఒకసారి శ్రేష్ఠిగారింట్లో దేవుడికి కొబ్బరికాయ కొట్టే సందర్భంలో శ్రీపాదులు ఆ కాయను శ్రేష్ఠిగారి నుండి తీసుకొని స్వయంగా తానే కొట్టారు. అది ముక్కలు ముక్కలుగా విరిగి అందులో నుండి నీళ్ళకు బదులు రక్తం చిమ్మింది. శ్రీపాదులు, “తాతా! ఈ రోజు నీకు నెత్తి బద్దలై మరణించాల్సిన యోగం ఉంది. నేను ఆ దేశకాలాలను ఈ కొబ్బరికాయలోకి ఆవహింప చేసి నిన్ను రక్షించాను,” అని తెలిపారు. శ్రీపాదులు దయతో తమ ఆశ్రితుల జాతక ఫలాలను ఈ విధంగా మార్చి, కర్మను ధ్వంసం చేసి వాళ్ళని రక్షిస్తారు అంటూ తమ వివరణ ముగించారు గురుదత్తభట్టు. సాయంకాలం అవడంతో మేము కృష్ణ ఈవలి ఒడ్డు చేరాము.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 23వ అధ్యాయం

## శివపూజా మహిమ (శ్రీపాదులకు 11 ఏళ్ళు)

### ధర్మగుప్తులతో సమాగమం

నేను కురుంగడ్డకు వెళ్తుంటే ధర్మగుప్తుడనే వైశ్యుడు కలిసారు. వారు పీఠికాపురంలోని వేంకటప్పయ్య శ్రేష్ఠిగారి దగ్గర బంధువులు. అప్పటివరకు నన్ను కలిసిన వారందరూ శ్రీవారి చరిత్రలో వరుసగా ఒక్కొక్క సంవత్సరంలో జరిగిన ఏదో ఒక సంఘటన చెప్తూ వచ్చారు. వీరు ఏం చెప్తారా? అని ఆలోచిస్తున్నంతలో వారు ఇలా చెప్పడం మొదలు పెట్టారు:

### శివయోగి వృత్తాంతం

"అయ్యా! శంకరభట్టూ! నేను శివభక్తుడను. శ్రీపాదులకు 11 ఏళ్ళ ప్రాయంలో ఒక శివయోగి పీఠికాపురం వచ్చారు. ఆయన దగ్గర ఒక పాత్ర కాని, కంచం కాని లేవు. కేవలం చేతిలో భిక్ష తీసుకొనేవారు. మాటిమాటికి శివ పంచాక్షరి జపిస్తూ ఉండేవారు. ఒకరోజు కుక్కుటేశ్వరాలయంలో పూజ జరుగుతుండగా శివయోగి లోపలికి వచ్చారు. వారితోబాటు రెండు తాచుపాములూ వచ్చాయి. పూజారులు వాటిని చూసి భయపడుతుంటే అవి శివుడి ఆభరణాలని, ఏమీ చేయవని, నమక చమకాలు రాగయుక్తంగా ఆలాపించమని శివయోగి చెప్పారు. ఆ ఆలాపనకు అవి లయబద్ధంగా పడగలని ఆడిస్తూ ఆనందం వ్యక్తం చేసాయి. సూర్యచంద్రశాస్త్రి అనే పూజారి శివయోగిని బాపనార్యుల ఇంటికి తీసుకొని వెళ్ళారు. శ్రీపాదులు స్వయంగా తన చేతులతో వారికి అన్నం తినిపించి శివతత్త్వాన్ని ఇలా వివరించారు:

### ఏకాదశ శివక్షేత్రాలు

"శివుడు 1. మహదేవ 2. శివ 3. మహారుద్ర 4. శంకర 5. నీల లోహిత 6. ఈశానరుద్ర 7. విజయరుద్ర 8. భీమరుద్ర 9. దేవదేవ 10. భవోద్భవ మరియు 11. అధిత్యాత్మక శ్రీరుద్ర మొదలైన

11 రుద్రుల స్వరూపం.

**ఏకాదశరుద్రులు.**

5 జ్ఞానేంద్రియాలు+ 5 కర్మేంద్రియాలు+1 మనస్సు = ఇవే ఏకాదశ రుద్రులకు ప్రతీకలని వీటినే ఏకాదశ (11) రుద్రకళలని కూడా అంటారని ఉపనిషత్తులు చెప్పుతున్నాయి. ఆంధ్రదేశంలో 11 శివక్షేత్రాలు ఉన్నాయి. వాటిని చూడటం వల్ల పుణ్యఫలం లభిస్తుంది.

| | |
|---|---|
| బృహత్శిలానగరంలో | నగరేశ్వరుడు |
| ద్రాక్షారామంలో | భీమేశ్వరుడు |
| శ్రీశైలంలో | మల్లిఖార్జునుడు |
| క్షీరారామంలో | రామలింగేశ్వరుడు |
| అమరావతిలో | అమరేశ్వరుడు |
| కోటిఫలీ క్షేత్రంలో | కోటిఫలీశ్వరుడు |
| పీఠికాపురంలో | కుక్కుటేశ్వరుడు |
| మహానందిలో | మహానందీశ్వరుడు |
| కాళేశ్వరంలో | కాళేశ్వరుడు |
| శ్రీకాళహస్తిలో | కాళహస్తీశ్వరుడు |
| త్రిపురాంతకంలో | త్రిపురాంతకేశ్వరుడు |

**శివతత్త్వ నిరూపణ**

నిజానికి శివుడికి రూపమే లేదు. **ఆత్మలలో వెలిగే జ్యోతి స్వరూపమే శివలింగం. పవిత్రమైన మనసులలోని ప్రతిరూపమే స్ఫటికలింగం.** వ్యక్తి కపాలంలో జ్ఞానం కలగడానికి సహకరించే రుద్రుడే కపాలి. మెదడు దగ్గర నుంచి కిందవరకు వ్యాపించియున్న నాడులే రుద్రజడలు.

శివుడు భిక్షాటనం చేసి జీవుల పాపకర్మలు నాశనం చేస్తారు. సృష్టి, స్థితి, లయ అనే మహాస్పందనలకు అనుగుణంగా శివుడు ఆనందతాండవం

చేస్తుంటారు. కాబట్టే **నటరాజు** అంటారు. చిత్ అంటే మనస్సు, అంబరం అంటే బట్ట లేక ఆకాశం. మనస్సనే ఆకాశంలో ఉండేవాడు, అంటే ఆకాశరూపంలో ఉండేవాడు **చిదంబరుడు.** నీకు కనిపిస్తున్న ఈ విశాల రోదసీ స్వరూపమే **రుద్ర స్వరూపం!**

12 జ్యోతిర్లింగాలు రాశిచక్రంలోని 12 రాశులను సూచిస్తాయి. అందుకనే శివుని **కాలస్వరూపుడు** అంటాము. పంచభూతములు వారి అయిదు ముఖాలు. **ఉమామహేశ్వరుడు** నిత్య ప్రసన్నుడు. సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలను భస్మం చేసినవాడే **త్రిపురాంతకుడు.** జ్ఞాననేత్రమే **మూడవకన్ను.** శివుడు ధ్యానంలో ఉండగా నిరంతరంగా వారిలో నుండి ప్రవహిస్తున్న పవిత్రతే **గంగామాత.**

ఆది మిథునమైన శివపార్వతుల స్వరూపమే మిథునరాశి. మిథునరాశిని సమీపించడానికి ముందుగా వృషభరాశిని దాటాలి. శివపార్వతులను సమీపించాలంటే ముందుగా వృషభాన్ని దాటాల్సి ఉంటుంది. అదే నందీశ్వరుడు. యోగస్థితిని పొందడం వల్ల కామాన్ని జయించగల్గుతారు. కామాన్ని జయించినపుడు స్త్రీ పురుష భేదభావం నశిస్తుంది. మన్మధుని జయించి దగ్ధం చేసి ఏకత్వస్థితిని పొందిన రూపమే **అర్ధనారీశ్వరుడు.** నాయనా! శివయోగి! శివపూజా రహస్యాలు కేవలం అనుష్ఠానంతోను, గురు కటాక్షంతో మాత్రమే తెలిసికొన గల్గుతారు."



## స్వర్ణపీఠికాపుర రహస్యం

అటు తరువాత, 'భౌతికంగా కనిపించే పీఠికాపురమే కాకుండా

జ్యోతిస్వరూపంతో స్వర్ణ పీఠికాపురం కూడా ఉందని, అది వారి చైతన్యంతో నిర్మింపబడినదని, భౌతిక పీఠికాపురం వ్యాపించినంతమేరా అదీ వ్యాపించి ఉన్నదని, ఎల్లప్పుడూ వారిని స్మరించి, ధ్యానించే భక్తులు, మహా యోగులు మాత్రమే దాన్ని తెలుసుకొనగల్గుతారని, అలాంటి వారు ఎంతదూరంలో, ఎక్కడ ఉన్నా కూడా స్వర్ణపీఠికాపురవాసులే అవుతారు,' అని చెప్పారు. **వారిని ఆరాధించే భక్తులు ఎన్నో పరీక్షలకు గురి కావల్సి ఉంటుందని, ఆ అడ్డంకులన్ని దాటి నిశ్చల భక్తి భావాన్ని స్థిరం చేసుకోగల్గేవారే** వారిని చేరుకుంటారని చెప్పి అలాంటి వారు ఎప్పుడూ తమ రక్షణలోనే ఉంటారని హామీ ఇచ్చారు. ఈ విషయాలన్ని శ్రీపాదులు శివయోగికి విశదీకరించారని ధర్మగుప్తులు నాకు చెప్పారు. నిజమే! **శ్రీపాదుల అనుగ్రహం యోగ్యులపై అమృతవృష్టిని కురిపిస్తుంది. అయోగ్యులకు అది ఎండమావివలె కేవలం ప్రలోభాన్ని మాత్రమే మిగుల్చుతుంది.**

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 24వ అధ్యాయం

## శివుని ఆయుధాల విశిష్టత

తరువాత నేను, "శివుని ఆభరణాలు, ఆయుధాలకి సంబంధించి ఏదైనా అంతరార్థం ఉందా?" అని ధర్మగుప్తులని ప్రశ్నించాను. దానికి వారు ఈ వివరణ ఇచ్చారు, "గణపతికి పాశాంకుశాలు, విష్ణువుకి సుదర్శనచక్రం ఎలాంటి ముఖ్య ఆయుధాలో శివునికి **త్రిశూలం** అలాంటి ముఖ్య ఆయుధం. త్రిశూలానికి మూడు కొనలుండి అడుగున వాటిని కలుపుతూ శూలహస్తం ఉంటుంది. **మూడు కొనలు సత్వ, రజస్, తమో గుణాలను సూచిస్తే ఆ శూలహస్తం వాటి ఏకత్వాన్ని సూచిస్తుంది. ఇక్కడ త్రిగుణాల ఏకత్వం అంటే, వాటికి అతీతమైన తత్త్వం అని అర్థం. అంతేకాకుండా ఇడా, పింగళ, సుషుమ్న నాడులు మూడూ శిరస్సులోని జ్ఞాన కేంద్రం దగ్గర కలుస్తాయి. దీన్నే త్రివేణి సంగమం అంటారు. ఆ మూడు నాడులు మూడు కొనలని సూచిస్తే, జ్ఞానకేంద్రం శూలహస్తాన్ని, వాటి ఏకత్వం త్రిగుణ సంగమాన్ని సూచిస్తుంది.** ఆకాశం శబ్ద గుణంతో కూడుకొని ఉంది. ఆకాశంలో ధ్వనుల ప్రకంపనలు ప్రయాణం చేస్తుంటాయి. మనం పవిత్రమైన మంత్రాలను శ్రద్ధాసక్తులతో చదివేటప్పుడు కాని, వినేటప్పుడు కాని వాటినుండి మధురమైన ఢమరుక నాదం వినిపిస్తుంది. యోగులకు ఇది మహదానందాన్ని కలిగిస్తుంది. దీన్ని సూచిస్తూ శివుని త్రిశూలానికి ఢమరుకం కట్టి ఉంటుంది.

సర్పిలాకారంలో ఉండే కుండలినీశక్తిని సూచిస్తూ శివుడు సర్పాలను మెడలో ధరిస్తారు. అందుకే **నాగాభరణుడు** అనే పేరు ఉంది. ఈ కుండలినీ శక్తి విజృభించినపుడు అష్టసిద్ధులు కలుగుతాయి. ఈ అష్టసిద్ధులు శివుని నియంత్రణలో ఉండటం వల్ల, వారు అష్టసిద్ధులకు ప్రభువు అవడం వల్ల ఆయన్ని **ఈశ్వరుడు** అని పిలుస్తారు. ఈశ్వరుడు అనే పదానికి ప్రభువు

అని అర్థం. జ్ఞానికి యోగదృష్టి కలగడానికి, భూత భవిష్యత్, వర్తమానాలు గ్రహించడానికి ఆజ్ఞాచక్రం వికసించాలి. అది వికసించినదన్న సంకేతమే శివుని మూడోకన్ను.

తాంత్రిక సిద్ధులు పులిలా భయంకరమైనవి. వాటిని పూర్తిగా లొంగదీసి తమ అధీనంలో పెట్టుకున్నానని తెలుపుతూ శివుడు **వ్యాఘ్రచర్మం** ధరిస్తారు. నిర్మలమైన బ్రహ్మ జ్ఞానానికి, అమృతత్త్వ సిద్ధికి పరమ పావని **గంగ** సంకేతమయితే నిత్య ప్రసన్నత్వంవల్ల కలిగే ప్రశాంత ఆనందాన్ని **నెలవంక** సూచిస్తుంది.

**స్త్రీ పురుషులు ఇద్దరిలోను స్త్రీ, పురుష తత్త్వాలు రెండూ కలిసే ఉంటాయి. శరీరం కుడిభాగంలో ఉండే శక్తి పురుష శక్తి, ఎడమభాగంలో ఉండే శక్తి స్త్రీశక్తి. ఈశక్తుల అవిచ్ఛిన్న సంయోగమే అర్ధనారీశ్వర తత్త్వం.** ఇంతేకాక కాలచక్రం కూడా అర్ధనారీశ్వరతత్త్వమని, ఎన్నడూవిడదీయరాని జంట అని తెలుసుకోగలగాలి. రాత్రి–పగలు, పౌర్ణమి–అమావాస్యల వంటివి అన్నీ ఒక దానిమీద ఒకటి ఆధారపడి ఉంటాయి. ఒకటి లేనిదే మరొకటి లేదు.

శివుడు **సంహారకారకుడు** అంటే పాత సృష్టిని తీసి కొత్త సృష్టిని కల్పించేవాడని అర్థం. ధనుస్సు ధరించి ఆర్ద్రా నక్షత్రంలో గోచరమయ్యే రుద్రుడు పరుగులు తీస్తూ పారిపోతున్న జింకను వెన్నంటి వేటాడే వేటగానిలా కనిపిస్తారు. ఇది ఆకాశంలో మిథున కర్కాటక రాసులకు అడ్డంగా ఐమూలగా ఉంటుంది. ఈ నక్షత్ర మండలానికి దగ్గరగా క్రూరగ్రహాలైన శని, కుజ, రాహు, కేతువులు సంచారం చేసినట్లయితే ప్రపంచ యుద్ధాలు, ప్రళయాలు జరుగుతాయి.

యోగాగ్ని వల్ల అన్ని కోరికలు భస్మమైనట్లయితే ఏ కోరికలూ లేని వైరాగ్య స్థితి కలిగి, ఆ వైరాగ్య స్థితిలో చక్కటి ప్రశాంతతతో కూడిన

నిర్వాణ స్థితి అనుభవంలోకి వస్తుంది. దీన్ని సూచిస్తూ శివుని స్మశానవాసి అంటారు. **విభూతి పవిత్రమైన తెల్లటి జ్ఞానానికి గుర్తు.** [9]అధిభౌతిక, [10]అధిదైవిక, [11]అధ్యాత్మిక, ఈ మూడు స్థాయిలలోను జ్ఞానప్రాప్తి లభిస్తుంది. పైన చెప్పిన బాధలను శరీరం అనుభవిస్తూ ఉన్నా, నిజమైన సాధకుడు ఆత్మను పరిశుద్ధంగా ఉంచుతూ, దైవ సాన్నిధ్యాన్ని పొందవచ్చుననే విషయాన్ని సూచిస్తూ, శివభక్తులు మూడు విభూతి రేఖలను (త్రిపుండ్రాలు) ధరిస్తారు.

## శివార్చనా విధానాలు

మాఘమాసంలో అమావాస్య ముందు వచ్చే చతుర్దశిని మహాశివరాత్రి అంటారు. **మహాశివరాత్రి మంగళవారంనాడు, అలాగే త్రయోదశి శనివారంనాడు వస్తే చాలా మంచిది.** కర్మకారకుడైన శనివల్ల కలిగే కష్టాలను శనికి అధిదేవత అయిన శివుని పూజచేసి పోగొట్టుకోవచ్చు. శనిత్రయోదశి ప్రదోష (సాయంసంధ్యా) సమయంలో శివార్చన చేస్తే కర్మదోషాలు పోయి సుఖశాంతులు కల్గుతాయి.

**శివుడు పంచభూతాత్మకుడు. మన శరీరంలోని** మూలాధారంలో ఉన్న పృథ్వీతత్త్వానికి ప్రతీకగా పార్థివలింగాన్ని; స్వాధిష్ఠానంలో ఉన్న జలతత్త్వానికి ప్రతీకగా జలలింగాన్ని; మణిపూరకంలో ఉన్న అగ్నితత్త్వానికి ప్రతీకగా జ్వాలాలింగాన్ని; విశుద్ధిలోని వాయుతత్త్వానికి ప్రతీకగా వాయులింగాన్ని; అనాహతంలోని ఆకాశతత్త్వానికి ప్రతీకగా చిదంబరలింగాన్ని సాధకులు పూజిస్తారు. ఆకాశలింగంగా పిలవబడే చిదంబర లింగానికి అసలు రూపమే ఉండదు. రుణము అంటే పాపం. పాపం లేనిది అరుణం. పాపాలను నాశనం చేసేవాడు, అరుణాచలేశ్వరుడు.

---

9. **అధిభౌతిక** ఇతర జీవుల వల్ల కలిగే దు:ఖాలు, కష్టాలు.

10. **అధిదైవిక** ప్రకృతి వైపరీత్యం వల్ల కలిగే బాధలు, కష్టాలు.

11. **ఆది+ఆత్మిక**, మనవల్ల మనకు కలిగే సమస్యలు, బాధలు.

## శ్రీపాదులే శ్రీవేంకటేశ్వరులు

ఇంతవరకు ఆపాదమస్తకం పరమశివుని తత్త్వాన్ని విశ్లేషించిన ధర్మగుప్తులు, ఈ ప్రసంగాన్ని ముగిస్తూ శ్రీపాదులు పద్మావతీ సమేత వేంకటేశ్వరుల సంయుక్తరూపమని వర్ణిస్తూ, దానిని ఇలా వివరించారు: “శ్రీవేంకటేశ్వరులు కృతయుగంనుంచే ఉన్నారు. దశరథునికి పుత్రునిలా జన్మిస్తానని వరం ఇచ్చి శ్రీరామునిలా అవతరించారు. అందువల్ల కౌసల్యా తనయుడు అయిన శ్రీరామునిగా పూజింపవచ్చు. కొంతకాలంపాటు వారిని శక్తిస్వరూపమైన బాలాత్రిపురసుందరిగా, కొంతకాలం శివస్వరూపంగా, కొంతకాలం సుబ్రహ్మణ్యస్వామిగా, కొంతకాలం మహావిష్ణువుగా ఆరాధించారు.

వారి వైష్ణవమాయకు అంతు ఎక్కడ? జగన్మోహిని రూపంలో దేవతలకు మాత్రమే అమృతాన్ని పంచి, మన్మథుడి అవసరమే లేకుండా శివుని మోహింపజేసి, ధర్మశాస్తను (అయ్యప్పను) జన్మింపజేసి, సృష్టికే ఒక కొత్త అర్థాన్ని ఇచ్చిన ప్రభువుకు అసాధ్యం అనేది ఏమైనా ఉంటుందా?

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 25వ అధ్యాయం

## సత్సంగత్వే నిస్సంగత్వం.

### శివారాధనా పద్ధతులు

శివారాధనా పద్ధతులను తెలుపమని నేను ధర్మగుప్తులను కోరాను. వారిలా వివరించారు, "అయ్యా! ఒక్కొక్క పూజా విధానంతో ఒక్కొక్క దైవం సంతుష్టులు అవుతారు. **సహస్రనామ పఠన, అర్చనలతో విష్ణువు, మోదకాలతో గణపతి, నమస్కారంతో సూర్యుడు, అర్ఘ్యంతో చంద్రుడు, అభిషేకంతో శివుడు ప్రసన్నులు అవుతారు. నమకాలను చదువుతూ ఏకాదశ రుద్రాభిషేకం చేసినట్లయితే అపమృత్యుదోషాలు హరింపబడటమే కాకుండా ఏకాదశ తిథి యొక్క పుణ్యబలం కూడా ప్రాప్తిస్తుంది.** ఈవిధంగా ఏకాదశ రుద్రాభిషేకానికి ఏకాదశ తిథికి సన్నిహిత సంబంధం ఉండటం వల్ల శివ– కేశవులు అభిన్నులు అనేది నిర్వివాదాంశమే. కాగా శివారాధనలో శివ పంచాక్షరి అనుష్ఠానము మొదటి పద్ధతి, మహాన్యాస విధానము రెండవది, రుద్రాభిషేకము మూడవ పద్ధతి.

### పంచతత్త్వారాధన

పంచాక్షరి 'నమశ్శివాయ'లోని 5 అక్షరాలు పంచభూతాలకు ప్రతీకలు, కాబట్టి భూతత్త్వానికి చందనం, అగ్నితత్త్వానికై దీపారాధన, వాయుతత్త్వానికి సాంబ్రాణి ధూపం, జలతత్త్వానికి కొబ్బరినీళ్ళు అర్పించాలి; ఆకాశతత్త్వానికి ఘంటారావం చేయాలి.

### సంధ్యోపాసన

పంచాక్షరిని పంచతత్త్వాలతో సాధన చేసే సాధకుల కనుబొమల మధ్యలో పంచతత్త్వాలు కనిపిస్తాయి. ఇవి సంధ్యా సమయాన వివిధ రంగులతో రూపుదిద్దుకున్న ఆకాశంలా రజత, అరుణ, స్వర్ణ, నీల, శుద్ధ ధవళం మొదలైన వివిధ వర్ణాలతో ప్రకాశిస్తూ దివ్య జ్యోతుల్లా

కనిపించుతాయి. అందువల్లనే ఋషీశ్వరులు పంచాక్షరీ పంచతత్త్వ సాధనను సంధ్యోపాసన అని వర్ణిస్తారు.

యంత్రం, మంత్రం, పంచతత్త్వ సాధన, యోగసాధన, ఆత్మ సమర్పణ అనే పద్ధతుల ద్వారా దేహ, ఆత్మబుద్ధి నశించి, దేహమే దేవాలయంగా, జీవుడే శివాత్మగా మారి మోక్షము లభిస్తుంది. ఈ స్థితిని పొందడానికి శివపంచాక్షరి జపం, మహాన్యాస[12]పూర్వక ఆరాధన, రుద్రాభిషేకం చేయాల్సి ఉంటుంది.

రుద్రులు వేలకొలది సహస్ర సంఖ్యలో ఉన్నారు. అంటే గణానికి ముగ్గురు చొప్పున ఏకాదశ రుద్రులకు (11×3×10000000=330000000) 33కోట్ల రుద్రగణాలు ఉన్నాయని, వాళ్ళే పంచభూతాలను, దేహ, ప్రాణ, మనస్సులను ఆవరించి ఉంటారని వేదం చెప్తున్నది. గణపతి 33కోట్ల రుద్రగణాలకు అధిదేవత. శ్రీపాదులు గణపతి తత్త్వంతో అవతరించినందువల్ల వారిని సేవించి అర్చించేవారికి 33 కోట్ల రుద్రగణాల అనుగ్రహం లభిస్తుంది.

## రుద్రాక్షధారణ

**శివభక్తులు ఖచ్చితంగా రుద్రాక్షను ధరించి తీరాలి.** మానవులలో వర్ణాలు ఉన్నట్లే రుద్రాక్షలలో కూడా బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతి రుద్రాక్షలు ఉన్నాయి. తెల్లనివి బ్రహ్మ జాతివి. ఇవి దొరకడం చాలా అరుదు. వీటిని బ్రాహ్మణులు, ఎర్రని క్షత్రియజాతి రుద్రాక్షలను క్షత్రియులు, చింతగింజరంగు వైశ్యజాతి రుద్రాక్షలను వైశ్యులు, నల్లని శూద్రజాతి రుద్రాక్షలను శూద్రులు ధరించినట్లయితే వారి వారికి అనుకూలంగా మంచి

12. న్యాస అను ధాతువునకు ఉంచడం అని అర్థం. మంత్రాలను చదువుతూ శరీరంలోని ఆయా అంగాలపై చేతిని ఉంచడం, ప్రధానంగా ఇది శరీరాన్ని, ఆత్మని పవిత్రీకరణం చేయటానికి అనుసరించే ఒక విధానం. శివునికి రుద్రాభిషేకం చేసేముందు మహాన్యాసం తప్పక చేయాల్సి ఉంటుంది.

ఫలితాలు కలిగి పాపాలు నశించి సమస్త కోరికలు తీరుతాయి. లేతవి, బరువు లేని రుద్రాక్షలను ధరించకూడదు. రుద్రాక్షను రాగి ఉద్ధరిణి కింద నిలిపి అడుగున చిన్నరాగి పాత్ర అంటే ఉద్ధరిణికి పంచపాత్రకి మధ్యలో రుద్రాక్షను పెట్టినట్లయితే, అది కుడి నుండి ఎడమకు ప్రదక్షిణ చేసినట్లయితే శ్రేష్ఠమైనదని, అపసవ్యంగా తిరిగితే మంచివి కావని తెలుసుకోవాలి. ఇటువంటి రుద్రాక్షలను ధరించిన గృహస్థులకు దారిద్ర్యం, భార్యావియోగం, అకారణ కుటుంబ కలహాలు కలుగుతాయి. సన్యాసులు వీటిని ధరించవచ్చు, బాధ లేదు.

## రుద్రాక్షలు దేవతామూర్తులు

సాధారణంగా ఏకముఖి నుండి ప్రారంభిస్తే 16 ముఖాల వరకు ఉన్న రుద్రాక్షలు లభిస్తాయి. వివిధ రుద్రాక్షలకు వివిధ దేవతా స్వరూపాలతో సంబంధం ఉంటుంది. ఏకముఖి శివ స్వరూపం అయితే,



ద్విముఖి–అర్థనారీశ్వరుని,
త్రిముఖి–అగ్ని,
చతుర్ముఖి – బ్రహ్మ,
పంచముఖి–కాలాగ్నిరుద్రుని,
షణ్ముఖి– కార్తికేయుని,
సప్తముఖి–మన్మధుని,
అష్టముఖి– రుద్రభైరవుని,
నవముఖి–కపిలముని,

దశముఖి–విష్ణుని రూపాలు అయితే, ఏకాదశ ముఖి–సాక్షాత్తు రుద్రుని స్వరూపము కాగా, ద్వాదశముఖి ద్వాదశాదిత్యుల స్వరూపం. ఇందులో నవముఖి రుద్రాక్ష దొరకడం చాలా కష్టం. దీనిలో విద్యా, జ్ఞాన, క్రియా మొదలైన నవశక్తులు ఉండటంవల్ల ధరించిన వాళ్ళకి సకల శుభాలు

కలుగుతాయి." ఇలా శివారాధన, దానికి సంబంధించిన రుద్రాక్షధారణ వివరించిన తరువాత, శ్రీపాదుల స్వరూపంగూర్చి కూడా మాట్లాడుతూ శ్రీపాదులను శివస్వరూపులని భావిస్తే విష్ణువులా, విష్ణువని తలచినట్లయితే శివునిలా కనిపించుతారని, భక్తులు వాళ్ళ మనసులో నుండి తర్కగుణాన్ని వదిలి వారిని శరణు వేడినట్లయితే యదార్థరూపంతో కన్పించుతారు అని చెప్పారు.

తరువాత ఇద్దరం కురుంగడ్డకు వెళ్ళి, స్వామికి పాదనమస్కారం చేసుకొని, కొంచెంసేపు ధ్యానస్థులం అయ్యాము. సాయంకాలం వారి ఆజ్ఞతో అవతలి ఒడ్డు చేరి జగత్ప్రభువుల దివ్యలీలా ప్రసంగాలతో కాలం గడిపాము. సుదూరంగా ఎవరో యోగులు 'శ్రీపాద శ్రీవల్లభ దిగంబరా' అంటూ సుశ్రావ్యంగా కీర్తిస్తున్న నామం చెవులకు అమృతంలా సోకుతుంటే ఆ మాధుర్యంలో మునకలు వేస్తూ మెల్లగా నిద్రలోకి జారాము.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 26వ అధ్యాయం

## కాలపురుషుని వివరణ

మేము ఉదయాన్నే కురుంగడ్డ చేరాము. శ్రీపాదుల పాదాలకు నమస్కరించిన తరువాత ధర్మగుప్తులు స్వామిని కలియుగ విశేషాల గురించి తెలుపమని ప్రార్థించారు. శ్రీపాదులు ఇలా చెప్పారు:

### ద్వాదశాక్షరీ రాజయోగవిద్యలు

"నాయనలారా! కాలం పరమాత్ముడి విరాట్ స్వరూపం. సంవత్సరాన్ని సంవత్సర పురుషుడని కూడా వ్యవహరిస్తారు. సంవత్సర పురుషుడికి ఆరు నెలలు ఉత్తరాయణం అయితే ఆరు నెలలు దక్షిణాయనం. ఈ సంవత్సర పురుషుడినే కొందరు కాలస్వరూపుడైన నారాయణునిగా ఉపాసన చేస్తారు. ప్రతి మాసానికి ఒక అక్షరం చొప్పున 12మాసాలకు 12అక్షరాల మంత్రం ఉంటుంది. దీన్నే ద్వాదశాక్షరీ (12 అక్షరాలు కల) విద్య అంటారు. ఈ కాలచక్రాన్ని యోగి తన శరీరంలోనే చూస్తారు. ఈ విద్యలో శరీరాన్ని బ్రహ్మాండంగాను, శిరస్సులోని ఆలోచనాస్థానాన్ని బ్రహ్మలోకంగా, నాభిని విష్ణులోకంగా, హృదయాన్ని రుద్రలోకంగా భావిస్తారు. యోగి తన శరీరంలోని ఆరు చక్రాలను ఆరు ఋతువులుగా దర్శిస్తారు. ఈ విద్యని **రాజయోగవిద్య** అంటారు.

వీర్యకణాల్లో జన్య దేవతలు ఉంటారు. జన్య దేవతలు పూర్వ తరాల వారు చేసిన కర్మల్ని రాబోయే తరాల వారికి కర్మ ఫలాలుగా అందించి అనుభవింపచేస్తారు. మరణించినవారి పేరుమీద మనం చేసే శ్రాద్ధఫలాలని స్వీకరించి, చనిపోయిన వాళ్ళకి ఉత్తమగతిని కలిగించేవాళ్ళే పితృదేవతలు. అంతేకాని పితృదేవతలు అంటే చనిపోయిన మన పెద్దలు కారు. కర్మఫలాలని క్రమపద్ధతిలో అందించడానికి కాలం ఎంతైనా అవసరం.

## కలియుగాంత లక్షణాలు

నదులు, సముద్రాలు పొంగి అపారనష్టం సంభవించడం, భూకంపాలు చాలా తరచుగారావడం, గ్రహాలు గతులు తప్పడం, పట్టపగలే కారుచీకటి కమ్మడం, ఆకాశంలో భయంకరమైన తోకచుక్కలు కనిపించడం ఇవన్నీ కలియుగాంత లక్షణాలు," అని చెప్పి కలియుగం ఎలా ప్రారంభమయ్యిందనే విషయం ప్రస్తావించారు, "ద్వాపరయుగం చివరి భాగంలో కలిపురుషుడు మహాదుఃఖంతో భగవంతుని సమీపించి, "ప్రభూ! ఎక్కడ చూచినా ధర్మం అగ్నిహోత్రంలా ప్రజ్వరిల్లుతున్నది. యుగధర్మాన్ని అనుసరించి నా ప్రభావాన్ని వ్యాప్తం చేయాలి. కాని అది అసాధ్యంలా తోస్తున్నది," అని తన వ్యధని వెలిబుచ్చారు. అపుడు జగత్ప్రభువు పశ్చిమ సముద్రంలోని ఒక ద్వీపాన్ని, అక్కడ మ్లేచ్ఛ జాతి మూలపురుషుడైన అధముడు అనే పురుషుని హవ్యవతి అనే స్త్రీని చూపించారు. తోబుట్టువులైన వారిద్దరి మధ్య కలి ప్రవేశించి, అక్రమ కామాన్ని ప్రేరేపించి, అధర్మమైన సంతానాన్నికనేలా చేసాడు. ఈ జంట నుండి కలికి మూలమైన మ్లేచ్ఛజాతి ఉద్భవించింది. వీరు అనాచారులుగా, ఆర్యధర్మాన్ని దూషించేవారుగా, నానా భక్షకులుగా ఉంటారు," అని తెలిపి, "నేను కల్కి అవతారం ధరించి కోటానుకోట్ల అధర్మ వర్తనులను నాశనం చేసి తిరిగి సత్యయుగాన్ని స్థాపించాలి," అని ముగించారు. పిమ్మట ధర్మగుప్తులు వాసవీమాత గురించి అడుగగా శ్రీపాదులు ఇలా చెప్పారు:

## వాసవీమాత ఆవిర్భావం

"కుసుమశ్రేష్ఠి అనే సామంతరాజు బృహత్‌శిలా నగరాన్ని రాజధానిగా చేసుకొని, 18పట్టణాలు కలిగిన రాజ్యాన్ని పరిపాలిస్తుండేవారు. ఆ రాజ్యంలో 714 గోత్రాల వైశ్య స్వాములు ఉండేవారు. అందులో కఠినమైన నియమనిష్ఠలని ఆచరించే 102 గోత్రాలవారిని ఆర్యవైశ్యులు అనేవారు. వీళ్ళు

బృహత్‌శిలా నగరంలో నివసించేవారు. వీరికి పరమేశ్వరి ఆరాధ్య దేవత. కుసుమశ్రేష్ఠి దంపతులకు సంతానం లేకపోవడంతో వారి గురువర్యులైన భాస్కరాచార్యుల ఆధ్వర్యంలో పుత్రకామేష్టి యాగం చేసారు. ఆర్యామహాదేవి ప్రత్యక్షమై రెండు ఫలాలను ప్రసాదించింది. వారికి వాసవీకన్యకాపరమేశ్వరి, విరూపాక్షుడు కవలలుగా జన్మించారు. విరూపాక్షుడు నంది అంశతో పుట్టారు. ఆ జన్మలో వారి గురువైన భాస్కరాచార్యులే నేటి జన్మలో మా బాపన్నావధానులు తాతగారు.

నాయనలారా! రేపు మా సోదరి వాసవి జన్మదినం, పైగా శుక్రవారం. మీరు వెంటనే పంచదేవ్‌పహాడ్ వెళ్ళి అక్కడ రెల్లుగడ్డితో చిన్న ఇల్లు నిర్మించండి. అందులో రేపు నేను దర్బారు చేస్తాను. ఇకనుండి ప్రతి శుక్రవారం దర్బారు నిర్వహిస్తాను. ప్రతి గురువారం ధర్మబోధ చేస్తాను," అని మాకు పని అప్పగించి, "మీకు రేపు సాకల్యంగా వాసవి అవతార విశేషాలు చెప్తాను," అని మాట ఇచ్చారు.

**"భక్తుడు దత్తుని మరవనంత వరకు దత్తుడు భక్తుని మరవకుండా ఉంటారు. మరపు మరణతుల్యం, స్మరణం నూతన జన్మ దాయకం,"** ఆ రోజు మాకు వీడ్కోలు ఇస్తూ ఆ మహా ప్రభువులు పలికిన సూక్తులివి.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 27వ అధ్యాయం

# పంచదేవ్‌పహాడ్‌లో మా అనుభవాలు

## మైలారులు-వీరముష్టలు

శ్రీపాదులు మమ్మల్ని రెల్లుగడ్డితో పంచదేవ్‌పహాడ్‌లో గృహ నిర్మాణం చేయమని ఆదేశించారు. కాని దానికి స్థలం కావాలి మాకేమో ఆ ప్రదేశం పరిచితమే కాదు. ఏం చేయాలో తెలియక అటూ ఇటూ తిరుగుతూ ఒక పొలం దగ్గరకు వచ్చాము. పొలం యజమాని అక్కడ గోశాల నిర్మిస్తున్నారు. మధ్యాహ్నం అవడంతో మేము ఆకలితో ఉన్నాం. ఆ యజమాని మమ్మల్ని సాదరంగా భోజనానికి పిలిచారు. శూద్ర భోజనం చేయడమా? వద్దా? అన్న మీమాంసలో ఉన్న మాతో బలవంతంగా భోజనం చేయించి, ధర్మగుప్తుల వద్ద ఉన్న ధనమంతా తీసుకున్నారు. ఇంతలో అక్కడికి మైలారులు, వీరముష్టలు వచ్చారు. వీళ్ళు శుభకార్యాలు జరిగేటప్పుడు వచ్చి జయజయ ధ్వానాలతో కన్యకాపరమేశ్వరి పాటలు పాడుతుంటారు. ఇందులో **వీరముష్టలు విష్ణువర్ధన మహారాజు సైనికులు. వృద్ధుడు, వివాహితుడు అయిన తమ రాజు వాసవిని వివాహం చేసుకోవాలి అనుకోవడం ఎంత అనుచితమో తెలిసిన కొందరు సైనికులు వాసవీమాత భక్తులై విష్ణువర్ధనుని సైనికులతో పోరాడారు. వాళ్ళు తమ ధన, మాన, ప్రాణాలను పణం పెట్టి పోరాడి ఉండటం వల్ల వైశ్యులు వీరిని సత్కరిస్తుంటారు.** పంటకాపు వీళ్ళకి కూడా భోజనాలు పెట్టించారు. మేమందరము కలిసి గోశాలను నిర్మించాము. మాకు సాయంత్రం కూడా భోజనం పెట్టిన తరువాత మమ్మల్ని ఆ రాత్రికి అక్కడే పరుండమని చెప్పి వాళ్ళంతా వెళ్ళిపోయారు.

## వాసవీమాత జన్మదినం

ఉదయాన్నే లేచి చూసినపుడు గోశాలలో గోవులూ, ఎడ్లు లేకపోగా చుట్టుపక్కల పంటకాపులు మా వద్దకు వచ్చి ఈ పొలం ఎంతకు కొన్నారని మమ్మల్ని ప్రశ్నించారు. మేము జరిగిన సంఘటన యధాతథంగా చెప్పితే మేము వెట్టివాళ్ళం అన్నట్లు చూసారు. ఇంతలో ఎవరో ఆగంతకుడు

వచ్చి, "వాసవీమాత ఎపుడు జన్మించింది?" అని అడిగి "మీ ఇద్దరు పిచ్చివాళ్ళు కురుంగడ్డలో ఉన్న పిచ్చివాడిని చూడటానికి వెళ్తున్నారా?" అంటూ ఎద్దేవా చేస్తూ వెళ్ళి పోయాడు. ఈ మాటలతో మాకు ఆ రోజు శుక్రవారమని, వాసవీమాత జన్మదినమని స్ఫురణకు వచ్చి త్వరగా బయల్దేరి పడవ ఎక్కాము. మా దగ్గర డబ్బు లేకపోవడంతో పడవవాడు మమ్మల్ని గద్దించి ధర్మగుప్తుల ఉంగరం లాక్కున్నాడు. అది రుసుం కింద జమా కడ్తాడేమో అనుకున్నాం. కాని దానిని కృష్ణలో విసిరి వేసాడు. నిన్నటినుండి అప్పటివరకు జరిగిన సంఘటనలన్ని విచిత్రంగా ఉండటంతో ఆశ్చర్యపడుతూనే మేము శ్రీపాదుల సన్నిధికి చేరాము. వారు, "గృహ నిర్మాణం జరిగిందా?" అని ప్రశ్నించారు. మేము జరిగినదంతా యథాతథంగా చెప్పాము. దానికి వారు ఆ పంటకాపు వాసవి సోదరుడైన విరూపాక్షుడని, గోసంపద అంతా కుసుమశ్రేష్ఠి ఇంట ఒకప్పుడు ఉన్న గోవులే అని, మైలారులు, వీరముష్టలు కూడా ఆనాటివారే అని,[13] వారందరితోపాటుగా అటువంటి మహత్తర పుణ్యకార్యంలో పాలు పంచుకోవడం మా అదృష్టం అని తెలిపారు. మమ్మల్ని గద్దించిన ఆగంతకుడు, పడవవాడు కూడా తానే అని తెలియచెప్పారు. 'ఈ మాయామానుష శ్రీపాద శ్రీవల్లభ రూపం కలియుగాంతంలో శ్రీ పద్మావతీ వేంకటేశ్వరుని రూపంగా మారుతుంది. **సమస్తమూ నా కరస్థమే అని తెలిసికొన్న వారు ధన్యులు.**' ఇది శ్రీచరణులు మాకు ఇచ్చిన అమూల్యమైన బోధ.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

---

13. ప్రభువుల అనుగ్రహం శ్రేష్ట జనులపై నిరంతరం ప్రవహిస్తూనే ఉంటుంది. శంకరభట్టుపై శ్రీపాదులకు అంతులేని అనుగ్రహం అడుగడుగునా ప్రభువులు వారిని కాపాడుతూ కోరికలను తీర్చుతూ వచ్చారు. అంతేకాక శంకరభట్టుతో ప్రభువులు తమ చరిత్రను గ్రంథస్థం చేయించనున్నారు. అందువల్లనే కొన్ని పర్యాయాలు కాలాన్ని వెనుకకు కొన్ని పర్యాయాలు ముందుకు తీసుకొని వెళ్ళి అప్పటి పరిస్థితులను, వ్యక్తులను యథాతథంగా సృష్టించి, వాటిని ప్రత్యక్షంగా చూడగల్గేలా చేసి గ్రంథకర్తకు అద్వితీయమైన అనుభవాలను కలిగించారు.

## 28వ అధ్యాయం

## వైశాఖ శుద్ధ దశమి, శుక్రవారం, వాసవీమాత జన్మదినం

### పంచదేవ్‌పహాడ్‌లో ప్రభువుల ప్రథమ దర్బారు

ఆ రోజు శుక్రవారం. శ్రీపాదులు కొత్తగా నిర్మించిన గోశాలలో ధ్యానస్థులు అయ్యారు. ఉన్నట్లుండి వారి శరీరం తేజోవంతమై ఆ రూపం పెద్దది అవుతూ సూర్యునిలో కలిసిపోయింది. కొద్దిక్షణాల తరువాత సూర్యబింబం నుండి ఇద్దరు దివ్యశిశువులు భూమి మీదకు వచ్చారు. భూమిపై కాలు మోపడంతోనే వారిలో ఒక శిశువు 16ఏళ్ళ శ్రీపాదునిగా మారితే, రెండవ శిశువు మూడేళ్ళ బాలికగా మారింది. ఇద్దరూ చూడటానికి ఒకేలా ఉన్నారు. శ్రీపాదులు ఆ దివ్య శిశుమూర్తిని ఎత్తుకొని గోశాలలోకి వెళ్ళారు. ఇదంతా ఏమైనా ఇంద్రజాలమా? అని నాకు మనసులో సందేహం మొలకెత్తింది. వెంటనే ప్రభువు, ‘‘ఇది ఇంద్రజాలమో, మహేంద్రజాలమో కాదు. ఇది నా స్వభావం. నేను సంకల్పించిన మరుక్షణం మన్నును మిన్నుగా మారుస్తాను. సృష్టికర్త అయిన బ్రహ్మకు ప్రకృతిలోని అదృశ్యశక్తులను సాకారంగాను, సగుణవంతంగాను వ్యక్తం చేయడానికి ప్రేరణను ఇచ్చే పరబ్రహ్మ స్వరూపాన్ని, సృష్టిజాతాన్ని స్థితిలో ఉంచడానికి విష్ణువునకు ప్రేరణనిచ్చే మహావిష్ణు స్వరూపాన్ని కూడా నేనే.

### సరస్వతి, లక్ష్మి, కాళీ/మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళీ

అలాగే సరస్వతి వేరు. మహాసరస్వతి వేరు. సృష్టికి సంబంధించిన జ్ఞాన స్వరూపం సరస్వతి, స్థితికి కారణమయిన వస్తు సమృద్ధి లక్ష్మి, సృష్టియొక్క శక్తి స్వరూపం కాళి అయితే వరుసగా ఆ దేవతా స్వరూపాలకు ప్రేరణని, శక్తిని ఇచ్చే మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళి రూపాలు అనఘామాత స్వరూపాలే. అనఘాలక్ష్మీ సమేతుడైన అనఘుడు అనేది నా దత్త స్వరూపం. త్రిమూర్త్యాత్మకుడైన దత్తుడు త్రిమూర్తులకంటె భిన్నుడు,

అతీతుడు. అదే విధంగా మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళి స్వరూపమైన అనఘా స్వరూపం ఆ త్రిశక్తులకంటె భిన్నంగానూ, అతీతంగానూ ఉంటుంది.

పద్మావతీ రూపం కూడా త్రిశక్తులను తనలో తాదాత్మ్యస్థితిలో ఉంచుకొని వాటికి ఆధారంగాను, అతీతంగాను ఉన్న పరాశక్తి స్వరూపం. అలాగే శ్రీవేంకటేశ్వర రూపం త్రిమూర్తుల మహాచైతన్యాన్ని తనలో ధరించి, వాటికి ఆధారంగాను, అతీతంగాను ఉన్న పరబ్రహ్మ స్వరూపం. ఇంతేకాదు, పద్మావతి, మహాలక్ష్మి ఇద్దరూ నిజానికి ఒకే తత్త్వం. అయినా, దేవి మహాలక్ష్మి తత్త్వంలో ఉంటే నేను మహావిష్ణువుగా, పద్మావతిలా ఉంటే వేంకటేశ్వరునిలా రూపాలు ధరిస్తాను. **సగుణ, సాకారాలతో తత్త్వం ఆవిర్భవించినపుడు వాటికి తగినట్లుగా మర్యాదలను, లోకాచారాలను, పరిమితులను తప్పక పాటించాల్సి ఉంటుంది,"** అని చెప్పి, "శంకరా! ఈ రోజు ఇక్కడ జరిగే లీలావిశేషాలను అన్నింటిని చరితామృతంలో యథాతథంగా వ్రాయి," అని నన్ను ఆదేశించారు.

## గోశాలావైభవం

మేము దిగ్భ్రాంతులమై చూస్తుండగానే శ్రీపాదుల శరీరం నుండి పద్మావతీదేవి, వేంకటేశ్వరులు ఆవిర్భవించారు. సూర్యబింబం నుండి దిగిన ఆ మూడేళ్ళ దివ్యశిశువు 18ఏళ్ళ వాసవీమాతలా మారింది. గోశాల చక్కటి రాజభవనంలా మారిపోయింది. అందులో కుసుమశ్రేష్ఠి దంపతులు, విరూపాక్షుడు, దాస–దాసీజనం ఇంకా ఎందరో కన్పించారు. ఫెళఫెళ ధ్వనితో వాసవీ రూపం నుండి నగరేశ్వరుడు ఆవిర్భవించారు. జంటలు జంటలుగా వైశ్యదంపతులు వచ్చారు. వారిని చూపించి, ఆ పుణ్య మూర్తులు వాసవితోపాటు అగ్ని ప్రవేశం చేసిన ఆర్యవైశ్య దంపతులని స్వామి నాతో చెప్పారు. తమ గురువైన భాస్కరాచార్యులు, 108వ గోత్రానికి చెందిన లాభాద మహర్షి రాలేదేమని కుసుమశ్రేష్ఠి ప్రశ్నించారు. దానికి

శ్రీనివాసులు భాస్కరాచార్యులు, లాభాది మహర్షి ఒక్కరే అని, ప్రస్తుతం తమ శ్రీపాద శ్రీవల్లభ అవతారంలో తమ మాతామహునిలా పీఠికాపురంలో ఉన్నారని, యోగదృష్టితో ఇక్కడ జరిగేవన్ని చూస్తారని చెప్పారు. ఇంతలో దివ్యవిమానంలో నుండి దిగి సుమతీమాత, అప్పలరాజశర్మ, శ్రేష్ఠి దంపతులు సూక్ష్మరూపంలో వచ్చారు.

## వాసవీ శ్రీనగరేశ్వరుల వివాహ చర్చ

సభాసదులని ఉద్దేశించి శ్రీనివాస ప్రభువులు, 'ఆ రోజు సుదినమని, వారు వాసవికి శ్రీనగరేశ్వరునకు నిశ్చయ తాంబూలాలు తీసుకోడానికి నిర్ణయించుకొన్నామని' ప్రకటించారు. వృద్ధుడు, వివాహితుడు అయిన విష్ణువర్ధన మహారాజు బలవంతంగా వాసవీకన్యకను వివాహం చేసుకోవాల నుకోవడం, వాసవీకన్యక నిరాకరించడంతో బృహత్‌శిలా నగరంపై దండెత్తి రావడం, అభిమానవతి అయిన వాసవి అగ్నిప్రవేశం చేయడం, ఆమెతోపాటుగా 102 గోత్రాల ఆర్య వైశ్యజంటలు అగ్ని ప్రవేశం చేయడం తెలిసిన విషయమే అని జరిగిపోయిన విషయాలను ఒకసారి వారి కందరికి గుర్తు చేసి, వాసవి వివాహం గురించి ప్రస్తావిస్తూ, "విపరీత భక్తి భావనలో కొందరు ఆర్యవైశ్యులు తమ సంతానాన్ని పరమేశ్వరికి అర్పించేవారు. అటువంటి బాలికలను గౌరబాలికలని, బాలురను బాల నగరులని పిలిచేవారు. గౌరబాలికలని విధిగా బాలనగరులకి ఇచ్చి వివాహం చేయాలని నిబంధన ఉండేది కదా. వాసవీకన్యక కూడా గౌరబాలిక కాబట్టి నగరేశ్వరుని బాలనగరుడిగా భావించి వివాహం చేయవచ్చు. కాని నగరేశ్వరునికి తల్లితండ్రులు లేరు, ఒక గోత్రమూ లేదు. ఇద్దరూ ఒకర్ని ఒకరు మనసా, వాచా, కర్మణా ఇష్టపడుతున్నారన్న ఒక్క విషయం ఆధారంగా ఇద్దరి కళ్యాణం జరిపించడమా? లేదా పూర్వాపరాలు ఆలోచించడమా? మన కులాచార ప్రకారం మేనరికం కూడా చెల్లుతుంది. అందుకని మీరంతా అన్ని ఆలోచించి మీ నిర్ణయం చెప్పండి," అని అడిగారు.

## గణనాథుల వాదం-వరదానం

ఇద్దరికి వివాహం జరిపించాలన్న నిర్ణయంలో ఈ తిరకాసు ఏమిటో తెలియక సభ్యులంతా తెల్లముఖాలు వేసి గణపతిని తలచుకొన్నారు. గణపతి ప్రత్యక్షమై వాసవి సాక్షాత్తు తమ తల్లి ఆయిన పార్వతీదేవి అని, కాబట్టి వారిద్దరి వివాహం జరిపించవచ్చని చెప్పారు. దానికి శ్రీనివాసులు **గణపతి సమ్మతం లేనిదే ఏ వివాహం ధర్మసమ్మతం కాదని, పార్వతీ పరమేశ్వరుల కళ్యాణానికి గణపతి జన్మించలేదు. కాబట్టి పార్వతీ కళ్యాణమే ధర్మ సమ్మతం కాదు** అని వాదించారు. వాసవి కళ్యాణం మాట అటుంచి పార్వతీ కళ్యాణమే చెల్లదనడంతో అక్కడి వాళ్ళంతా నిశ్చేష్టులయ్యారు. గణపతి కోపించి, "మామా! భౌతికంగా నా ప్రాదుర్భావం జరగక పోయినా సమస్త మానవుల, దేవతల మూలాధారచక్రాన ఉన్నది నేనే కదా! అప్పటికి శంకరుల మూలాధారంలో గుప్తంగా ఉన్న నా అంగీకారంతోనే వారి వివాహం జరిగింది, కాబట్టి అది ధర్మ సమ్మతమే. ఇక మా తండ్రి గోత్రం లేనివాడు అనడం అసంగతం. లాభాద మహర్షి నా పుత్రుడు. కాబట్టి నాది మా తండ్రిది కూడా లాభాది గోత్రమే అవుతుంది కదా! ఈ లాభాది గోత్రం 102గోత్రాలలో ఒకటి కాబట్టి మా తండ్రి ఆర్య వైశ్యుడే. ప్రభాతస గోత్రంలో జన్మించిన కుసుమశ్రేష్ఠికి లాభాదిగోత్రం వారితో సంబంధ బాంధవ్యాలు ఉన్నాయి. ఆ రకంగా చూస్తే ఇది మేనరికమే అవుతుంది. ఈ రకంగా మీ మూడు అభ్యంతరాలు చెల్లవు," అని శ్రీనివాసుల వాదం ఖండించారు. తరువాత, "అయినా నా తండ్రి నిర్ధనుడనే కదా మీ పరిహాసం. **ఈ రోజు నుండి శివారాధన, అభిషేకం చేసేవారికి లక్ష్మీ కటాక్షం ఎల్లప్పుడు ఉండుగాక! శని ప్రదోష సమయంలో శివారాధన చేసే వాళ్ళకి ఇహపర సుఖములు కలుగుగాక!"** అని వారు వరాలను ప్రసాదించారు. వైశ్య ప్రముఖులు అందరూ ఏకగ్రీవంగా గణపతి అభిప్రాయాన్ని అంగీకరించారు. 102గోత్రముల లెక్క ఖచ్చితంగా 102గోత్రములే. లాభాది గోత్రీకులైన ధనలక్ష్మీ -

ధనగుప్తులు, అగ్నిగుండంలో ప్రవేశించి ఆత్మార్పణ చేసుకున్నందువల్లనూ, వాళ్ళకి సంతానం లేకపోవడం వల్లనూ, లాభాదిమహర్షి గోత్రం లేదని, ఆర్యవైశ్యులు 101గోత్రీకులే అని అనుకోవడం పొరపాటు. ఆ గోత్రం నగరేశ్వరులకి చెందాలి అనే ఉద్దేశ్యంతోనే ఈ సంఘటనని కల్పించడం జరిగింది," అని వాసవీమాత వివరించి, తాము కన్యకా రూపంలో ఉన్నప్పటికి తమ అణువు అణువులోనూ పరమేశ్వరుడు నిండి ఉన్నారని, కన్యకారూపం కేవలం 18సంవత్సరాలే అని ఆ తరువాత ఆమె తిరిగి పరమేశ్వరే అని కూడా స్పష్టం చేసారు.

శ్రీపాదులు పీఠికాపుర సంస్థానంలో ఆడపడుచుగా వాసవిని ఉండమని కోరగా అంబిక అంగీకరించి, వారిని వేంకటేశ్వరుని రూపంలో బృహత్‌శిలానగరంలో నిలిచి ఉండమని ప్రార్థించారు. అటు తరువాత నిశ్చయ తాంబూలాల వేడుక ఎంతో వైభవంగా జరిగింది. దీనినంతా కన్నుల నిండుగా చూడగల్గిన మా అదృష్టాన్ని ఎంత వర్ణించినా తక్కువే అవుతుంది. ఆ మరునాడు గోశాల యథా ప్రకారం సాధారణ గోశాలవలెనే ఉంది. మా కాలకృత్యాలు తీర్చుకొని మేము కురుంగడ్డ చేరాము.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 29వ అధ్యాయం

# వాసవీమాతకు ఆర్యవైశ్యులతో అనుబంధం

### నృసింహసరస్వతి అవతారం

మేము కురుంగడ్డ చేరి శ్రీపాదుల దర్శనం, పాదాభివందనం చేసిన తరువాత వారు ఇలా సెలవిచ్చారు, "నాయనలారా! నిన్న జరిగిన వాసవీకన్యకా జయంతి ఉత్సవాన్ని చూసి మీరు ధన్యులయినారు. దేశ, కాలాలు నా చేతిలోని ఆటబంతులు. ఎప్పుడో జరగవలసిన, జరుగుతున్న, జరుగబోవు సంఘటనలని భూతకాలంలోకి గాని, వర్తమానంలోకి గాని, భవిష్యత్తులోకి గాని నేను మార్చగలను. **భక్తులు తమతమ చైతన్య స్థాయినిబట్టి నన్ను అర్థం చేసుకొన గలుగుతారు. మీలో ఉన్న నాలోనికి మీరు పూర్తిగా శరణార్థులై నా ఆదేశ ప్రకారం కర్మలని ఆచరించినట్లయితే, మీ భారాలన్నీ నేనే భరించి మిమ్మల్ని ఒడ్డుకి చేరుస్తాను,"** అని చెప్పి రాబోయే తమ అవతార వివరాలను ఇలా తెలిపారు, "కలియుగ మానవులు హిరణ్యకశ్యపునిలాంటి వారు. భౌతికశాస్త్రంలో ఎంతో అభివృద్ధిని సాధించి హిరణ్యకశ్యపునిలా ప్రకృతిమాత నుండి వరాలను పొందుతారు. వారి నుండి ప్రహ్లాదుని వంటి భక్తులను రక్షించడానికి నేను నృసింహుని గుణాలతోను, కేవలం నా మాటతో ప్రకృతిని శాసించకలిగే సరస్వతీ గుణంతోను, ఇలా ఈ రెండు గుణాల సమ్మేళనతో నృసింహసరస్వతీ అవతారాన్ని ధరిస్తాను. ఈ అవతారంలో గంధర్వపురంలో ప్రసిద్ధి పొందుతాను."

### ఆర్యవైశ్యుల గోత్రాల వివరణ

తరువాత వాసవీమాత గురించి మాట్లాడుతూ, "సమాధి అనే తపస్వి జగన్మాత భక్తుడు. అతడే కుసుమశ్రేష్ఠిగా జన్మించారు. ఆద్యశక్తి వారి కుమార్తె అయిన వాసవిగా జన్మించింది. విష్ణువర్ధనుడు కోరరాని కోరిక కోరాడు. ఆర్యవైశ్యులు అగ్నిగుండంలో దుమికి ఆత్మగౌరవం కాపాడుకోవాలని తలిచారు. వాసవీమాత తమ తల్లితండ్రులకు, గోత్ర

సంబంధీకులకు ఆర్యమహాదేవి రూపంలో దర్శనమిచ్చి, “వారందరు అగ్ని హోత్రంలో లీనమయిన తక్షణమే విష్ణువర్ధనుడి శిరస్సు వేయి చెక్కలు అవుతుందని, వైశ్యకుల అధిదేవత అయిన నగరేశ్వరస్వామిని మరువక పూజించమని, అలాగే కులదేవతల పూజ, గోత్ర పూజ చేయమని ఆదేశించి అటువంటి భక్తుల ఇళ్ళలో తమ కాలి అందెలరవళి వినిపించుతుందని, వారికి ఇహ–పర సుఖశాంతులు లభిస్తాయని,” వాసవీమాత వారితో అన్న మాటలను శ్రీపాదులు మాకు తెలిపారు. నేను ఆ 102గోత్రీకుల వివరాలని అడుగగా, “మొట్టమొదటగా లాభాది మహర్షి గోత్రానికి చెందిన ధనదుణ్ణి, ధనలక్ష్మిని స్మరించాలి అని చెప్పి, తరువాత 102గోత్రాలు, వాటికి సంబంధించిన ఋషుల వివరాలు వివరించారు. ఆ వివరణనంతా శ్రద్ధగా విన్న నేను, “ప్రభూ! తమరు సెలవిచ్చిన గోత్రాలలో లాభాది గోత్రం లేదు. దాన్ని వీటికి చేర్చినట్లయితే 103గోత్రాలు అవుతాయి కదా,” అని నా సందేహాన్ని వ్యక్తపరిచాను. దానికి వారు, “లాభాదమహర్షికి సంబంధించిన గోత్రాలలో ధనదకుల, కాశ్యపస అని రెండు గోత్రాలు ఉన్నాయని, కాశ్యపస గోత్రం ఉంచినట్లయితే సరిగ్గా 102గోత్రాలే అవుతాయని చెప్పారు. కలియుగాంతంలో వాసవీ నగరేశ్వరుల వివాహం జరిగేటపుడు వధువుది ప్రభాతస గోత్రంగా, వరునిది కాశ్యపస గోత్రంగా చదవాలని వాసవి వివాహం జరిగేంత వరకు మాత్రమే 102గోత్రాలలో ధనదకుల గోత్రం లెక్కలోనికి తీసుకోవాలని, వివాహం జరిగాక కాశ్యపస గోత్రాన్ని లెక్కలోకి తీసుకోవాలని, కలియుగాంతంలో ధనదకుల గోత్రం నిర్వంశం అవుతుందని చెప్పి, అగ్నిగుండంలో ప్రవేశించిన 102పుణ్యదంపతుల పేర్లు చెప్పి, ఈ ఆర్యవైశ్య దంపతుల పేర్లు స్మరించినట్లయితే పాపవిముక్తి అవుతుందని తెల్పారు.

తరువాత ముగ్గురం ధ్యానస్థులం అయ్యాము.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

# 30వ అధ్యాయం

# సంశయాత్మా వినశ్యతి

### చైతన్యస్థాయి

శ్రీపాదులు ఉపాసకుల సాధనా విధానాలు, వారి చైతన్య స్థాయిలను ఈ విధంగా వివరించారు: “జీవులకు 64 చైతన్య స్థాయిలు ఉంటాయి. నాథసంప్రదాయం వాళ్ళు ఈ 64 చైతన్య స్థాయిలలో తాదాత్మ్యస్థితిని పొంది జీవులను ఉద్ధరించడానికి 64 శాబర తంత్రాలను సాధన చేస్తారు. ఈ నాథ సంప్రదాయానికి ఆదిగురువు దత్తాత్రేయుడే. మీ కనులముందున్న ఈ శ్రీపాదుడే ఆనాటి దత్తుడు.

**మానవుల శరీరంలో చైతన్య స్థాయిలను బట్టి వారి పరిణామ వేగం ఆధారపడి ఉంటుంది. మానవులు ఆచరించే యోగపద్ధతులు, మంత్రజపాలు, యజ్ఞయాగాది క్రతువులు, ధర్మకార్యాలు మొదలైన వాటిపైన, వారు సాధించిన చైతన్య స్థాయిపైన వారి ఆత్మజ్యోతి ప్రకాశం**(Aura) **ఆధారపడి ఉంటుంది.** ఆ ప్రకాశానికి అనుగుణంగా నాడీశుద్ధి జరుగుతుంది. ఆ నాడీశుద్ధి స్థాయిని బట్టి మానవుల్లో అనేక రకాలైన శారీరిక, మానసిక, ఆధ్యాత్మికశక్తులు పెరుగుతాయి. ఆయా శక్తులను వారు ఏ విధంగా ఉపయోగిస్తున్నారు? అనే దానిపై దైవానుగ్రహం ఆధారపడి ఉంటుంది. ఇలా ఇవి ఒకదానికి ఒకటి ఆధారంగాను, ఆధేయంగాను ఉంటాయి. అదే విధంగా శుభప్రదములైన సరస్వతీ, లక్ష్మీ, దుర్గా శక్తులు మానవునిలో అంకురించి ప్రవర్ధమానం అవుతుంటే అంబిక తమ అనుగ్రహాన్ని వారిపై కురిపిస్తుంది.

మానవులు చేసే పాపకార్యాలు కాని, పుణ్యకార్యాలు కాని వ్యక్తం నుండి అవ్యక్తానికి, అవ్యక్తం నుండి వ్యక్తానికి వస్తూ పోతూ ఉంటాయి. వారు పూర్వజన్మలో చేసిన పాపాలు అవ్యక్తంలో ఉండి ఈజన్మలో సంసారంలోని బాధలు, కష్టాల రూపంలో వ్యక్తం అవుతాయి. ఆ విధంగానే ఈ జన్మలో

చేస్తున్న పాప కర్మలు, పుణ్యకర్మలు అవ్యక్తంలోకి పోయి తరువాతి జన్మలో అవ్యక్తం నుండి వ్యక్తంలోకి వస్తాయి. కాని తీవ్రమైన దుష్కర్మ, తీవ్రమైన సత్కర్మల ఫలం చాలా వరకు ఈ జన్మలోనే అనుభవించడం జరుగుతుంది."

**సంశయాత్మకులు**

"ప్రభూ! వాసవీమాత తమరిని వారి దేవస్థాన పరిసర ప్రాంతంలో వేంకటేశ్వర రూపంలో రమ్మని కోరారు కదా, దీని అర్థం ఏమిటి?" అని నేను ప్రశ్నించాను. "నీవు నా చరితామృతం వ్రాస్తున్నావు. దీనిలోని విషయాలకు ప్రమాణమేమిటి? అని అడిగే సందేహమనస్కులు కొందరు ఉంటారు. శ్రీపాదులే వేంకటేశ్వరులని నమ్మడం ఎలా? అని వారి తర్కం. దానికి ప్రమాణంగానూ, వాసవి ఆర్యమహాదేవి అవతారమని రూఢి చేయడానికి నేను వేంకటేశ్వర రూపంలో బృహత్‌శిలా నగరంలో నెలకొంటాను. ఇందరు దేవతలు ఉండగా వేంకటేశ్వర రూపమే ఎందుకు అక్కడ నెలకొల్పబడింది? అదే వాళ్ళ సందేహాలకు సమాధానం, ప్రత్యక్ష ప్రమాణమూ కూడా. అదేవిధంగా పీఠికాపురంలో బాపనార్యుల వంశంలోని వాళ్ళద్వారా వాసవీ ఆలయ నిర్మాణం ఏర్పాటు చేయిస్తాను. కలియుగాంతంలో తిరుమలకి, పీఠికాపురానికి మరికొన్ని పుణ్యక్షేత్రాలకు నేను నా నిజ రూపంతో వస్తాను," అని చెప్పారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 31వ అధ్యాయం

# దశమహావిద్యల వర్ణనం

**శ్రీవిద్య**

మేము ప్రతిరోజు సాయంకాలం కృష్ణ ఈవలి ఒడ్డుకు వచ్చే వాళ్ళం. ఉదయాన్నే మళ్ళీ శ్రీచరణుల వద్దకు వెళ్ళేవాళ్ళం. ఆ గురుసార్వభౌములు మాకు ఎన్నో యోగరహస్యాలు తెలియచేస్తుండేవారు. ఒకరోజు దశ మహావిద్యల గురించి వివరణ ఇస్తూ ఇలా చెప్పారు, “శ్రీవిద్యను ఉపాసించడం చాలా శ్రేష్ఠమైంది. పూర్వకాలం ఈ విద్యను అగస్త్య మహర్షి హయగ్రీవుల వద్ద నేర్చుకొని, భార్య ఐన లోపాముద్రకు నేర్పించారు. ఆమె చాలా నిష్ఠతో ఈ విద్యని సాధనచేసి వాటి అంతరార్థాల ను భర్తకు తెలియచేస్తుండేది. ఈ రకంగా భార్యాభర్తలు ఇద్దరు ఒకరికొకరు గురుశిష్యులయ్యారు. ఇది ఒక విచిత్రమైన విషయం.

**దశమహావిద్యలు**

దశమహావిద్యలలో మొదటిది కాళీ రూపం. సమస్త విద్యలకు ఆదిరూపం మహాకాళి. ఆ దేవి విద్యామయ శక్తులనే మహావిద్యలని అంటారు. కృష్ణవర్ణంలో ఉండటం వల్ల దేవికి కాళీ అనే నామం ఏర్పడింది. అనేక సంవత్సరాలకు కాని ఫలించని యోగమార్గ సాధన కొద్ది మాసాలలోనో, రోజుల్లోనో సాధించాలనుకొంటే కాళీ ఉపాసన చేస్తారు. కాని కాళీశక్తిని తమ శరీరంలోనికి ఆకర్షించుకొనేటప్పుడు అగ్నితో సమానమైన మంటలని, భయంకరమైన బాధని యోగి అనుభవిస్తారు.

**రెండవది తారా రూపం.** తరింప చేసే దేవి కాబట్టి తార అయ్యింది. ఈమెను నీలసరస్వతి అని కూడా అంటారు. వశిష్ఠ మహర్షి గొప్ప తారా ఉపాసకుడు.

**మూడవది ఛిన్నమస్త.** పార్వతి తన సఖురాండ్రైన డాకినీ, వర్ణినీలతో మందాకినీ నదికి స్నానానికై వెళ్ళింది. స్నానం చేసిన తరువాత వారిద్దరు ఆకలిగా ఉందని తమ ఆకలిని తీర్చమని అడగటంతో దేవి ఖడ్గంతో తన

శిరస్సుని ఖండించుకున్నది. ఖండిత శిరస్సును ఆమె తమ వామ హస్తంలో పట్టుకొన్నది. దాని నుండి వెలువడ్డ మూడు ధారలను ముగ్గురు త్రాగి తమ ఆకలిని తీర్చుకున్నారు. అప్పటి నుండి ఆమె ఛిన్నమస్తాదేవిగా ప్రసిద్ధి పొందింది.

**నాల్గవది షోడశీమహేశ్వరి.** పార్వతీదేవి యొక్క ముగ్ధ మోహనమైన 16సంవత్సరాల ప్రాయపు రూపమే షోడశీమహేశ్వరి. ఈ తల్లిని ప్రసన్నం చేసుకోడానికి సాధకులు షోడశాక్షరీ (16 అక్షరాలుకల) మంత్రాన్ని జపిస్తారు. ఈ దేవిని ఆశ్రయించిన వారికి అన్ని విద్యలు అరచేతిలోనే ఉంటాయి. ఈ దేవి ఉపాసన వల్ల భోగము, మోక్షము రెండూ సిద్ధిస్తాయి.

**అయిదవ రూపం భువనేశ్వరీదేవి.** ఈ దేవిని ఏడుకోట్ల మహామంత్రాలు ఆరాధిస్తుంటాయి. ఈ విశ్వాన్ని సృష్టించాలనే అభిలాషతో, క్రియాశక్తిని ఆహ్వానిస్తూ బ్రహ్మ తీవ్రమైన తపస్సు చేసారు. ఆ తపస్సుకు మెచ్చిన పరమేశ్వరి భూదేవి రూపంలో ప్రత్యక్షమైంది. విశ్వానికే అధిదేవత కాబట్టే భువనేశ్వరీ అని పిలుస్తారు. అవ్యక్తం నుండి వ్యక్తమైన బ్రహ్మాండ రూపం, చైతన్య స్వరూపమే భువనేశ్వరీదేవి.

**ఆరవది త్రిపురభైరవి రూపం.** కొన్ని ప్రత్యేకమైన క్లిష్టపరిస్థితులు ఏర్పడినప్పుడు వాటిని రూపుమాపగల శక్తిని త్రిపురభైరవి అని అంటారు. ఈ శక్తిని నృసింహభగవానుడి అభిన్నశక్తిగానూ, కాలభైరవుని అవతారంగాను పరిగణిస్తారు.

**ఏడవ రూపం ధూమావతి.** ఈ దేవి ఉగ్రతారయే. ఈమె శరణాగతి వల్ల విపత్తులు నాశనమై సంపదలు లభిస్తాయి. జీవుని ఆకలి, దప్పికల బాధలకు, కలహ–దారిద్ర్యాలకు ఈమె కర్త. ఈ తల్లి అనుగ్రహం ఉంటే సమస్యలన్ని దూరం అవుతాయి.

**బగళాముఖి ఎనిమిదవ రూపం.** కుటుంబపరంగాను, ఆధ్యాత్మికంగాను, దేశంలోను, సమాజంలోను వికాసానికి అడ్డంకులుగా ఉన్న అరిష్టాలను

రూపుమాపడానికి, శత్రువులను అణగదొక్కడానికి ఈ మాతను ఆరాధిస్తారు. బ్రహ్మ, విష్ణు, పరశురాములు ఈ దేవి ఉపాసకులే. చాలాకాలంవరకు తిరుపతి వేంకటేశ్వరుని బగళాముఖిగా పూజించారు.

**తొమ్మిదవ రూపమైన మాతంగి** మతంగ మహాముని కుమార్తె. మాతంగికి గృహస్థ జీవితాన్ని సుఖవంతం చేసే శక్తి ఉంది.

**పదవ రూపమైన కమలాలయ** సమృద్ధికి ప్రతీక. ఈమె అనుగ్రహం వల్ల రాజభోగం, కీర్తి లభిస్తాయి.

**చరితామృత పారాయణ మహిమ**

ఇంతవరకు చెప్పిన శ్రీపాదులు, 'విస్తారంగా దశవిద్యా మహా స్వరూపాన్ని ఏ రోజున ఎవరి ద్వారా మీకు తెలియచెప్పాలో నేను నిర్ణయించి ఆ విధంగా బోధింపచేస్తాను,' అని తెల్పి అనఘాదేవి దశమహావిద్యా స్వరూపిణి అని, అనఘా–అనఘులను పూజించిన వారికి సమస్త కోరికలు ఫలించుతాయని చెప్పారు. తరువాత నన్ను ఉద్దేశించి, "శంకరభట్టూ! **నీతో రచింపబడే చరితామృత గ్రంథాన్ని పారాయణ చేసి, ఈ తరువాత వెంటనే వచ్చే అష్టమినాడు అనఘాష్టమీ వ్రతం చేసుకొని 11 మందికి భోజనాలు పెడితే వెంటనే ఫలితాలు కన్పిస్తాయి,"** అని చెప్పారు. **శ్రీ చరితామృతగ్రంథం నామమాత్ర గ్రంథం కాదు. దీని పారాయణ చేస్తున్నప్పుడు మీకు తెలియకుండాగనే మీరు నా సంపర్కంలో ఉంటారు. కాబట్టి మీ ధర్మబద్ధమైన కోరికలు తీరుతాయి. దీన్ని పూజామందిరంలో ఉంచినట్లయితే దురదృష్టాన్ని, దారిద్ర్యాన్ని కలిగించే శక్తులని విచ్ఛిన్నం చేస్తుంది,"** అని హామీ ఇచ్చారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

## 32వ అధ్యాయం

## నవనారాయణులే నవనాథులు

### నవనాథుల జననం

శ్రీపాదుల దివ్య పాదాలకు నమస్కరించిన తరువాత నేను వారిని నవనాథుల గురించి ప్రశ్నించాను. నవనాథుల పేరు వినగానే ప్రభువు కన్నులలో చాలా ఆనందం కనిపించింది. "నాయనలారా! నవనాథులని స్మరిస్తేనే చాలు, అన్ని రకాలైన శుభాలు కలుగుతాయి. వీళ్ళని స్మరించిన భక్తులపై దత్తుల అనుగ్రహం తప్పక ఉంటుంది," అంటూ వారి వృత్తాంతాన్ని చెప్పడం ఆరంభించారు:

"ఋషభ చక్రవర్తికి నూర్గురు పుత్రులు ఉన్నారు. అందులో తొమ్మిది మంది నారాయణ అంశతో జన్మించారు. వీరిని నవ (9) నారాయణులు అని అంటారు. వీరు వరుసగా 1.కవి, 2.హరి, 3.అంతరిక్షుడు, 4.ప్రబుద్ధుడు, 5.పిప్పలాయనుడు, 6.అవిర్హోత్రుడు, 7.దృమీళుడు, 8.చమనుడు, 9.కరభాజనుడు. వీరంతా అవధూత స్థితిలో ఉండే సిద్ధ పురుషులు. నా ఆజ్ఞమేరకు, కృష్ణావతారంలో వారు చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవడానికి, ధర్మసంస్థాపన కార్యాలు చేబట్టడానికి వీరు **నవనాథులు**గా జన్మించారు.

| | |
|---|---|
| 1. కవి. | మత్స్యేంద్రనాథుడు |
| 2. హరి | గోరక్షానాథుడు |
| 3. అంతరిక్షుడు | జాలంధరనాథుడు |
| 4. ప్రబుద్ధుడు | కానీఫా |
| 5. పిప్పలాయనుడు | చర్పటనాథుడు |
| 6. అవిర్హోత్రుడు | వటసిద్ధనాగనాథుడు |
| 7. దృమీళుడు | భర్తరీనాథుడు |
| 8. చమనుడు | రేవణనాథుడు |
| 9. కరభాజనుడు | గహనీనాథుడు |

ఇందులో (1) కవి అనేవారు మత్స్యేంద్రుడిగా జన్మించారు. ఉపరిచరుడనే వసువు ఊర్వశిని చూచి మోహించాడు. అతని వీర్యం యమునా నదిలో పడగా ఒక మీనం త్రాగింది. ఆ మత్స్యం నుండి మత్స్యేంద్రనాథుడు జన్మించారు.



(2) **హరి** అనేవారు మత్స్యేంద్రనాథుల శిష్యునిగా **గోరక్షానాథునిగా** జన్మించారు. మత్స్యేంద్రనాథుడు దేశసంచారం చేసేటపుడు సంతానంలేని ఒక స్త్రీకి భస్మాన్ని మంత్రించి ఇవ్వగా, ఏమాత్రం నమ్మకం లేని ఆ స్త్రీ దాన్ని పెంటదిబ్బపై విసిరి వేసింది. ఆ భస్మం చాలా శక్తివంతమైనది. కాబట్టి అందులోనుండి **గోరక్షానాథుడు** ఉద్భవించారు.

(3) బృహద్రథుడనే రాజు యజ్ఞం చేసినపుడు ఆ యజ్ఞకుండం నుండి **అంతరిక్షుడు జాలంధరనాథునిగా** ఉద్భవించారు.

(4) ఒకసారి బ్రహ్మదేవుడు సరస్వతిని చూచి మోహించగా వీర్యస్ఖల నమై హిమాలయాల్లోని అరణ్యంలో నిద్రిస్తున్న ఒక ఏనుగు చెవిలో పడింది. దానిలో నుండి **ప్రబుద్ధుడు కానీఫా**లా జన్మించారు. వీరు కర్ణకానీఫాగా ప్రసిద్ధిచెందారు.

(5) పార్వతీ వివాహ సమయంలో పురోహితునిగా ఉన్న బ్రహ్మ, పార్వతీ రూపాన్ని చూచి మోహితుడు అవడంతో వీర్యస్ఖలనమై భాగీరథి నదీతీరం దగ్గర రెల్లుదుబ్బులో పడి దానిలో **పిప్పలాయనుడి** ఆత్మ ప్రవేశించి

**చర్పటనాథు**నిలా జన్మించారు.

(6) ఆ వీర్యంలో కొంత భాగం తక్షకుని కుమార్తె అయిన పద్మిని అనే నాగకన్య శిరస్సుపైన పడింది. అది భక్ష్య పదార్థమని తలచి తినడంవల్ల ఆ నాగకన్య గర్భవతి అయింది. ఆ సమయంలోనే జనమేజయుడు సర్పయాగం చేస్తుండటంవల్ల ఆస్తీకుడనే మహర్షి ఆ నాగకన్యను ఒక మట్టిచెట్టు తొఱ్ఱలో దాచారు. గుడ్డును మాత్రం అక్కడే ఉంచి ఆ పాము వెళ్ళిపోయింది. అందులో నుండి **అవిర్హోత్రుడు, వటసిద్ధ నాగనాథుడనే** పేరుతో అవతరించారు.

(7) కౌశికుడనే మహర్షి తన భిక్షాపాత్రను పర్ణశాల బయట ఉంచారు. అదే సమయంలో సూర్యుడి రేతస్సు దానిలో పడింది. మహర్షి అది గ్రహించి ఆ పాత్రను భద్రంగా ఉంచారు. దాని నుండి **ద్రుమీళుడు, భర్తరీనాథుడనే** పేరుతో ఉద్భవించారు. భర్తరి అంటే భిక్షాపాత్ర. దానినుండి జన్మించిన కారణం వలన **భర్తరీనాథుడు** అయ్యారు.

(8) రేవా నది అంటే నర్మదా నదిలో పడిన బ్రహ్మ వీర్యంలో **చమనుడి** ఆత్మ ప్రవేశించి **రేవణనాథుడు** జన్మించారు.

(9) గోరక్షకుడు సంజీవనీ మంత్రం జపిస్తూ మట్టితో ఒక మనిషి బొమ్మను చేయడం జరిగింది. ఆ బొమ్మలో **కరభాజనుని ఆత్మ** ప్రవేశించి జీవాన్ని పొంది **గహనీనాథుడునే** పేర అవతరించారు. ఈ విధంగా ఒక్కొక్క నారాయణుడు ఒక్కొక్క నాథునిగా జన్మించారు."

**అంశావతారాల పరిధి**

"నవనాథులు నవనారాయణుల అంశాలు అయితే నవనారాయణుల కి నవనాథులకి ఏమైనా బేధం ఉందా?" అంటూ నేను నా సందేహాన్ని వ్యక్తపరిచాను. "సమస్త సృష్టియొక్క మహా సంకల్ప స్వరూపాన్ని నేనే. మిగిలిన దేవీ, దేవతా సంకల్పాలు నా మహా సంకల్పంలోని అంశ మాత్రాలే. వారికి పరిమితమైన స్వేచ్ఛ మాత్రమే ఉంటుంది." దానికి

ఉదాహరణని ఇస్తూ ఈ విధంగా చెప్పారు: "ఒక పంటకాపు ఆవుని తాటితో బంధించినపుడు ఆ త్రాడు పోగలిగిన దూరం వరకు మాత్రమే అంటే ఒక నిర్ణీతమైన పరిధిలోనే దానికి స్వేచ్ఛ ఉంటుంది. ఆ పరిధిని దాటాలంటే కాపు అనుమతి కావాలి. అలాగే అంశావతారాలకి కొన్ని ధర్మ-కర్మ సూత్రాలకు లోబడి ఉండేలా స్వేచ్ఛ ఇవ్వబడుతుంది. సంకల్పం మూలతత్త్వం నుండి వస్తుంటే వీరు వాటిని అమలులో పెడుతుంటారు. జీవుల సమస్యల ను మూలతత్త్వానికి నివేదించి, మూలతత్త్వం యొక్క అనుగ్రహం తెచ్చి జీవులకు శ్రేయస్సు కలిగిస్తారు. **మానవులకున్నట్లు అంశావతారాలకు రాగద్వేషాలు, అహంకారం వంటి దుర్గుణాలు లేకపోవడంవల్ల మూలతత్త్వం ఏయే పనులను చేయగలదో అంశావతారాలు కూడా ఆ పనులను చేయగల్గుతారు. అందువల్ల జీవులకు సంబంధించినంతవరకు అంశావతారాలకు పూర్ణావతారాలకు ఏమీ బేధం లేదు,"** అని చెప్పి నా సందేహం తీర్చారు. తరువాత భవిష్యత్తులో సాయిబాబా అనే పేరుతో తమ సమర్థ సద్గురు రూపం రానున్నదని, ఇంద్రియవృత్తులను శాంతింప చేసేదే సాయితత్త్వమని, ఆ తత్త్వము వారిలో సాయుజ్యస్థితిలో ఉందని శ్రీపాదులు తెలిపారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 33వ అధ్యాయం

## నరసింహరాయల ఆతిథ్యం (కాళీమాత)

## (శ్రీపాదులకు 12 ఏళ్ళు)

### పుత్తడిబొమ్మ రమణి

మమ్మల్ని శ్రీపాదులు పీఠికాపురం పోయి రమ్మని ఆదేశించారు. మేము కృష్ణ ఈవలి ఒడ్డు చేరి ఆ రోజున ఒక బండమీద శ్రీచరణుల పాదముద్రలను చూసి ఎంతగానో ఆనందం, ఆశ్చర్యం చెందాము. వారు సూర్యనమస్కారాలు ఆ బండమీద నిల్చొని చేసేవారట. మేము వెళ్ళుతుండగా పంచదేవ్‌పహాడ్‌లో ఒక జొన్నచేను యజమాని సాదరంగా మమ్మల్ని పిలిచి చక్కటి ఆతిథ్యం ఇచ్చారు. తరువాత తన అనుభవాలని మాతో పంచుకున్నారు, "నా పేరు నరసింహరాయడు. నా చిన్నతనంలోనే తల్లితండ్రులు పోవడంతో మేనమామ నన్ను పెంచారు. మా మేనత్త గయ్యాళి, దురాశ ఎక్కువ. వారి కూతురు రమణి. పేరుకు తగ్గట్టుగా అందము, సౌశీల్యం మేళవించి ఉన్న పుత్తడి బొమ్మ. రమణి తన దగ్గర ఉన్న ఒక కృష్ణ విగ్రహాన్ని పూజిస్తూ ఉండేది. రమణికి ఎన్నో పెళ్ళి సంబంధాలు వస్తుండేవి. కాని మా రమణికి నన్ను చేసుకోవాలని ఉండేది. నాకు పని ఎక్కువ, ఆహారం తక్కువ అవడంవల్ల అసలే దుర్బలుడను, ఇంకా బలహీనంగాను పిరికివాడిగాను తయారయ్యాను.

### కుహనాసాధువు రాక

ఒకసారి మా ఊరికి ఒక దొంగ సాధువు వచ్చాడు. అతడు మా మేనత్తను మాయమాటలతో లోబరుచుకొని కాళీమాతకు పూజ చేయాలని, దానివల్ల పెద్ద నిధి దొరుకుతుందని చెప్పాడు. రమణి ఎంత మొత్తుకుంటున్నా వినకుండా మొదటి పనిగా మా రమణి పూజ చేసే కృష్ణ విగ్రహాన్ని పారేసాడు. రోజూ కోళ్ళు బలి ఇవ్వడం, వాటి రక్తంతోను, ఇంకా

కొన్ని విచిత్ర స్మశాన పరికరాలతోను పూజగది అంతా నానా భీభత్సంగా ఉండేది. రమణిలో కాళీమాత ప్రవేశించిందని చెప్పి ఆమెకు అన్నం బదులు రక్తం తాగడానికి ఇస్తుండేవాడు. ఇల్లంతా స్మశానంలా ఉండేది.

ఆ సాధువుకి వశీకరణం కూడా తెలుసు. రమణి మీద వశీకరణ ప్రయోగం చేసి దుష్ట సంకల్పంతో ఒక అర్ధరాత్రి మా రమణిని సమీపించాడు. మా రమణి బిగ్గరగా అరిచి ఇనుప వస్తువుతో అతని తలమీద కొట్టింది. తన వశీకరణం ఎలా విఫలం అయ్యిందో వాడికి తెలియలేదు.

**దత్తుల కరుణ**

మర్నాడు పొద్దున ఒక బ్రాహ్మణ బిచ్చగాడు మా ఇంటికి వచ్చాడు. అప్పటి మా మనస్థితులను బట్టి ఒకరు మా ఇంట్లో భూతప్రేతాలే ఉన్నాయని, కేవలం దరిద్రమే ఉన్నదని, అస్తవ్యస్త పరిస్థితులే ఉన్నాయని కావాలంటే అవి తీసుకొని వెళ్ళమని చెప్పాము. ఆయన అన్నింటికి సరే అన్నారు. నేను నా వెండి తాయెత్తు ఇచ్చాను. ఆ దొంగ సాధువు కపాలం భిక్షగా తీసుకొని పొమ్మని ఎగతాళి చేసాడు. ఇంతలో మా ఇంట్లో కళ్ళు జిగేల్ అనేటట్లు ఓ దివ్య ప్రకాశం కనిపించింది. ఒక కిరణం రమణిలో, ఒకటి నాలో ప్రవేశించింది. రమణి స్వస్థురాలయింది. నేను బలశాలిని, ధైర్యవంతుడను అయ్యాను. మా అత్తకు పక్షవాతం వచ్చింది. మాంత్రికుడి నోటిలో నుండి రక్తధారలు పడి వాడి శక్తులన్ని హరించుకు పోయాయి. తరువాత ఆ దివ్య ప్రకాశం మానవరూపం ధరించింది. ఆ దివ్య భవ్య స్వరూపం ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీపాద శ్రీవల్లభుల వారిదే. **"నిజానికి కాళీమాత ధ్వంసం చేసేది సాధకునిలో ఉన్న కామం, క్రోధం మొదలైన దుష్టశక్తులను మాత్రమే. ఆమె కోళ్ళు, మేకలు కోరదు. ప్రాణమయ జగత్తులో ఉన్న రాక్షస శక్తులు కాళికా రూపం ధరించి మేము ఫలానా దేవతలం అని అసత్యాలు చెప్పుతూ క్షుద్ర విద్యలు ప్రదర్శిస్తూ బలులు కోరుతాయి. ఈ ప్రేతాత్మలు ఆయా దేవతా రూపాలను ధరించగలుగుతాయే కాని ఆ దేవతా శక్తులు మాత్రం వాటికి**

**ఉండవు.**" అని శ్రీపాదులు మాతో చెప్పారు.

తరువాత ప్రభువులు మా మేనత్తను అనుగ్రహించి ఆమెను స్వస్థురాలిని చేసారు. స్వయంగా వారే దగ్గరుండి రమణితో నా వివాహం జరిపించారు. అపుడు వారి వయసు 12 సంవత్సరాలని చెప్పి, ఆ రోజు వారు మాకు ఇచ్చిన అక్షితలు ఇవే అంటూ కొన్ని అక్షతలు చూపించి కాలాంతరంలో ధర్మగుప్తులు, శంకరభట్టు వస్తారని వారికి ఇవ్వమని శ్రీపాదులు తనను ఆదేశించారని చెప్పి, మాకు కొన్ని అక్షతలు ఇచ్చారు. ఆహా! శ్రీవల్లభులు ఎంతటి లీలామయ అవతార స్వరూపులు!

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 34 వ అధ్యాయం

# మానవత్వమే అసలైన దైవత్వం

# (ధూమావతి)

## బ్రాహ్మణుని దీనావస్థ

మేమిద్దరం శ్రీపాదుల నామస్మరణ చేస్తూ మా ప్రయాణం సాగిస్తూ ఒక గ్రామం చేరుకున్నాం. శ్రీపాదుల దయవల్ల మా ప్రయాణంలో మాకు ప్రతిచోట అడగకుండానే ఆతిథ్యం లభించింది. ఆ గ్రామంలో విశేషం ఏమిటంటే ఒక ఋణదాత ఒక బ్రాహ్మణుడి ఇంటిలోని సామానంతా వీధిలో పారేస్తున్నాడు. పాపం! అతని భార్యా, పిల్లలు కూడా వీధిలో నిల్చున్నారు. ఒక గిరి గీసి ఆ బ్రాహ్మణుని అందులో నిల్చోబెట్టి ఎన్ని రోజుల్లో అప్పు తీరుస్తావో యజ్ఞోపవీతం పట్టుకొని ఖచ్చితంగా చెప్పమని ఋణదాత నిర్బంధం చేస్తున్నాడు. ధర్మగుప్తులకు జాలి వేసి ధన సహాయం చేయాలనుకున్నారు. కాని అప్పుడు అంత మొత్తం వారి వద్ద లేదు. ఆ బ్రాహ్మణుని దీనావస్థ చూసి జాలి వేసి నేను కల్పించుకొని ఇంకొక రెండు వారాలు గడువు ఇచ్చినట్లయితే అతను అప్పుతీర్చగలడని, దానికి నేను హామీ అని ఋణదాతకు చెప్పాను. వెంటనే నా ప్రతిపాదనని ఒప్పుకుంటూ బాకీ తీర్చేవరకు మేమిద్దరం ఆ గ్రామంలోనే ఉండాలని, బ్రాహ్మణుడు ఋణం తీర్చక పోయిన పక్షంలో న్యాయాధికారి వేసే శిక్షను నేను అనుభవించవలసి ఉంటుందని షరతులు విధించారు ఆ ఋణదాత. పూర్వాపరాలు ఆలోచించకుండా ఎవరి విషయంలోనో తల దూర్చినందుకు, నాతోపాటుగా ధర్మగుప్తులను కూడా సంకట పరిస్థితులలో ఇరికించినందుకు నన్ను నేనే నిందించుకున్నాను. కాని ఇద్దరం శ్రీపాదులవారిదే భారమని, వారే మమ్మల్ని కాపాడుతారని నమ్మకంతో ఉన్నాము.

## పందాల జోరు

ఆ బ్రాహ్మణుని చూడబోతే చాలా బీదవాడు. వంటకి సంభారాల మాట

అటుంచి, దేవుడి దీపారాధనకైనా నూనె, వత్తి – పత్తి లాంటివి కూడా లేవు. కాలే కడుపులతో మేమిద్దరం కూర్చొని "శ్రీపాదరాజం శరణం ప్రపద్యే" అనే మంత్రాన్ని పాడుతుంటే ఆ వీధిలోని పిల్లలు, పెద్దలు కూడా మాతో కలిసి నామ సంకీర్తన చేసారు. వారిలో కొందరు పంట కాపులు ఉన్నారు. 'నేనొక మహాపురుషుడి శిష్యుడినని, నా వద్ద దైవీశక్తులు ఉన్నాయని, అందుకే ధైర్యంగా హామీ ఇవ్వగలిగానని, నాకు జోస్యంకూడా బాగా వచ్చుని,' వాళ్ళు ఊరిలో ప్రచారం చేసారు. నేనిచ్చిన హామీపైన ఆధారపడి బ్రాహ్మణుడు అప్పు తీరుస్తాడని కొందరు, తీర్చలేడని మరికొందరు ఊళ్ళో పందాలు కాయడం మొదలు పెట్టారు. అనాలోచితంగా తమ భక్తుడు పలికిన మాటలను భగవంతుడే నిజం చేయాలని నేను మనసులో అనుకున్నాను.

ఆ ఊళ్ళోనే శరభేశ్వరశాస్త్రి అనే పండితుడు ఉన్నాడు. అతడు మంత్రశాస్త్రవేత్త కూడా. వారు ఏదో ప్రేతాత్మ సహాయంతో భూత, భవిష్యత్, వర్తమానాలు తూచా తప్పకుండా చెప్పేవాడు. పందెగాళ్ళు కొందరు వారి దగ్గరకు వెళ్ళి విషయం చెప్పగానే అతడు ప్రేతాత్మని ప్రశ్నించాడు. బ్రాహ్మణుడు అప్పు తీర్చలేడని ఆ ప్రేతాత్మ చెప్పడంతో ఆయన అదే నొక్కి చెప్పాడు. దీనితో పందాల జోరు పెరిగి నూరు–నూరు వరహాలలో పందాలు కాయసాగారు. శంకరభట్టుకి వత్తాసు ఇస్తున్న వాళ్ళు పేద బ్రాహ్మణుడి ఇంటికి సంభారాలు పంపడం మొదలు పెట్టారు. కాని నాకు పరిస్థితి అంతా అయోమయంగా ఉంది. "తండ్రీ! శ్రీపాదా! అంతంత మాత్రం చదువుతో, ఏ ఆధ్యాత్మిక శక్తి, జపతపాలు, యోగాభ్యాసాలు, నియమ నిష్ఠలు లేని నేను, కేవలం మీమీద ప్రగాఢ భక్తితో మీ చరిత్ర వ్రాయడానికి కుతూహల పడుతున్న నేను, అనాలోచితంగా ఈ పరిస్థితులలో ఇరుక్కున్నాను. నన్ను గట్టెక్కించు ప్రభూ, మీదే భారం," అని ప్రార్థించాక ఎంతో ధైర్యంగా అనిపించింది.

**శరభేశ్వరశాస్త్రి సోదరి**

శరభేశ్వరశాస్త్రికి ఆ గ్రామంలోనే నివసిస్తున్న ఒక చెల్లెలు ఉంది. 'భర్త చనిపోయి తనకు వైధవ్యం వచ్చినట్లు' ఆమెకు కల వచ్చింది. అన్నగారికి తన కల గురించి చెప్పితే ఆయన ప్రేతాత్మను అడిగి, 'దేశాంతరంలో ఉన్న ఆమె భర్తని దొంగలు దోచుకొని చంపివేసారు,' అని చెప్పాడు. కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తున్న ఆమెను ఓదార్చడానికి వెళ్ళిన పంటకాపులు ఆమెని నా వద్దకు తెచ్చారు. వస్తూనే ఆమె, "అన్నా! నా మాంగల్యాన్ని రక్షించండి," అంటూ నా కాళ్ళమీద పడింది. నేను అప్రయత్నంగా నీ భర్తకు ఏమీ కాదు, అని చెప్పి పంచదేవ్‌పహాడ్‌లో పంటకాపు మాకు ఇచ్చిన అక్షతలు కొన్ని ఇచ్చి పూజగదిలో భద్రపరచమని చెప్పి ఆమె భర్త కొద్ది రోజులలో తిరిగి వస్తాడని ధైర్యం చెప్పాను. ఈ విషయం విన్న శరభేశ్వరశాస్త్రి అగ్గి మీద గుగ్గిలం అయి, **"నా చెల్లెలి భర్త తిరిగి వచ్చి నా జోస్యం తప్పినట్లయితే నేనే ఆ బ్రాహ్మణుడి బాకీ పూర్తిగా తీరుస్తాను. శంకరభట్టుని గురువుగా స్వీకరించి శ్రీపాదులను ఆరాధిస్తాను,"** అని ప్రతిజ్ఞ చేసాడు. నాల్గవరోజు చెల్లెలి భర్త దేశాంతరం నుండి తిరిగి వచ్చాడు. మార్గమధ్యంలో దొంగలు తనను చంపబోగా సమయానికి ఒక ముస్లిం పహల్వాన్ వచ్చి తనను ఆదుకున్నాడని చెప్పడంతో నేను ఇచ్చిన మంత్రాక్షతల వల్ల తన భర్త బ్రతికాడని ఆమె భావించింది.

**గర్వభంగం**

శరభేశ్వరశాస్త్రి అహంకారం తగ్గి, బ్రాహ్మణుని అప్పు పూర్తిగా తీర్చి వారి యింట ఆతిథ్యం స్వీకరించమని మమ్మల్ని సాదరంగా ఆహ్వానించారు. ఆయన మాతో, "అయ్యా! దశమహావిద్యలలో ఒకటైన **ధూమావతీదేవిని నేను ఆరాధించేవాడిని. తంత్ర గ్రంథాల ప్రకారం ఆమె ఉగ్రతారాదేవే. ఆమె ప్రసన్నురాలయితే సర్వ సుఖాలు ప్రాప్తిస్తాయి, కోపిస్తే జీవనం దుఃఖప్రదమే.** నేను ఆ మహాతల్లి అనుగ్రహం పొందాను. చాతబడివల్ల, ప్రేతాత్మతో

పీడింపబడటం వల్ల బాధ పడుతున్న వారి దుఃఖాలు ఆ తల్లి దయతో పోగొట్టేవాడిని. మొదట ధనాశ లేకుండా చేసినా, మెల్లగా నేను ధనాకర్షణకి లోనయ్యాను. ఇది ఆ మహాతల్లికి సమ్మతం కాదు. ఇంతలో ప్రాణమయ జగత్తులోని శక్తివంతమైన ప్రేతాత్మతో నాకు అనుబంధం ఏర్పడింది. ఇటువంటి వాటిని ఉపాసిస్తే చివరికి దుఃఖమే మిగులుతుంది అని తెలిసి కూడా, నేను ధన వ్యామోహంలో ఇరుక్కున్నాను.



అయితే ఆవిధంగా సంపాదించిన ధనాన్ని ప్రజల క్షేమం కోసం ఉపయోగిస్తే ప్రేతాత్మ మన అధీనంలో ఉంటుంది. లేదా ఇలా తప్పుడు జోస్యాలు చెప్పి అవమానాలపాలు చేస్తుంది," అని మాకు వివరించి తనను శిష్యునిగా స్వీకరించమని నన్ను ప్రార్థించాడు. "ఈ ప్రపంచానికే శ్రీపాద శ్రీవల్లభులు తప్ప వేరే గురువు ఎవరూ లేరు. శ్రీపాదులు దశమహావిద్యల గురించి సంక్షిప్తంగా చెప్పి మిగిలిన విషయాలు ఎవరి ద్వారా ఎంతవరకు తెలియచేయాలో అంతవరకు బోధపడేలా చేస్తాను," అని మాకు చెప్పారు. ఇప్పటివరకు **దశ మహావిద్యలలో కాళీ, మరియు ధూమావతి గురించి తెలిసింది.** శ్రీపాదులు ఇక్కడ మమ్మల్ని విచిత్ర పరిస్థితులలో ఇరికించి తిరిగి వారే ఒడ్డున వేసారు. **శ్రీపాదులవారు చిక్కులను కలిగించుటలో బహు నేర్పరి. వాటినుంచి భక్తులను బయట పడవేయుటలో బహు చమత్కారులు. శ్రీపాద నామస్మరణం ఇహపర సాధనం,"** అని చెప్పాను.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

# 35వ అధ్యాయం

# దుష్ట శిక్షణ-శిష్ట రక్షణ

## (శ్రీపాదులకు 12 ఏళ్ళు) (ఉగ్రతారాదేవి)

### తారా ఉపాసకుడు

మేము తిరిగి మా ప్రయాణం కొనసాగించాము. మార్గ మధ్యంలో ఒక ఆశ్రమం బయట ఇద్దరు శిష్యులు నిల్చొని, "శంకరభట్టు, ధర్మగుప్తులు మీరేనా"? అని ప్రశ్నించారు. మేము ఔనని చెప్పడంతో మమ్మల్ని లోపలకు తీసుకొని వెళ్ళారు. అక్కడ తారాదేవి విగ్రహం చూసి ఆ సిద్ధుడు తారాదేవి ఉపాసకుడని గ్రహించాము. శ్రీపాదుల పూజ, భజన, మా భోజనం అయ్యాక సిద్ధుడు తారాదేవి గురించి ఇలా వివరించారు.

**మోక్షాన్ని ప్రసాదించి తరింపచేసేది కాబట్టి ఈమెను తార అని పిలుస్తారు. భయంకరమైన విపత్తుల నుండి భక్తులను రక్షించే దేవి కనుక, వాక్‌శక్తిని ప్రసాదించే తల్లి కనుక ఈమెను నీలసరస్వతి అని కూడా పిలుస్తారు. ఈ దేవి ఉపాసన వల్ల సామాన్యులు కూడా బృహస్పతి అంత విద్వాంసులు అవుతారు.** భారతదేశంలో మొట్టమొదటగా తారా ఉపాసన చేసినది వశిష్ఠ మహర్షియే.

### అందియల బహూకృతి

మిథిలదేశంలోని మహిషి అనే గ్రామంలో ఉగ్రతారా సిద్ధ పీఠంలో ఉగ్రతారా, ఏకజట, నీలసరస్వతి ముగ్గురూ ఏకస్థానంలో ఉంటారు. మాతని దర్శించి నేను బయటకు రాగానే ముద్దులు మూటగట్టే 13 ఏళ్ళ బాలిక కనిపించి, "నాయనా! నాకోసమేనా నీవు లోకాలంతా గాలిస్తున్నావు?" అని అడిగింది. ఆ ముగ్ధ మోహన రూపాన్ని మైమరచి చూస్తుండగా ఆమె శరీరంలోని కణాలు తేజోభరితమై అందుండి ఒక బాలుని రూపం ఉద్భవించింది. ఆ బాలుని రెండు కాళ్ళకు అందెలు ఉన్నాయి, కాని అవి

చాలా బిగుతుగా ఉండటంతో నన్ను విప్పమని అడిగి విప్పాక అవి నా చేతికే ఇచ్చి వాటిలో జీవశక్తి ఉందని, అవి నాకు మార్గదర్శకంగా ఉంటాయని చెప్పి అదృశ్యమయ్యాడు.

**గుణపాఠం**

తరువాత అన్ని పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ పీఠికాపురం వచ్చాను. అక్కడ స్వయంభూదత్తుని మందిరంలో ఉన్న సర్ప దర్శనంతో నాలోని కుండలినీ శక్తి విజృంభించి, శరీరం స్వాధీనం తప్పి పిచ్చివానిలా తిరుగుతూ నరసింహవర్మగారింటికి చేరాను. అక్కడ మహిషీ గ్రామంలో చూసిన బాలుణ్ణే చూసాను. వర్మగారి ఇంటి వద్ద జట్కాబండి ఒకటి ఉంది, కాని అది మనిషిలాగే బండి. అందులో శ్రీపాదులు తాతగారింటికి వెళ్తుండటం కద్దు. వర్మగారు జట్కాలాగే నౌకర్ని  పిలిచారు. శ్రీపాదులు జట్కాలో తాము కూర్చొని, ఆ నౌకర్ని కూడా కూర్చోబెట్టి నన్ను బండి లాగమని ఆదేశించారు. నేను ఆ పని చేయనని మొరాయిస్తే బెదిరించి బండి లాగేలా చేసారు. వారిద్దరి బరువు 20 మంది బరువులా ఉంది. అసలే లాగలేక అవస్థ పడుతుంటే ఆ కసాయి బాలుడు దుడ్డుకర్రతో నన్ను మోదడం ప్రారంభించాడు. ఒంటినిండా రక్తంతో, అర్ధనగ్నంగా వాళ్ళని వారి ఇంటి వరకు తీసుకొని వెళ్ళాను. బాలుడు లోపలికి వెళ్ళి రెండు చేతుల నిండా మిరప పొడి తెచ్చి నా శరీరంపై దట్టించాడు. పుండుమీద కారం చల్లడం, కాదు కాదు రుద్దడం అంటే ఇదే కాబోలు, గాయాల బాధకి తోడు భగభగ మంటలు.

**తల్లితండ్రుల సమ్మతం లేని సన్యాసం-గురువు లేని దీక్ష వ్యర్థం**

ఇంతలో వారి అమ్మమ్మ రాజమాంబ బయటకు వచ్చారు. ఆమెను చూడటంతోనే నా బాధ చాలావరకు తగ్గింది. ఆ నౌకరు జరిగినదంతా ఆవిడకు చెప్పితే శ్రీపాదులు అదంతా అబద్ధమని, నాకు చల్లగా గంధమే రాసానని చెప్పారు. నౌకరు వచ్చి చూస్తే వారు చెప్పిందే నిజమయింది.

శ్రీపాదులు తమ తాతగారితో నాగురించి చెప్పుతూ వీడు తారా ఉపాసకుడు, మంచిదే కాని సన్యాసదీక్షను గురు అనుమతితో కాక తన ఇష్టం వచ్చినట్లు తీసుకున్నాడు. ఇతని తండ్రి అష్టకష్టాలు పడి వీడిని పెంచి పెద్ద చేసారు. ఇతని తల్లి వీడు గర్భమందున్నపుడు ఎంతో కష్టాన్ని అనుభవించింది. వీడు జన్మించేటపుడు ఎంతో రక్తం పోగొట్టుకొని, గాయాలపై కారం అద్దినపుడు కల్గే బాధని అనుభవించింది. కాలాంతరంలో వారిద్దరు మరణించి పీఠికాపురంలో జన్మించారు. వర్మగారి ఇంట్లో పనిచేసే ఈ నౌకరే పూర్వజన్మలో వీడి తండ్రి. ఈ నౌకరు భార్యే వీడి తల్లి. వీడు తాను సన్యసించానని చెప్పి తల్లితండ్రులకు పిండప్రదానం చేయలేదు. స్వల్ప బాధను ఇచ్చి వీడిని కర్మ విముక్తుణ్ణి చేసాను. ఇతడు 9 రోజులు తన పూర్వ జన్మలోని తల్లితండ్రులయిన ఈ భార్యా భర్తలకు సేవ చేసినట్లయితే పితృదేవతల శాపం తొలగిపోతుంది", అని చెప్పారు. నేను ఆ రకంగానే చేసి, వారి అనుగ్రహ ఆశీర్వాదాలు పొంది, మహిషి గ్రామంలో ఇచ్చిన కాలిఅందెలను పూజ గదిలో భద్రపరిచి ఉగ్రతారా సిద్ధిని పొంది నా తంత్రశక్తితో జనుల బాధలు దూరంచేస్తూ జీవిస్తున్నాను. మీరు రావడానికి ముందే శ్రీపాదులు కనిపించి ఆ కాలిఅందెలు మీకు ఇమ్మని ఆదేశించారని చెప్పి అందెలు మాకు అందచేసారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 36వ అధ్యాయం

# విచిత్ర దాంపత్యం

# (మాతంగి)

**అందెలరవళి**

మాకు బహుమతిగా ఇచ్చిన కాలి అందెలను తీసుకొని మా ప్రయాణం సాగించాము. మేము నడుస్తున్నంత మేరా మధురమైన ఆ అందెలరవళి మా మనసులను పరవశింపచేసి ఏదో తెలియని దివ్యశక్తి అనాహతం నుండి ఇతర చక్రాలలోకి, అన్ని నాడులకు ప్రవహించి మాలో నూతన శక్తిని కలుగచేసింది. మేము గ్రామపు పొలిమేరల దగ్గరకు చేరాము. ఊరు చివర చండాల కులానికి సంబంధించిన వాళ్ళు నివసించే చోట ఒక ఆశ్రమాన్ని చూసి ఆశ్చర్య పోయాము. ఆశ్రమం దగ్గరకు చేరగానే అందెలరవళి ఆగి పోయింది. ఇంతలో ఆశ్రమం నుండి 60ఏండ్ల తేజస్వి అయిన మహర్షి, 30 ఏళ్ళ ఒక యోగినీ మాత బయటకు వచ్చారు. మమ్మల్ని సాదరంగా లోపలకు తీసుకొని వెళ్ళి, 'తాను పీఠికాపుర వాస్తవ్యుడనని, మొదటి పేరు వేదాంతశర్మ అని, ప్రస్తుతము బంగారయ్యప్ప అని పిలవబడుతున్నానని, ఆమె బంగారమ్మ అనే చర్మకారస్త్రీ అని, మాతంగి ఉపాసకులమని,' మాతో చెప్పారు. మాకంతా అయోమయంగా ఉంది. వారు బ్రాహ్మణులు, ఆ స్త్రీ మాదిగ కాంత, ఇది ఏమి దాంపత్యం? అని మనసులో ఒక సందేహం. మాకు కందమూలాలు, పళ్ళు ఇచ్చాక వారి వృత్తాంతాన్ని ఇలా చెప్పారు:

**వేదాంతశర్మ కథనం**

"నేను పీఠికాపురంలో ఉన్నపుడు మూడుమార్లు వివాహం చేసుకున్నాను. కాని ముగ్గురు భార్యలూ మరణించారు. శ్రీపాదులు నాతో హాస్యంగా, 'తాతా! నేను చూపిన మామ్మని వివాహం చేసుకోకుండా, ధర్మపత్నిగా మాత్రం స్వీకరిస్తే ఉత్తమ జన్మని ప్రసాదిస్తాను,' అంటుండేవారు.

పీఠికాపురంలోనే బంగారయ్య, బంగారమ్మ అనే చర్మకార దంపతులు ఉండేవాళ్ళు. వారిద్దరికి శ్రీపాదులపై మక్కువ ఎక్కువ. ఒకరోజు ఉన్నట్లుండి శ్రీపాదులు చర్మపాదుకలు కావాలని కోరారు. బ్రాహ్మణులు చెక్కపాదుకలను ధరించాలే కాని చర్మ పాదుకలు ధరించకూడదని ఇంటిలోని వారు నిరాకరించారు. శ్రీపాదులు యధేచ్ఛగా అన్ని కులాలవారి ఇంటికి వెళ్ళుతుండేవారు. ఆ రోజు శ్రీపాదులు ఉన్నట్లుండి బంగారమ్మ వాళ్ళింట్లో ప్రత్యక్షమయ్యారు. వారికొలతలు తీసుకున్నాక, 'ప్రభూ! నా చర్మం ఒలిచి మీ చెప్పులు కుట్టాలని ఉంది,' అని బంగారమ్మ తన కోరి కను వ్యక్తం చేసింది. వారు నవ్వి అంతర్ధానమయ్యారు. మా ఇంట్లో ఉన్న ఆవు చనిపోయింది, దాని చర్మాన్ని శుద్ధిచేసి బంగారయ్య దంపతులు శ్రీపాదులకు ఒక చెప్పుల జత తయారుచేసారు. అదే సమయంలో పీఠికాపురంలోని బ్రాహ్మణులు ఒక వేదాంత గోష్ఠిని ఏర్పాటు చేసారు. గోష్ఠికి ఎవరెవరిని ఆహ్వానించాలో నిర్ణయించే బాధ్యత నాపై పడింది. శ్రీపాదులు ఉపనయనం అయ్యాక ఒక్కరోజు కూడా వేదం నేర్చుకోలేదు. కాని ఎక్కడ నుండి ఏ పన్నమును చెప్పమన్నా చెప్పి దాన్ని విశ్లేషించేవారు. అందుచేత వారు ధర్మసూత్రాలను ఎలా విశ్లేషిస్తారో వినాలన్న కుతూహలంతో నేను వారిని కూడా ఆహ్వానించాను. అయితే, శ్రీపాదులు సభలో ధర్మవిరుద్ధంగా మాట్లాడితే ఆ వంకన రాజశర్మ, బాపనార్యుల కుటుంబాలను వెలివేయవచ్చు అనేదే అసలు ఈ గోష్ఠిని ఏర్పాటు చేయడంలోని బ్రాహ్మణుల ముఖ్య ఉద్దేశం.

**ఆత్మ ఏక - బహు శరీరగతమా?**

సరే, వేదాంతగోష్ఠి ప్రారంభమయింది. అందులో ఆది శంకరాచార్యులు చనిపోయిన మహారాజు శరీరంలో పరకాయ ప్రవేశం చేయడం, వారి శరీరాన్ని రాణి ఆదేశంతో కాల్చబోవడం, కాలిపోతున్న తమ శరీరాన్ని రక్షించుకోవడం కోసం శంకరాచార్యులు రాజు శరీరాన్ని వదిలి తిరిగి తమ శరీరంలో ప్రవేశించడం గురించి ప్రస్తావించారు. అది విన్న శ్రీపాదులు,

"ఆత్మ అనేది ఒకసారి ఒక శరీరంలోనే ఉండగలదా? ఆత్మ ఒకేసారి మూడు, నాల్గు శరీరాలలో ఉండి మూడు, నాల్గు జన్మల కర్మ ఫలాలని పోగోట్టుకోలేదా?" అని ప్రశ్నించారు. దానికి ఆ సభలోనివారు అటువంటి దాఖలాలు ఎక్కడా లేవని చెప్పారు. అందుకు వారు, "దాఖలాలు లేకేమి? ఉన్నాయి. కాని మీకు తెలియదు," అని చెప్పి, "దేవేంద్రుడు శాపవశాత్తు పంచపాండవులుగా జన్మించినపుడు, శచీదేవి ద్రౌపదిగా జన్మించి భార్య అయింది. శచీ, పురందరులిద్దరూ జన్మించినా, వారి మూలతత్త్వం స్వర్గంలోనే ఉంది. దేవతాధర్మాలు, మనుష్యధర్మాలు, జంతుధర్మాలు వేరువేరు. అన్నిటిని కలగాపులగం చేయకూడదు," అని చెప్పారు. పురాణకాలంలో ఇటువంటివి జరిగి ఉండవచ్చు. కాని నేటి కాలంలో జరుగవని నేను చెప్పాను. దానికి వారు నీవు ముగ్గురు స్త్రీలను వివాహం చేసుకున్నావు, మరి ఒక స్త్రీకూడా ముగ్గురు పురుషులని వివాహం చేసుకోవచ్చా? అని ప్రశ్నించారు. దానికి నేను, "మగవాడు ఎందరి స్త్రీలనైనా వివాహం చేసుకోవచ్చు, కాని స్త్రీలకు అటువంటి హక్కు లేదు," అని చెప్పాను. అపుడు శ్రీపాదులు, "మండోదరి మహా పతివ్రత. ఆమె వాలికి భార్యగా ఉన్నపుడు శరీరాణువులు వేరు. రావణాసురుని భార్యగా ఉన్నపుడు శరీరాణువులు వేరు. విభీషణునకు భార్యగా ఉన్నపుడు శరీరాణువులు వేరు. ఆత్మ నిర్వికారమైనది కనుక దేనితోను  సంగమం ఉండదు కనుక అది నిత్యశుద్ధము, అత్యంత పవిత్రము," అని వివరించారు. నేను కొంచెంసేపు ఆలోచించి, "అయితే బహు భర్తృత్వం కూడా అంగీకరించాలా? అని ప్రశ్నించాను. దానికి వారు, "ధర్మ విరుద్ధమైన బాంధవ్యాలు ఏర్పడినపుడు ఆసురీ శక్తులు విజృంభించి అవాంతర కులాలు ఏర్పడుతున్నవి. అందువల్ల అసుర ధ్వంసం చేయవలసి ఉంది. అందరు విధిగా కులగోత్రాలు, వర్ణాశ్రమ ధర్మాలను పాటించాలి. కాని దివ్యాత్మల విషయం వేరు. వాటికి ఒకటే ఆత్మ ఉంటుంది. ఆత్మ పురుషరూపంలో ఆవిర్భవిస్తే ఆ ఆత్మయొక్క శక్తి స్త్రీ రూపంలో

ఉద్భవిస్తుంది. అటువంటి వారిది దివ్యదాంపత్యం అనబడుతుంది,” అని చెప్పి నా వైపు తిరిగి, “నీవు ఒకే సమయంలో వేదాంతశర్మ అనే బ్రాహ్మణునిలా, బంగారయ్య అనే చర్మకారునిలా జన్మించావు. అలాగే నీ స్త్రీశక్తి ఒకే సమయంలో నీ ముగ్గురి భార్యలవలె, ఇటీవల మీ ఇంట్లో మరణించిన గోవువలె, బంగారమ్మ అనే పేరుతో బంగారయ్య అనే ఆ చర్మకారుని భార్యవలెను జన్మించింది. చనిపోయిన ఆ ముగ్గురి భార్యల చైతన్యం, చనిపోయిన ఆ గోమాత చైతన్యం ప్రస్తుతం బంగారమ్మలో లీనమయి ఉన్నాయి. **చైతన్యం ఇలా మూడు నాల్గు శరీరాలలో విభాజితం అయినపుడు ప్రతి శరీరం తనది ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం అనుకుంటుంది. కాని ఏ శరీరం మరణించినా దానికి సంబంధించిన చైతన్యం సజీవంగా ఉన్న మూలచైతన్యంలో విలీనం అవుతుంది. ఇదే సృష్టి రహస్యం.** కాబట్టి నీ శక్తి స్వరూపం అయిన బంగారమ్మని నీ భార్యను చేసుకో. కాకపోతే ఆమె శరీరం ఈ జన్మలో బంగారయ్యకు ధారాదత్తం అయ్యింది. కాబట్టి ధర్మవిరుద్ధం కాకుండా, ఆమెనుండి ఏ శరీరసుఖం కోరకుండా సంసారం నిర్వహించు. బంగారమ్మ తన చర్మం ఒలిచి నాకు చెప్పులు కుట్టి ఇస్తాను, అన్నది. నేను సరే అన్నాను. గోమాత మరణించి ఆ చర్మంతో నాకు చెప్పులు కుట్టడం జరిగింది, గోమాతలోని చైతన్యం కూడా ఆమెదే కాబట్టి, ఆమె అన్న మాట నిజమైనట్లేకదా!” అని చెప్పి గోష్ఠికి వచ్చిన వాళ్ళని ఉద్దేశించి, “మీ ఆంతర్యం నాకు తెలుసు, మమ్మల్ని కులంనుండి వెలివేయాలని మీ సంకల్పం. మీరు నన్ను ఏమి చేయగలరు? నేనే ఈ వేదాంతశర్మని కులబహిష్కృతుని చేస్తున్నాను. నీవు ఈనాటి నుండి బంగారయ్యగా వ్యవహరించెదవు గాక!” అని తమ తీర్మానం వ్యక్తం చేసారు. అందరు చూస్తుండగానే ఒక జ్యోతి స్వరూపం నాలో కలిసి పోయింది. అపుడు వారు, “మీ కళ్ళ ఎదుటే బంగారయ్య ఆత్మజ్యోతి ఈ శర్మలో కలిసిపోయింది. ఇప్పుడు ఇతడు బ్రాహ్మణుడా? చండాలుడా? మీరే నిర్ణయించండి,” అని

ప్రశ్నించి వారిని ధర్మసంకటంలో పడవేసి ఇంకా ఇలా చెప్పారు:

**పరివర్తనా పద్ధతులు**

"నేను చతురాశ్రమ ధర్మాలు సక్రమంగా నిర్వర్తింపబడాలని, అష్టాదశవర్ణాలవారు సుఖసంతోషాలతో జీవించాలని చెప్తున్నాను. మీ ధర్మకర్మలని సరిగా నిర్వహించండి. అలా కాని పక్షంలో కష్టాలకు గురి అయి, అస్తవ్యస్త జీవనం గడపాల్సి ఉంటుంది. చక్కటి మార్పు రావాలంటే రెండు రకాల పద్ధతులు ఉన్నాయి. సరిచేసుకోవడం మొదటి పద్ధతి. ఇది వ్యక్తుల అంతర్మనసులో కలిగే భావం. కాబట్టి, మార్పు సహజంగా సరళంగా ఎవరి ప్రమేయం లేకుండా జరిగిపోతుంది. రెండవది సరిచేయబడటం. అయితే ఇది కొంచెం బలవంతమైన పద్ధతి. కనుక దీనికి కొంత కాలవ్యవధి ఇవ్వబడుతుంది. ఆ నిర్ణీత సమయంలో మారకపోతే విపరీత పరిణామాలు ఎదుర్కోవాల్సి వస్తుంది. మీరు రెండవ దశలో ఉన్నారు. కాబట్టి ఇప్పుడు మీరు సరియైన నిర్ణయం తీసుకొనకపోతే వినాశాన్ని ఆహ్వానించడమే అవుతుంది. వినాశంచేసి అయినా సరే నేను ధర్మస్థాపన చేస్తాను," అని నిష్కర్షగా మాట్లాడారు. నేను విధిలేని పరిస్థితులలో బంగారమ్మను వివాహం చేసుకొని భార్యగా స్వీకరించి ఇక్కడ నివసిస్తూ మాతంగిని సేవిస్తూ జీవిస్తున్నాను. శ్రీపాదులు ఒకసారి కురుంగడ్డకి పోతూ మా ఆశ్రమానికి వచ్చి మమ్మల్ని ఆశీర్వదించి, నేను వచ్చే జన్మలో తిరిగి బ్రాహ్మణునిలా, బంగారమ్మ శూద్రకన్యలా జన్మిస్తుందని, మా ఇద్దరి వివాహం జరిగి మాకు సంతానం కలుగుతుందని, మా సంతానం కురుంగడ్డలో వారిని సేవిస్తారని చెప్పారు. కాలాంతరంలో శంకరభట్టు, ధర్మగుప్తులు ఇటువైపుగా వస్తారని, వారివద్దనుండి అందెలు తీసుకొని తమ పాదుకలను వారికి ఇమ్మని ఆదేశించారు." ఇంతవరకు చెప్పిన వేదాంతశర్మ మాతంగీదేవిని గురించి వివరిస్తూ, "మేము ఆరాధించేది **మతంగముని కన్యక అయిన మాతంగీదేవి. ఆమెను రాజమాతంగి, కర్ణమాతంగి అని కూడా పిలుస్తారు.** ఈ దేవి

**ఆరాధన వల్ల విశేష దాంపత్య సౌఖ్యం లభిస్తుంది,"** అని చెప్పి ఒకసారి శ్రీపాదులు రాజమాతంగి రూపంలో దర్శనమిచ్చి వారిని ధన్యులను చేసారని కూడా చెప్పి వారి కథ ముగించారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 37వ అధ్యాయం

# స్త్రీ - పురుషతత్త్వాల శుద్ధి

# (ఛిన్నమస్తాదేవి)

## ఛిన్నమస్తాదేవి ఉపాసన

మేము ఆ దంపతులు ఇచ్చిన పాదుకలను తీసుకొని మా ప్రయాణం కొనసాగిస్తూ మార్గమధ్యంలో ఒక అడవిలో చెట్టుకింద విశ్రమించాము. కొందరు యోగినులు అక్కడకు వచ్చి, మమ్మల్ని చూసి, 'అది దేవభూమి అని, తాము ఛిన్నమస్తాదేవిని ఉపాసించడానికి అక్కడకు వచ్చామని, ఆ సమయంలో మగవారు దరిదాపుల్లో ఉండకూడదని, వచ్చినవాళ్ళు ప్రాణాలతో బయటకు పోరని,' హెచ్చరించారు. ఇంతలో యోగినీమాత వచ్చి మమ్మల్ని ఉండనిమ్మని, మాకు చీర, రవిక ఇమ్మని వాళ్ళని ఆదేశించారు. మా బట్టల్ని ప్రజ్వలింపచేసిన అగ్నిగుండంలో పడేసారు. వారిచ్చిన చీరలని ధరించిన వెంటనే మా శరీరాలలో పూర్తిగా మార్పులు జరిగి మేము స్త్రీలలా మారిపోయాము. మమ్మల్ని వాళ్ళు శంకరమ్మ, ధర్మమ్మ అని పిలవడం మొదలు పెట్టారు. మాకు మాంసాహారం, మద్యం



ఇచ్చారు. వాళ్ళు బుట్టలో  పెట్టుకొని తెచ్చిన ఛిన్నమస్తాదేవిని ఒక ప్రత్యేక స్థానంలో ఉంచి దాని చుట్టు తిరుగుతూ భయాన్ని కలిగించే నృత్యం చేసారు. ఇటువంటి ఒక పూజ ఉంటుందని మేము కలలో కూడా ఊహించ లేదు. యోగినీమాత ఇలా విశదీకరించారు, **"కబంధం (తల లేని మొండెం) మార్పులు చెందుతూ ఉండే ఈ జగత్తుకి అధిపతి అయిన శక్తికి ప్రతీక. ఆ శక్తినే ఛిన్నమస్తాదేవి అంటారు.** అర్ధరాత్రి

సమయంలో ఛిన్నమస్తాదేవి ఉపాసన చాలామంచి ఫలితాలను ఇస్తుంది. శత్రువులపై విజయానికి, రాజ్యప్రాప్తికి, దుర్లభమైన మోక్షప్రాప్తికి ఈ మాతను ఉపాసించాలి. ఆమె తన శిరస్సును ఖండించుకున్నా సజీవంగానే ఉన్నటువంటి దేవి. దీన్నే పరిపూర్ణ అంతర్ముఖత్వం అంటారు."

**శంకరమ్మ - ధర్మమ్మల బలి**

మాకు ఇదంతా వింతగా, భయానకంగా ఉంది. ఇంతలో అర్ధరాత్రి అవడంతో దేవికి మమ్మల్ని బలి ఇవ్వాలని తలచి, మా మెడలో వేపాకులు కట్టారు, నుదుట పెద్దబొట్లు పెట్టారు. కత్తితో మా శిరస్సులు ఖండించారు. మా రక్తాన్ని ఆ యోగినీగణం పానం చేసారు. మా తలలు ఒక వైపు, మా మొండాలు ఒకవైపు పడి ఉన్నా, మేము చైతన్యంతో ఉండి విపరీతమైన బాధని అనుభవించాము. ఇంతలో మాకు మగత కమ్మింది. ఏదో ప్రకాశం మా వైపు వస్తుండటం, ఈ యోగినీ గణాలు గాలిలో కలిసిపోవడం ఒకేసారి జరిగాయి. మా శిరస్సులు, మొండాలు తిరిగి అతికించబడ్డాయి. తెల్లవారుఝామున మేము మామూలుగా నిద్రనుండి మేల్కొన్నట్లుగా లేచాము. మెల్లగా మా స్త్రీ లక్షణాలు పోయి, తిరిగి పురుషులం అయ్యాము. ధరించడానికి అక్కడ కొత్త బట్టలు కూడా ఉన్నాయి. మేము ఆ బట్టలను ధరించి బయలుదేరాము.

**చైతన్యాల పవిత్రీకరణ**

ఇంతలో ఒక బాటసారి కలిసి, "అయ్యలారా! ప్రతి శరీరంలోను స్త్రీ, పురుషతత్వాలు రెండూ ఉంటాయి. నిన్న జరిగిన యోగప్రక్రియ ద్వారా మీలోని స్త్రీతత్వం పరిశుద్ధి చేయబడింది. ఈ రెండు చైతన్యాలు శుద్ధి అయితేనే కాని విశ్వచైతన్యంలోని శక్తి శరీరాలలోకి ప్రవహించదు. ఇప్పుడు మీకు అవసరమైనంత యోగశక్తి విశ్వచైతన్యం నుండి మీకు లభిస్తుంటుంది. ఎంతో కష్టం మీదకాని తెరచుకోని సుషుమ్నామార్గం మీకు శ్రీపాదుల దయవల్ల తెరచుకుంది. ఇంతకంటే మీకు ఏం కావాలి? ఇంతటి అదృష్టాన్ని మీకు కలిగించినది మీ దగ్గర ఉన్న శ్రీచరణుల పాదుకలే," అని చెప్పి వెళ్ళిపోయాడు. మా శరీరాలు ఇపుడు దివ్య చైతన్యంతో

అనుసంధానమై ఉన్నాయి అన్న భావనే మాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. **ఆహా! శ్రీపాదుల అనుగ్రహ వృష్టి ఉన్నచోట ఏది అసాధ్యం?** అని అనుకుంటూ ఆశ్చర్యానందాలను ఒకేమారు అనుభవిస్తూ, ఆ విశ్వప్రభువుల నామామృతపానం చేస్తూ ముందుకు సాగాము.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 38వ అధ్యాయం

# బైరాగి కథనం (బగళాముఖీ)

# (శ్రీపాదులకు 14 ఏళ్ళు)

### బగళాముఖీ ఆవిర్భావం

మాకు దారిలో రావిచెట్టు కింద కూర్చున్న ఒక బైరాగి కన్పించారు. ఆయన ముఖం ఎంతో తేజోవంతంగా ఉంది. వారు మమ్మల్ని, "మీరు శంకరభట్టు, ధర్మగుప్తులేనా?" అని అడిగి మేము ఔనని చెప్పడంతో, 'మీ దగ్గర ఉన్న పాదుకలను నాకు ఇచ్చి నా దగ్గరున్న కాలనాగమణిని తీసుకో'మని చెప్పారు. తరువాత తాము బగళాముఖీ ఉపాసకుడనని చెప్పి ఆదేవి గురించి ఇలా వివరించారు, **"బగళాముఖీ దేవి దశమహా విద్యలలో ఒకటి. ఈ దేవి ఆరాధన వలన వాక్సిద్ధి కలుగుతుంది.** సత్యయుగంలో సమస్త జగత్తును నాశనం చేసేంత తుఫాను వచ్చింది. విష్ణుమూర్తి చింతాక్రాంతుడై జీవులను రక్షించడానికి తపస్సు చేసారు. శ్రీవిద్యామహాదేవి బగళాముఖీ రూపంలో దర్శనమిచ్చి, ఆ భయంకరమైన తుఫానుని



స్తంభింపచేసింది. **మంగళవారం చతుర్దశి అర్ధరాత్రి ఈమె ఆవిర్భవించింది.** సాధకుని జీవితంలో అల్లకల్లోలం లేపే దుష్ట శక్తులని, అంధశక్తులని స్తంభింపచేసి సాధకుని పురోగతికి తోడ్పడుతుంది. విష్ణువు, పరశురాముడు ఈ దేవి ఉపాసకులలో ముఖ్యులు," అని చెప్పి పీఠికాపురంలో తమ అనుభవాలని చెప్పడం మొదలుపెట్టాడు:

"నేను నా తీర్థయాత్రలలో పీఠికాపురంలోని కుక్కుటేశ్వరాలయానికి

వెళ్ళాను. అక్కడ ముద్దులు మూటగట్టే మూడేళ్ళ బాలుడు కనిపించి **తాను చాలా కాలం నుండి ఈ మధ్య కాలంవరకు స్వయంభూదత్తుడి పేరుతో లోపల బందీయై ఉన్నానని, అర్చకులు శీతలోపచారాలు సరిగా చేయడానికి తిరస్కరించడంతో బయటకు వచ్చేసానని చెప్పాడు. నాకు వారు దత్తులని, కర్మఠులైన బ్రాహ్మణులు అస్పృశ్యులను లోనికి రానీయకపోవటంవల్ల ఖిన్నులై** ఆర్తులను రక్షించడానికి స్వయంగా అవతరించారని తెలిసింది. నేను వారి ని బగళాముఖీ రూపంలో దర్శనమిమ్మని అడిగాను. శ్రీపాదులు ఆ దేవి రూపంలో దర్శనమిచ్చారు.

**పీఠికాపురం - అపప్రథల నిలయం**

ఆ మహాతేజస్వరూపిణిని చూడగానే ఎనిమిది రోజులు ఒళ్ళు తెలియని బ్రహ్మానందస్థితిలో ఉండిపోయాను. ఊరిలో నేనొక క్షుద్ర మాంత్రికుణ్ణని, ఏదో ప్రయోగం ద్వారా కుక్కుటేశ్వరుని, స్వయంభూదత్తుని శక్తిని అపహరించబోయానని, కాని పూజారుల నియమనిష్ఠల వల్ల అది బెడిసికొట్టి, మూర్ఛలో పడి ఉన్నానని వదంతులు పుట్టి అర్చకస్వాముల ప్రాముఖ్యత పెరిగిపోయింది. అర్చకస్వాములతో విశేష పూజలు చేయించుకొన్నట్లయితే అరిష్టాలన్ని తొలగిపోయి ఇతోధిక శ్రేయస్సు కలుగుతుందనే ప్రచారం ఉధృతం అయ్యి, పీఠికాపుర వాస్తవ్యులు వేలం వెర్రిగా అర్చకస్వాములతో పూజలు చేయించుకోవడం మొదలు పెట్టారు. అర్చకులకు పెద్ద మొత్తంలో దక్షిణలు దొరకసాగాయి. అయితే ఇంటికి తెచ్చుకున్న ధనం తెల్లవారేసరికి మాయం అయ్యేది. అందరికి అర్చనలు చేయించడానికి ఒప్పుకొని కష్టపడి పూజలు చేయించడమే అవుతుంది తప్ప వారికి ఫలితం శూన్యంగా ఉంది. మనసువిప్పి వారి గోడు ఎవ్వరితోనూ చెప్పుకోలేరు. ఎందుకంటె, ఈ విషయం కనుక బయటికి పొక్కితే కొత్తగానూ, అపురూపంగానూ దొరుకుతున్న వాళ్ళ గౌరవం దెబ్బ తింటుంది. వాళ్ళ ఇబ్బంది ఇలా ఉండగా, నా విషయం పెద్ద చర్చనీయాంశం అయ్యింది. ఈ

బైరాగి బ్రతికి ఉన్నాడా? మరణించాడా? దహనం చేస్తే మంచిదా? చేస్తే బైరాగి శక్తులు ఇంకా విజృంభిస్తాయా? అనే మీమాంసలో మొత్తానికి నా శరీరాన్ని దహనం చేయడం జరగలేదు. ఇదంతా శ్రీపాదుల విచిత్ర లీల.

ఎనిమిదవ రోజు నేను స్పృహలోకి వచ్చాను. బ్రాహ్మణులు ఎవ్వరు భిక్ష ఇవ్వకపోవడంతో నన్ను గొల్లవారివాడలో ఉంచారు. అందులో ఒక గొల్లవనిత పేరు లక్ష్మి. ఆమెకు ఇటీవలే వైధవ్యం సంప్రాప్తించింది. శ్రేష్ఠిగారి ఇంటి ఆవు వట్టి పోవడంతో లక్ష్మి వారి ఇంటికి పాలు తీసికొని వెళ్ళేది. శ్రేష్ఠిగారి ఇంటిలో శ్రీపాదులు ఈ పాలను తాగుతుండేవారు.

**పురాణపండితుని కథ**

ఇంతలో ఊరిలోకి పురాణం చెప్పే ఒక పండితుడు వచ్చాడు. పురాణాలన్ని వాళ్ళకి తెలిసినవే కాబట్టి అవి కేవలం శూద్రుల కోసమే అని, వాళ్ళు పురాణశ్రవణం చేసి పండితునికి దక్షిణ ఇవ్వాలని బ్రాహ్మణులు నిర్ణయించారు. అతనికి బాపనార్యుల ఇంటిలో భోజనం ఏర్పాటు చేసారు. పురాణ ప్రవచనం ముందు లక్ష్మి అతనికి పాలు కాచి ఇచ్చేది. ఆ పురాణ పండితుడు మహాజ్ఞాని, మహాయోగి. అతడు తన యోగశక్తివల్ల తన ఆత్మ ధరించిన ఇతర రూపాలు తెలుసుకొని వాటిని తనలోకి ఆకర్షించుకున్నాడు. ఇక్కడ జమిందారు ఇంట్లో నాల్గునెలల పసిబాలునిలో తన ఆత్మ ఉందని, ఆ ఆత్మయే మరుజన్మలో లక్ష్మికి భర్త అవగలదని యోగదృష్టితో కనిపెట్టాడు. మరణానంతరం, లక్ష్మి భర్త ఆత్మ మూలతత్త్వమైన పురాణ పండితునిలో లీనమయ్యిందన్న విషయం సర్వజ్ఞులైన శ్రీపాదులకి తెలుసు. అయితే ఆ పండితుడు తనకు ఉన్న కర్మ ఋణానుబంధాలు తీర్చుకొని, అలాగే తన ఆత్మ ధరించిన ఇతర రూపాలను తనలో ఆకర్షింప చేసుకొని భగవంతునిలో లీనమవ్వాలని నిశ్చయించుకున్నాడు. అలా అయిన పక్షంలో, వచ్చే జన్మలో లక్ష్మికి భర్త కావలసిన జమీందారు కొడుకు– ఆ పసికందు మరణించి, ఆ జన్మలో లక్ష్మి బ్రహ్మచారిణిగానే జీవించాల్సి ఉంటుంది. కాని,

లక్ష్మి మరుజన్మలో బ్రహ్మణుల ఇంట్లో పుట్టాలని, ఈ జన్మలోని భర్తయే మరుజన్మలో కూడా తన భర్తగా రావాలని తీవ్రంగా కోరుకుంటున్నది.

**కర్తవ్య బోధ**

పురాణ ప్రవచనం ముగిసాక శూద్రుల దగ్గర సంభావనలు తీసుకోవడం వల్ల వాళ్ళతో తనకున్న ఋణానుబంధం తీరిపోయిందని, అలాగే బాపనార్యుల ఇంట్లో భోజనం చేయడం వల్ల బ్రాహ్మణ జన్మకి సంబంధించిన ఋణానుబంధం తీరిందని ఆ పండితుడు లెక్కలు వేసుకుంటున్నాడు. బాపనార్యులవద్ద సెలవు తీసుకొని వెళ్ళబోతుంటే శ్రీపాదులు అతనితో, "నాయనా! ఈ లక్ష్మి అమాయకురాలు. ఇంక కొంత కాలమే జీవిస్తుంది. నీవు ఆ జమీందారు కొడుకు నుండి చైతన్యం తీసివేస్తే మరుజన్మలో బ్రాహ్మణిలా పుట్టే లక్ష్మి గతి ఏమిటి? నేను ఈమెను ఆశీర్వదించి, మాంగల్యం కూడా సృష్టించి హిరణ్యలోకంలో ఉంచాను. అందువల్ల, ఋణానుబంధం తెంచుకొనకుండా ఈమె దగ్గర సువర్ణ దానం స్వీకరించి, వచ్చే జన్మలో ఆదర్శదంపతులై జీవించండి," అని దీవించారు. ఈ విధంగా జమీందారు కొడుకుయొక్క అకాల మృత్యువు, తమ భక్తురాలైన లక్ష్మికి మరుజన్మలో కన్యగానే ఉండిపోవాల్సిన రాత రెండింటిని విచిత్రంగా తప్పించారు, ఆ జగత్ ప్రభువులు. వారి లీలలు అద్భుతములు, అనూహ్యములు కదా!

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

## 39వ అధ్యాయం

## నాగమణి మహత్యం (త్రిపురభైరవి)

## (శ్రీపాదులకు 15 ఏళ్ళు)

### నాగేంద్రశాస్త్రితో నాగులపై గోష్ఠి

మేము కాలనాగమణిని తీసుకొని మా ప్రయాణం సాగించాము. దారిలో నాగేంద్రశాస్త్రి అనే ఒక బ్రాహ్మణుడి ఇంట్లో ఆగాము. వారి ఇంట్లో నాగుపాములు వాళ్ళ సంతానంలా స్వేచ్ఛగా తిరుగుతున్నాయి. అవి ఎవరికి హాని కలిగించవు. దివ్యనాగులకు పడగపై మణి ఉంటుంది. దానిని సంపాదించాలని వారు ఎన్నో ఏళ్ళు నాగోపాసన చేశారట. వారు ఇలా చెప్పడం మొదలు పెట్టారు, "శ్రీపాదులకు 15 సంవత్సరాల వయసులో నేను పీఠికాపురం వెళ్ళాను. అక్కడ స్వయంభూదత్తుని మెడలో ఒక కాలనాగుని, దానిపై మణిని చూసాను. నాగమణికి మన జీవితంలోని ఎన్నో అరిష్టాలను నివారించే శక్తే కాకుండా, అంగారకగ్రహంతో సంబంధం ఉన్న అన్ని దోషాల ను పోగొట్టే శక్తి కూడా ఉంటుంది. ఆ మణిని చూసాక దానిని ఎలాగైనా సంపాదించి, జీవితంలో అభివృద్ధి సాధించాలని నిశ్చయించుకున్నాను.

### నాగదోషశాంతి

నేను నరసింహవర్మగారి ఇంటిమీదుగా వెళ్తూ, వర్మగారు చెట్లకు బోదెలు చేయడం, శ్రీపాదులు వాటికి నీళ్ళు పోయడం చూసాను. ఇంతలో వర్మగారికి ఔదుంబర వృక్షం కింద రాగి పాదుకలు కన్పించాయి. వాటిని కొబ్బరినీళ్ళతో కడిగి ప్రభువుల పాదాల దగ్గర పెట్టారు. శ్రీపాదులు నన్ను, "నాగేంద్రశాస్త్రీ!" అంటూ పిలిచి, "నీవు నాగమణి కావాలని కోరుకుంటున్నావు. ఈ పాదులకను తీసుకొని వీటిని పూజిస్తూ ఉండు. నాగులు వాటి మణులతో ఏ స్వామిని ఆరాధిస్తాయో ఆ ప్రభువుని నేనే. ఈ దివ్య పాదుకలని అర్చించి, ఆ తీర్థం ఇచ్చినట్లయితే వ్యాధిగ్రస్తుల రోగాలు తగ్గిపోతాయి. సర్పదోషాలు హరించుకుపోతాయి. కాలాంతరంలో శంకరభట్టు, ధర్మగుప్తులు నీ వద్దకు వచ్చినపుడు ఈ పాదుకలను వారికి ఇచ్చి, వారివద్ద నుండి కాలనాగ మణిని తీసుకో," అని చెప్పి, **"నాగదోషాన్ని**

**శాంతింప చేయడానికి పూజలు చేసేటప్పుడు పుట్టింటివారి సొమ్ము, లేదా మేనమామల సొమ్ము కొంతైనా ఆ పూజకి అయ్యే ఖర్చులో కలపాలని, లేకపోతే ఫలితం ఉండదు,"** అని చెప్తూతూ దాని వెనుక ఉన్న కారణాన్ని ఈ విధంగా వివరించారు:

"పూర్వం శుంభనిశుంభుల అత్యాచారాలవల్ల పీడితులైన దేవతలు హిమాలయాలకు వెళ్ళి హైమవతీదేవిని స్తుతించారు. గౌరీదేవి శరీరం నుండి కౌశికి అనే దేవత ఆవిర్భవించింది. దీనితో పార్వతీదేవి శరీరం నలుపుగా మారి కాళీమాతగా ప్రసిద్ధి చెందింది. మళ్ళీ గౌరిగా మారాలనే భావన రావడంతో కాళి అంతర్ధానం అయ్యింది. పరమేశ్వరుడు ఆమె జాడ తెలియక నారద మహర్షిని అడుగగా, దేవి సుమేరుపర్వతానికి ఉత్తర దిశలో ఉందని చెప్పారు. శివుని ఆజ్ఞ మేరకు నారదుడు పార్వతీదేవి వద్దకు వెళ్ళి ఆమెను శివుని వివాహమాడమని కోరాడు. ఆ ప్రస్తావనకు కోపించి పార్వతి ఛాయారూపిణి త్రిపురభైరవిగా మారింది. ఈ క్రోధావేశాలకు కాలాన్ని శాసించే కాలనాగులు కారణాలు. కనుక, విష్ణుస్వరూపుడినైన నేను శివుని త్రిశూలంతో నాగమణులను సృష్టించి అవి కాలనాగులు ధరించేలా వరమిచ్చాను. అంతేకాక హైమవతి నా చెల్లెలు కాబట్టి, నా చెల్లెలి కోసం నాగమణులని సృష్టించాను కాబట్టి, నాగసర్పదోష నివారణకి పుట్టింటి వారి సొమ్ము తృణమో, పణమో ఖచ్చితంగా ఉండాలని నిబంధన చేసాను," అని శ్రీపాదులు తనకు వివరించారని చెప్పాక తమ అనుభవం ఇలా తెలిపారు.



**నాగేంద్రశాస్త్రి కథ**

నేనీ స్థలంలో ఆశ్రమం కట్టుకొని, నా దగ్గరకు వచ్చిన వారికి ధర్మాన్ని బోధిస్తూ, పీడితుల బాధలను తొలగిస్తూ జీవితం గడుపుతున్నాను. ఇంతలో

నా భార్య మరణించింది. అప్పుడే ఒక మంగలివాని భార్య పాముకాటుతో మరణించింది. నేను నా నాగవిద్యతో పామును రప్పించి విషం తీయించాను. కాని, మంగలి భార్య ఆ శరీరంలోకి రావడానికి ఇష్టపడక ప్రాణమయ జగత్తులో స్వేచ్ఛగా ఉండాలని, జనులను ఆవహించి వాళ్ళని బాధించి తాను ఆనందం అనుభవించాలని సంకల్పించుకొన్నది. మంగలి తన భార్యను బతికించమని ప్రాధేయపడటంతో వాడి భార్య శరీరంలో నా భార్య ఆత్మ ప్రవేశపెడ్తానని, కాని, ఆమెను తల్లిలా చూడాలని చెప్పాను. అతడు అంగీకరించడంతో నా భార్య ఆత్మని వాని భార్య శరీరంలో ప్రవేశపెట్టాను. కాని మంగలివాని భార్య మహా దుష్టురాలు, గయ్యాళి అవడంతో ఆ శరీరంలోని నాడులన్ని దోషభూయిష్ఠమై ఉండటంవల్ల ఆ శరీరంలో ప్రవేశించిన నా భార్యకు విపరీతమైన బాధ, కంపరం పుట్టసాగాయి. ఆ శరీరాన్ని వదిలి వెళ్తానని పదేపదే నా భార్య ప్రాధేయ పడుతుండేది. ఆమె తరచూ నన్ను కలుసుకుంటూ ఉండటం వల్ల నాకు మంగలివాని భార్యతో అక్రమ సంబంధం ఉన్నదని, కాబట్టి నన్ను కులంనుండి వెలి వెయ్యాలని, మంత్ర – తంత్రాలలో నాకు వచ్చే సంపాదనలో ముప్పాతిక భాగం మంగలివానికి నష్టపరిహారంలా ఇవ్వాలని, మంగలి కులపెద్దలు తీర్పు ఇచ్చారు. పురుగు మీద పుట్రలా మంగలివాని భార్య ఆడవాళ్ళ వంటిమీదకు వచ్చి 'తాను మరణించిన శాస్త్రిగారి భార్యనని, తన భర్త చేసే అన్యాయాన్ని అరికట్టమని, అలా కాని పక్షంలో నన్ను, ఆ మంగలి కాంతని హత్య చేస్తానని' బెదిరించడం మొదలుపెట్టింది. దిక్కు తోచని నేను శ్రీపాదులని శరణు వేడాను. "భర్తవి అయినంతమాత్రాన నీ భార్యని మంగలివాని భార్య శరీరంలో ప్రవేశించమని ఆజ్ఞాపించడం ఉచితం కాదని," నన్ను మందలించి, బాధితులకు ప్రతిఫలాపేక్ష లేకుండా సేవ చేయమని బోధించి, విచిత్రంగా మంగలివాని భార్య తిరిగి మరణించేలా, ఆ శవాన్ని దహనం చేసేలాంటి పరిస్థితులను కల్పించి నా భార్య ఆత్మకు విముక్తి కలిగించారు ఆ జగత్ప్రభువులు.

# 40వ అధ్యాయం

# భాస్కరశాస్త్రితో బహుముఖగోష్ఠి

## (శ్రీరాజరాజేశ్వరిదేవి)

### భాస్కరశాస్త్రితో భేటీ

మేము వీలునుబట్టి వివిధ ప్రయాణ సాధనాల ద్వారా ప్రయాణం చేస్తూ త్రిపురాంతకం అనే పుణ్యక్షేత్రం చేరాము. ప్రభువుల పాదుకలు మాతో ఉండటంతో వారు మాతోపాటు ప్రయాణం చేస్తున్నట్లు, మమ్మల్ని వారే ముందుకు నడిపించుతున్నట్లు, మేము మాట్లాడే మాటలు కూడా వారే పలికిస్తున్నట్లు మాకు ఒక వింత అనుభూతి కలుగుతుండేది. త్రిపురాంతకంలోని అర్చకస్వామి భాస్కరశాస్త్రి 'పీఠికాపుర వాస్తవ్యులు, శ్రీషోడశీరాజరాజేశ్వరి ఉపాసకులు. వారికి శ్రీపాదులు కలలోనే శ్రీరాజరాజేశ్వరిదేవి మంత్రదీక్షను ఇచ్చారట. మేము శ్రీచరణుల పాదుకలను వారి పూజా మందిరంలో ఉంచాము. వెంటనే ఆ పాదుకల నుండి దివ్యవాణి వినిపించింది.

### శ్రీపాదుల దివ్య భవిష్యవాణి

"నాయనలారా! మీరెంతో ధన్యులు. భాస్కరశాస్త్రి ఈ పాదుకలను కొంతకాలం పూజించిన తరువాత ఈ రాగి పాదుకలు బంగారు పాదుకలుగా మారిపోతాయి. మహాపురుషులు కొందరు వీటిని హిరణ్యలోకం, కారణలోకం తీసికొని పోయి అర్చనాదికాలు చేసిన తరువాత మహాకారణలోకంలో ఉన్న నా దగ్గరకు తీసుకొని వస్తారు. నేను వాటిని ధరించి ఈ మూడు లోకాల సిద్ధులను, మహాపురుషులను ఆశీర్వదించాక వాటికి దివ్యతేజోమయ సిద్ధి కలుగుతుంది. తరువాత వీటిని సిద్ధపురుషులు స్వర్ణ విమానంలో తీసుకొని వెళ్ళి శాస్త్రోక్తంగా నా జన్మస్థలంలో భూమికి 300 నిలువు లోతున ప్రతిష్ఠిస్తారు. యోగదృష్టి కలవారికి మాత్రమే ఈ స్వర్ణ పీఠికాపురపు ఉనికి తెలుస్తుంది. సరిగ్గా ఈ స్వర్ణ పాదుకలకు పైన పీఠికాపురంలో నా పాదుకలు

ప్రతిష్ఠింపబడుతాయి.” దివ్యవాణి చెప్పిన విషయాలు విని మేమెంతో ఆనందించాము.

### శ్రీరాజరాజేశ్వరీదేవి

తరువాత మేము భాస్కరశాస్త్రిని రాజరాజేశ్వరీదేవి గురించి తెల్పమని ప్రార్థించాము. “రాజరాజేశ్వరిదేవి మన మనస్సుకు, ఇచ్ఛకు పైన ఉన్న విశాలమైన సీమలో ఆసీనురాలై ఉంటుంది. ఆలోచించే మన మనస్సు సాధారణంగా మేధాశక్తిగా మారుతుంది. ఆ మేధాశక్తిని వివేకవంతం చేయడానికి ఈ దేవి సహాయం చేస్తుంది. **సాధారణంగా శక్తి, వివేకం కలిసి ఉండవు. కాని రాజరాజేశ్వరీదేవి శక్తితో కూడిన వివేకాన్ని, వివేకయుతమైన శక్తిని ప్రసాదిస్తుంది. రాజరాజేశ్వరీశక్తిని పెంపొందించుకున్న సాధకులు తమ వివేకబలంతో విరోధిశక్తులను నిర్మూలించగల్గుతారు.** ఆమె దృష్టిలో అందరూ తన బిడ్డల. అసురులను, రాక్షసులను, పిశాచాలను కూడా తన బిడ్డలుగానే పరిగణిస్తుంది. ఆమె శక్తికి జ్ఞానమే కేంద్రం. అందువల్ల ఆమె అనుగ్రహం కలిగితే సత్యబోధ కలుగుతుంది. నేను శ్రీపాదుల దయకు పాత్రుడనైనందున నాకు రాజరాజేశ్వరీ దీక్షలో సఫలత ప్రాప్తించింది,” అని దేవి గురించి వివరించి శ్రీపాదులు ఎలా పీఠికాపురం నుండి సంచారానికి బయలుదేరారో తరువాత చెప్తానని, మేమిద్దరం అక్కడకు చేరే ముందే శ్రీపాదులు రాజరాజేశ్వరి రూపంలో దర్శనమిచ్చి తాను చేసిన పులిహోర కొద్దిగా స్వీకరించారని, శ్రీపాదులు సాక్షాత్తు మహాసరస్వతీ, మహాలక్ష్మి, మహాకాళీ, రాజరాజేశ్వరీ స్వరూపులని చెప్పి ఆ ప్రసాదాన్ని మాకు కూడా ఇచ్చారు. తరువాత మేము ముగ్గురం ధ్యానస్థులం అయ్యాము.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

# 41వ అధ్యాయం

# దత్తదీక్షా ప్రహసనం

# (శ్రీపాదులకు 16 ఏళ్ళు)

**వాక్కుల భేదాలు**

పరా, పశ్యంతీ ఆదిగాకల వాక్కులని వివరించమని నేను భాస్కరశాస్త్రిని కోరాను. 'బయటకు వినబడే వాక్కు **స్థూలవాక్కు.** బయటకు ఏ మాత్రమూ వినిపించకుండా లోలోపలనే ఉంటూ పెదిమల కదలికలోనే కనిపించే వాక్కు **మధ్యమ.** దీనికంటె సూక్ష్మంగా ఉండేది **వైఖరీ.** వాక్కు కంఠగతమై అంటే గొంతులోనే ఉండిపోయి బయటకు రాకుండా మనసులో మెదలుతుంటే అది **పశ్యంతీ.** దీనికంటె సూక్ష్మంగా నాభిలోనే సంకల్పమాత్రంగా ఉండే వాక్కును **పరావాక్కు,'** అంటారని వివరించారు.

**త్రిపురసుందరి**

అంబికను త్రిపురసుందరిగా ఆరాధించుతారని చెప్పుతూ గుణత్రయాలు, జగత్రయాలు, అవస్థాత్రయాలు, మూర్తిత్రయాలు మొదలైన అన్ని త్రయాలకు ఆమె అధీశ్వరి అని, పరిపూర్ణమైన శ్రద్ధతో, ఆత్మ సమర్పణ చేసుకొని సంపూర్ణ శరణాగతి చెందితే ఈ లోకం నుండి కాని, మనకంటికి కనిపించని లోకాలనుండి కాని ఎటువంటి శతృత్వం ఎదురయినా, పరోక్షంగా ఉంటూ మనకు ఏ కీడు జరగకుండా కాపాడుతుందని, వ్యక్తి ఆధ్యాత్మికంగా చక్కటి పురోగతి సాధించినట్లయితే భౌతిక ప్రపంచంలో ఏ రకంగా జీవిస్తున్నాడో అదేవిధంగా అదృశ్య లోకాలలో కూడా జీవించగల్గుతాడని చెప్పారు. అభివృద్ధి సాధించాలంటే ముఖ్యంగా శ్రద్ధ, దానితోపాటు దృఢమైన విశ్వాసం ఉండాలి. **ఈ సృష్టికి అధిపతి అయిన పరమాత్మని, వారి తత్త్వాన్ని, సర్వజ్ఞతని, సర్వవ్యాపకత్వాన్ని పూర్తి నమ్మకంతో అంగీకరించగలిగితే దాన్ని 'శ్రద్ధ' అంటారు. అవసరమైన వేళలో తప్పకుండా**

**పరమాత్మ యొక్క సహాయం అందుతుంది అనే స్థిరమైన భావననే 'విశ్వాసం' అంటారు. ఈ రెండు  స్థిరంగా ఉన్నప్పుడు ఆధ్యాత్మిక ప్రగతి పథంలో పయనించడం, పరిణతిని పొందడం ముమ్మాటికి నిశ్చయం. శ్రద్ధ, విశ్వాసంలాగే జ్ఞానం, శక్తి కూడా పరస్పరం ఆధారంగాను, ఆధేయంగాను ఉంటాయి. శక్తిహీనమైన జ్ఞానం నిర్లిప్తతను కలిగిస్తే, జ్ఞానహీనమైన శక్తి విచక్షణారహితమై వినాశానానికి దారి తీస్తుంది.** అందువల్ల జ్ఞానంతో ప్రకృతి బంధాలనుండి ముక్తుడై, విచక్షణాయుతమైన శక్తితో పరిపూర్ణత సాధించాలి, అని వివరించారు.

**దత్తదీక్ష**

అటు తరువాత ఏ పరిస్థితులలో శ్రీపాదులు పీఠికాపురం వదిలి వెళ్ళారో కూడా చెప్పసాగారు, "ఒకసారి దత్త భక్తుడైన ఒక సన్యాసి కుక్కుటేశ్వరాలయానికి వచ్చాడు. తాను దత్త దీక్షను ఇస్తానని, ఒక మండలం (40) రోజులు దత్తదీక్షను పాటించినట్లయితే అనుకున్న పనులు జరిగి తీరుతాయని ప్రకటించాడు. పీఠికాపుర బ్రాహ్మణులందరు దత్త దీక్షను స్వీకరించి వారికి పెద్ద మొత్తంలో దక్షిణ ఇవ్వసాగారు. అందులో కొంతభాగం ఆయన తిరిగి వారికే ఇవ్వసాగాడు. ఈ బ్రాహ్మణులు మిగిలిన కులస్థులను కూడా దత్తదీక్ష తీసుకొని ఆ సన్యాసికి భారీయెత్తున దక్షిణలనిచ్చి జన్మ చరితార్థం చేసుకోమని బోధించసాగారు. ఈ విషయమై బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య పరిషత్తులు బాపనార్యుల  అధ్యక్షతన సమావేశమయ్యాయి. అందులో 'దత్తుడు అందరివాడు, అందువల్ల అన్ని కులాల వాళ్ళు దీక్ష తీసుకోవచ్చు,' అని బాపనార్యులు ప్రకటించారు. కాని బ్రాహ్మణులు అందుకు అంగీకరించక, శూద్రులు అనాచారవంతులు కాబట్టి వారికి దీక్ష ఇవ్వకుండా, కేవలం దక్షిణ మాత్రం తీసుకొని వాళ్ళని తమ శక్తితో ఉద్ధరిస్తామని వాదించారు.  'అనాచారవంతులు అన్ని కులాల్లోను కొద్దో గొప్పో ఉంటారు. ఆ రకంగా దీక్ష లేకుండా ఉద్ధరించ గలిగే పక్షంలో ఏ

కులం వారికి ప్రత్యేక దీక్షలు అక్కరలేదు. అయినా భూరి దక్షిణ అని చెప్పి వ్యక్తులను బలవంతపెట్ట కూడదు. అన్ని కులాల్లోను బీదవారు ఉంటారు. యథాశక్తితో సంతోషంగా ఇచ్చే దక్షిణతోనే దత్తుడు ప్రసన్నుల వుతారు.' అని బాపనార్యులు అభిప్రాయం వెలిబుచ్చారు. దక్షిణలలో, సంభావనలలో భాగం పంచుకుంటున్న బ్రాహ్మణులు వాళ్ళ వితండవాదం విడవకుండా, 'పరమహంస పరివ్రాజక మహాశయులవంటివారు మన ఊరు వస్తే మేళతాళాలతో, వేదమంత్రాలతో, పూర్ణ కుంభాలతో ఎదురు వెళ్ళి స్వాగతం ఇవ్వకపోగా దక్షిణ విషయంలో వెనకాడడం భావ్యం కాదని," చెప్పి బాపనార్యులను, అప్పలరాజశర్మగార్లను దీక్ష తీసుకొని దక్షిణ ఇస్తారా? లేదా? అని నిష్కర్షగా ప్రశ్నించారు. వారు నిజంగా పరమహంస పరివ్రాజకులంత వారే అయితే ఊరికి రావడానికి ముందే వర్తమానం పంపడంలాంటి కొన్ని పద్ధతులు అనుసరించి ఉండాల్సిందని, బ్రాహ్మణ పరిషత్తు అనేది సామూహిక సపమస్యలు, ప్రయోజనాల గురించి ఆలోచించాలే కాని వ్యక్తిగత శ్రేయస్సు గురించి పట్టించుకోకూడదని, తాము వ్యక్తిగత శ్రేయస్సు కోసం దత్తదీక్ష తీసుకోవడం తమ అభిమతం కాదని, అయితే తక్కినవాళ్ళు వారి అభీష్టం ప్రకారం దత్తదీక్ష తీసుకోవచ్చ'ని బాపనార్యులు తేల్చి చెప్పారు.

## వెంకయ్యకు దత్త దీక్ష

ఊళ్ళో వెంకయ్య అనే పంటకాపు శ్రీపాదులవారి భక్తుడు. ఆ రోజు గురువారం. శ్రీపాదులు స్వయంగా వెంకయ్య ఇంటికి వచ్చి దీక్ష తీసుకోలేక పోతున్నందుకు నిరాశపడవద్దని, మండలదీక్ష అవసరం లేదని, ఏకరాత్రి దీక్ష చాలని యథాశక్తి దక్షిణ ఇవ్వవచ్చని వాళ్ళకి సాంత్వన చెప్పి వెంకయ్యతోపాటు అష్టాదశ వర్ణాలవారికి తామే స్వయంగా దీక్ష ఇచ్చి ఆశీర్వదించారు. ఆ రోజంతా వాళ్ళ ఇంట్లోనే గడిపి, వారితో భజనలు

చేయించి, తానే దత్తుడినని, తమను స్మరిస్తేనే చాలు ప్రసన్నులమై వారి కోరికలు తీరుస్తామని అభయమిచ్చారు.

## శ్రీపాదుల ప్రస్థానం

ఆ మరునాడు శుక్రవారం. శ్రీపాదులు మొదట వర్మగారింటికి, తరువాత బాపనార్యుల ఇంటికి వెళ్ళారు. అక్కడ వారికి మంగళ స్నానం చేయించి, పాలు, పండ్లు మొదలైనవి తినడానికి ఇచ్చారు. తాము సాక్షాత్తు దత్తుడనని, తమను భక్తులు పిలుస్తున్నారని, లోకాన్ని ఉద్ధరించే కార్యక్రమం చేపట్టడానికి తాము పీఠికాపురం వదిలి వెళ్తున్నామని తెలియజేసారు. అక్కడనుండి తమ ఇంటికి వెళ్ళారు. అక్కడ తల్లితండ్రులు వివాహ ప్రస్తావన తేగా తాము తాతగారికి, వర్మ, శ్రేష్ఠిగార్లకు ఎన్నోమార్లు అనఘాలక్ష్మీసమేతులై దర్శనం ఇచ్చామని, వివాహ ప్రసక్తి ఎత్తినట్లయితే తాము ఇల్లు వదిలి వెళ్ళిపోతామని ఇదివరకే చెప్పానని గుర్తుచేసి తమ అనఘాలక్ష్మీ సమేత దివ్య భవ్య రూపంతో వాళ్ళకి దర్శనం ఇచ్చారు. సుమతీ, రాజశర్మలు నిశ్చేష్టులై చూస్తూ ఉండగానే తమ అమృతస్పర్శతో అన్నలిద్దరి అంగవైకల్యాన్ని పోగొట్టారు.

### ప్రభువుల ఋణానుబంధం

ఇంతలో బాపనార్యుల, వర్మ, శ్రేష్ఠిగార్ల కుటుంబ సభ్యులంతా రాజశర్మగారింటికి వచ్చారు. శ్రీపాదులు అందరితో కులాసాగా కబుర్లు చెప్పుతుండగా సుమతి, “నాయనా! అన్ని బాకీలు తీర్చుకొని వెళ్ళుతున్నావు. కాని మల్లాది వారి, వర్మగారి, శ్రేష్ఠిగారి పాలఋణం తీర్చుకోలేవు,” అని అన్నారు. అపుడు శ్రీచరణులు, “అమ్మా! నీవు చెప్పినది నిజమే. ఈ మూడు వంశాలపై నా అనుగ్రహం ఎప్పుడూ ఉంటుంది. నీ పుట్టింటివారి ప్రతి తరంలోను వారి ఇంట భోజనం చేస్తాను. వారు నన్ను మేనల్లునిగా భావించి వాత్సల్య దృష్టితో చూస్తారని నాకు తెలుసు. కాబట్టి నేను కూడా

ఈ మానవీయ బాంధవ్యానికి మన్నన ఇస్తూ వాళ్ళతో బుద్ధిమంతుడైన మేనల్లునిలా ప్రవర్తిస్తాను. ఇంతకంటె నీకు ఏం కావాలి?" అని తల్లికి సమాధానం చెప్పి తండ్రితో, "నాన్నగారూ! నా అన్నలిద్దరూ మంచి వేదపండితులు అవుతారు. శ్రీధరశర్మ సమర్థరామదాసుగా జన్మించి ఛత్రపతి శివాజీగా జన్మించే వర్మగారికి గురుత్వం వహిస్తాడు. రామరాజశర్మ శ్రీధరుడనే పేరుతో మహా యోగిగా ప్రసిద్ధి పొందుతాడు," అని అభయం ఇచ్చారు. తరువాత వేదపఠనం జరుగుతుండగా శ్రీపాదులు అంతర్హితులు అయ్యారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 42వ అధ్యాయం

## దిగంబరా! దిగంబరా!శ్రీపాదవల్లభ దిగంబరా!

### హతాశులైన పురవాసులు

మధ్యాహ్నం భోజనాలు అయ్యాక భాస్కర పండితులు ఇలా చెప్పారు, "శ్రీపాదవల్లభులు శూద్రుల ఇంటిలో దత్త దీక్ష ఇవ్వడం, పూజాదికాలు లేకుండా భక్తుల చేతికి తోరాలు కట్టడం, తానే దత్తుడనని ప్రకటించడం శాస్త్ర విరుద్ధం అని బ్రాహ్మణులు తలచి బాపనార్యులను రాజశర్మను వెలివేయాలని తీర్మానించారు. కాని అకస్మాత్తుగా శ్రీపాదవల్లభులు అంతర్ధానం అవడంతో ఈ విషయం ప్రధాన చర్చనీయాంశం అయ్యింది. ఎన్నోమార్లు శ్రీపాదులే దత్తప్రభువులని నిరూపణ జరిగినా మళ్ళీ మొదటికే వచ్చిన బ్రాహ్మణులు, "16సంవత్సరాలు నిండని బాలుడు తానే దత్తుడనని ప్రకటించడం దైవద్రోహం కాదా?" అంటూ మళ్ళీ అదే దోషాన్ని ఇంకొకసారి వేలెత్తి చూపించారు. కొంతమంది బ్రాహ్మణులు కడుపులో కపటం ఉంచుకొని, పైకి సానుభూతి ప్రకటించడానికి బాపనార్యుల ఇంటికి వెళ్ళారు. ఆశ్చర్యంగా అక్కడ ఎవ్వరూ విచారంగా లేకపోగా 'దత్తుడు మా ఇంట్లో శ్రీపాదునిలా తిరుగాడుతూ మా జన్మ ధన్యం చేసాడు,' అంటూ ఎంతో ఆనందం ప్రకటించడంతో బిత్తరపోయి అక్కడ నుండి మిగిలిన మూడు ఇళ్ళకు వెళ్ళారు. కాని మూడు చోట్లా ఇదే పరిస్థితి ఎదురవడంతో బిక్క చచ్చిపోయి కుక్కుటేశ్వరాలయంలోని బైరాగి దగ్గరికి వెళ్ళి సంగతి అంతా పూస గుచ్చినట్లు చెప్పారు. బైరాగి పై ప్రాణం పైనే పోయింది. ఏదో ఒక దైవం పేరు కాకుండా తన ఉపాస్యదైవం దత్తుడు తానే అని శ్రీపాదులు చెప్పడంతో, అదే నిజమైనట్లయితే తనకు కష్టాలు ఖాయం అని, దత్తులు విచిత్రస్వభావులు, కష్టాలు కలిగించి, వినోదం చూసి, సంపూర్ణ శరణాగతి పొందితే కాని ఉద్ధరించరు అని, ఇక్కడ ఇంత ధనం సంపాదించడం దత్తుడి కరుణ అని అనుకున్నాను. కాని కరుణ వెనకాల తన కోసమే ఏదైనా

ప్రత్యేకమైన శిక్ష కేటాయించారా? అని విచారించడం మొదలు పెట్టాడు. తాను ధనకాంక్షతోనే ఈ దీక్షా కార్యక్రమం మొదలుపెట్టాడే తప్ప, తన వద్దకాని, ఆ బ్రాహ్మణుల వద్ద కాని ఏ ఆధ్యాత్మిక శక్తి లేదు. దీక్ష తీసుకున్న వాళ్ళ కోరికలు ఫలిస్తే తమకు గొప్పతనం ఆపాదించుకొనవచ్చు. అలాకాని పక్షంలో ఉపాసకుల భక్తి శ్రద్ధలలో, విశ్వాసంలో లోపమని వారిపై తప్పు నెట్టవచ్చు. ఈ కపట ప్రణాళిక శ్రీపాదుల రూపంలో ఉన్న దత్తులకి తెలిసి చిత్రమైన చిక్కులు కల్పించరు కదా, అని ఒకవైపు భయంతో ఇంకొక వైపు పశ్చాత్తాపంతో లోలోపలే కుమిలి పోసాగాడు.

## విచిత్ర శిక్షా విధానం

ఇంతలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు ఆలయానికి వచ్చి తన పేరు నరసింహఖాన్ అని, కాశ్యప గోత్రీకుడనని, దత్త దీక్ష కోసం మరాఠా దేశం నుండి వచ్చానని చెప్పాడు. ఆయన బొడ్డు దగ్గరున్న వరహాలమూటని చూసేసరికి బైరాగికి అంతకు ముందు ఏర్పడిన పశ్చాత్తాపం, భయం స్థానంలో మళ్ళీ ధనాశ చిగురించింది. వెంటనే దీక్షా కార్యక్రమాన్ని చేపట్టి అందులో ఒక భాగంగా బ్రాహ్మణుని చేయి చాపమని చెప్పి కమండలం నుండి అతని చేతిలో నీళ్ళను పోస్తుండగా, "అనేక సంవత్సరాలనుండి నీవు సంపాదించిన పుణ్యం అంతా నాకు ధారపోసావు, నేనిది పీఠికాపురానికి దత్తం చేస్తున్నాను," అని ప్రకటిస్తూ ఆ బ్రాహ్మణుడు అదృశ్యం అయ్యాడు. అయితే ఆ బైరాగి నీళ్ళు పోస్తుండగా నీటితోపాటు ఒక తేలు కూడా క్రింద పడింది. అది ఎవరో ఒక బ్రాహ్మణుని కుట్టింది. పాపం, అతనికి ఎన్ని తేలు మంత్రాలు వేసినా బాధ తగ్గకపోగా నోట్లోంచి నురగ రావడంకూడా ప్రారంభమయ్యింది.

## మూఢాః పరప్రత్యయనేయ బుద్ధిః

కమండలం నుండి తేలు పడటం చూసిన ఒక బ్రాహ్మణుడు

తేలుకాటు పాముకాటుగా మారడం కొండజాతి వారికి మాత్రమే తెలిసిన తాంత్రిక ప్రయోగం అని, ఆ విద్య తెలిసిన బైరాగి దాన్ని ఆ బ్రాహ్మణుని మీద ప్రయోగించాడని, ఆ విద్య ప్రకారం దెయ్యం నీళ్ళ నుండి మొదట తేలులా వచ్చి, కరిచాక పాములా మారి, ఆ తరువాత మళ్ళీ దెయ్యంలా మారిపోతుందని, అలా మారిన క్షణమే తేలు కుట్టిన వ్యక్తి పిచ్చిగా గంతులు వేయడం ప్రారంభిస్తాడని, ఇక ఆ దెయ్యం తనని ప్రయోగించిన వ్యక్తి ఇష్టాన్ని బట్టి అందరి ఇళ్ళలోనూ జొరబడి ధనం దొంగిలించి వాడికి ఇస్తుందని చెప్పి తన వైదుష్యాన్ని ప్రదర్శించాడు. ఇంతలో తేలు కుట్టిన వ్యక్తి బాధ భరించలేక గెంతడం మొదలు పెట్టేసరికి ఆ మహాజ్ఞాని వాణి సత్యమై అందరూ నివారణోపాయం కూడా అతన్నే అడిగారు. ప్రతి ఒక్క ఇంటిముందు, 'ఓ దయ్యమా! రేపు రా' అని బొగ్గుతో వ్రాసి ఉంచినట్లయితే అది చదివిన దయ్యం ఆ రోజు పోయి మరునాడు వస్తుందని, అదే వ్రాత కనిపించడంతో మళ్ళీ రేపు వద్దామని తలచి వెళ్ళిపోతుందని, ప్రతిరోజూ ఈ రకంగా మోసగిస్తూ దాని బెడద తప్పించుకోవచ్చని చెప్పాడు. ఈ సూచనను ఆమోదించి వీళ్ళు వాళ్ళు అన్న భేదం లేకుండా అందరు ఉరుకులు పరుగులు తీస్తూ వెళ్ళి తమతమ ఇళ్ళ ముందు 'ఓ దయ్యమా! రేపు రా' అనే ఆహ్వాన పత్రిక వ్రాసి ఉంచారు.

### మంత్రాక్షతలు

ఇక్కడ ఆలయంలో తేలు కుట్టిన వ్యక్తి దగ్గరకు ఒక పంటకాపు వచ్చి తమ కులపెద్ద వెంకయ్య తనకు శ్రీపాదులు ఇచ్చిన మంత్రాక్షతలను ఆ బ్రాహ్మణునికి ఇవ్వాలని నిశ్చయించుకున్నారని దానివల్ల అతను స్వస్థుడు కాగలడనే వార్తని అందించాడు. ఏ క్షణంలోనైనా దయ్యంలా మారి పోతానేమో? అని భయపడుతున్న ఆ బ్రాహ్మణుడు 'వెంకయ్య లాంటి సౌమ్యుడు ఈ విధంగా కబురు పంపాడంటే బహుశా ఇదే దీనికి విరుగుడై ఉండవచ్చు,' అని భావించి శూద్రుడైన వెంకయ్యనుండి అక్షతలు తీసుకొని

నిశ్చింతగా ఇంటికి వెళ్ళాడు.

**దత్త దిగంబరా! దత్త దిగంబరా ! శ్రీపాదవల్లభ దత్త దిగంబరా!**

ఇక ఆ బైరాగి విషయంలోకి వస్తే, ఇటువంటి క్షుద్ర మాంత్రికుని వద్ద మన సొమ్ము దక్షిణ రూపంలోనైనా సరే ఉంచకూడదు అని నిర్ధారణ చేసిన పీఠికాపురవాసులు అతని వద్ద ఉన్న ధనం మాత్రం లాక్కొని, దయ తలిచి దేహశుద్ధి చేయకుండా ఊరునుండి వెళ్ళగొట్టారు. ఆ ధనంతో బాపనార్యుల సలహా మేరకు అష్టాదశవర్ణాల వారికి అన్నసంతర్పణ జరిగింది. పీఠికాపురంలో మొదటిసారిగా 'దత్త దిగంబరా! దత్త దిగంబరా! శ్రీపాదవల్లభ దత్త దిగంబరా!' అనే దివ్యనామ సంకీర్తన ఎంతో శ్రావ్యంగా వినిపించుతూ ఊరంతా మధురంగా ప్రతిధ్వనించింది.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 43వ అధ్యాయం

## జగన్మాత వివిధ రూపాలు

### శ్రీపాదుల తత్త్వం

ఆనాడు రాత్రి తమ ఆరాధన, పూజాదికాలు ముగించుకొని భాస్కరపండితులు శ్రీపాదుల తత్త్వం గురించి వర్ణించ సాగారు, "పరమాత్ముడు (పిపీలికాది బ్రహ్మ పర్యంతం) చీమనుండి మొదలు బ్రహ్మ వరకు అన్ని జీవరాసులలో ఉంటారు. అయితే **శ్రీపాదులు మాత్రం తాము పిపీలికంగాను, బ్రహ్మగాను ఉన్నానని అంటారు. అంటే ప్రతి జీవరాశి చైతన్యంలో తాదాత్మ్య స్థితిలో ఉన్నానని, సృష్టిలో సృష్టి రూపంతో ఉన్నానని వారి భావం.** మహాసరస్వతి, మహాలక్ష్మి మొదలైన రూపాలు నేనే అనడంలోని అంతరార్థం కూడా ఇదే. వారు ఆయా చైతన్యాలలో విలీనమై ఉంటారన్న మాట. అలా ఉన్నప్పటికి ఏ స్థితిలోనూ ఏ జీవికి వారి స్పర్శ అనుభవం కాదు. ఇది ఈ అవతార విశిష్టత. అనఘాలక్ష్మీ సమేత అనఘుడు వారి అర్ధనారీశ్వర రూపం. అయితే శ్రీపాదులు ఈ అవతరణలో యతీశ్వరునిగా ఉన్నారు. సగుణ, సాకార అవతారాలు ఎత్తినపుడు వాటికి సంబంధించిన మర్యాదలను విధిగా పాటించాలి. ఇది ధర్మ సూక్ష్మం. కాగా ఈ అవతారంలో తల్లి, తండ్రి కూడా వారే కాబట్టి భక్తునికి అనుగ్రహం త్వరగాను, విశేషంగాను లభిస్తుంది. శ్రీపాదులకు జప-తపాలు చేయవలసిన అవసరం లేదు. అయినా ధ్యానం, జపం, తపస్సు చేసి ఆ ఫలితాన్ని సృష్టికి ధారాదత్తం చేస్తారు. తమ తపఃఫలంతో భక్తులను కర్మబంధ విముక్తులను చేస్తారు.

### మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళీ, రాజరాజేశ్వరీ

జగన్మాత యొక్క - మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళీ, రాజరాజేశ్వరీ మొదలైన నాలుగు రూపాలు విశ్వ పరిపాలన కోసం ఆవిర్భవించాయి. జగన్మాతకు 3 స్థాయిలు ఉన్నాయి.

1. అతీతస్థాయి, అంటే సృష్టి జరగడానికి ముందున్న స్థాయి,

అవ్యక్తమైన స్థాయి;

2. విశ్వస్థాయి, అంటే సృష్టింపబడిన జీవులనందరిని తనలో వహిస్తున్న స్థాయి;

3. వ్యక్తిస్థాయిలో ఆమె మానవ వ్యక్తిత్వానికి, దివ్య ప్రకృతికి మధ్యవర్తిగా ఉండి శీఘ్ర పరిణతికి ప్రేరణను, సహాయాన్ని అందచేస్తుంది. ఇదే అనఘాలక్ష్మి అవతరణలోని ముఖ్య ఉద్దేశం. ఈ తల్లి మూడు విభిన్న లోకాలలో మూడు విభిన్న భూమికలలో ఉంటుంది. పరార్ధగోళాలలో అనంతమైన స్థితి, శక్తి, అనందం నిండిన లోకాలున్నాయి. ఇక్కడి జీవులు చక్కటి పరిపూర్ణతతో, ఏ మార్పులు లేని ఏకత్వంతో జీవిస్తుంటారు. ఇక్కడ ఆమెది విశ్వచైతన్య భూమిక. అంటే సత్, చిత్, ఆనందం, అంటే శాశ్వతమైన సత్యం, అఖండ జ్ఞానం, ఆనందం మిళితమైన భూమిక; ఈ లోకాలకు కింద స్థాయిలో దేవి దివ్య చైతన్య సృష్టికి చెందిన లోకాలున్నాయి. ఇక్కడ అనఘాలక్ష్మీ దివ్యచైతన్య మహాశక్తిగా ఉంటుంది. ఇక్కడ ప్రతి ప్రక్రియలో ఇచ్ఛా, జ్ఞానశక్తులు ప్రయత్నం లేకుండానే పరిపూర్ణతను పొందుతాయి. అఖండమైన ఆనందమే తప్ప ఇక్కడ దుఃఖం, అసత్యం, బాధ అనేవే ఉండవు.

దీనికి కింద మన లోకంలో అజ్ఞానభూమిక ఉన్నది. ఇక్కడి అనుభవాలన్ని అపరిపూర్ణతకు, వైఫల్యానికి, పరిమితులకు లోబడి ఉంటాయి, అని చెప్పి తరువాత జగన్మాత యొక్క నాలుగు రూపాలు, వాటిలోని బేధాల గురించి ఇలా చెప్పారు: "కాళీ అనేది విధ్వంసక శక్తి. కష్టాలు చుట్టుముట్టిన సంఘర్షణలో ప్రతిదానిని ఛిన్నాభిన్నం చేస్తూ పోయే అజ్ఞానంలోని ప్రకృతిశక్తి ఆమె. అయితే మహాకాళి ఉన్నత భూమికకు చెందినది. ఆమె సాధారణంగా బంగారు రంగులో కనిపిస్తుంది. ఆమె అసురులకు భయంకరి. రాజరాజేశ్వరి వివేకానికి ప్రతినిధి. అయితే మహాకాళి బలానికి, శక్తికి ప్రతినిధి. **కాళిశక్తిలోని ప్రచండమైన తీవ్రత,**

**ఆవేశం దైవంమీదనే కాలుమోపేంత వరకు వస్తే కాని తగ్గదు. సంఘర్షణ, వినాశంతో ఆమె ఆగిపోతుంది. కాని మహాకాళి నిరోధక శక్తులను నాశనంచేసి సాధకుడు ప్రగతి మార్గంలో పయనించేలా తోడ్పడుతుంది.** ఇక మహాలక్ష్మి పరిపూర్ణమైన పరిపూర్ణతకు ప్రతీక, అంటే వివేకం, సౌందర్యం, బలం అన్ని సమ పాళ్ళలో పరిపూర్ణంగా ఉంటాయి. మహాలక్ష్మి పరమప్రేమ, ఆనందాలకు అధిదేవత. లక్ష్మి భౌతిక వస్తు సంచయానికి మాత్రమే ప్రతీక. అయితే మహాలక్ష్మి భౌతిక వస్తు సంచయం, భౌతిక శక్తులు, భౌతిక జీవులు వీటిని దివ్యానంద సామరస్యానికి అనుకూలంగా మలిచి, దివ్య జీవనాన్ని ప్రసాదించగల మహాశక్తి.

ఇక సరస్వతీమాతను ఉపనిషత్తులలో ఉద్గీత అని, దశమహావిద్యలలో మాతంగి అని వర్ణించారు. అయితే దివ్యనైపుణ్యానికి, ఆత్మ చైతన్యకర్మలకు మహాసరస్వతీ ప్రతీక. ఈ మహాతల్లి అనుగ్రహం వలన మనకు కర్మలను నిర్వహించడంలో నేర్పు వస్తుంది. దివ్య జ్ఞానాన్ని ఎలా ఉపయోగించాలో, ఆత్మ చైతన్యాన్ని జీవితానికి ఎలా అన్వయించాలో, అనేక శక్తుల సామరస్యత వలన సంతోషం ఏ రకంగా కలుగుతుందో తెలుస్తుంది. అనఘాలక్ష్మిలో రాజరాజేశ్వరి, మహాలక్ష్మి, మహాకాళి, మహాసరస్వతి లక్షణాలు పరిపూర్ణంగా ఉంటాయి. రూపం లక్ష్మిలా ఉంటుంది. అలాగే అనఘుని రూపం విష్ణువులా ఉండి, ఆయనలో త్రిమూర్తుల లక్షణాలు పరిపూర్ణంగా ఉంటాయి. కాబట్టి అనఘా సమేత అనఘుని ఆరాధించడం సర్వ శ్రేయోదాయకం. వివిధ దేవతలను ఆరాధించడం వల్ల సర్వశుభాలు కలుగుతాయి. అయితే దత్తారాధనవల్ల ఆయా దేవతలిచ్చే శుభఫలాలు తొందరగా కలుగుతాయి. దత్తుడు సర్వదేవతా స్వరూపుడు, అవతార సమాప్తిలేని మహా అవతారం అవడంవల్ల ఇది సాధ్యం అవుతుంది," అని వివరించి సుఖం, హర్షం, పారవశ్యం, ఆనందం ఇవి వేరువేరు భావాలు, **ఆనందం ఆధ్యాత్మికమైనది, అది పరమేశ్వరునికి సంబంధించిన**

**విషయం, పారవశ్యం యోగికి కలిగే అనుభవం, కోరికలు లేనివారికి కలిగేది హర్షం, స్థూలంగా చూస్తే సుఖం భౌతికమైనది, సాధారణంగా సుఖం అందరికి అందుబాటులో ఉంటుంది. కాని సుఖంయొక్క నిర్వచనం వ్యక్తులను బట్టి మారుతుంటుంది. సుఖంతోపాటు దుఃఖం అనివార్యమని చెప్పారు.** తరువాత నన్ను ఉద్దేశించి, "నాయనా! శంకరభట్టూ! **నీవు వ్రాయబోయే గ్రంథం శాశ్వతమైన, అనశ్వరమైన గురుసార్వభౌముల తత్త్వాన్ని, లీలలను యధాతథంగా చిత్రించే గ్రంథం. దీన్ని భక్తి, శ్రద్ధలతో ఏ భాషలో చదివినా ఒకే రకమయిన చక్కటి ఫలితాలను ఇస్తుంది. ఇందులోని ప్రతి అక్షరం బీజాక్షర శక్తిని కలిగి ఉంటుంది,"** అని నేను వ్రాయబోయే శ్రీచరణుల చరితామృత విశిష్టతని అభివర్ణించారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 44వ అధ్యాయం

# పృథ్వీ - జల యజ్ఞాల వివరణ

## పృథ్వీ యజ్ఞం

ఆ మరునాడు స్నాన, సంధ్యాదులు ముగించాక మేము త్రిపురాంతకేశ్వరుని ఆలయానికి వెళ్ళాము. అక్కడే భాస్కరపండితులు శ్రీపాదుల మహిమ గురించి వివరించడం మొదలు పెట్టారు: "నాయనలారా! శ్రీపాదులు పీఠికాపురంలో అవతరించడం వల్ల అక్కడ భూమి చైతన్యాన్ని పొందింది. వారి మహాసంస్థాన నిర్మాణం తరువాత మెల్లమెల్లగా అక్కడ భూమి జాగృతమై భూమండలాన్ని అంతా జాగృతం చేస్తుంది. ఇలా జాగృతమైన ప్రదేశాలలో ఉన్న జనులు శ్రీపాదుల దివ్యాకర్షణ శక్తి వల్ల పీఠికాపురానికి ఆకర్షింపబడుతారు. ప్రభువు సంచరించిన ప్రదేశాలన్ని కూడా జాగృతిని చెందుతాయి. వారి శరణాగతిలోకి వెళ్ళినవారు అప్రయత్నంగానే ఆయా స్థలాలకు ఆకర్షింపబడుతారు. ఇంతేకాదు, ప్రతి జీవిలోను[14] పృథ్వీతత్వం ఉంటుంది. ఏ సాధకుల పృథ్వీతత్వం వారి దివ్య కరుణవల్ల జాగృతం అవుతుందో వాళ్ళు తప్పకుండా ప్రభువులు సంచరించిన పీఠికాపురం, కురువపురం మొదలైన ప్రదేశాలకి ఆకర్షింపబడుతారు. "అయ్యా! పృథ్వీతత్వం జాగృతం అయిన వారందరూ భౌతికంగా ఆయా ప్రదేశాలు దర్శిస్తారా?" అని నేను నా సందేహాన్ని వ్యక్తం చేసాను. దానికి వారు నవ్వుతూ, "భౌతికంగా దర్శించినా, దర్శించ లేకపోయినా, సాధకుల పరిణతి స్థాయిని బట్టి వాళ్ళ చైతన్యం ఆయా ప్రదేశాలతో అనుసంధానం చెంది వాళ్ళు ఆ పురవాసులే అవుతారు. భౌతిక పీఠికాపురం వ్యాపించి ఉన్నంతమేరా స్వర్ణపీఠికాపురం ఉంది. ఇది కేవలం దత్తుని చైతన్యంతో నిర్మితమైనది. చెక్కుచెదరని భక్తి,

---

14. అంశావతార పురుషులు, అవతార పురుషులు జగద్గురువులు పుట్టి పెరిగిన ప్రదేశాలలో, వాళ్ళు సంచరించిన ప్రదేశాలలో వారి నివాస స్థలాలలోని అపవిత్రత వారి ఉనికి వల్లనూ, పాదస్పర్శ వల్ల, వారి పవిత్ర ఉపదేశాల వల్లనూ పూర్తిగా నశించి పునీతం అయ్యాయి. అవుతున్నాయి. ఇదే పృథ్వీ యజ్ఞంగా ఇక్కడ చెప్పబడింది.

శ్రద్ధలవల్ల ఏ క్షణాన సాధకుని చైతన్యం ఈ దివ్య చైతన్యంతో కలుస్తుందో ఆ క్షణం నుండి అతను స్వర్ణపీఠికాపురవాసే అవుతాడు. ఇది చర్మ చక్షువులకు కాక, జ్ఞాన చక్షువులకు, యోగ చక్షువులకు మాత్రమే కనిపిస్తుంది. అలాగే భౌతిక కాశి ఉన్నంతమేరా స్వర్ణకాశి వ్యాపించి ఉంది. నేను కాశీకి వెళ్ళుతున్నాను, అక్కడే నివసిస్తాను అని ఎవరయితే దృఢంగా నిర్ణయం తీసుకొని మానసికంగా తాపత్రయపడుతారో వాళ్ళు భౌతికంగా ఎక్కడ ఉన్నా వాళ్ళకి కాశీవాస ఫలితం తప్పక లభిస్తుంది," అని విశదీకరించారు.

**పంచక్రోశయాత్ర**

"కాశీలో పంచక్రోశయాత్ర చేస్తే మంచిదని చెప్తారు కదా, దీని అంతరార్థం ఏదైనా ఉందా?" అని నేను ప్రశ్నించాను. "నాయనా! **పంచక్రోశ యాత్ర అన్నది భౌతికయాత్ర. కాని ఆధ్యాత్మపరంగా విశ్లేషిస్తే సాధకుడి చైతన్యం అన్నమయ కోశాన్నుండి ఆనందమయకోశం చేరగలిగే యాత్ర** అని చెప్పవచ్చు. అన్నమయకోశంలో తన భౌతికమైన ఉనికి ఆనందిస్తూ శక్తిలేమివల్ల శరీరవ్యాపారంలో ఇబ్బందులు కలగకుండా, దానివల్ల సాధనాపథంలో ఎటువంటి ఆటంకాలు ఎదురవకుండా చూసుకుంటూ ప్రాణాయామ పద్ధతుల ద్వారా ప్రాణమయకోశపు స్థితిని ఆస్వాదిస్తూ, మనోమయ కోశంలో చెలరేగే భావసంచనాలపై నియంత్రణని సాధిస్తూ, విజ్ఞానమయకోశం వరకు వచ్చినట్లయితే ఏది మంచి? ఏది చెడు? అనే వివేకం కలుగుతుంది. కాని ఇక్కడ సాధకుడు చాలా జాగ్రత్తగా వ్యవహరించగలగాలి. ఎందుకంటె ఈ కోశం "నేను, నాది" అనే అహంకారభావాలకు నిలయం. దీనిపై కూడా విజయం సాధించగల్గి చివరగా ఆనందమయకోశాన్ని చేరగలిగితే దివ్యానందస్థితిని పొందగలుగుతాడు. ఈ పంచక్రోశయాత్ర చేయగలిగే శక్తి, ఈ దివ్యానందస్థితి శ్రీపాదుల అనుగ్రహంవల్లనే సుసాధ్యం అవుతుంది.

**జలయజ్ఞం**

గంగామాత కోరికపై శ్రీపాదులు తమ సూక్ష్మ శరీరంతో ప్రతి రోజు

కాశీలోని గంగలో స్నానం చేసేవారు. పాపభూయిష్ఠులైన మానవులు స్నానం చేయడం వల్ల గంగ, కృష్ణ మొదలైన పవిత్ర నదులు కలుషితం అవుతాయి. మహాపురుషులు పుణ్యపురుషులూ చైతన్యస్వరూపులూ కనుక ఆయా నదులందు వారు స్నానం చేసినపుడు వాటిలోని పాపాలు నశించి తిరిగి అవి పుణ్యవంతాలు అవుతుంటాయి. **జీవరాశుల శరీరంలో రస స్వరూపంలో ఉన్న జలతత్వాన్ని శుద్ధి చేయడమే శ్రీపాదుల జలయజ్ఞ స్వరూపం,"** అని వివరించి నా సందేహాన్ని దూరం చేసారు.

**కర్త ఎవరు?**

ఆ తరువాత గ్రంథ రచన విషయంలో నా భయాలని కనిపెట్టి, **"ఈ చరితామృత గ్రంథాన్ని వ్రాయడానికి కాని, అనువదించడానికి కాని యోగ్యత ఉన్నవారిని స్వయంగా ఆయనే ఎన్నుకుంటారు. ఈ గ్రంథాన్ని వ్రాసేటప్పుడుకాని, అనువదించేటప్పుడు కాని గ్రంథకర్త పైన, అనువాదకుల పైన వారి కృపాదృష్టి ప్రసరిస్తూనే ఉంటుంది. కాబట్టి నీవు ఈ గ్రంథాన్ని వ్రాస్తున్నావనేది పైకి కనిపించే ఒక ప్రక్రియ మాత్రమే, వాస్తవానికి వ్రాయించేది వారే శ్రీపాదశ్రీవల్లభులే."** అని నిష్కర్షగా చెప్పారు. "నాలాంటి అల్పజ్ఞునితో ఇంతటి మహత్ కార్యాన్ని చేయించడం ఆశ్చర్యంగాను, ఆనందగాను ఉన్నది," అన్న నా మాటలను విని, **"దత్తుని విధానమే అంత. నిషిద్ధ పదార్థాలతో వ్యాధులను తగ్గించడం, బొత్తిగా ఏమీ తెలియని వారితో మహత్కార్యాలను చేయించడం వారి విధానం, వారికది వినోదం, దివ్యశక్తికి నిదర్శనం కూడా,"** అని దత్త విధానాన్ని వర్ణించారు. ఆ తరువాత ఒక విచిత్ర సంఘటన మాకు వినిపించారు.

**మత్స్యావతార రహస్యం**

"ఒకసారి ఒక సన్యాసి కుక్కుటేశ్వరాలయానికి వచ్చి, కళ్ళు మూసుకొని ప్రార్థన చేస్తుండగా మత్స్యావతారానికి యోగపరమైన అర్థం ఏదైనా ఉందా? అన్న ఆలోచన వారి మనసులో మెదిలింది. సరిగ్గా అదే సమయానికి వర్మ, శ్రేష్ఠిగార్లు శ్రీపాదులను తీసుకొని అక్కడకు వచ్చారు. ఆ సన్యాసిని

చూస్తూనే శ్రీపాదులు, “ఈ చేపలవాడిని ఇక్కడకు ఎవరు రానిచ్చారు?” అని అడిగారు. వారి నోటివెంట ఈ మాట రావడం తడవుగా సన్యాసి శరీరం నుండి చేపల వాసన రావడం మొదలుపెట్టింది. శ్రీపాదులు తీక్షణంగా ఆయనను చూడటంతో అతనికి యోగదృష్టి కలిగి తన శరీరంలోని రక్త నాళాలలోను, విభిన్న ద్రవాలలోను వివిధ కణాలు చేప ఆకారంలో ఉండటం గమనించారు. ఆ చిన్నచిన్న కణాలే శరీరంలో అనేక రకాల అనుభూతులను కలిగిస్తున్నాయని, అలాగే వాసనను గ్రహించ గలిగే, రుచిని పసిగట్టకల్గే కణాలు కూడా చేప ఆకృతిలోనే ఉన్నట్లు గమనించారు. సృష్టి మొదట అంతా జలమయమని, పరిణామ ప్రక్రియలో చేప మొదటి జంతువని, అదే మన శరీరంలోని తత్త్వాన్ని కూడా సూచిస్తుందని, అదే మత్స్యావతార ప్రక్రియ అని వారికి అర్ధమయ్యింది. అతడు శ్రీపాదుల చరణాలు తాకి నమస్కరించాడు. శ్రీపాదుల కరుణావృష్టితో ఆ సన్యాసి శరీరం నుండి సువాసనలు రాసాగాయి. **శరీరంలోని అనుభూతులలో చక్కటి మార్పు వచ్చినట్లయితే అది భౌతికంగా కూడా ప్రకటం అవుతుందని శ్రీపాదులు మౌనంగా బోధించారు. “ఓయీ! మత్స్యావతారం గురించి నీకు తెలిసింది కదా!** కూర్మావతారం దైవీప్రకృతికి, ఆసురీప్రకృతికి ఆధారం. మంథర పర్వతాన్ని కూర్మం మీద ఉంచే దేవదానవులు సముద్రాన్ని మధించారు, కాని కూర్మం మాత్రం అంతర్ముఖంగా ఉంటూ నిశ్చలంగానే ఉండిపోయింది. అదే విధంగా నీవు కూర్మ న్యాయంతో అంతర్ముఖుడవై యోగాభ్యాసం చేయాలి. కర్మబంధం నుండి విడుదల పొందాలి. బహిర్ముఖుడవయ్యావో బంధనాల్లో ఇరుక్కు పోతావు,” అని భోదించారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

## 45వ అధ్యాయం

## శ్రీసాయి అవతరణ

మధ్యాహ్నం భోజనాలు అయ్యాక మా కోరికపై భాస్కర పండితులు శ్రీపాదుల లీలలను మళ్ళీ వర్ణించసాగారు: "శ్రీచరణులు కాశీ మహాపుణ్యక్షేత్రంలో ఎందరికో యోగ, సిద్ధ శక్తులను ప్రసాదించారు. క్రియాయోగాన్ని గృహస్థులకు బోధించడానికి శ్రీశ్యామచరణులు అనే మహా మనీషిని అక్కడ జన్మించవలసినదిగా ఆదేశించానని, వారికి హనుమంతులచే క్రియాయోగదీక్షను ఇప్పించెదనని చెప్పారు. తరువాత వారు బదరికావనం మీదుగా నేపాల్ వెళ్ళి అక్కడ ఒక పర్వతంపైన రామనామ ధ్యానంలో నిమగ్నులై ఉన్న హనుమంతునికి సీతారామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్న సమేతులుగా దర్శనమిచ్చి, 'అనంతకాలం అగ్నిబీజ రూపమైన రామనామాన్ని లెక్కకు అందనన్ని మార్లు జపం చేసి కాలాతీతుడు, కాలాత్మకుడు అయ్యావని చెప్పి కలియుగంలో ఒకమారు అవతరించాల్సి ఉందని, వారు ఇంద్రియ ప్రవృత్తులను శాంతింపచేయగల సమర్థులు అగుటచే **శాయి** అనే పేరుతో విఖ్యాతి చెందుతారని' చెప్పారు. 'అరబ్బీ భాషలో అల్ అనగా శక్తి, అహ్ అనగా శాక్త, శక్తిని ధరించినవాడు. అందువల్ల అల్లాహ్ అనగా శివ శక్తుల సంయుక్త స్వరూపమని, వారు తమ అవతారంలో శివశక్తి స్వరూపమైన అల్లా నామమును స్మరిస్తారని,' కూడా తెలిపారు.

### హనుమ విన్నపాలు

'స్వామి జన్మించిన భారద్వాజ గోత్రంలోనే తాము కూడా జన్మించాలని, అంశావతారంలా కాక దత్తసాయుజ్యంతో మూలావతారంలాగా అవతరించాలని,' తమ కోరికను హనుమ తెలియజేసారు. వెంటనే శ్రీపాదులు కాలపురుషుని పిలిచి, "ఇతనికి నా సాయుజ్యాన్ని ప్రసాదింపదలిచాను. కనుక హనుమలోని చైతన్యాన్ని దానికి అనుగుణంగా మార్చవలసినది," అని ఆజ్ఞాపించారు. ఒక్క క్షణంలో హనుమయొక్క శరీరంలోని జీవాణువులు అన్ని విఘటన చెంది దానిలో నుండి అనసూయా మాత ఆవిర్భవించి, ప్రసవవేదన పడసాగింది. తన కన్నుల ఎదురుగా ఉన్న దత్తుడు తిరిగి తన గర్భంలో జన్మించదలచాడా? అని తల్లి ఆశ్చర్య పడసాగింది. దానికి వారు,

'నీ గర్భమందున్నది హనుమ, వారికి నేను సాయుజ్య స్థితిని ఇస్తున్నాను,' అని సమాధానం చెప్పారు. ఇంతలో అనసూయ ముద్దులు మూటకట్టె మూడు తలల దత్తమూర్తికి జన్మనిచ్చింది. మొదటగా ఆ మూర్తి ఒక సాధారణ పసిపాపడిలా, తరువాత హనుమలా మారిపోయాడు. తమలో లీనమై ఉన్న మహబూబ్ సుభానీ అను మహాజ్ఞానిని వారిష్ ఆలీషా అనే పేరుతో అవతరింప చేస్తామని, వారు గురువై యోగరహస్యాలు బోధిస్తారని, తమనే నిరంతరం స్మరిస్తూ తమ చైతన్యంలో మనస్సును లీనంచేసి ఉన్న గోపాలరావు అనే మహా భక్తుణ్ణి హిందూ ధర్మాన్ని ఉపదేశించడానికి వారికి గురువుగా ప్రసాదిస్తున్నామని, అతడు వెంకటేశ్వర భక్తుడై వెంకూశా పేరుతో వారి సాయిబాబా అవతారంలో గురువు అవుతారని' శ్రీపాదులు హనుమతో చెప్పారు. అపుడు హనుమ సీతతో, "తల్లీ! మీరు ప్రేమతో ఇచ్చిన మాణిక్యహారాన్ని, దానిలో ఎక్కడైనా రామనామం ఉందేమో చూడటానికని నేను విరగకొట్టి, రామనామం లేకపోవడంతో పారేసాను. ఆ అపరాధం మన్నించండి," అని ప్రార్థించారు. దానికి శ్రీపాదులు ఆ మాణిక్యహారమే మాణిక్యప్రభువులనే గురుస్వరూపంగా అవతరిస్తుందని తమ సన్నిధిలో కారణం లేని కార్యం జరగదని విశదీకరించారు.

**కురుంగడ్డ వాసం**

తరువాత శ్రీపాదులు ద్రోణగిరి అని పిలువబడే సంజీవని పర్వతం వద్దకి వెళ్ళి అక్కడి ఋషిపుంగవులతో కొంతకాలం గడిపి, కల్కి ప్రభువు జన్మించే శంబల గ్రామానికి వెళ్ళారు. అక్కడనుండి అనేక దివ్య క్షేత్రాలను దర్శిస్తూ, మహర్షులను ఆశీర్వదిస్తూ గోకర్ణానికి వెళ్ళి అక్కడే మూడు సంవత్సారాలు గడిపి లెక్కలేనన్ని లీలలు చేసారు. తరువాత శ్రీశైలం వెళ్ళి అక్కడ సిద్ధపురుషులను సమావేశపరిచి వారికి దివ్య-జ్ఞానయోగాన్ని బోధించారు. మరికొంతకాలానికి కురుంగడ్డ చేరారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 46వ అధ్యాయం

## అశ్వాల వ్యోమ యానం

మేము ఇచ్చిన శ్రీపాదుల పాదుకలను భాస్కర పండితులు పూజామందిరంలో పెట్టారు. వాటిపైన వేసిన అక్షతలు వృద్ధి పొందసాగాయి. మేమిద్దరం అది చూసి ఆశ్చర్యపడుతుంటే ఆ రోజు ఉత్తరాఫల్గునీ నక్షత్రమని, శ్రీనివాసుల కళ్యాణం ఆ నక్షత్రంలోనే జరిగిందని, తాము సాక్షాత్తు పద్మావతీ సమేత వేంకటేశ్వరులని తెలపడానికే శ్రీపాదులు ఈ లీల చేసారని చెప్పి భాస్కర పండితులు మాకు కొన్ని మంత్రాక్షతలు ఇచ్చారు. మేము మా ప్రయాణం సాగించాము. కొంతదూరం ఎడ్లబండిపై వెళ్ళాం, వాళ్ళకి కొన్ని మంత్రాక్షతలు ఇచ్చాము. తరువాత కొండవీడు వెళ్తున్న గుఱ్ఱపు బండిలో ఎక్కి, వాళ్ళకి కూడా కొన్ని మంత్రాక్షతలు ఇచ్చాము. ఆ బండి ఆసామి వైశ్య ప్రముఖులు అయిన ధనగుప్తులు. కొండవీడులో జరుగబోతున్న కుమారుని వివాహానికి వెళ్ళుతున్నారు. వారు మాతో ఇలా చెప్పారు:

**ధనగుప్తుల అనుభవాలు**

నేనొకసారి వ్యాపారపు పనిమీద పీఠికాపురానికి వెళ్ళాను. అక్కడ శ్రీపాదులను కలిసాను. వారు నాతో, “నీ కుమారుని వివాహ సందర్భంలో మీకు నా ఆశీసులతో అక్షతలు అందుతాయి. ఎవరిద్వారా మీకు అక్షతలు లభిస్తాయో ఆ బ్రాహ్మణునికి 11 వరహాలు దక్షిణగా ఇవ్వండి, అతనితో ఉన్న వైశ్య ప్రముఖుని కుమారునికి మీ కుమార్తెను ఇచ్చి వివాహం చేయండి, వారికి 100 వరహాలు ఇచ్చి కొండవీడులో నిశ్చయ తాంబూలాలు తీసుకోండి,” అని చెప్పారని తెలియజేసారు. ధనగుప్తుల కుటుంబాన్ని కూడా కొండవీడు వివాహానికి ఆహ్వానించారు. అక్కడే ధర్మగుప్తుల కుమారునికి ధనగుప్తుల కుమార్తెతో నిశ్చయతాంబూలాలు జరిగాయి. నాకు 11, ధర్మగుప్తులకి 100 వరహాలు ఇచ్చారు. వజ్రాలకు సంబంధించిన వ్యాపారం కోసం ధర్మగుప్తులు అక్కడే ఉండిపోయారు, నన్ను గుఱ్ఱపుబండిలో విజయవాటికకు పంపి వాళ్ళ బంధువుల

ఇంట్లో బస ఏర్పాటు చేసారు. కృష్ణానదిలో స్నానం చేసి దుర్గాదేవి దర్శనానికి వెళ్ళాను. అక్కడ శ్రీపాదుల దర్శనానికై తహతహలాడుతున్న ఒక వృద్ధ సన్యాసి కలిసారు.



ఈ మారు నేను, ఆ వృద్ధ సన్యాసి పీఠికాపుర ప్రయాణం మొదలుపెట్టాం. దారిలో రాజ్మహేంద్రవరంలో గోదావరిలో స్నానం చేసి మార్కండేశ్వరుని, కోటిలింగేశ్వరుని దర్శించాము. కొద్దిరోజుల ప్రయాణం తరువాత పీఠికాపురం చేరుకొన్నాము. సత్యఋషీశ్వరులైన బాపనార్యుల ఇంట్లో బస చేసి, ఆ నాల్గు కుటుంబాలవారి నుండి, ఇతరుల నుండి శ్రీచరణుల లీలలు ఎన్నో విన్నాం. ఆ లీలల్ని వర్ణించడానికి వేయి నాల్కలున్న ఆదిశేషువుకే సాధ్యం కానపుడు నాబోటి వారెంత? కొన్ని కొన్ని లీలలను మాత్రమే గ్రంథస్థం చేస్తున్నాను.

**గురుసార్వభౌముల లీల**

వేము తిరుగు ప్రయాణానికి బయలుదేరుతున్నప్పుడు, నాల్గు కుటుంబాలవారు మాతోపాటుగా కురువపురం రావడానికి నిశ్చయించుకున్నారు. 18 గుఱ్ఱపుబండ్లను సమకూర్చారు. ప్రయాణం చాలా రోజులు పడుతుంది అని తెలిసినా శ్రీపాదులను చూడబోతున్నాం అనే భావన ముందు ఇది పెద్ద విషయంలా వారికి తోచలేదు. 18 గుఱ్ఱపు బండ్లు ఉన్నట్లుండి ఒక్కసారి నేలమీదకాక ఆకాశంలో పరిగెత్తుతున్నట్లు అనిపించింది. బండ్లు తోలేవాళ్ళతో సహా అందరికి మత్తు ఆవహించింది. మేము తెల్లవారుఝామున బయలుదేరితే మధ్యాహ్నానికల్లా ఒక గ్రామం దగ్గర బళ్ళు ఆగాయి. బండ్లు ఆగడం, మాకు మత్తు వదలడం ఒకేసారి జరిగాయి.

## పంచదేవ్‌పహాడ్‌లో గురువారం దర్బార్

మేము బండ్లు దిగి బాటసారులని, 'అది ఏ ఊరు?' అని అడిగాము. వారది పంచదేవ్‌పహాడ్ అని, ఆ రోజు గురువారం కాబట్టి శ్రీపాదుల దర్బారుకి వెళ్ళుతున్నామని, అక్కడ ఆ మహాప్రభువులు అందరి బాధలను నివారించి, అందరికి కడుపు నిండుగా భోజనాలు పెడ్తారని చెప్పారు. ఇంత తక్కువ సమయంలో మేము అక్కడికి ఎలా చేరామో మాకు అర్థం కాలేదు. మాకు అది కలా? నిజమా? అన్న సందేహం శ్రీపాదులని చూసేంతవరకు దూరం కాలేదు. సుమతీదేవి శ్రీపాదులను కౌగిలించుకొని కన్నీరు పెట్టుకున్నారు. తల్లిని ఊరడిస్తూ శ్రీపాదులు, "అమ్మా! అనసూయమాతతో సమానమైన సాధ్వివి. నిర్గుణ, నిరాకార పరతత్త్వాన్ని బిడ్డగా పొందిన భాగ్యశాలివి. నీవు కంటతడి పెడితే భూమిలో పంటలు పండుతాయా?" అంటూ తమ దివ్య హస్తాలతో ఆమె కన్నీరు తుడిచారు.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



## 47వ అధ్యాయం

## శ్రీపాదుల మాతృభక్తి

శ్రీపాద శ్రీవల్లభ దర్బారులో భోజనం సమృద్ధిగా, అక్షయంగా వస్తూనే ఉంది. అందరం తినగా మిగిలినది కృష్ణా నదిలో జలచరాలకు వేసారు. వాటికి కూడా శ్రీపాదుల ప్రసాదం లభించింది. శ్రీపాదులవారి పనులన్ని అసాధారణంగాను, రోమాంచకంగాను ఉంటాయని శ్రేష్ఠిగారు తెల్పినపుడు, శ్రీచరణులు దానికి జవాబు చెప్తూ, "నానుండి వెలువడే ఒక చిన్న కిరణాన్నే ఈ భూమి తట్టుకోలేదు. అందుకనే నన్ను నేను మాయలో దాచుకుంటూ, అవసరమని తోచినపుడు మాత్రమే లీలలను ప్రదర్శిస్తాను. తాతా! **నేను ఎత్తలేని బరువు, పరిష్కరించలేని సమస్య, ఈయలేని వరము, చేయలేని కార్యము ఈ సృష్టిలో లేవు.** పీఠికాపురం నుండి మిమ్మల్ని ఇక్కడకు ఇలా రప్పించడం చాలా చిన్న విషయం," అని వివరించారు. తరువాత ముగ్గురు అమ్మమ్మలు ప్రేమతో వారికి హల్వా, పెరుగు, వెన్న తినిపించారు. వాళ్ళు శ్రీపాదులను పెళ్ళికుమారుడిగా చూడాలన్న తమ కోరికను వెల్లడించారు. దానికి వారు కల్కి అవతారంగా శంబల గ్రామంలో జన్మించినపుడు సింహళంలో పద్మావతి అనే పేరున జన్మించిన అనఘాలక్ష్మిని వివాహం చేసుకుంటానని, దానిని వాళ్ళు తప్పక చూడగల్గుతారని హామీ ఇచ్చారు. రాజశర్మ, "నాయనా! నీవు దత్తప్రభువని తెలియక ఏదయినా అపరాధం చేసినట్లయితే క్షమించు," అని ప్రార్థించారు. "నాన్నా! నేను మీ బిడ్డను. తండ్రి బిడ్డను క్షమించమని అడగడం ఎంత విడ్డూరం! మీరు వాత్సల్యం కురిపిస్తూ నా అభివృద్ధికి తోడ్పడాలే తప్ప ఇలాంటివి మాట్లాడకూడదు," అని సమాధానపరిచారు.

### దివ్య శిశువులు ఇరువురు

పెళ్ళికొడుకుగా చూడవలసిన కుమారుని యతీశ్వరునిగా చూస్తున్నందుకు కళ్ళనీళ్ళు పెట్టుకున్న తల్లి ధ్యాసను మరలుస్తూ, "అమ్మా! నాకు ఆకలిగా

ఉందని అనసూయామాత దగ్గరకు వెళ్ళితే నాకంటే ముందు ఆ రాక్షసి వాసవి అక్కడ చేరి అమ్మ వద్ద పాలన్నీ తాగేసి, నీవు సుమతీమాత దగ్గరకి తొందరగా వెళ్ళి పాలు తాగు, లేదా ఆ పాలు కూడా నేనే తాగేస్తాను, అని బెదిరిస్తుంది, చూడమ్మా!" అంటూ పసిపాపలా మారిపోయారు. సుమతి ఆ శిశువును తన ఒడిలోకి తీసుకొని స్తన్యం ఇస్తూ, ప్రేమగా వాసవీ! అంటూ పిలిచింది. మరుక్షణమే పూర్తిగా శ్రీపాదులలాగే ఉన్న పసిపాప సుమతి ఒడిలోకి వచ్చింది. సుమతీమాత ఇద్దరు పిల్లలకు చెరోవైపు స్తన్యపానం ఇస్తూ తన దుఃఖమంతా మరిచిపోయింది.

**విన్నపాలు వినవలె.....**

వచ్చినవారిలో వెంకయ్య అనే పంటకాపు ఉన్నాడు. అతని ఇంటి దగ్గరే శ్రీపాదులు అన్ని వర్ణాలవారికి దత్తదీక్షను ఇచ్చారు. "ఇంతటి దివ్యలీల జరిగిన ఈ దర్బారు ప్రదేశం, దీనికి ఆనుకొని ఉన్న విశాల భూభాగం విశ్వవిఖ్యాతి పొందాలి," అని వెంకయ్య తన కోరిక వ్యక్తం చేసాడు. భవిష్యత్తులో అక్కడ పక్కా భవన నిర్మాణం జరుగుతుందని, అందులో గోశాల కూడా ఉంటుందని శ్రీపాదులు చెప్పారు. నా కన్నుల ముందే జరిగిన ఈ లీలని నేను యథాతథంగా వ్రాస్తున్నానే తప్ప ఇందులో ఏ రకమైన అతిశయోక్తి లేదు. తరువాత కొంతసేపటికి మళ్ళీ అందరం మగతలోకి జారుకున్నాం. కనులు తెరిచి చూస్తే శ్రీపాదులు, నేను ఆ సన్యాసి తప్ప మిగిలిన ఎవ్వరూ లేరు. వాళ్ళని ఏదైనా రాక్షసమాయ బలి తీసుకుందా? అని నాకు భయం వేసింది. శ్రీపాదులు ఇలా తెలిపారు, **"నా సన్నిధిలో ఏ రాక్షసమాయ పని చేయదు. వారందరిని తిరిగి క్షేమంగా పీఠికాపురం చేర్చాను. నన్ను ఎవరు ఏ భావంతో సేవిస్తారో వారిని ఆ విధంగానే నేను తరింపచేస్తాను."**

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**

# 48వ అధ్యాయం

## శ్రీపాదుల ధర్మబోధలు

శ్రీపాదులు సాధారణంగా గురువారంనాడు పంచదేవ్‌పహాడ్‌లో దర్బారు జరిపేవారు. వారు కృష్ణ మీదుగా నడిచి వచ్చేటప్పుడు కాలు పెట్టబోయే ప్రతిచోట ఒక పద్మం ఉదయించేది. వారు ఆ పద్మాల మీదుగా నడిచి వచ్చేవారు. ఆ కర్ర పాదుకలు  వాటిమీద ఎలా నిలిచేవో ఊహకు అందని విషయం. దర్బారు సాయంత్రం వరకు సాగేది. వారు మళ్ళీ ఇదే విధంగా నడుచుకుంటూ తిరిగి కురుంగడ్డ వెళ్ళేవారు. భక్తులు వారికి వచ్చేటప్పుడు స్వాగతం, వెళ్ళేటప్పుడు వీడ్కోలు ఇచ్చేవారు. ప్రతి శుక్రవారం స్త్రీలకు పసుపు కొమ్ములు పంచి ఇచ్చేవారు. తమకంటె పెద్దవారయిన స్త్రీలను అమ్మా! సుమతీ! అనో, అమ్మా! అనసూయమ్మ తల్లీ!అనో పిలిచేవారు. చిన్నవారిని అమ్మా! వాసవీ అని కాని సురేఖా, రాధా, విద్యాధరీ! పేర్లతో కాని పిలిచేవారు. వృద్ధులను ఆప్యాయంగా అమ్మమ్మా! అని, మగవారిని అయితే తాతా! అని పిలిచేవారు. ఇలా చిన్నవాళ్ళనైనా, పెద్దవాళ్ళనైనా ఆపేక్షగా మర్యాదగా సంబోధించి మాట్లాడేవారు.

వీలునుబట్టి శుక్రవారం దర్బారు పంచదేవ్‌పహాడ్‌లో కాని, కురుంగడ్డలో కాని నిర్వహించేవారు.



| | |
|---|---|
| ఆదివారం | యోగవిద్య |
| సోమవారం | పురాణగాథలు |
| మంగళవారం | ఉపనిషత్తులు |
| బుధవారం | వేదాలు–వేదార్థాలు |
| గురువారం | గురుతత్త్వం |
| శుక్రవారం | శ్రీవిద్య |
| శనివారం | శివారాధనమహత్యం |

ఇలా ఒక్కొక్క విషయం ప్రబోధించేవారు. ఏ రోజయినా సరే భక్తుల యోగక్షేమాలు మాత్రం తప్పక అడిగి తెలుసుకొనేవారు. ప్రతిరోజు అన్న సంతర్పణ ఉండేది. గురువారం మాత్రం ప్రత్యేకమైన వంటలు చేయించి, స్వయంగా వడ్డించేవారు. అదృష్టవంతులు కొంతమందికి స్వహస్తాలతో తినిపించేవారు కూడా. ఏదోఒక తీపి పదార్థం ప్రసాదంలా పంచేవారు. భక్తులు జొన్నలు, రాగులు, వరి, కాయగూరలు మొదలైనవి తెచ్చేవారు. ఎలాంటి బాధతో వచ్చిన భక్తులైనా ఆ బాధ నివారణ అయ్యే దర్బారునుండి తిరిగి వెళ్ళేవారు. శ్రీదత్తపురాణం చదవమని, దత్తుల అనుగ్రహం తప్పక లభిస్తుందని శ్రీచరణులు బోధించేవారు. రాత్రివేళ ఎవ్వరిని కురుంగడ్డలో ఉండనిచ్చేవారు కాదు. నాతో వచ్చిన వృద్ధ సన్యాసిని మాత్రం కొన్ని రోజులు ఉండనిచ్చారు. తరువాత వారిని కాశీకి వెళ్ళమని, అక్కడే దేహం చాలించమని చెప్పారు.

భోజనం తయారుచేయడం, వంటపాత్రలు తోమడం, వచ్చిన భక్తులకు అసౌకర్యం కలగకుండా చూడటం నా విధులు. ఏ వేళలో భక్తులు వచ్చినా వాళ్ళకు విధిగా భోజనం పెట్టాలని, వాళ్ళది ప్రసాద రూపంలో తప్పక తినాలని చెప్పేవారు. ఎప్పుడయినా భోజన పదార్థాలు తక్కువగా ఉన్నాయని నేను చెప్తే, తమ కమండలంనుండి వాటిపైన కొద్దిగా నీళ్ళు చల్లేవారు. దానితో వంటకాలన్ని అక్షయంలా వస్తుండేవి. వారుమాత్రం ఏ అన్నమైనా సరే కేవలం గుప్పెడు మెతుకులు తినేవారు.

**దివ్య ఉపదేశాలు**

వారి దివ్య దర్శనం అయ్యాక కూడా తమ దుష్ట ప్రవృత్తులను మార్చుకోనివారికి విచిత్రమైన కష్టాలు వచ్చేవి. తిరిగి వాటి నివారణ కోసం ప్రభువుల వద్దకు పరుగెత్తుకు వచ్చేవారు. చనిపోయిన పెద్దలకు శ్రద్ధతో తప్పక శ్రాద్ధకర్మలు చేయాలని బోధించేవారు. ఎవరిపైన తమకు

పక్షపాత ధోరణి లేదని, అష్టాదశ వర్ణాలవారు తమ దృష్టిలో సమానులే అని, వాళ్ళు అనుసరించే ధర్మకర్మలను బట్టి తాము ఫలితాలను ఇస్తామని చెప్పేవారు. నీవు నీ గురువుకి నమస్కరిస్తే, అతడు తన గురువుకి నమస్కరిస్తాడని, ఆ శృంఖల చివరకు ఆదిగురువైన తమ వరకు వచ్చి తమకే చెందుతుందని అనేవారు. దేవతలకు కోపం వస్తే గురువు రక్షిస్తారని, గురువునకే కోపం వచ్చినట్లయితే రక్షించేవారు ఎవ్వరూ ఉండరని హెచ్చరించేవారు. ఈ సృష్టిలో ఎవ్వరిని ద్వేషించ వద్దని, తిరిగి ఆ భావం కూడా తమకే వచ్చి చేరుతుందని ఉద్బోధించేవారు. రాత్రివేళలలో దేవతలు విమానాలలో, హిమాలయాలలోని యోగులు దివ్యకాంతిమయ దేహాలతో గురుసార్వభౌముల దగ్గరకు కురుంగడ్డ వస్తుండేవారు. **కురుంగడ్డ విశేష మహిమాన్విత క్షేత్రమని, అక్కడ ఉన్న ఈశ్వరుడు జాగృతమూర్తి అని, అక్కడ దేవతలు, మహర్షులు, సిద్ధులు మారువేషాలలో తిరుగుతుంటారని** శ్రీవల్లభులు చెప్పేవారు. వ్యక్తులు చేసే కర్మలు అన్ని ధర్మ సమ్మతములై ఉండాలని, హృదయంలో నిరంతరం భగవన్నామాన్ని స్మరిస్తూ తమ తమ కర్మలను చేస్తుండాలని చెప్పుతుండేవారు. శ్రీపాదుల దివ్యవచనాలను అనుసరిస్తూ మన జీవితాలను తీర్చి దిద్దుకోవాలని ప్రార్థిస్తున్నాను.

**శ్రీపాదరాజం శరణం ప్రపద్యే**



# 49వ అధ్యాయం

# అగ్ని ఉపాసనయే అగ్ని యజ్ఞం

## అగ్ని యజ్ఞం

శ్రీపాదులు ఒకసారి నాతో ఇలా అన్నారు, "శంకరభట్టూ! మనం చేసేది అగ్ని ఉపాసన. నీ అగ్ని ఉపాసన గాడిపొయ్యి వెలిగించి వంట చేయడమే. నీ గాడిపొయ్యిలోని అగ్నికి స్వతఃశక్తి లేదు. నా యోగాగ్ని కలవడం వల్ల ఆ పొయ్యిమీద నీవు చేసేవంట ప్రసాదంగా మారి భక్తుల కష్టాలను, బాధలను పోగొట్టగల్గుతుంది. ఈ గాడిపొయ్యి ఇంకొక 9 సంవత్సరాలు మాత్రమే వెలుగుతుంది. అంటే నా 30 యేట నేను నా శరీరాన్ని గుప్తపరచుకుంటాను. ఆ తర్వాత 3 సంవత్సరాలు శ్రద్ధ ఉన్న భక్తులకు మాత్రమే తేజోరూపంలో దర్శనం ఇస్తాను. అటు తరువాత కూడా మనం మొదలు పెట్టిన ఈ [15]అగ్నియజ్ఞం ఎటువంటి ఆటంకాలు లేకుండా కొనసాగుతుంది.

## [16]కర్మధ్వంస విధానాలు

ఒకసారి ఒక నవదంపతులు శ్రీపాదుల దర్శనార్థం వచ్చారు. ప్రభువులు వారిద్దరిని పంచదేవ్‌పహాడ్‌లోని తమ దర్బారులో ఉండమని ఆదేశించారు. రెండోరోజు ఆ యువకుడు మరణించాడు. పాపం! ఆ యువతికి ఇది పరమ దుస్సహమైన వైధవ్యం, ఆమె శోకదేవతకు మారు రూపంలా ఉంది. బంధువులు వచ్చారు. శవాన్ని ఏం చేయ్యాలో ? శ్రీపాదులని ఏం అడగాలో? వారికి తెలియడం లేదు. అప్పుడే దర్బారు వచ్చిన శ్రీపాదులు కర్మ అనివార్యం అని సూచించారు. "చైతన్య స్వరూపులు,

---

15. పొయ్యి వెలిగించి, ఇతరులకై వంట చేసి వారికి తృప్తిగా భోజనం తినిపించడాన్ని శ్రీవల్లభులు అగ్ని యజ్ఞంగా  పేర్కొన్నారు. ఇంటికి వచ్చిన వారిపై విసుగు చెందకుండా ఏదో ఒక రకమైన పొయ్యి పైన ఇంట్లో ఉన్నదే వండి కడుపు నిండుగా వాళ్ళకి వడ్డించి తినిపించడం అగ్ని యజ్ఞమే. ఆకలితో ఉన్నవారి కడుపు నింపితే అన్న దానప్రియులైన దత్తులు ప్రసన్నులు అవుతారు.

16. ఈగ్రంథంలో చాలా చోట్ల కర్మధ్వంస విధానాలు అని వ్రాయడం జరిగింది. విశ్వ ప్రభువులు తమ భక్తుల కన్నీటిని తుడవడానికి, కడగండ్లను పోగొట్టడానికి ఎన్నో పద్ధతులలో కర్మను నాశనంచేశారు. మరొక్కసారి శ్రద్ధగా చదివి చూడండి.

